# తెలుగు జాతీయాలు

బూదరాజు రాధాకృష్ణ

→ సోల్ డిస్ట్రిబ్యూటర్స్ ←

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాదు–500 001.

TELUGU JAATIIYAALU - By Budaraju Radhakrishna

ప్రథమ ముద్రణ : మార్చి, 1999

© Reserved.

**Warning**

All Rights Reserved No part of this publication may be reproduced in any form or by any means without the prior permission of the Copyright Holder

ముఖచిత్రం: పి. శ్రీధర్

398
కర బూ-తెలు

Acc. No. 4479

Acc. No. 49358
హైదరాబాద్ - 500 044.

వెల: రూ.70-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్. 3229831

# నా మాట

తెలుగు జాతీయాలు అనే శీర్షిక కింద "ఈనాడు దినపత్రిక" ఆదివారం సంచికల్లో ధారావాహికంగా 1991 జనవరి 6 కూ 1992 డిసెంబరు 6కూ మధ్య కాలంలో వెలువడిన జాతీయాలను ప్రస్తుతం గ్రంథ రూపంలో ప్రచురిస్తున్నాను ధారావాహికంగా రచించి ప్రచురించే అవకాశం నాకు కల్పించిన పత్రికాధిపతి రామోజీరావుగారికి నేనెంతో రుణపడి వున్నాను ఇందులో 485 జాతీయాలకు అర్థ వివరణ ఉన్నాయి

మొదట ప్రచురిస్తున్నప్పుడు ఒకటి రెండు జాతీయాల వివరణ పునరుక్త మయింది అకారాది క్రమంలో రాయటం కుదర లేదు మిత్రులూ అభిమానులూ సూచించిన మేరకు అప్పటప్పటికి రాసి ముద్రణ కివ్వటంలో వచ్చిన ఈ లొసుగులను మాత్రం ఈ గ్రంథ ప్రచురణలో పరిహరించాను అంతేగాని కొత్తగా ఏమీ చేర్చలేదు, మార్చలేదు

తెలుగులోని అనేక జాతీయాలు, కులాలనూ, వృత్తులనూ, స్థలాలనూ, ప్రవృత్తులనూ విమర్శించేవి, వెక్కిరించేవి, హేళన చేసేవి ప్రస్తుత దేశకాల పరిస్థితుల్లో వాటిని వివరించటానికి సాహసం చాలలేదు అప్పటప్పటి అనుభవాలను పురస్కరించుకొని ఆయాకాలాల్లో ఎవరో కల్పించిన జాతీయాలు కొంతకాలం జనామోదకరంగా ఉండి, కాలాంతరంలో మరుగుపడవచ్చు. వినోద దృష్టితో, సహన భావంతో వాటిని స్వీకరించలేని, ఆమోదించలేని, హర్షించలేని దేశకాలపరిస్థితులు వచ్చినప్పుడు వాటికి సహజ మరణం సంప్రాప్తిస్తుంది. కొంతకాలం తరవాత వాటికే పునర్జన్మ ప్రాప్తి కలిగినా ఆశ్చర్య పడనక్కరలేదు సమాజ స్వభావంలోని విలక్షణతకు జాతీయాలు ప్రతిబింబాలు వాటిని తెలిసి ప్రయోగించటం భాషాభిమానానికి నిదర్శన ఇంతకు పూర్వం కీర్తిశేషులు నేదునూరి గంగాధరం వంటి మహనీయులు అష్టకష్టాలు పడి వీటిని సేకరించారు. ఈ రచనకు ఆధారభూతులైన అటువంటి సాహితీపరు లందరికీ నేను కృతజ్ఞుణ్ని

అర్థవివరణ నాకున్న అనుభవజ్ఞానాదుల మీద ఆధారపడింది అది సమగ్రమూ కాదు – దోషరహితమూ కాదు అందుకు పాఠకలోకం నన్ను మన్నించాలని కోరుతున్నాను సాహితీ పరులకు – ముఖ్యంగా విద్యార్థులకు – తెలిసినంతలో, చేతనైనంతలో, వీలయినంత స్పష్టంగా, చేతనయినంత సూటిగా ఆయా జాతీయాలను వివరించి భాషాభిమానం కలిగించాలని ప్రయత్నించాను ఇందులోని దోషాలకు నేనే బాధ్యుణ్ని గుణాలకు నాకు వాటిని గురించిన పరిజ్ఞానం కల్పించిన గురువులూ, గ్రంథకర్తలూ బాధ్యులు. ఈ నా ప్రయత్నం ఆమోదయోగ్య మవుతుందని, కావాలని కోరుకుంటున్నాను

గ్రంథరూపంలో వెలువడుతున్న ఈ రచనను నా బాల్య స్నేహితుడూ, ఉత్తమ సాహితీ పరుడూ అయిన కీర్తిశేషుడు అచ్యుతుని బాలకృష్ణమూర్తికి అంకితం చేస్తున్నాను

పుస్తకానికి ప్రేమాభి మానాలతో, కవరుడిజైన్ చేసి ఇచ్చిన (వ్యంగ్య) చిత్రకారుడు చిరంజీవి పి శ్రీధరుకు నేను కృతజ్ఞుణ్ణి గ్రంథ ప్రకాశకులైన శ్రీ వి. శ్రీనివాసుకు కృతజ్ఞతలు.

హైదరాబాదు,
18–3–1999

– బూదరాజు రాధాకృష్ణ

# ఇందులో...

* * *

# తెలుగు జాతీయాలు

ఏభాషలో నయినా అసంఖ్యాకంగా ఉండే మాటలు నామవాచకాలు. వ్యక్తుల, స్థలాల, పశుపక్ష్యాదుల పేర్లన్నీ నామవాచకాలే. వాటిలో కొన్ని పూర్వసాహిత్యంలోని పాత్రల పేర్లమీద పుట్టి, వాడుకలో ప్రత్యేకార్థా లిచ్చేవి అలాగే మరికొన్ని స్థలనామాదులమీద పుట్టినవి విద్యావంతుల సంభాషణల్లో రచనల్లో ఈ రకం నామవాచకాల వాడుకలో కొన్ని ప్రత్యేకార్థాలూ ఒడుపులూ కనిపిస్తాయి వారి వారి సాహిత్య పరిచయాన్నీ లోకానుభవాన్నీ సంస్కారాన్నీ పురస్కరించుకొని శ్రోతలు అర్థం చేసుకుంటారు – వక్తలు ప్రసంగిస్తారు ఇటువంటి మాటలకు కొన్ని సందర్భాల్లో నిశ్చితమైన అర్థంవుంటే కొన్ని సమయాల్లో విరుద్ధార్థమో విపరీతార్థమో ఉండవచ్చు కొన్ని సరదాకు సృష్టించుకున్నవయితే కొన్ని ప్రయోజనదృష్టితో పుట్టినవి. అన్ని సమయాల్లో అయా మాటల అర్థవివరణలో ఏకాభిప్రాయం లేకపోవచ్చు అన్ని విశేషాలనూ ఇక్కడ వివరించటం సాధ్యంకాకపోవచ్చు 'నేనందఱమెప్పింతు'నని పోతన లాగా భావించక స్థూలంగా వాటిని పరిచయం చేస్తాను.

ఈ విధమైన నామవాచకాలను కొందరు జాతీయాలని వ్యవహరిస్తారు కొన్ని తెలుగు సాహిత్యంలో తెలుగువాళ్ళ వాడుకలో పుట్టి వ్యాప్తిలోకి వచ్చినవయితే, మరికొన్ని సంస్కృత వాఙ్మయంలో పుట్టినా తెలుగువాళ్ళు సొంతం చేసుకున్నవి ఈ మాటల్లో వ్యక్తినామాల మీద పుట్టినవి ఇతర సాధారణ విశేష్యాల్లాగా సహజమైనవి కావు – విద్యావంతుల విశ్వామిత్ర సృష్టిలో ఉద్భవించినవి

☆ ☆ ☆

**అక్కన్న మాదన్నలు:** గోల్కొండ తానీషా దగ్గర ఒకరు మంత్రిగా, మరొకరు సేనాపతిగా ఉన్న అక్కన్న మాదన్నలు స్నేహానికి ప్రతీకలు. జంట కవుల్లా కలసి మెలిసి ఉండేవారు కాబట్టి అలా సన్నిహిత మైత్రితో ఉండే ఏ ఇద్దరినయినా చూసినప్పుడు వాళ్ళు అక్కన్న మాదన్నల్లా ఉన్నారనటం పరిపాటి అయింది వీరిద్దరూ చరిత్ర కెక్కిన వ్యక్తులే వారిలా జీవితాంతం స్నేహం చెడకుండా అన్యోన్యంగా ఉండేవాళ్ళు చాలా అరుదు స్నేహం చేయటానికి అలనాటి శ్రీరామ సుగ్రీవుల్లా ఒక తంతు నడవటం ఇంకా కళింగ ప్రాంతంలో నిలిచింది దాన్ని 'నేస్తం కట్టడ' మంటారు అలా నేస్తం కట్టినవాళ్లు కుటుంబ మిత్రులై జీవితాంతం ఒకరి కష్టసుఖాలను మరొకరు పంచుకుంటూ ఉండటం ఆనవాయితీ.

**అక్షింతలు:** ఈ తెలుగు మాటకు సరైన సంస్కృత రూపం అక్షత–లు. క్షతం అంటే దెబ్బ, ప్రమాదం వగైరా. అవేవీ లేకుండా మంత్రపూతంగా ఇచ్చే/వేసే బియ్యపు గింజలు అక్షతలు శుభకార్యాల్లో తెల్లగా ఉన్న బియ్యాన్నే అక్షతలుగా వాడ్తారు

తెలుగువాళ్ళ వాడుకలో ఈ రెండు రకాల భావాల్లోనూ అక్షింతలు వేయటమనే ప్రయోగముంది. ఆశీర్వదించటానికి దీవించటానికి తలమీద అక్షింతలు చల్లటం పరిపాటి. అలాగే దేవతాపూజలో కూడా అక్షింతలు చల్లుతాం. 'చల్లు'కు బదులు 'వేయు' అనే పదాన్ని వాడినప్పుడు తిట్టు, దూషించు, విమర్శించు అనే అర్థాలు వస్తాయి. భూత ప్రేత పిశాచాదులను పారదోలటానికి ఉచ్చాటన మంత్రాలు చదువుతూ అక్షింతలను నాలుగు మూలలా విసురుతారు. భిన్న విధాల వాడుక ఉన్నందున విడిగా అక్షింతలు అనే మాట వాడినప్పుడు సందర్భం పురస్కరించుకొని అర్థం చేసుకోవలసి వుంటుంది.

**అగస్త్యభ్రాత:** అగస్త్యుడికో అన్నో తమ్ముడో ఉన్నాడు. అరణ్యవాస సమయంలో రామలక్ష్మణులు ఆయన ఆశ్రమాన్ని చూసినట్లు చెప్పిన వాల్మీకి ఎందుకో ఆయన పేరు చెప్పలేదు. తల్లి గర్భంలో ఉండగానే జ్ఞానవంతుడైనాడని ఆయన్ను వర్ణించిన నారదీయ పురాణం కూడా ఆయన పేరేమిటో చెప్పలేదు. ఆయన ఊరు సంగతి కూడా మనకు తెలీదు. ఊరూ పేరూ లేనివాడు కాబట్టి 'అనామకు' డనిపించుకున్నాడు. లోకదృష్టిలో ఆ రెండూ లేనివాడు ఎంత మహాత్ముడయినా ఎందుకూ కొరగానివాడనే భావం పుట్టింది. ఎందుచేతనోగాని తెలుగువాళ్ల కాయనంటే ముచ్చట వేసింది. అందుకని ఓ సామెత పుట్టించారు. 'ఎవరండీ ఆయన?' అని ముక్కూ మొహం తెలీని వ్యక్తిని గురించి వాకబు చేస్తే, "ఆయనాండి! అగస్త్యభ్రాత – హనుమాయమ్మ మొగు"డని చెప్తారు!

పురుషాధిక్య సమాజంలో భార్య పేరుతో తప్ప ప్రత్యేక వ్యక్తిత్వం లేని, ఉన్నా ప్రదర్శించని మనిషిని హనుమాయమ్మ మొగుడంటారు. అతడికో పేరుంటుంది. అతడంటే ఖాతరు లేనప్పుడు అతడిపేరుతో మనకు పనిలేదు. తెలుసుకొని సాధించేదీ లేదు. కాబట్టి అనామకుడి కిందే లెక్క. అగస్త్యుడు జగత్ప్రసిద్ధుడు. ఆయన అన్నకంత పేరు లేదు. ప్రసక్తి లేదు. అందుకని అగస్త్యభ్రాత అని నిర్లక్ష్యం చేసినట్లే హనుమాయమ్మ అనే నోరుగల ఇల్లాలి మొగుడిక్కూడా గౌరవ మర్యాదలు లేవన్నమాట. అంతమాత్రాన సదరు వ్యక్తులను వాజమ్మలుగా భావించటం తప్పేగాని అలా అలవాటయింది. తెనాలి రామకృష్ణుడి పాండురంగ మాహాత్మ్యంలో నిగమశర్మ అనే గడుగ్గాయి కథ ఉంది. చెడు తిరుగుళ్లు తిరుగుతున్న అతణ్ణి ఆయన అక్కగారు పరమ సుకుమారంగా మందలిస్తుంది. అంత ఉత్తమ పాత్రకు రామకృష్ణుడు పేరు పెట్టలేదు! ఆమె ఎవరంటే 'నిగమశర్మ అక్క' అని చెప్పుకొని సంతోషించమన్నాడు! అలాంటి చమత్కారమే అగస్త్యభ్రాత పేరు చెప్పించలేదు. కుటుంబంలో ప్రసిద్ధులుంటే ఇతరులకు కలిగే మర్యాద లిలాగే ఉంటాయి.

**అగస్త్య మంత్రం:** మిత్రావరుణులు ఊర్వశిని చూసి వీర్యస్ఖలనం చేసుకొంటే సదరు వీర్యాన్ని కుండలో దాటిపెట్టిందట ఆమెగారు! అందులో నుంచి అగస్త్యవశిష్ఠులు పుట్టుకొచ్చారని ఉత్తర రామాయణ కథనం. అగస్త్యుడికి అగస్తి అనే మరో పేరుంది. ఆయన పేరిట ఓ నక్షత్రముంది. భాద్రపదమాసం రెండోపక్షంలో సప్తమినాడు ఆ నక్షత్రం ఉదయిస్తుందని, అప్పుడు నదుల్లోని మురికినీళ్లు కలకదేరుతాయని చెప్తారు. ఆ సందర్భాన్ని 'అగస్త్యోదయ' మంటారు. ఆయన వింధ్యపర్వతం పొగరు దీయడానికి దేవతల కోరిక మీద దక్షిణ దిక్కుకు వచ్చాట్ట. తాను తిరిగి వచ్చేదాకా తన కమండలాన్ని మోస్తూ అలాగే పడివుండమన్నాట్ట. ఆయన ప్రయాణించిన దక్షిణభారత

ఖండాన్ని 'అగస్త్య మార్గ' మంటారు అయన తమిళదేశం వెళ్లి చాలా ప్రాచీనకాలంలో 'పేరగత్తియమ్' అనే పుస్తకాన్ని అరవభాషలో రాసిపారేశా డంటారు 'అగస్త్య సంహిత' అనే తంత్రశాస్త్ర గ్రంథమొకటి ఆయన పేరిట ఉంది సంస్కృతంలో అలాగే 'అగస్త్యస్తవ' మనేది అదిపురాణంలో, వరాహపురాణంలో కనిపిస్తుంది పొట్టివాడటగాని చాలా గట్టివాడని వేరే చెప్పనక్కరలేదు

అయన పేరిట ఉన్న ఒక మంత్రాన్ని 'అగస్త్యమంత్ర' మంటారు అదేమిటంటే – చెప్పలేని వాళ్లక్కూడా – అమాటకొస్తే తెలుగు తల్లులందరికీ – ఆ మంత్రం వచ్చు పసిపిల్లలకు ఉగ్గుపట్టిన తరవాత పొట్టమీద చేత్తో రాస్తూ "వాతాపి జీర్ణం–వాతాపి జీర్ణం" అనటం సర్వసాధారణం నర్సింగుహోముల్లో పురుడు పోసుకొనేవాళ్ల కీమంత్రం వచ్చో రాదో చెప్పలేం గ్రామీణ కుటుంబాల్లోని నిరక్షరాస్యమాతృమూర్తు లందరికీ ఇది ఖాయంగా వచ్చు

వాతాపి, ఇల్వలుడు అనే ఇద్దరన్నదమ్ము లుండేవాళ్లు మణిమతీపురమనే నగరాన్ని పాలిస్తున్న రాజులని విష్ణుపురాణం, భారతం వీళ్లను గురించి చెప్తాయి రాక్షసులని కూడా కొందరు పేర్కొంటారు. ఇల్వలు డొక బ్రాహ్మణుణ్ణి అన్ని కోరికలూ తీర్చే మంత్రం చెప్పమని ప్రాధేయపడితే చెప్పలేదట ఆ కోపాన్ని ఆ కులం మొత్తం మీద పెంచుకొన్నారు అన్నదమ్ములు వాతాపి కామరూపుడు అయన ఏ రూపం కావాలంటే ఆ రూపం ధరించగలడు ఇంటికి పిలిచి భోజనం పెట్టినప్పుడు వాతాపి నానా రూపాలు ధరించేవాడు అతన్ని ఇల్వలుడు వండిపెట్టి, భోజనమైన తరవాత 'వాతాపీ! రా!' అని పిలిచేవాట్ట! వెంటనే అతడు పొట్టచీల్చుకొని వచ్చేవాడట అలా చంపుతున్నారని మొరపెట్టుకొంటే అగస్త్యుడు తాను వెళ్లి 'వాతాపి జీర్ణం' అని మూడుసార్లు కడుపు నిమురుకోగానే వాతాపి జీర్ణమైపోయాట్ట రాళ్లు తిన్నా జీర్ణం చేసుకోగలశక్తి తమ పిల్లలకు కలగాలని కోరుకునే తల్లులు ఈ మంత్రం జపించి నిర్భయంగా ఉంటారు కల్తీ బియ్యం తిన్నా ఈ మంత్రం ఈ కలికాలంలో పనిచేస్తుందో లేదో మాత్రం చెప్పలేను ఈ వాతాపి రాక్షసుడు కాడుగాని ఒక రాజని మాత్రం భారతం వివరిస్తుంది పెద్ద భేదం లేదని సరిపెట్టుకోవచ్చుగదా!

అగ్రతాంబూలం: తాంబూలమిస్తే ఉభయులూ ఒక ఒప్పందానికి వచ్చినట్లు లెక్క. మంచిపనికి ముందు, అశుభకర్మలకు పని నెరవేర్చిన తరవాతా తాంబూలమిచ్చి మర్యాద చేయటం తెలుగువారి అచారం మన ప్రాచీన కవులు కృతిభర్తలయిన రాజుల నుంచి కర్పూర తాంబూలాలు స్వీకరించి కావ్యరచన మొదలు పెట్టేవారు వివాహాది శుభకార్యాలకు అంగీకారం కుదిరిన తరవాత కాబోయే వియ్యంకులు తాంబూలా లిచ్చిన తరవాత బుద్ధి మార్చుకోవటం మాట తప్పటంకన్నా పెద్ద పాపమని పూర్వులు భావించేవాళ్లు అందుచేతనే కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధానులు బాల్యవివాహానికి 'తాంబూలా లిచ్చాను, తన్నుక చావండి' అని బెదిరించగలిగాడు ఈ సంప్రదాయం కొందరు ముస్లిముల్లో కూడా కొన్ని ప్రాంతాల్లో ఉంది. ఇప్పటికీ పెళ్ళిళ్ళలో నాదస్వరం వాయించే, హిందూ దేవాలయాలు నిర్మించే ముస్లిం కుటుంబాలు కొన్ని గుంటూరు జిల్లాలో ఉన్నాయి వాళ్ళు కూడా తాంబూలాలు పుచ్చుకొనిగాని పని అరంభించరు

పండిత సభల్లో, చివరకు బ్రాహ్మణార్థాల్లో ఎవరికి ముందు తాంబూల మిచ్చారనే విషయం ప్రతిష్ఠకు నిదర్శనం కాకతీయుల కాలంలో వెలసిన భాస్కర రామాయణానికి

ప్రధానరచయిత అయిన భాస్కరుడికి రాజసభలో 'అగ్రతాంబూలం' (పండిత కవులందరిలోనూ అగ్రేసరుడు, ఉత్తముడు అనే గుర్తింపు) లభించిం దంటారు తాంబూలానికి పర్యాయపదమైన 'హళకి' అయన కప్పటినుంచి పౌరుషనామధేయ మయిందని, ఆ మాటకు అర్థం తెలియని సామాన్యులు అర్థంతో నిమిత్తం లేకుండా శబ్దసాదృశ్యాన్నిబట్టి 'హుళక్కి' అనుకొని (హుళక్కి అంటే శూన్యం అని అర్థం) ఆయన్ను హుళక్కి భాస్కరుడని వ్యవహరించారని ఒక కథ చెప్తారు కథ సంగతేమయినా తాంబూల మివ్వటం మర్యాదకూ కట్టుబాటుకూ ఒప్పందానికీ నిదర్శనం అగ్రతాంబూల మివ్వటం – ఉన్నవారిలో ఉత్తమోత్తముడని గౌరవించటం కాలక్రమాన ఈ మాట పెద్దరికాన్ని సూచించే సామాన్యార్థం సంపాదించుకుంది

అంకురార్పణం: అంకురమంటే మొలక అర్పణమంటే ఇక్కడ నాటడమని అర్థం విత్తనం నాటడానికి అంకురార్పణ మనేది సంస్కృత పర్యాయం. విత్తు నాటిన తర్వాత మొలిచి పెరిగి చెట్టయి మానయినట్లు ఏపని నయినా మొదలు పెట్టిన తరవాతనే అది నెరవేరటం జరుగుతుంది కాబట్టి అంకురార్పణమనే మాటకు మొదలు పెట్టడం అనే అర్థం వచ్చింది ఈ పదానికి చేయు అనే క్రియారూపం చేరినప్పుడు మొత్తం క్రియాపద మవుతుంది ఈ మాట ప్రకారం చెట్టుకన్నా విత్తే ముందని భావించాలి తగాదాలూ పోట్లాటలయినా, అధిక ప్రసంగం చేసినా, ఇద్దరిమధ్య స్పర్థలు పుట్టించే పని చేసినా అంకురార్పణ మయిందనీ, అంకురార్పణ చేశాడనీ అనటం పరిపాటి

అంగారక జపం: అంగారక గ్రహాన్ని దేవుడుగా భావించి చేసే జపం అంగారక జపం ఈ జపంలో కొన్ని మంత్రాలూ కొన్ని శ్లోకాలు ఉన్నాయి సాధారణంగా అప్పుల పాలయినవాళ్ళు అంగారక జపం చేస్తే రుణబాధనుంచి విముక్తులవుతారన్న విశ్వాస మొకటుంది. చేయిచూసి ఉన్న దరిద్రాన్ని గుర్తించి చెప్పే జ్యోతిషులు 'అంగారక జపం చేయండి బాధలు తొలగిపోతాయి' అని చెప్తారు. అందువల్ల ఎవరయినా అంగారక జపం చేస్తున్నారంటే అప్పుల్లో చిక్కుకున్నారనే అర్థం వచ్చింది వాడుకలో 'ఎలా ఉన్నారు?' అనే ప్రశ్నకు 'అంగారక జపం చేస్తున్నా'నంటే ఆర్థికబాధల్లో ఉన్నానని వివరించినట్లు లెక్క కేవలం రుణబాధలు తొలగించటం విషయంలోనే ఈ జపప్రస్తావన వస్తుంది ఇతర గ్రహాలు ఈ విషయంలో అంగారకుడంత శక్తులున్నవి కాదు ఒకానొక శృంగేరీ పీఠాధిపతి అప్పులు చేసి శారదాపీఠాన్నీ శంకరమఠాన్నీ చాలా అభివృద్ధికి తెచ్చాడు ఆయన పేరు నృసింహభారతి అనీ, ఆయన తెలుగువాడు కావచ్చుననీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఒక శ్లోకం ఉదాహరించారు 'కారూణా మపి దారూణా మశ్మనాం వేశ్మనా మపి, నృసింహభారతే ర్ద్రవ్య మయ్యో! అయ్యో! వృథా వృథా!' అనేదా శ్లోకం నృసింహభారతి తెలుగువాడయినా కాకపోయినా 'అయ్యో!' అని మొత్తుకొంటూ శ్లోకం రాసిన వ్యక్తి మాత్రం తెలుగువాడు కావచ్చు వడ్రంగులకూ, కలపకూ, రాళ్ళకూ, ఇళ్ళకూ నృసింహభారతి సొమ్మంతా వృథాగా ఖర్చయిందనేది శ్లోకార్థం శంకరాచార్యుల పేరిట ఒక విష్ణుస్తవ ముంది. దాంట్లో 'మచ్ఛిష్యమ ప్యనుదినం పరిరక్ష విష్ణో' అనే మొర ఉంది దయాశీలి అయిన ఆచార్యుడు వారసత్వంగా వదిలిపెట్టి శిష్యుడికిచ్చి పోయాడీ ఆస్తిని, అప్పులతోసహా 'అతగాణ్ణి కూడా కాపాడవయ్యా, విష్ణుమూర్తీ!' అని వాపోయా డాస్తవంలో. అందులో 'ఋణవారణాయ' (అంటే అప్పులు తీర్చటంకోసం) ఆ స్తవాన్ని రాసినట్లు చెప్పకున్నాడు! అంగారక జపానికి పోటీగా ఈ స్తోత్రం కూడా ఈ కలికాలంలో వెలిసిందన్న మాట.

**అచ్చుబోసిన ఆంబోతు:** అంబోతు (ఎద్దు) శివుడి వాహనం నందితో సమానం అంత విచిత్రమైన నమ్మకం ప్రజల్లో ఉంది పెద్దలు చనిపోయినప్పుడు వారి పేరిట ఒక అంబోతును వదిలిపెడ్తే కీర్తిశేషులకు పుణ్యం వస్తుందన్న నమ్మక మొకటుంది దాన్ని అరకకు కట్టడానికి వీల్లేదు గ్రామం మొత్తం దాని తిండీ తిప్పలూ భక్తిశ్రద్ధలతో చూస్తుంది అది చేలో పడి మేసినా తోలాల్సిందేగాని బందెల దొడ్డిలో పెట్టేందుకు లేదు, దాని యథేచ్ఛా విహారానికి తగిన శిక్షగా భగవంతుడి బంటుగా తన కర్తవ్యం నిర్వర్తించిందనే లెక్క ఒక్కోసారి క్షామం వచ్చినా, పశువులకు రోగాలు వస్తున్నా గ్రామంలోని యావన్మందీ కలిసికట్టుగా ఒక అంబోతును వదిలిపెట్టే ఆచారముంది కొన్నిచోట్ల ఇది అంబోతు అని తెలియటానికి దాని వీపుమీదనో తొడమీదనో అచ్చు (ముద్ర) వేస్తారు అప్పుడది అచ్చుబోసిన అంబో తవుతుంది ఒక్కోసారి పొరుగూరి చేలమీదికి అది దండయాత్రకు పోవచ్చు అయినా దానికి నిర్బంధం, శిక్ష లేనప్పుడు ఈ పేరుబెట్టి చాటుమాటున తిట్టి సంతృప్తి పడుతుంటారు

**అజగరోపవాసం:** అజగరం అంటే కొండచిలువ అది తిండి మానేయటం అజగరోపవాసం ఇది జరిగే సంగతికాదు బకధ్యానం అంటాం గాని అది చేపలకోసం నిశ్చలంగా నిలిచి ఎదురుచూస్తుంటుందేగాని జపం చేయదు పిల్లిశీలం అంటాంగాని అది జాతర చేసినంతమాత్రాన సంయోగాన్ని వ్యతిరేకించదు నక్కవినయం అంటాంగాని అది పొంచుండి, నేలబారున పాకి, వేటాడుతుందేగాని వినయంగా ప్రవర్తించదు ఘోటకబ్రహ్మచర్యం సంగతి సరేసరి అజగరోపవాసం కూడా దుర్వాసుడి నిరాహారదీక్షలాంటిది అదో మేకనో, దూడనో మింగి నెమరువేస్తూ చుట్టచుట్టుకొని కళ్ళుమూసుకొని పడుకున్నంతమాత్రాన ఉపవాసం చేస్తున్నదని భ్రమించగూడదు ఆ తన్మయస్థితిలో అది మింగిన జంతువును జీర్ణం చేసుకొనే ప్రయత్నంలో ఉంటుంది పైకి తిండికి మొహంవాచి అలసటతో పడివున్నట్లు కనిపిస్తుంది – అంతే తింటూ తిననట్లు కనిపించటాన్ని అజగరోపవాస మంటారు మన రాజకీయవాదుల కిది ఆదర్శం – పరిపాటి అమాయకత్వం నటిస్తూ, ఏమీ ఎరగనట్లు కనిపిస్తూ, 'స్వయంపాకం'గా తన తిండి తాను తినే మహాత్ములందరూ అజగరోపవాసం చేస్తున్నట్లే లెక్క ఇందుకు చాలా నేర్పు కావాలి

**అజాగళస్తనం:** అజం అంటే మేక దాని గళం దగ్గర – గొంతుదగ్గర – ఉన్న చన్నులు అజాగళస్తనాలు అవి అలంకారప్రాయాలేగాని వాటినుంచి పాలు రావు లేనిపోని గాంభీర్యం ప్రదర్శించడానికేగాని వాటివల్ల అటు మేకలకుగాని ఇటు మనకుగాని పనికివచ్చేదేమీ లేదు ఓ తెలుగుకవి సాహిణిమారుడనే కాకతీయ సేనాధిపతిని సంస్కృతంలో తిడ్తూ, ఆ సేనాపతినీ ఈ మేక మెడ చన్నులనూ సృష్టించి నందువల్లనే బ్రహ్మదేవుడికి పూజలు జరగటం లేదని దూషించాడు ఫలితంలో ఫలానా పనిగాని, విషయంగాని, వస్తువుగాని పనికిరానిదనో పనికి మాలినదనో చెప్పాలంటే దాన్ని 'అజాగళస్తన' మని చెప్పటం పరిపాటయింది

**అజాయుద్ధం:** అజ అంటే ఆడమేక ఆడమేకల పోరాటాన్ని ఈ పేరుతో పిలుస్తారు మేకపోతులయితే కుమ్ములాడుతాయి పొట్టేళ్ళు సరేసరి – తలలు బద్దలయ్యేదాకా, ఒకటి పడిపోయేదాకా పోట్లాడుతాయి ఆడమేకల యుద్ధం లెక్కకు పోరాటమేగాని ప్రమాదకరం

కాదు పోరాట లక్షణాలేగాని తీవ్రకత ఉండదు. బర్రెగొడ్ల కొమ్ములాటలోలాగే కొమ్ముల గలగలలేగాని దెబ్బలు తాకవు ఆర్భాటమేగాని హాని తక్కువ. ఎవరైనా పట్టుదల లేకుండా ధనప్రాణ నష్టం లేకుండా తగాదాకు దిగితే దాన్ని అజాయుద్ధమంటారు లాలూచీ కుస్తీలాంటి దన్నమాట మేకల విషయంలో లాలూచీ లేదు గాని ఉన్నట్లనిపిస్తుంది. పోరాటం ఎంత త్వరగా మొదలవుతుందో అంత త్వరగా పూర్తవుతుంది అనుకోకుండా మొదలై ఆకస్మికంగా ముగిసి ఆస్తి శరీరాదులకు హానీ, కష్టం లేకుండా పోట్లాటలు పెట్టుకున్నవాళ్ళు అజాయుద్ధం చేస్తున్నారంటారు. ఉత్తుత్తి యుద్ధమన్నమాట

**అడకత్తెర/అడకొత్తు:** వాడుకలో నుంచి తొలగిపోతున్న గృహోపకరణాల్లో అడకత్తెర ఒకటి పూర్వం పోకలను వక్కలుగా/చెక్కలుగా కత్తిరించుకోవడానికి ఇది వాడేవారు ఒకవైపు కలిపివుండే ఈ కత్తెరకు రెండు అంచులూ పదునైనవే రెండు/అన్ని వైపుల నుంచీ బాధలూ ప్రమాదాలూ ఎదుర్కొంటున్నవాళ్ళు తమ పరిస్థితి అడకత్తెరలో పోకలాంటిదని చెప్పేవాళ్ళు రకరకాల ఇబ్బందుల్లో ఉండి దిక్కు తోచని స్థితిలో ఉన్నప్పుడు అడకత్తెరలో ఉన్నామని వాపోతుంటారు

**అడుగులకు మడుగులు:** పూర్వం మహారాజులూ, మహారాణులూ బయల్దేరినప్పుడు వాళ్లవెనక కొంగులెత్తి పట్టుకోవడానికి సేవకు లుండేవాళ్ళు అలాగే ముందు గుడ్డలు పరిచేవాళ్ళు, కాళ్ళకు నేల తగిలి ఒత్తిడి కలిగి బాధ పడకుండా పూర్వం రాజకుమార్తెలు ఏడు మల్లెపూల ఎత్తుండేవాళ్లని కాశీమజిలీలవంటి కథలు వర్ణిస్తాయి అంత సుకుమారులకు నడుస్తున్నా ఇబ్బంది కలక్కుండా 'మడుగులు' పరిచేవాళ్ళు మడుగు అంటే మడతపెట్టిన గుడ్డ ఒంటిపొర గుడ్డలు పరిచినా కాళ్ళు కందిపోవచ్చు కాబట్టి గుడ్డ మడతలు పరిచేవా రన్నమాట ఆ పరచటాన్ని కూడా మరింత సుకుమారంగా ఒత్తట మన్నారు అడుగులకు మడుగులొత్తే పని సేవకు లందరిలోనూ తక్కువరకం వాళ్ళ కర్తవ్యం రాజులకు సరే. సామాన్యులక్కూడా ఇలాంటి సేవలు చేయటం దాస్య ప్రవృత్తికి చిహ్నం. అయితే సామాన్యుల భోగం కట్టుగుడ్డల్తో సమాప్తమవుతుంది ఉత్తుత్తి సేవలు చేయించుకోవలసిందే వాళ్ళు. ఈ కాలంలో మడుగుల్లేకపోయినా – అవి ఉంటే ఎలా సేవలు చేస్తారో అలా వంగి వంగి దణ్ణాలు పెడుతూ బతకటాన్ని అడుగులకు మడుగులొత్తటం అంటారు అంటే – బానిసలా వ్యవహరించటం/ప్రవర్తించటం, రాజమర్యాదలు జరపటం, విపరీతంగా గౌరవించటం.

**అతలాకుతలం:** దీనికి అతలకుతలమనే రూపాంతరముంది మొత్తంమీద ఈ మాటకు తలకిందులు అనే అర్థముంది అతలాకుతలం కావటమంటే విసిగి వేసారటం, అలసట పడటం, తలకిందులు కావటం వగైరా అర్థాలున్నాయని కొన్ని నిఘంటువులు పేర్కొన్నాయి కుతలం అంటే భూమి భూమికింద ఏడు లోకాలున్నాయని మన పురాణాలు ఘోషిస్తాయి వాటిని సప్త అధోలోకా లంటారు అతలం, వితలం, సుతలం, తలాతలం, రసాతలం, మహాతలం, పాతాళం అనే ఏడు భూమికింద ఉన్న లోకాలని విశ్వాసం కొందరు సుతలానికి బదులు కుతలమనే శబ్దాన్నే వాడుతుంటారు అడుగున ఉన్న అతలం పైనున్న కుతలమయినా, కొందరి భావన ప్రకారం దానికి రెండు మెట్లు కింద ఉన్న కుతలమయినా దెబ్బ తిన్నట్లే, పతనమైనట్లే. "పాపం, ఆయన వ్యవహారం/వ్యాపారం అతలాకుతలంగా ఉంది" అనే మాట వినపడుతుంది అంటే అతడి వ్యాపారమో వ్యవహారమో చెడిందని, అతడు దెబ్బతిని ఉన్నాడని, తలకిందులై పోతున్నాడని అర్థం అధోలోకా లున్నాయన్న విశ్వాసంతో ఇది పుట్టింది.

**అతిపరిచయం:** 'అతి' అనే ఉపసర్గకు 'ఎక్కువ' అనే అర్థముంది కాబట్టి ఇది గాఢమైన పరిచయమని భావించకూడదు "అతి పరిచయా దవజ్ఞా సంతతగమనా దనాదరో భవతి, మలయే భిల్లపురంధ్రీ చందన తరు కాష్ఠ మింధనం కురుతే" అని ఒక కవి దృష్టాంతంతోసహా ఈ మాటను వివరించాడు పరిచయాన్ని విపరీతంగా పెంచుకుంటే ఎదుటివ్యక్తి తక్కువగా చూస్తాడు రోజా ఎవరింటికయినా స్నేహ తీవ్రతవల్లనే కావచ్చుగాక పోతుంటే మర్యాద పోవటమేగాక అగౌరవం కూడా వస్తుంది మలయ పర్వతాల్లో నివసించే భిల్లాంగన మంచి గంధపు చెక్కలతోనే వంట చేస్తుందని తాత్పర్యం 'ఏరా, ఒరే'లు చాలక తిట్లతో స్నేహం ఎంత గొప్పదో నిరూపించుకొనేవాళ్ళు కొల్లలు పిలుపులోనే అమర్యాద, తేలిక భావం వ్యక్తీకరిస్తే అది అతిపరిచయానికి ఫలితమన్నమాట ఈ మాటకు ఎక్కువ పరిచయమనిగాక విపరీతమైన నిర్లక్ష్యానికి దారితీసే పరిచయమనే అర్థం

**అతిరథ మహారథులు:** ఈ మాట భారతం నాటిది ఒక్క విలుకాడితో నయినా సమంగా పోరాడలేని వాణ్ణి అర్థరథు డనేవాళ్ళు ఒక్క రథికుడితో సమంగా పోరాడగలవాడు సమరథుడు అనేకులైన విలుకాళ్ళతో – ఒక లెక్క ప్రకారం పదకొండు వేలమందితో– పోరాడగలవాడు మహారథు డంటారు కొంతమంది లెక్కన తనను తాను సంరక్షించుకుంటూ తన సారథినీ గుర్రాలనూ కాపాడుకుంటూ పోరాడగల వ్యక్తిని ఈ పేరుతో పిలుస్తారు అంతకన్నా సమర్థుడు అతిరథుడయితే అతణ్ణి మించిన యోధుడు అతిరథశ్రేష్ఠుడు ఈ పరిగణన భేదా లెలా ఉన్నా మహావీరులనే అర్థంలో అతిరథ మహారథులని సమర్థులయిన వ్యక్తుల గురించి ప్రస్తావించటం కద్దు ఈ రథాల సంగతి పాత కాలపు యుద్ధానికి సంబంధించిందే కాని – ఈనాటి వ్యవహారంలో యుద్ధరంగంతో సంబంధంలేని ఇతర రంగాల్లో కూడా సమర్థులనీ, శక్తిమంతులనీ చెప్పటానికి ఈ జాతీయాన్ని ప్రయోగించటం అలవాటయింది

**అత్తరు సాహెబు:** అత్తరు తయారుచేసే విద్య దేశవాణీ నైపుణ్యం కాదు కస్తూరి, జవ్వాది వంటి లేపనాలు, మంచి గంధం పూతలు, సంపెంగ నూనె వంటి తైలాలు మనవా ళ్ళెరగనివీ కావు, వాడనివీ కావు సెంటులు ఆంగ్లేయులు ద్వారా దిగుమతి అయినవయితే అత్తరులు ముస్లిములు అలవాటుచేసిన సుగంధద్రవ్యాలు రకరకాల పూల నుంచీ పసర్లనుంచీ అత్తరులు తయారుచేయటం భోగలాలసతమీద అభిమాన గౌరవాలున్న ముస్లిం ప్రపంచంనుంచి మనకు పట్టుబడ్డవి అత్తరులు అమ్మేవ్యక్తి తొలిదశలో ముస్లిమే కాబట్టి సాహెబ్ అన్నారు – తెలుగులో తద్భవరూపంలో సాయిబు అన్నారు పూలరంగడన్నట్లు అత్తరు సాయి బన్నమాట పుట్టించారు పూలరంగడు స్వయంగా విలాస పురుషుడు, శృంగారప్రియుడు అత్తరు సాహెబు కేవలం సుగంధ ద్రవ్యాలమ్ముకొని పొట్ట గడుపుకొనే వ్యాపారి మాత్రుడు అతగాడి రసిక జీవనం గురించి సమాజం పట్టించుకోలేదు గాని అతణ్ణి దరిమిలా కిరసనాయిలు (కిరసనూనె, గాజునూనె) అమ్మే మరో సాయిబుతో ముడివేసి సామెత మాత్రం పుట్టించారు – "కిరసనాయిలు సాయిబు స్నేహంకన్నా అత్తరు సాయిబు శత్రుత్వం మంచి"దని స్నేహంతో కిరసనాయిలమ్మే సాయిబు కౌగిలించుకున్నా దుర్వాసన వదిలించుకోడానికి బాధపడాలి అతడి స్నేహంవల్ల కలిగిన సుఖంకన్నా కౌగిలింతవల్ల వచ్చిన దుర్వాసన దుర్భరమయింది బేరం కుదరక అత్తరు సాహెబుతో ఘర్షణపడి నాలుగుదెబ్బలు

తిన్నా, దెబ్బలబాధ ఎలాగున్నా ఒంటికి కమ్మని వాసన పట్టుంది ఆ బాధలు తగ్గించుకోటానికన్నాడా కర్పూరతైలం వంటి మరో సుగంధద్రవ్యం పనికివస్తుంది. అందువల్ల అత్తరు సాహెబంటే గుమగుమలాడించేవా డన్నమాట. ఫలితంలో అత్తరు సాయిబంటే సంతోషపెట్టేవాడనే అర్థం వచ్చింది.

అద్దంలో ముడుపు: వెనకటికో లంచగొండి ముడుపిస్తేగాని పనిచేయ నన్నాట్ట పని చేసిపెట్టమన్నవాడు కూడా సామాన్యుడేం కాదు చేసిన తర్వాత ఇస్తానన్నాడు చేయవలసినవాడికి అపనమ్మకం పుట్టింది – ఇంతకూ ఇస్తానన్నవాడి దగ్గర తైలముందో లేదోనని ఇసక తక్కెడ, పేడ తక్కెడ లాంటి వాళ్ళిద్దరూ బేరసారాలు తెమల్చుకొన్న తరవాత తుని తగవులాగా ముడుపు చూపితే నమ్మి చేసి పెడతానని ఒకడూ, చేసిన తరవాతే ముడుపు చెల్లించే షరతు మీద దాన్ని అద్దంలో మాత్రమే ముందుగా చూపుతానని రెండోవాడూ ఏర్పాటు చేసుకున్నారు ముడుపంటే మూట అందులో ఏముందో విప్పితేగాని తెలీదు – కనబడదు అద్దంలో మూట మాత్రం కనిపిస్తుందిగాని, అందులో ఏముందో కనిపించదు. అప్పటికి – ఈ మాట పుట్టేనాటికి – ఎక్స్‌రేలాంటి యంత్రసాధనా లున్నట్లు లేదు అద్దంలో కనిపించే మూటను లాక్కోవడానికి వీలులేదు చివరకు ఆ మూటనే – అంటే దాని నీడనే తీసుకొని సరిపెట్టుకోమంటాడేమో లంచగొండి ఊహించినట్లూ లేదు మొత్తంమీద ముడుపు నిజమో నీడో చెప్పలేని స్థితి అది ఇచ్చేదో ఎగవేసేదో అంతకన్నా తేలని విషయం అందుబాటులో ఉన్నట్లు కనిపిస్తూ – అందని, అందుకోవటం కుదరని ఏ విషయమైనా అద్దంలోని ముడుపుకిందే లెక్క అది ఉన్నట్లూ కాదు; లేనట్లూ కాదు ఇలా అనిశ్చితంగా, బ్రహ్మపదార్థంలా, అనిర్వాచ్యంగా ఉన్న ఏ విషయాన్నయినా అద్దంలో ముడుపని వ్యవహరిస్తారు

అద్వైతం: జీవాత్మపరమాత్మలకు భేదం లేదనీ, అవి రెండూ ఒక్కటే అని చెప్పే తత్త్వ సిద్ధాంతం అద్వైతం ఆదిశంకరాచార్యులవారు ఈ అద్వైత సిద్ధాంతం ప్రతిపాదించి జైన బౌద్ధాల తాకిడికి అతలాకుతల మవుతున్న వైదికధర్మానికి ప్రాణం పోశా రంటారు తత్త్వశాస్త్రంలో పరమగౌరవంతో ప్రస్తావించే ఈ పదాన్ని 'చాదస్తం' అనే అర్థంలో – ముఖ్యంగా బ్రాహ్మణ సంఘంలో వాడుతుంటారు. అసలు చాదస్తమనే మాట విరుద్ధార్థంలో వాడుకలోకి వచ్చింది. వేదంలోని శబ్దాల అమరిక కొన్ని నియమాల ప్రకారం సాగింది ఆ నియమాల మొత్తాన్ని ఛందస్సు అంటారు. ఋగ్వేదంలో వాడింది ఋక్ఛంద మంటారు ఛందస్సు (అనే శాస్త్రం) బాగా తెలిసిన వ్యక్తి ఛాందసుడు అతగాడి లక్షణం ఛాందసం అదే తెలుగులో చాదస్తంగా మారింది "వేదవిత్సో జడః" అనేమాటను ఎవరో కల్పించారు. అంటే వేదం చదువుకున్నవాడు లోకజ్ఞానం లేనివాడన్నమాట కొందరు కవులు బ్రహ్మదేవుడంతటివాణ్ణి వేదజడుడని వెక్కిరించారు అటువంటి చాదస్తం వురఫ్ ఛాందసం అనే లక్షణాన్నే తరవాతి కాలంలో అద్వైతశబ్దానికి కూడా కల్పించారు కొంతమంది ఇతరుల సొమ్ము తనదిగా భావించే దురాశాపరులకు అద్వైతభావముందని భావించి 'అయనకంతా అద్వైతమే' అంటారు అంటే – అంతా అన్నీ తనవే అనుకొనే స్వభావముందని చెప్పటమన్నమాట చాదస్తం అనే అర్థానికి వాడుక ఎక్కువ

**అనంతశయనం:** గోవిందరాజస్వామివారు పడుకునే ఉంటారు అలాగే అనంత శయనంగారున్నూ అనంతుడంటే ఆదిశేషుడు చుట్టచుట్టుకొన్న శేషుడిమీద శ్రీమన్నారాయణులవారు శయనిస్తారు కాబట్టి విష్ణుమూర్తికి అనంతశయనుడనే పేరు వచ్చింది అనంతం అంటే అంతులేనిదని మరో అర్థం అసలు ఆదినారాయణులవారు అప్పుడప్పుడు అవతారా లెత్తడానికో, శివుణ్ణి ఆయన భక్తుల నుంచి కాపాడ్డానికో, ఇతరావసరాలవల్లనో లేవలేక తప్పదుగాని, విగ్రహంగా చెక్కిన తరవాత ఆయన కదలటమనే ప్రశ్నేలేదు సర్వకాల సర్వావస్థల్లోనూ పడుకున్నవాడు పడుకున్నట్లే ఉండక తప్పదు

అలా కదలక మెదలక పడుకొనే పరిస్థితి మానవజాతికి కన్నుమూసిన తరువాతనే సాధ్యం అందువల్ల పెద్దలను ప్రస్తావిస్తూ "ఆయన అనంతశయనం అలంకరించి చాలాకాలమయింది" అంటే – శాశ్వతంగా ఇహ లోకం వదిలిపెట్టి వెళ్ళారనే అర్థం వచ్చింది కాలక్రమాన అనంతశయన మంటే "పాడె" అనే అర్థం వచ్చింది వైష్ణవ పరిభాషలో కన్నుమూసిన వారిని అనంతశయనంమీద తీసుకపోతారు ఇలా కొన్ని మాటలకు కాలాంతరంలో దురర్థాలు వస్తుంటాయి

**అందెవేసిన చేయి:** ఒక వృత్తిలో, విద్యలో నిపుణుడని చెప్పటానికి ఈ జాతీయం వాడుతుంటారు కాలికి గూడా అందెలు వేసే ఆచారం లేకపోలేదు మధ్యయుగాల నాటి రాజులూ సేనాపతులూ తాము గెలిచిన వీరుల బొమ్మలు చెక్కించి కాలి కడియాలుగా ధరించి తమ అతిశయం చాటుకొనేవాళ్లు శత్రుత్వం శాశ్వతంగా వారసత్వంగా పెంచుకొనే మార్గమది పండితులు చెవులకు (మకర) కుండలాలు పెట్టుకొని తమ ఘనతను ప్రదర్శించటం నేటికీ ఆచారమే కొందరు శాలువ కప్పుకొని దాన్ని 'పండిత శాలువా' అని పిలిపించుకోవటమూ ఉంది కుస్తీలు పట్టే జెట్టీలు చేతికి తోలు పటకా కట్టుకొని (దాన్ని తోడా అంటారు) తమ గొప్పతనాన్ని తెలియజేస్తే, ఆయా వృత్తుల్లో విద్యల్లో నైపుణ్యానికి చిహ్నంగా చేతికి అందెలు అలంకారాలుగా ధరిస్తుంటారు పండితకవులు 'సింహతలాటం' అని బోలు మురుగులకు సింహం తల రెండు చివర్లా ఉండేట్లు ఆభరణం చేయించుకొనేవాళ్ళు ఇవి సొంతంగా చేయించుకున్న నగలు కావచ్చు ఇతరులు వీరి నైపుణ్యాన్ని గుర్తించి గౌరవచిహ్నంగా చేయించి తొడిగినవీ కావచ్చు ఈ ఆచారాన్ని గ్రహించిన బ్రిటిష్‌వాళ్ళు తాము తొలిదశలో స్థాపించిన పాఠశాలల, కళాశాలల, ఉపాధ్యాయులకు 'శాస్త్రి' అనే బిరుదుమిచ్చి, లండన్నుంచి పేరుతోబాటు ఈ బిరుదును కూడా చెక్కించిన అందెలు తెప్పించి తొడిగించేవాళ్లు కులం, శాఖ, అంతశ్శాఖ వంటి విభేదాలతో నిమిత్తం లేకుండా ఈ శాస్త్రి బిరుదం ప్రసాదించి, బంగారు కడియాన్ని ప్రభుత్వం తరఫున బహూకరించేవాళ్లు తొలి రోజుల్లో మదరాసులోని పాఠశాలలో తెలుగుశాఖకు ప్రధానోపాధ్యాయుడుగా ఉన్న రావిపాటి గురుమూర్తి 'శాస్త్రి'కి ఇలాంటి బహూకరణ జరిగినట్లు గెజెట్లో ప్రచురించారు అయన తరువాత ఆ పీఠమెక్కిన పరవస్తు చిన్నయకున్న 'సూరి' బిరుదం ఆయన స్వయంగా పెట్టుకొన్నదేగాని ప్రభుత్వమిచ్చింది కాదని ఓ పరిశోధకుడు నిరూపించాడు ఈ వివరా లెలా ఉన్నా అందెవేసిన చేయి అంటే నిపుణుడు, సమర్థుడు, వీరుడు వగైరాల్లో ఎవరయినా కావచ్చు బిరుదులూ పారితోషికాలూ ఇచ్చే అభ్యాసం లేని కాలంలో ఈ పద్ధతి మొదలయింది అందెవేసిన

వ్యక్తి వాదంలోనో ద్వంద్వ యుద్ధంలోనో ఓడిపోయినప్పుడు అందెను తీసివేయటం, కొన్ని సమయాల్లో విజేతకు సమర్పించుకోవటం పరిపాటిగా ఉండేది

అన్నదీక్ష; అక్షరదీక్ష: పూర్వం గురుకులాశ్రమాల్లో విద్యార్థులకు అన్నంపెట్టి, గుడ్డలిచ్చి, తలదాచుకొనే ఆశ్రయమిచ్చి, చదువు నేర్పి పంపేవాళ్లు. అలా ఆశ్రమాలు నిర్వహించే గురువులను వెతుక్కుంటూ విద్యార్థులు దేశ సంచారం చేసేవాళ్ళు–అనువైన స్థలం, గురువూ దొరికేదాకా అలా ఏదో ఒక ఆశ్రమానికి చేరిన ఒక విద్యార్థి వీరుడు నిద్రలేచినప్పటినుంచి తిండివేళ కోసం కనిపెట్టుకొని ఉండేవాడట– చాలా శ్రద్ధగా. చదువు దగ్గరకు వచ్చేసరికి ఆవలింతలు, పక్కచూపులు వగైరా అనేక భంగిమలు ప్రదర్శించేవాడు. అలాంటివాళ్ళు ఇప్పుడూ వున్నారు ఎప్పుడూ ఉంటారు అటువంటివాళ్ళ దీక్షంతా అన్న సంపాదన మీదనేగాని అక్షర సంపాదన మీద ఉండదు చదువు మీదకన్నా ఏదోవిధంగా ఈ విద్యా సంస్థ నుంచి బయటపడి ఎలాగో ఒకలాగు అన్నవస్త్రాలు సంపాదించుకోవా లనుకొనేవాళ్లు అన్నదీక్షాపరులు. చదువు పూర్తి అయిన తరువాత ఉపాధి దొరుకుతుందా లేదా అన్న విచారం లేకుండా విద్యార్జనే ధ్యేయంగా పెట్టుకొనేవాళ్లు అక్షరదీక్షాపరులు. గురుకులాల్లోని విద్యార్థుల చదువు పూర్తికావచ్చే సమయంలో వారికి చదువు ఒంటపట్టిందో, సంపాదనాలోచనే ఉందో తెలుసుకోవడానికి గృహస్థులు గురువులను ప్రశ్నించేవాళ్లు విద్యార్థి ప్రగతిని గురించి మీ వాడికి అన్నదీక్ష ఉందనో, అక్షరదీక్ష ఉందనో ఉపాధ్యాయులు చెప్పేవాళ్ళు– వేరే సర్టిఫికెట్లు రాసి ఇవ్వకుండా అప్పటిమాట ఇది.

అన్నమో రామచంద్రా!: రామరాజ్యంలో తప్ప ఇతరత్రా ఇతర కాలాల్లో తిండికి కరువుండేదిట ఆ కాలంలో మాత్రం అన్నమడగాల్సిన పనిలేదు. కృత యుగంలో కూడా అన్న పేదలున్నందుకు విచారించినా, కనీసం త్రేతాయుగంలో కొన్ని వేల సంవత్సరాలయినా తిండికి మొహంవాచే పనిలేనందుకు హర్షించాలి. కలికాలంలో వర్ణసాంకర్యం, ధర్మసాంకర్యం వచ్చినందువల్ల దరిద్రం రాకచస్తుందా అని కోప్పడేవాళ్లున్నారు. వారయినా ఇంత అన్నదానం చేస్తే కొంతవరకయినా కరువు తీరేది. అయినా వాళ్లు ఆ పని చేయుటంలే దనటానికి సాక్ష్యం లేదు. వాళ్లు తిండిపెట్టలేక వదిలివేసిన వాళ్లలో బిచ్చమెత్తుకొనిగాని బతకలేని వాళ్ళందరూ 'అన్నమో రామచంద్రా!' అని, ఒకప్పుడుండి అన్నంపెట్టి ఇప్పుడు లేని మహాదాతలకోసం -ఆక్రోశిస్తుంటారు తిండిలేనివాళ్లకీ తిండి సంపాదించుకోలేనివాళ్లకీ ఆ రామచంద్రుడు తప్ప మరెవ్వరూ గుర్తురాకపోవడమే విశేషం.

అప్పారావు హర్కారాలు: హర్కారా అనే హిందీ మాటకు వార్తాహరుడని అర్థం. కబురు తెచ్చినవాడన్నమాట. బ్రాహ్మణ సమాజంలోకి ఒకరు వచ్చి కూర్చుంటే, అలవాటు ప్రకారం ఆయన గోత్రాలనూ సూత్రాలనూ అడిగారట, "మీరు ఆపస్తంబులా? అశ్వలాయనులా?" అని ఆపస్తంబుడు, అశ్వలాయనుడు అనే మహర్షులను సూత్రకర్త లంటారు ఆచారవ్యవహారాలను, ఆచరించవలసిన కర్మకాండలను రాసినవారన్నమాట ఆ ప్రశ్నలకేమని సమాధానమివ్వాలో వచ్చినవారికి తెలియలేదు గాని, మీరెవరని అడిగివుంటారని ఊహించారు కాబట్టి జవాబుగా అప్పారావుగారి హర్కారాలమని ఘనంగా చెప్పుకున్నారు ఆ సమాధానమే వచ్చినవారు బ్రాహ్మణేతరులనీ, వారికి ఈ గోత్రాలూ సూత్రాలు తెలియవనీ తేల్చిపారేస్తుంది అడిగిం దొకటయితే మరోవిధంగా

అర్థం చేసుకొని ఏదో ఒక సమాధానం చెప్పినవాళ్ళను అప్పారావు హార్మ్యారా లనటం పరిపాటి అయింది అలాగే ఒక దక్షిణాది బ్రాహ్మణుడు, సంధ్యావందనాదులు మాత్రమే తెలిసి - హిందీరాని వ్యక్తి తటస్థపడితే, అతడితో బాటు కాశీయాత్ర చేస్తున్న ఒక హిందీవాడు "ఆప్ కహా౯ జాతేహై౯?" అని ప్రశ్నించాట్ట - మీరెక్కడికి పోతున్నారని ఆ ప్రశ్న అర్థం కాకపోయినా ఏదో జవాబు చెప్దామని ఈ దక్షిణాది ఛాందసుడు "ఉత్తరే శిఖరే జాతే" అనే వేదభాగం చదివి - దాని అర్థం కూడా ఆయనకు తెలియకపోవచ్చు - ప్రత్యుత్తరమిచ్చా డంటారు ఇలాంటి వ్యక్తులను అప్పారావు హార్మ్యారా లంటారు

అభావ ప్రత్యామ్నాయం: అభావం అంటే లేకపోవటం ప్రత్యామ్నాయం అంటే బదులు లేనిదానికి బదులు అని మొత్తం అర్థం సాధారణంగా, ఉండవలసిన వస్తువు లేకపోతే, దానికి బదులుగా మరొకటి వాడటాన్ని ప్రత్యామ్నాయం అంటాం పూజాపురస్కారాలూ, క్రతువులూ, యజ్ఞాలూ, చివరికి దానధర్మాలు చేసేటప్పుడూ కావలసినది ఒక్కోసారి ఉండదు కర్చు భరించలేక దానికి బదులుగా మరొక చౌకవస్తువు నివ్వటమూ కద్దు గోదాన ప్రత్యామ్నాయంగా ఓ రూపాయి బిళ్ళనో, తుండుగుడ్డనో ఇస్తుంటారు భరించలేని వాళ్ళు ఒక వస్తువుకు బదులు మరొకటి ఇచ్చారంటే అర్థముంది గాని లేనిదానికి బదులేమిటని ఎవర్నయినా ప్రశ్నించవచ్చుగాని మీమాంసా శాస్త్రజ్ఞులను అడక్కూడదు ఎందుకంటే - వాళ్ళు భగవత్పదార్థం-అంటే దేవుడు-ఉన్నట్లో లేనట్లో తేల్చుకోవలసినవాళ్ళు ఈ సృష్టికి కారకుడుగా ఏదో శక్తి - దాన్నే దేవు డంటామని సరిపెట్టుకోండి - ఉండాలి, కానీ అది ఉన్నట్లు సామాన్య దృష్టికి కనిపించదు వినిపించదు అంటే దాని ఉనికి అభావ మన్నమాట ఆ అభావానికి ప్రత్యామ్నాయంగా- అంటే బదులుగా - దేవు డున్నాడని నమ్మటం అభావ ప్రత్యామ్నాయం సదరు దేవుడున్నా లేనిదానితో సమానం. ఎందుకంటే మనకు అందుబాటులో లేడు లేకపోయినా ఉన్నా డనిపిస్తున్నాడు ఈ అభిప్రాయాన్ని సాధించటానికి మీమాంసావేత్తలు కల్పించుకొన్న పరిభాష అభావ ప్రత్యామ్నాయం ఇది శాస్త్రసంకేతం ఆ శాస్త్రం చదవని, రానివాళ్ళు కూడా ఈ మాటను ప్రయోగిస్తుంటారు - లేనిదానితో సమానమనే అర్థంలో.

అభావవిరక్తి: భావం అంటే ఉండటం అభావం అంటే లేకపోవటం విరక్తి అన్నా వైరాగ్యమన్నా ఒకటే తాను కావాలని కోరినా తనకు దొరకని వస్తువు తన కక్కరలేదని చెప్పటం, తనకు దానిమీద కోరిక లేదనటం అభావవిరక్తి. 'అందని ద్రాక్షపళ్ళు పుల్లన' అన్నట్లు అందుబాటులో లేనిదానిమీద విరక్తి ప్రదర్శించటం అభావవిరక్తి 'ఆ దిక్కుమాలిన ఉద్యోగం నేను చేయదలచలేదండి, ఊరికే ఇచ్చినా ఆ వస్తువు, ఆ పదవి నాకు వద్దు' వగైరా మాటలన్నీ అభావ విరక్తికి నిదర్శనలు ఈ వైరాగ్యం తాత్కాలికం కావచ్చు, దీర్ఘకాలికం కావచ్చు, శాశ్వతం కావచ్చు సంసారం చేసి, దానిమీద అసహ్యపడి సన్యాసం పుచ్చుకునే వైరాగ్యం వంటిది కాదిది తనకేమీ లేనప్పుడు ఈ అశాశ్వతమైన ధన ధాన్య సంపత్తి అక్కరలే దనటం, అనుకోవటం మాత్రమే అభావవిరక్తి కిందకు వస్తాయి

అమావాస్య మరణం: అమావాస్య తెలుగువాళ్ళ లెక్కన చాలా చెడ్డరోజు. అరవ వాళ్ళకయితే చాలా పవిత్రమైన దినం! అమావాస్య బతికున్నవాళ్ళకి చెడ్డరోజయితే

ప్రేతలకు(శవాలకు) మంచిదనే నమ్మకం కూడా కొందరిలో ఉంది భీష్ముడివంటి మహాత్ములు ఏకాదశినాడు కన్ను మూశారు కాబట్టి ఆ పుణ్యతిథే ప్రేతలకయినా మంచిదనీ, అమావాస్యలాంటివి మంచిరోజులు కావనీ మరికొందరి విశ్వాసం సౌరమానం (సూర్యుడి గమనం మీద ఆధారపడ్డ కాలప్రమాణం) మీద విశ్వాసమున్న తమిళులు మాత్రం అమావాస్యను పుణ్యదినంగా భావిస్తారు – మంచికీ చెడుకూ. మనది చాంద్రమానం అంటే చంద్రుడి గమనం మీద ఆధారపడ్డ పంచాంగం కాబట్టి మన నమ్మకాలు వేరుగా ఉండటంలో ఆశ్చర్యం లేదు ముస్లిములు "తీన్ తేరా అర్ అఠారా" అంటూ మూడో పదమూడో ఎనిమిదో పద్దెనిమిదో రోజులు మంచివి కావనుకుంటారు వాళ్ళ పంచాంగంలోని తిథులు (రోజులు) మనవాటికన్నా ఒకరోజు ముందుంటాయి కాబట్టి చవితి, చతుర్దశి, నవమి, మళ్ళీ చవితి అనేవి మనకూ మంచివి కావు కాబట్టి రెండు వాదాలూ ఒకటేనని సమన్వయవాదు లంటారు.

తెలుగులో "ఏమీ ఎరగనివాడు ఏకాదశినాడు పోతే, అన్నీ తెలిసినవాడు అమావాస్యనాడు చచ్చా"డనే సామెత ఉంది ఈ వాక్యం ఎటుబట్టే అటు సమన్వయించుకోడానికి సరిపోతుంది ఏకాదశి వైష్ణవులకు పరమపవిత్రదినం. ఆరోజున అమాయకుడు మరణించి వైకుంఠానికి పోతాడనేది విశ్వాసం అమావాస్య నిషిద్ధ దినం కాబట్టి ఆనాడు మరణించిన వ్యక్తి నరకానికి పోతాడనేది మరో విశ్వాసం అన్నీ తెలుసునన్న అహంకారంతో మంచిరోజు చూసుకోకుండా మరణించాడనేది ఆక్షేపం మళ్ళీ ప్రాణం పోకడ ఎవరికీ తెలీదని కూడా అంటూనే ఉంటారు. ఈ విషయాల్లో ఏకాభిప్రాయం అసాధ్యం శాస్త్రవిషయా 'లెలా ఉన్నా అమావాస్య మరణం అరిష్టమనేది తెలుగువాళ్ళలో పాతుకపోయిన విశ్వాసం అమావాస్యనాడు గతించాడంటే అజ్ఞాని అని ఆక్షేపించటమన్నమాట.

అమీతుమీ: విద్యావంతుల వాడుకలో పుట్టి సామాన్యప్రజల వ్యవహారంలో నిలదొక్కుకున్న జాతీయమిది. 'అమి' అంటే 'నేను, నాది;' 'తుమి' అంటే 'నీవు, నీది' ఈ రెండు మాటలూ బెంగాలీనుంచి తెలుగులోకి వచ్చాయి 'అహం, త్వం' అనే సంస్కృత సర్వనామాలనుంచి అవి బెంగాలీ భాషలోకి వచ్చాయి. 'నీవో నేనో తేల్చుకుందాం' అనే అర్థంలో 'అమీ తుమీ తేల్చుకుందా' మనటం అలవాటయింది

అంబాజీపేట ఆముదం: తెలుగుదేశంలోని ఆముదం పంటల్లో అంబాజీపేటలో పెరిగిన మొక్కలు సర్వశ్రేష్ఠం అంటారు దొంగతనానికి బయలుదేరినవాళ్ళు ఒంటికి ఆముదం పట్టించిగాని ఇల్లు వదలరని ప్రతీతి ఎవరైనా పట్టుకొన్నా పట్టుజారి తప్పించుకోడానికి ఆముదం పూత సాయపడుతుంది దొంగల విషయంలోనయినా, ఇతరులకు దొరక్కుండా తప్పించుక తిరిగే నేర్పరి విషయంలోనయినా ఆముదం పట్టించాడని వర్ణించటం అలవాటు. ఎవరికీ దొరకని, ఏ విధంగానూ చిక్కని వ్యక్తి శ్రేష్ఠమయిన అంబాజీపేట ఆముదం పూసుకున్నా డనటం వాడుక అటువంటి వ్యక్తినే ఏకంగా "ఆయనాండి! అంబాజీపేట ఆముదంలెండి" అంటుండేవాళ్ళు ఆముదానికున్న ఒక లక్షణాన్ని బట్టి ఈ వాడుక వస్తే మరో గుణాన్నిబట్టి మరో విధమయిన ప్రయోగం పుట్టింది కొందరు వెంటపడి వేధిస్తారు తమ పనులు నెరవేరేదాకా ఆముదం జిడ్డులా పట్టుకుంటారన్నమాట ఒక పట్టాన వదలరు వాళ్ళను తిట్టికొట్టీ వదిలించుకోవటం కష్టం అలాంటి వ్యక్తులను -కూడా అంబాజీపేట ఆముదంలా మాంచి జిడ్డులా

పట్టా డంటారు దొరక్కపోవటమే గాక పట్టుకుంటే వదలకపోవటం కూడా ఈ జాతీయానికి అర్థాలే. మామూలు రకాలని వంటాముదంగాడు, పచ్చాముదంగాడు అని దూషించేవాళ్ళు, వాళ్ళలో సమర్థులైన మహాత్ములను మాత్రం 'అంబాజీపేట ఆముదం'తో గాని పోల్చరు ఇలా రెండు విధాల ఈ మాటకు వాడుక ఉంది

**అయితంపూడి ఉద్యోగం:** ఈ ఉద్యోగం చేస్తున్నదికాదు చేసింది కాదు వచ్చిందీ కాదు వచ్చేదీకాదు వస్తుందని ఊహించిన ఉద్యోగం వస్తేమటుకు దరిద్రం తీరుస్తుందన్న విశ్వాసముంది. అంతేకాదు. బోలెడు పాడీపంటా ఏర్పడ్తాయన్న నమ్మకముంది వచ్చిందంటే అంత పాడిని ఒక్క కుటుంబం ఏం చేసుకుంటుందన్న ప్రశ్న వచ్చింది ఆలోచిస్తే కనీసం ఆరు గేదెల పాడి తప్పదనిపించింది అన్ని పాలూ పెరుగూ దాచే దెలాగనే ఆలోచన పుట్టింది కుండలు కనీసం నాలుగయినా అవసరమని లెక్కలో తేలింది ఒకటేమో పాలకోసం, మరొకటి పెరుక్కోసం మూడో కుండలో చల్ల నింపవచ్చు మరి బంధువులుగాని, మరెవరయినాగాని కాసిని మజ్జిగ ఇప్పించమని అడుగుతారు కదా! వాళ్లకోసం మజ్జిగ కుండ మరోటి తప్పదు ఇలాగ ఓ మహాత్ముడు గాలిలో మేడలు కట్టాడుట ఉద్యోగం వచ్చి, ఆరు గేదెల పాడి సమకూడినప్పుడు చేయవలసిన ఆలోచన ముందే చేశాడన్నమాట. ఇంతకూ ఆ ఉద్యోగం రాలేదు వస్తే గిస్తే ఆరు గేదెల పాడి అయినా ఉండకపోదన్న అచంచల విశ్వాసంతో ముందు జాగ్రత్తగా నాలుగు కుండలు సమకూర్చుకోవా లనుకోవటం అమాయకత్వం ఇది నిజమా కాదా అన్నది కాదు ప్రశ్న ఇలా ఊహాలో జీవించే వాళ్లుంటా రనేది వాస్తవం అసలు అయితంపూడిలో ఉద్యోగం ఉందా లేదా అన్న ప్రశ్నతోగాని, ఉన్నా అది తనకు అందుబాటులో ఉందోలేదో సరిచూసుకోవటంగాని లేకుండా ఊహాప్రపంచంలో ఇన్నిన్ని ఆలోచనలు చేశాడట ఓ అభాగ్యుడు ఆ ఊరి పేరుమీదనే ఈ జాతీయం ఎందుకు పుట్టిందో చెప్పలేంగాని, కానిపని అనే అర్థంలో ఇది వాడుకలో నిలిచిపోయింది చల్లకు మజ్జిగ పర్యాయపదం అయినా ఈ భావుకుడు అది మరో వస్తువనుకొని దాన్ని నిలవ చేయటానికి మరో కుండ కావాలనుకున్నాడు అంత పెద్ద ఉద్యోగం వస్తే పాల కుండలు సంపాదించటమే ప్రధాన సమస్య అనికూడా భావించాడు ఇల్లూ వాకిలీ ఏర్పరుచుకుందామని కూడా అనుకోలేదు గాని గేదెపాడి కోసం కలవరించాడు పునాదుల్లేకుండా భవనం కట్టాలని తాపత్రయపడేవాళ్లనూ, ఆధారం లేకుండా అరిచేతిలో స్వర్గముందని ఊహించేవాళ్ళనూ ప్రస్తావించేటప్పుడు 'ఆయన అయితంపూడి ఉద్యోగం చేస్తున్నాడు లెండి!' అని ఆక్షేపించటం కద్దు ఉద్యోగం ఇచ్చినవాళ్లూ పుచ్చుకొన్నవాళ్లూ లేరు కానీ ఉద్యోగం వేరొకటి దొరికిందన్నమాట ఊహాజీవులు చేసేది అయితంపూడి ఉద్యోగం

**అయిదు పది:** అయిదు పది చేయటం, అయిదు పది కావటం – అనే రెండురకాల ప్రయోగాలున్నాయి రెండు చేతులనూ జోడిస్తే పదివేళ్ళూ కలిసి నమస్కారమవుతాయి ఈ అర్థంలో ప్రాచీన సాహిత్యంలో అయిదు పది చేయటమనే జాతీయం కనిపిస్తుంది అయిదు పది కావటమంటే పారిపోవటం, ఓడిపోవడమనే అర్థాలున్నాయని కొందరు వివరిస్తారు ఈ రెంటికీ ఈ కాలంలో వాడుక తక్కువ

**అయోధ్య, సయోధ్య:** అయోధ్య అనే మాటకు ఇతరులు జయించటానికి వీలుగాని (కోటలాంటి)దని అర్థం సయోధ్య అనే మాటకు సంస్కృత సాహిత్యంలో ప్రయోగం

కనిపించదుగాని సయి (సమానమైన) ఒద్ద (చేరిక) అనే అర్థాన్ని కొన్ని తెలుగు నిఘంటువు లిస్తున్నాయి. ఈ రెండు మాటలూ కలిసి సయ్యొద్ద/సయ్యోద్ధి అనే రూపం పొందాయని, ఆ సమాసానికి సాన్నిహిత్యం, స్నేహమని అర్థాలనీ చెప్తారు అయోధ్యా శబ్దంతో దీనికి రూపసాదృశ్యం కల్పించి, సంస్కృతంలా భావించి, 'ధ్య'కారానికి ఒక ఒత్తు పెట్టి సయోధ్య అనే రూపం కలిగించారు ఇవి తెలుగునాటి రాజకీయాల్లో, అందులోనూ కాంగ్రెసు రాజకీయాల్లో – నీలం సంజీవరెడ్డి, కాసు బ్రహ్మానందరెడ్డిగారలు ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రిత్వం కోసం పోటీపడినప్పుడు – బాగా వాడుకలోకి వచ్చిన జంటమాటలయినాయి ఒక వర్గం వారు 'అయోధ్య' అంటే పోరాటం వద్దంటే– మరో వర్గం వారు సయోధ్య – అంటే స్నేహంగా ఉందామంటూ ఉభయపక్షాలూ నాయకత్వం కోసం పోరాడినప్పటి మాటలివి ఫలితంలో సయోధ్య అంటే స్నేహమనీ, అయోధ్య అంటే శత్రుత్వమనీ నూతనార్థాలు వచ్చి పడ్డాయి మూలార్థం ఒకటయితే వాడుకలో నిలిచిన అర్థాలు వేరు ఒక పదం సంస్కృతంనుంచి తెలుగులోకి ఎరువుగా వచ్చిందయితే, రెండోది తెలుగునుంచి సంస్కృతీకరించిన మాట భాషల్లో ఈలాంటి రూపభేద, అర్థభేదాలు ఏర్పడుతుండటం వింతేమీ కాదు

**అరణ్యరోదనం:** అరణ్యమంటే అడవి, రోదనమంటే ఏడుపు అడవిలో ఏడిస్తే వినేవారుండరు కాబట్టి సానుభూతి చూపేవాళ్ళు గాని, ఓదార్చేవాళ్ళు గాని, ఏడుపు మాన్పించేవాళ్ళుగాని ఉండరు అందువల్ల ఏడ్చినా ప్రయోజనం లేదు ఏడవటం అనవసరం వృథా శరీర శ్రమ నవ్వినా, తిట్టినా, పొగిడినా, మరే పనిచేసినా అడవిలో చేసినంత కాలం అది ప్రయోజనం శూన్యమే అయినాసరే వాడుకలో ఏడ్పుకే ప్రాధాన్యమిచ్చి ఈ జాతీయం పుట్టించారు అనవసర శ్రమ అనే అర్థంలో కూడా ఈ మాటను వాడుతుంటారు

**అరవ ఏకాంతం:** ఏకాంతం అంటే ఒంటరితనం అరవలు ఒంటరిగా ఉన్నా తమలో తామయినా ఏదో సణుక్కుంటూ గొణుక్కుంటూ ఉంటారనేది ఒక నమ్మకమయితే, ఏకాంతంగా – అంటే రహస్యంగా – మాట్లాడుకున్నా కొండమీది గోలలాగా, సంతగోలలాగా ఉంటుందనేది మరో విశ్వాసం. 'అతి రహస్యం బట్టబయలు' అన్న సామెతగా తమిళులు గుసగుసలాడుకున్నా అందరికీ తెలిసిపోతుందనే వేళాకోళంతో అరవ ఏకాంతమనే మాటపుట్టింది ఇది నిజమా కాదా అనే ప్రశ్న వేరే విషయం తెలుగువాళ్లకు తమిళుల మీద ఉన్న సద్భావన కిదో నిదర్శనమని సరిపెట్టుకోవాలి

**అరవ ఏడుపు:** బహుశా ఈ జాతీయం మదరాసు ప్రాంతంలో పుట్టి ఉంటుంది అక్కడ ఓ విచిత్రమైన పద్ధతి ఉంది ఎవరైనా మృతిపొందితే మృతుల కుటుంబాల తరఫున ఏడవడానికి కొన్ని మురాలుంటాయి ఇంటి యజమానికీ యజమానురాలికీ మృతుడికీ ఉన్న సంబంధబాంధవ్యాలను కనుక్కొని వాళ్లకు బదులు తామే వాయలువాయలు పెట్టి ఏడుస్తారు ఈ విధంగా కూలికి ఏడ్చేబృందా లనేక మున్నాయి ఇది అరవ ఏడు పన్నమాట సొంతదార్లకు బదులు ఇంత అని కూలి డబ్బులు తీసుకొని బయటివా రేడవటాన్ని అరవ ఏడు పంటారు. తమకేమీ సంబంధం లేకపోయినా తెచ్చిపెట్టుకున్న దుఃఖంతో దొంగ ఏడుపు లేడిస్తే అరవఏడు పంటారు

**అరవ గోల:** తెలుగులో 'సంతగోల, కాకిగోల' అన్న మాటల స్థానంలో అరవ గోల అనేమాట పుట్టింది ఇద్దరు తెలుగువాళ్ళు కలిస్తే ఏ ఇంగ్లీషులోనో హిందీలోనో

మరే ఇతర భాషలోనో మాట్లాడుకుంటారుగాని మాతృభాషలో మాట్లాడరని పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు సాక్షి వ్యాసాల్లో జంఘాలశాస్త్రి చేత చాలాసార్లు అనిపించారు అరవలు కేవలం మన కీవిషయంలో విరుద్ధంగా ప్రవర్తిస్తారు. ముఖ్యంగా తమిళేతర ప్రాంతాల్లో ఉన్నప్పుడు కూడా వాళ్ల సంభాషణ మన ప్రాణానికి గోలగా భాసిస్తుందన్నమాట

అరవ చాకిరి: అనేక కారణాల వల్ల తెలుగువాళ్లకూ అరవలకు ఎప్పుడూ పడేట్లులేదు చాళుక్యులు, చోళులు మొదలైన రాజవంశాలవాళ్లు తెలుగుదేశాన్ని జయించి పాలించి నప్పటినుంచీ ఈ విరోధం కొనసాగుతున్నట్లుంది వాళ్ల కుంభకోణాలు, చిదంబర రహస్యాలు మనవాళ్లని అనేకవిధాల బాధించి వుండవచ్చు ఉత్తర హిందూస్థానంలో పంజాబీల్లాగా దక్షిణ భారతంలో అరవలు (తమిళులు) శ్రమజీవు లన్నమాట నిజం అందువల్లనే మనకు వాళ్లంటే ఈర్ష్య పుట్టి, దరిమిలా రాజకీయాదికారణాలవల్ల అది అసహ్యంగా పరిణమించి ఉంటుంది మాటా పలుకూ లేకుండా ఎంత చాకిరయినా చేస్తే దాన్ని 'గొడ్డు చాకిరి' అనటం తెలుగుజాతీయం ఆ గొడ్డు స్థానంలో అరవ శబ్దాన్ని చేర్చి అమర్యాద చేయటం కూడా తెలుగుతీరే అరవకుండా చేసే చాకిరినీ, అరవలు చేసే చాకిరినీ శ్లేషలో బంధించి ఈ సమాసం కల్పించి వుంటారు మనవాళ్లు. వాళ్ళ విషయంలో కన్నడిగులక్కూడా మనతో ఏకాభిప్రాయముంది శ్రీనాథుడు 'నా కవిత్వంబు నిజము కర్ణాట భాష' అన్నా, 'కర్ణాట రాజ్యరమాధురంధరు'డైన శ్రీకృష్ణదేవరాయలు మనవాడేనని భావించినా మనం ఉభయులం తమిళ ద్వేషులమే అందుకే కాబోలు చివరికి అరవ భాషను మనవాళ్లు డబ్బాలో రాళ్లు దొర్లించినట్లుంటుందని ఆక్షేపించినట్లే కర్ణాటులు "తెలుగు తేట, కన్నడ కస్తూరి, అరవ అధ్వాన్న" అని తమ భాష కస్తూరిలా గుబాళిస్తుందనీ, మనది తేటగా (స్పష్టంగా) ఉంటుందనీ, అరవం మాత్రం అధ్వాన్నంగా ఉంటుందని ఆక్షేపిస్తుంటారు తమిళంలో-ప్రాచీన తమిళంలో-పదాదిని 'ర' పలకటంలేదు అందుకే 'రవం' (ధ్వని) ఉన్న తమ భాషను 'మధుర భాష' అని భావించి వాళ్లు 'అరవ'మని పిలుచుకుంటే, సరిగ్గా ఆ మాధుర్యమే లేదని ఆ భాషను మనం అరవ మంటున్నాం. చిలప్పతికారం (శిల్పాధికారం) అనే ప్రాచీన తమిళ కావ్యంలో కణ్ణకి మాటలు అరవం కన్నా తియ్యగా ఉంటాయని వర్ణించాడు కవి! వాళ్ళ భాష వాళ్ళకు ముద్దు; మనది మనకు. భాష సంగతి ఎలా ఉన్నా తమిళులు చేసే శ్రమను మన గొడ్డు చాకిరితో పోల్చి ఈ జాతీయాన్ని పుట్టించామన్నమాట!

అరుంధతీ దర్శనం: వశిష్ఠమహర్షి భార్య అరుంధతి సప్తర్షుల్లో వశిష్ఠ నక్షత్రం పక్కన కనపడీ కనపడకుండా మినుకుమినుకుమనే మరో నక్షత్రాన్ని అరుంధతి అంటారు. మహాపతివ్రతల్లో ఆమె చాలా ముఖ్యురాలనీ, ఒకప్పుడు అగ్ని సప్తర్షుల భార్యలను చూసి మోహించి క్షీణిస్తుంటే అతడి భార్య స్వాహాదేవి తాను ఆయా ఋషిపత్నుల రూపంలో కనిపించి ఉత్సాహపరిచిందిగానీ అరుంధతి వేషం కట్టలేకపోయిందనీ పురాణగాథ లున్నాయి అరుంధతి హరిజనస్త్రీ అనీ,వశిష్ఠుడితో ఆమె వివాహం కులాంతర వివాహమనీ చెప్తారు వివాహ సమయంలో వరుడు అరుంధతీ నక్షత్రాన్ని దర్శిస్తే ఆయుష్మంతు డవుతాడన్న నమ్మకముంది. ఎవరికయినా అరుంధతీ నక్షత్రం కనిపించకపోతే అతగాడు ఆరునెలలకన్నా బతకడనే ప్రవాదమొకటుంది -జ్యోతిషం పుణ్యమా అని. కంటిమాపు

సరిగా లేనివాళ్ళకు బహుశా ఈ సూత్రం వర్తించదేమో తెలీదు పగటి ముహూర్తాలు పెట్టి పెళ్ళిళ్ళు చేయించే పెద్దలు కూడా ఆకాశంలో ఉత్తరభాగం చూపి అరుంధతిని చూడమంటారు! చెప్పినవారికీ చూసినవారికీ కనిపించకపోయినా అలా చెప్పటం, చూపటం ఆచార మయిపోయింది. అరుంధతీ దర్శన మయిందంటే ఆయుష్యం పెరిగినట్లు,పుణ్యం వచ్చినట్లు లెక్క ఒకాయన 'అరుంధతి కనిపించలేదుగాని పెళ్ళికోసం చేసిన ఆరువేల రూపాయల అప్పు కనిపిస్తున్న'దన్నాడని ఓ కథ చెప్తారు బహుశా ఆ మాట 'ఓలి' (కన్యాశుల్కం) ఇచ్చి పెళ్ళాడే రోజులనాటి దయివుంటుంది

ర్క వివాహం: అర్కమంటే జిల్లేడు మొదటిభార్య చనిపోతే మరో పెళ్ళి చేసుకునే వాళ్ళున్నారు ఆమె పోతే మూడో పెళ్ళి ముడిపడదనే నమ్మకముంది కానీ పెళ్ళాడ దలచినవాళ్ళు మూడో భార్యగా జిల్లేడు మొక్కను కన్యగా భావించి ఆ చెట్టుకు సూత్రం కట్టి దరిమిలా అసలు కన్యను పెళ్ళాడతారు అప్పుడట–పెళ్ళాడిన కన్య నాలుగో భార్య అవుతుందట! అందువల్ల మూడో పెళ్ళి ముడిపడకపోయినా ఇబ్బంది లేదనేది ఆచారమయింది ఈ దుష్టసంప్రదాయం పూర్వం చాల ఎక్కువగా ఉండేది ఈ అర్క వివాహం అంటే దొంగపెళ్ళి అనే అర్థం వాడుకలోకి వచ్చింది ఎందుచేతనో అంత వాడుకలోకి రాని మరో పరమదుష్టసంప్రదాయ ముండేది భక్తచింతామణీ శతకం రాసిన వడ్డాది సుబ్బారాయుడుగారు ఏడో పెళ్ళి చేసుకున్నా డంటారు అప్పుడు పెళ్ళికూతురు మెడకు బిగించవలసిన ఉచ్చును 'శాస్త్ర ప్రకారం, ఆచారం ప్రకారం' అరటిచెట్టుకు బిగించాడట. అది 'కదలీవివాహ' మన్నారు! ఈ శాస్త్రాలూ ఆచారాలూ ఎలా తగలడ్డా, అర్క వివాహమనే మాటకు 'దొంగపెళ్ళి' అనే అర్థమే నిలిచింది 'గుళ్ళోపెళ్ళి' కున్న గౌరవం దీనికి లేదు

అలంకరణ విద్యార్థి: పూర్వ విద్యార్థులు గురువులను వెతుక్కుంటూ ఆయా ఆశ్రమాలకు పోయి చదువుకొనేవాళ్ళు అక్కడ గురువులే వాళ్లకు అన్నపానాదులు కల్పించి, తల దాచుకొనే చోటు చూపించి, చాకిరీ చేయించుకొని చదువుచెప్పి పంపేవాళ్ళు అలాంటికాలంలో కూడా కొందరు విద్యార్థులు సరిగా విద్యలు నేర్చుకొనేవాళ్ళుకాదు వాళ్ళెందుకున్నారంటే – తరగతికి అలంకారప్రాయంగా, సంఖ్యాబలం పెంచడానికి ఉన్నారని చెప్పాలి ఆ బాపతు విద్యార్థులను అలంకరణ విద్యార్థు లంటారు

అలంకృతశిరశ్ఛేదం: శిరశ్ఛేదం అంటే తల నరకటం కొందరు తప్పుగా 'శిరచ్ఛేదం' అంటుంటారు (శిరస్+ఛేదం=శిరశ్ఛేదం) అలంకృతం అంటే అలంకారాలు చేసిన అని అర్థం కొన్ని సందర్భాల్లో మనకిష్టంలేని వ్యక్తి వచ్చి తిష్ఠ వేస్తాడు ఎంతసేపటికీ పోడు అతగాణ్ణి మర్యాదగానే సాగనంపవలసి వస్తుంది. అలాగే ఉరితీసేముందు నేరగాణ్ణి నీ చివరి కోరిక ఏమిటో చెప్పమని అడిగే పద్ధతి ఉంది ఉరి తప్పించటంతప్ప మరే కోరికయినా నెరవేరుస్తాం అని చెప్పటం కద్దు ఒకడెవడో నా తలమీద వజ్రాల కిరీటం పెట్టి ఆతర్వాత ఉరితీయ మన్నాడట! కోరిక తీర్చటంకోసం అతగాడికి ఆ అలంకారాలన్నీ చేసి దరిమిలా తల నరికారని ఓ కథ. ఉరితీయటంకన్నా పూర్వం తల నరకటమే ఆచారంగా ఉండేది ఆ కథను పురస్కరించుకొని ఎంతో గౌరవ మర్యాదలతో సాగనంపటం, అభిమానిస్తున్నట్లు నటిస్తూ దొంగపోటో వెన్నుపోటో పొడిచి చంపటం వగైరాలను అలంకృత శిరశ్ఛేద మంటారు 'మీ వయస్సు చాలా

పెద్దది ఇంత శ్రమపడలేరు కాబట్టి తప్పుకోండి' అని కొందరు మహా నాయకులను పదవినుంచి తప్పించటం కూడా అలంకృత శిరశ్ఛేదమే

**అలాత పిశాచం:** అలాతం అంటే కొరివి పిశాచమంటే దయ్యం మొత్తం మాటకు కొరివిదయ్యమని అర్థం మైదానాల్లో సహజవాయువు పైకివచ్చి ముట్టుకొని మంటలువస్తే వాటిని చూసి దయ్యాలని భయపడుతుంటారనీ, అది మూఢవిశ్వాసమనీ శాస్త్రజ్ఞులంటారు వారి గొడవ వారిది శ్మశానాల్లో గ్రామాల చివర కొరివి దయ్యాలు తిరుగుతుంటాయనీ, అవి బాటసారులను భయపెట్టి చంపుతుంటాయనీ లోకంలో నమ్మకముంది ఆ కొరివిదయ్యాల్లగానే భయపెట్టే, మండిపడిపోతుంటే బాధించే వ్యక్తులను కూడా 'కొరివిదయ్యా'లని వ్యవహరించటం కద్దు అచ్చ తెలుగులో ఈ రకంగా తిట్టే అవతలి వ్యక్తికి మరింత మంట పుట్టుకొస్తుందనేమో, 'అలాతపిశాచ'మని దూషిస్తుంటారు సంస్కృతంలో 'అది నిజంగా పిశాచం కాదు, కొరివిమంటే' నని నమ్మజెప్పే సమయంలో కూడా అలాతపిశాచ మంటారు అంటే ఉత్తుత్తి (దయ్యం) విషయమని చెప్పటమన్నమాట

**అవటకచ్ఛపం:** ఇదీ తాబేలు సంగతే అవటం అంటే బొరియ కూపకూర్మం నీటి తాబేలు సంగతయితే ఇది మెట్ట తాబేలు వ్యవహారం అది బావిలోనో చెరువులోనో మకాంవేసి అదే ప్రపంచ మనుకున్నట్లు, మరో లోకం లేదనుకున్నట్లు ఇది తన బొరియే సమస్త ప్రపంచం అనుకుంటుంది అంటే దానికిలాగే దీనిక్కూడా లోకజ్ఞానం లేదన్న మాట ప్రపంచజ్ఞానం లేని వ్యక్తిని అవటకచ్ఛప మంటారు కూపకూర్మం, బావిలో కప్ప, ఇదీ ఒకే భావాన్ని వ్యక్తం చేసేందుకు వాడే మాటలు

**అవినాభావం:** 'వినా' అనే సంస్కృతావ్యయానికి 'లేని' అని అర్థం అవినాభావమనే మాటకు లేకుండపోవటమని అర్థం 'వీళ్ళిద్దరికీ అవినాభావ సంబంధం' అంటే వాళ్లు ఒకరిని విడిచి మరొకరు బతకలేనంత స్నేహం, ఒకరు లేనిదే మరొకరుండనంత మైత్రి అనే అర్థాలు వచ్చాయి. ఒక సంస్కృత అవ్యయం ఇలా తెలుగులో భాగమయింది

**అశ్వత్థ ప్రదక్షిణం:** అశ్వత్థమంటే రావిచెట్టు ప్రదక్షిణం అంటే చుట్టూ తిరగటం తెలుగువాళ్ళలో ఒక నమ్మకముంది సాక్షాత్తూ నారాయణమూర్తి అవతారమయిన రావిచెట్టు చుట్టూ ప్రదక్షిణం చేస్తే సంతానం కలుగుతుందనే విశ్వాసంతో ఒక గొడ్రాలు రావిచెట్టు చుట్టూ మూడుసార్లు తిరిగి కడుపు పట్టి చూసుకుందని సామెత ప్రదక్షిణలవల్ల, కౌగిలింతలవల్ల సంతానం కలుగుతుందనే విశ్వాసంతో సింహాచలం దేవాలయంలోని స్తంభాన్ని దంపతులు చెరోవైపునుంచీ కౌగిలించుకోవటం కద్దు అలాంటిదే ఇదిన్నీ ప్రదక్షిణవల్ల దైవానుగ్రహం కలిగినా పురుష ప్రయత్నం లేకుండా గర్భోత్పత్తి కలుగుతుందనుకోవడం అమాయకత్వమే కావచ్చు కానీ "ఆమె కడుపుతో ఉంది–బహుకాలం తరువాత" అనడానికి బదులు "అశ్వత్థ ప్రదక్షిణం చేసిం"దనటం అలవాటయింది! కొందరు రావి చెట్టుకూ వేప చెట్టుకూ పెళ్ళి చేస్తే సంతానం కలుగుతుందని నమ్ముతారు వేపను లక్ష్మీదేవిగా భావించేవాళ్ళు పాతకాలం వాళ్ళు ఇప్పటివాళ్ళు ఎన్టీఆర్ పుణ్యమా అని దాన్ని 'తెలుగుచెట్టు' అంటున్నారు

**అష్టావక్రుడు:** పూర్వం ఏకపాదుడనే గురువు శిష్యులను వేపుక తినేవాడట – రాత్రింబవళ్లు చదివిస్తూ ఆ గురువుగారి కుమారుడు తల్లి కడుపులో ఉండగానే,

శిష్యులమీద జాలిపడి తండ్రితో వాళ్లమీద దయ చూపమని వాదించాడు. ఇలా వంకర మాటలు మాట్లాడావు కాబట్టి నీ శరీరంలో ఎనిమిది (అష్ట) వంకరలతో కురూపిగా పుట్టమని తండ్రి కొడుకును శపించాడని విష్ణుపురాణం చెప్తుంది. అలా శపించి సంపాదనకోసం తండ్రి జనకమహారాజు దగ్గరకు పోతే, అష్టావక్రుడు మేనమామ ఉద్దాలక మహర్షి ఇంట్లో పుట్టాడు. మేనమామ కొడుకు తన తండ్రి తొడ మీద కూర్చోబోయిన అష్టావక్రుణ్ణి వెక్కిరిస్తాడు. తండ్రిని వెతుక్కుంటూపోయి రాజసభలో వాదోపవాదాల్లో ఓడిపోయి చావుకు సిద్ధమైన తండ్రిని కాపాడుకుంటాడు అతడు నీళ్ల మధ్య నిలిచి చాలాకాలం తపస్సు చేస్తుంటే రంభాదులు వచ్చి తమకు విష్ణుమూర్తి భర్త అయ్యేట్లు వరమివ్వమంటారు. కృష్ణావతారంలో అలాగే జరుగుతుందంటాడు. అంతవరకూ బాగుంది కానీ నీటిలో నుంచి బైటకు రాగానే అతడి అవతారం చూసి అప్సరసలు నవ్వారట అయనక్కోపం వచ్చి కృష్ణుడు లేనప్పుడు మీరు బోయల చేతిలో అవమానాల పాలవుతారని శపించాట్ట. అలాగే జరిగిందని పురాణ కథ

ఎంత మహాతపస్వి అయినా విద్యాంసుడయినా శరీర సౌందర్యం లేనందువల్ల అయన వెక్కిరింతలపా లయినాడు లోకానికి అయన శక్తికన్నా వికార స్వరూపమే ఆకర్షకమయిం దన్నమాట అందుకే కురూపిని అష్టావక్రుడనటం అలవాటయిపోయింది

అహినకులికం: అహి అంటే పాము నకులం అంటే ముంగిస ఈ రెంటికీ సంబంధించిన సమానమైన లక్షణం ఆగర్భశత్రుత్వం పిల్లీ కుక్కలకు లాగా, ఎలుకా పిల్లులకులాగా సహజవైరం ఉండటాన్ని అహినకులికం అంటారు కొంచెం భేదం లేకపోలేదు పిల్లి ఎలుకతో పోరాడదు పోరాడే పనే లేదు దొరికితే నోటకరచుకొని చంపి తింటుంది కుక్క పిల్లితో గూడా పెద్దగా పోరాడే పనిలేదు ఎదుటపడితే కుక్క పెద్దజంతువు కాబట్టి చంపగలదు చంపుతుందేగానీ తినదు ఏపాటి అవకాశమున్నా పిల్లి ఏ గోడో, చెట్టో ఎక్కి తప్పించుకోగలదు కుక్క అంత ఎత్తు ఎగరలేదు కాబట్టి అరుస్తుండాల్సిందే గాని చేయగలిగిం దేమీలేదు పిల్లి ఎదుటపడిన ఎలుకకు చావు తథ్యం కుక్క ఎదటపడిన పిల్లికి చావు వైకల్పికం ఈ రెండు సందర్భాల్లోనూ సహజశత్రుత్వం సమానమేగానీ పోరాటం లేదు పామూ ముంగిసల మధ్యనున్న వైరం అలాంటిది మాత్రమే కాదు పోరాటం జరిగి తీరుతుంది పాము పడగవేటుకు దొరక్కుండా ముంగిస చుట్టూ తిరుగుతుంటుంది వాలూ వీలూ దొరికినపుడు మెడ కొరికి చంపుతుంది ఈ విషయంలో పిల్లీ పాముల మధ్య జరిగే పోరాటానిక్కొండా పోలిక ఉంది అయినా పిల్లీ పాముల వైరం సహజశత్రుత్వం కాదు ప్రాణరక్షణార్థం జరిగే యుద్ధం మాత్రమే ముంగిసతో పాము పోరాడటం జన్మసిద్ధమైన శత్రుత్వం ముంగిస పామును చంపటం ఖాయం. సమానద్వేషముండి పోరాడుతున్న వాళ్ళలో ఒకరు గెలిచి తీర్తారన్న విశ్వాసమున్నప్పుడు ఆ పోరును అహినకులికం అంటారు బలహీనుణ్ణని తెలిసికూడా చచ్చేదాకా పోరాడే దొకరు మరొకరు సమయం చూసి దెబ్బతీసి విజయం సాధించేవారు ఇలాటి శత్రుత్వమున్న సందర్భాలను అహినకులికం అంటారు ఈ యుద్ధానికి విస్పష్టమైన ఫలితం ఉంటుంది అది సహజశత్రుత్వం కూడా

అసిధారావ్రతం: 'అసి అంటే కత్తి ధార అంటే పదునైన అంచు చాలా కష్టమైన పని అనే అర్థంలో 'నా బతుకంతా అసిధారావ్రతంగా నడుస్తున్న'దంటారు నిజానికి అది కూడా ఒక వ్రతమే అది బ్రహ్మచర్య దీక్షలో ఒక భాగం భార్యాభర్తలు ఒకే

మంచంమీద పడుకొని కలియకుండా ఉండే వ్రతముంది మధ్యలో ఒక విచ్చుకత్తిని పెట్టుకుంటారు కదిత్తే ప్రాణాంతకం కేవలం కత్తి అంచుమీద పడుకోవటం కాదిది

ఒకప్పు డొక రెవెన్యూ అధికారి జమాబందీకి వచ్చిన గ్రామాధికారులను రేపురా, మాపురా అని ఏడిపిస్తుంటే ఒకాయన ఓ పద్యం చెప్పాడట – "శీతల వారి స్నానము, భూతల శయనంబు ఒంటిపూ టశనంబున్, నాతిగల బ్రహ్మచర్యము, నా తరమా పూట గడప? నారయభూపా!" అని చన్నీళ్ల స్నానం చేయవచ్చు కటిక నేలమీద పడుకోవచ్చు ఒంటిపూట తిని బతకవచ్చు కానీ భార్య ఉండగా బ్రహ్మచర్యంతో బాధపడటం సాధ్యం కాదని విలపించా డన్నమాట. ఈ అసిధారావ్రతం కూడా అటువంటి కఠోరదీక్షే. భార్య దూరంగా ఉండగా పడే విరహబాధ కాదిది. దగ్గర ఉండగా నిబ్బరంగా దీక్ష వహించటం అందువల్ల అసిధారావ్రతమనేది చాలా దుర్భరమైన వ్రతం. మనోనిశ్చయానికి భయంకర పరీక్ష

ఆకాశకుసుమం: కుసుమం అంటే పువ్వు ఈ మాటకు బదులు పుష్పశబ్దాన్ని కూడా పర్యాయంగా వాడుతుంటారు ఆకాశానికి బదులు 'గగనం, అభ్రం, మేఘం' అనే మాటలను కూడా వాడి, భిన్న సమాసాలను కల్పిస్తారు. పూలనేవి చెట్లకో తీగలకోగాని ఆకాశానికీ మబ్బులకూ పూయటమన్నది అబ్బురమేగాదు, అసాధ్యంకూడా. కుందేటి కొమ్ములాగా, కాకి దంతంలాగా లేనివస్తువిది. 'ఏమీలేదు, సర్వశూన్యం, హుళక్కి, అబద్ధం, అసాధ్యం' అనే అర్థాల్లో ఈ జాతీయాన్ని వాడుతుంటారు కొంద రిది ఒక వేళ ఉన్నా దొరకని వస్తువనే అర్థంలోనూ వాడుతుంటారు. ఎందుకంటే, స్వర్గలోకం ఆకాశంలో ఉందనీ, అక్కడ కల్పవృక్షం, పారిజాతం లాంటివి ఉన్నాయనీ పురాణాల్లో కవిత్వాల్లో వర్ణించారు కాబట్టి ఆకాశంలో కూడా పూలుండవచ్చుగాని అవి మనకు దొరకవు, కనిపించవు అనే నమ్మకం కలిగి ఈ మాట వాడుతున్నా రన్నమాట. బహుశా పింజెలు పింజెలుగా కనిపించే మబ్బులే ఆకాశకుసుమా లనిపించవచ్చు. అవి కూడా అందుబాటులో ఉండవుకాబట్టి లేనివాటికిందే లెక్క ఫలితంలో ఆకాశ కుసుమం అంటే దేవతా వస్త్రంలాగా లేని విషయం/వస్తువు.

ఆకాశరామన్న: రాసినవాడి ఊరూ పేరూ తెలియని ఉత్తరాన్ని ఆకాశరామన్న ఉత్తర మంటాం కొన్నిసార్లు ఏదో ఒక విన్నపం కూడా సంతకం లేకుండా, రాసిన వ్యక్తి చిరునామా లేకుండా వస్తుంది. అది ఆకాశరామన్న అర్జీ. ఒక్కోసారి బెదిరింపులు రావచ్చు అది ఆకాశరామన్న చీటీ భూమ్మీదవున్న మనిషే ఈ రాతలు రాస్తుంటే ఆకాశంతో ఆయనకు సంబంధమేమిటి?

పూర్వం పెద్దలు రచ్చబండమీద కొలువుదీర్చేవాళ్ళు. ఇప్పుడూ అలాగే జరుగుతున్న దనుకోండి అలా కొలువుదీరిన పెద్దల్లో ఎవరో ఒకరు బుర్రగోక్కుంటూ ఆకాశంవైపు చూసేవాళ్లు సదరు పెద్దమనిషికి చెట్టుకొమ్మల మధ్య వేలాడుతున్న చీటి కనిపించేది. (ఆయన అందుకు సొంతంగా బాధ్యుడు కాకపోయినా ఆయన ఎరికతోనే అది అలా వేలాడే దన్నమాట) ఎవర్నో చెట్టెక్కించి ఆ చీటీని దించి చదివితే అందులో ఎవరిమీదనో నిందలుగాని అలాంటివిగాని ఉండేవి సంతకం ఉండేదికాదు ఆకాశం నుంచి సాక్షాత్తు రామచంద్రుడే అలా సందేశం పంపాడని సామాన్యజనం–నిక్కచ్చిగా వాళ్లంతా నిరక్షరాస్యులే–నమ్మేవాళ్ళు దస్తూరీ పోల్చడంవంటి నిపుణవిద్య అసలు విద్యాగంధమే లేని జనానికి మొదలే చేతగానిది కాబట్టి అందులోని విషయాన్ని

సర్వసాధారణంగా నమ్మేవాళ్ళు అలా సంతకం చేయకుండా అభాండాలో రహస్యాలో బయటపెట్టిన వాడు కాలక్రమాన ఆకాశరామన్న అయిపోయాడు

తక్కినవాళ్ల విషయం ఎలాగున్నా ఈ ఆకాశరామన్నమటుకు ఆకాశం నుంచి ఊడిపడ్డ పరమ నీతిమంతుడైన అచ్చతెలుగువాడని రామన్నపేరే చెప్తుంది మన తెలుగువాళ్లలో కనీసం ఒక్కడైనా ఇంతటి అఖండు డున్నాడంటే మనమంతా గర్వించి తీరాలి! దస్తూరీలను పోల్చే అవకాశం వచ్చిన తర్వాత టైపుమిషన్లు ఈ పనిచేయటం మొదలుపెట్టాయి వాటి అలవాట్లను కూడా కనుక్కోగలశక్తి వచ్చేసరికి ముద్రణ యంత్రాలు ఆ కొరత తీరుస్తున్నాయి. పూర్వం బడిపిల్లలచేత రాయించే వాళ్లు–సొంత దస్తూరీ బయటపడకుండా ఫోర్జరీలు చేయగల మహానుభావులకు ఇటువంటి సమస్యే రాదనుకోండి

ఆకాశరామన్న మహనీయుడే కావచ్చుగాని సాధారణంగా ఆయన పేరిట (అంటే పేరు లేకుండానే) వచ్చే ఉత్తరాలూ అర్జీలూ చీటీలు తప్పకుండా ఎవరో ఒకరు చేసిన తప్పు(డు) పనులను బయటపెట్టడానికే వస్తాయి మంచి విషయాల జోలికి ఆకాశరామన్న పోయిన దాఖలాలు కనిపించవు నిర్భయంగా అన్యాయాలను బయటపెట్టలేని వాళ్ళూ, అలాగని వాటిని కడుపులో దాచుకోలేని వాళ్ళూ అప్పుడప్పుడు ఈ అవతార మెత్తుతుంటారు "చీటికి ప్రాణంబు వ్రాలు సిద్దము సుమతీ" అని బద్దెన ఘోషించినా, వ్రాలు (సంతకం) లేని రాతకు న్యాయశాస్త్రరీత్యా ప్రాముఖ్యం లేకపోయినా, ఆకాశరామన్న విశ్రమించడు ఆకాశరామన్న ఎవరో ఎవరికీ తెలీదు తెలిసినా బయటపెట్టరు! కాబట్టి ఆయన దేవుడిలాగా చర్మచక్షువులకు కనిపించడు.

**ఆటవిడుపు:** ఇది పాతకాలపు వీధిబడుల సంప్రదాయంలో ఒక భాగం. ఆనాటి బోధన పూర్తి అయి పిల్లలు ఇళ్ళకుపోయే ముందు ఒక పద్యం చెప్పేవారు – ఒకటికి రెండుసార్లు గుర్తు రాసుకొనిగాని, గుర్తుపెట్టుకొనిగాని మరునాడుదయం బళ్ళోకి రాగానే దాన్ని ఉపాధ్యాయుడికి ఒప్పచెప్పాలి. చెప్పకపోతే పేంబెత్తం దెబ్బలుండేవి తప్పులు చదివితే ఒకటికి పదిసార్లు పలకమీద దాన్ని సరిగ్గా రాసి చూపాలి పిల్లలు ఆడుకోవడానికి పోబోతుండగా బడి 'విడుపు' సమయంలో నేర్పిన పద్యాన్ని ఆటవిడుపు పద్యమనేవారు సాధారణంగా సుమతి శతకం, భాస్కర శతకం, వేమన, భర్తృహరి పద్యాల్లో రోజుకొకటి నేర్పేవాళ్ళు అంతకన్నా ముందు కాలంలో అర్థం చెప్పకుండా అమరకోశం, ఆంధ్రనామ సంగ్రహంలోని పద్యాలు నేర్పేవారు ఉచ్చారణ స్పష్టత, శబ్దాధికారం (అర్థవిరహితంగానయినా సరే) పట్టుబడాలని పద్యాలు ఇలా చదివించేవారు కొన్ని బళ్ళలో 'భారత సావిత్రి' వంటి వచన గ్రంథాలను కూడా చదివించేవాళ్ళు ఇప్పుడు ఆధునిక విద్యావిధానంలో ఈ పద్ధతికి స్థానం లేదు. చివరికి స్నాతకోత్తర స్థాయిలో బంగారు పతకాలు సంపాదించిన వీర విద్యార్థులక్కూడా పట్టుమని పది పద్యాలు రావని బల్లగుద్ది చెప్పవచ్చు వచ్చిన నాలుగింటినీ రాయమంటే గణ యతి ప్రాస పాదభేదాలు గమనించకుండా రాసే నైపుణ్యం సాహితీపరులకు కూడా అలవడింది ఈ విధమైన చదువు లేకపోయినా 'ఆటవిడుపు' అనే మాట మాత్రం అర్థవిశేషం సంపాదించుకొని "పనిలేకపోవటం" అనే భావంలో వ్యవహృతమవుతున్నది పత్రికల్లో 'పంచవర్ష ప్రణాళికలకు ఆటవిడుపు' వంటి శీర్షికలు ప్రత్యక్షమవుతున్నాయి కవి హృదయంలో 'విరామం, విశ్రాంతి, అమల్లుకాకపోవటం' అనే అర్థాలు ఈ మాటకు వచ్చాయి

**ఆత్మారాముడు:** "ఆత్మారాముడు క్షోభిస్తున్నాడు కడుపు కింత అన్నం వేయాలి" వగైరా వాక్యాలు వినిపిస్తుంటాయి 'ఆత్మ' అంటే 'తనను', 'ఆరామం'గా అంటే 'నివాసస్థలం'గా చేసుకొన్నవాడు ఆత్మారాముడు. ఆకలి, దుఃఖం, ప్రేమ, ద్వేషం వంటి సమస్త గుణాగుణాలూ మనలోనే ఉంటాయి కాబట్టి మన ప్రాణమే, జీవమే ఆత్మారాముడు అందుకే "అంతా రామమయ" మంటారు! "అంతః+రామం" అనే రెండు పదాలు సంధిలో "అంతారామ" మవుతాయని చెప్పేవాళ్ళు లేకపోలేదు "అంతః" అంటే "లోపల" సమస్త విషయాలకు ఆధ్యాత్మికార్థమో దేవతా సంబంధమో కల్పించుకొనే భారతీయ చిత్తవృత్తి! కీమాట ఒక మచ్చుతునక భేషజానికి ఇదో చిహ్నం తాను కోరే కోరికలకూ చేసే పనులకూ దైవమే కారణమని తప్పించుకోటానికి ఇదొక సులభమార్గం ఈ మాట వాడకుండా ఇదే భావాన్ని వెలిబుచ్చినవాడు కన్యాశుల్కంలో గిరీశం దేవుడు తనను డిపెండెంటుగా (ఆధారపడ్డవాడిగా) సృష్టిస్తే తన చేతలన్నిటికీ ఆయనే బాధ్యుడన్న గిరీశం, ఇండిపెండెంటుగా (స్వతంత్రుడిగా) సృష్టిస్తే అడిగేవాళ్ళు లేదన్నాడు! ఈ పదం రాముడికి సంబంధించిందో కాదో నిశ్చితంగా చెప్పలేం గాని ఇందులో రామశబ్దం వినిపిస్తున్నది కాబట్టి ప్రస్తావిస్తాం.

**ఆముదపాకు:** ఆముదం మొక్కకున్న ఆకు అనేకవిధాల మనిషి అరచేతిని పోలి ఉంటుంది శాతవాహనులకాలంలో గుడిసెలమధ్య పెరిగే ఆముదపాకు ఇల్లాలి స్తనసౌభాగ్యాన్ని చేపట్టుగా సూచిస్తుంటుందని ఓ కవి వర్ణించాడు విప్పిన అరచేతిలా గుండే ఆముదపాకును అడుక్కుతినేవాడి చేతితో పోల్చి, ఫలానా వ్యక్తి పరమ యాచకుడని వెక్కిరించటానికి 'అతడండి! ఆముదపాకండి!' అనటం కద్దు బిచ్చగాడనే అర్థంలో ఈ మాటను వాడుతుంటారు

**ఆముదపు చెట్టు:** చిన్నదయితే మొక్క, పెద్దదయితే చెట్టు చేవదేలేది చెట్టు, తేలనిది మొక్క కొందరు బీరచెట్టు, పొట్లచెట్టు అని తీగలను గూడా చెట్లని పిలిచేవాళ్ళు లేకపోలేదు నేలబారున పెరిగే వెంపలి "చెట్టు" కు నిచ్చెనలు వేసేవాళ్ళు పుట్టారని కలికాల లక్షణంగా చెప్తారు ఆ సంగతి అలా ఉంచి 'చెట్లు లేనిచోట ఆముదపు చెట్టే మహావృక్ష' మనే వాక్యం వాడుకలో ఉందని తెలుసుగదా! సమర్థులు లేనిచోట ఉన్నంతలో ఉన్నవాడే గొప్పవాడనే అర్థంలో 'అతగాడు ఆముదపు చెట్టులాంటివా'డంటారు పోటీదారుగాని, మించినవాడుగాని లేనిచోట తానే అందరికన్నా పెద్దవాణ్ణని, గొప్పవాణ్ణని చెప్పుకొని బతికే వ్యక్తిని ఆముదపుచెట్టని వేళాకోళంగా పిలుస్తారు

**ఆముదాలు:** ఈ మాట ఆముదం చెట్లకూ గింజలకూ అన్వయించవలసిందేగాని లోకవ్యవహారంలో మరో విశేషార్థం సంపాదించుకుంది ఇప్పటిలా దివాలా తీసి బకాయిపడ్డవారు అప్పులిచ్చిన వాళ్ళకు ఎలా చెల్లించాలో వివరించే చట్టాలు లేని రోజుల్లో ఎందుకు పుట్టిందోగాని ఈ మాట పుట్టింది పదిమంది దగ్గర అప్పు తీసుకొని ఎవరికీ పూర్తిగా తిరిగి యివ్వలేని సందర్భంలో ఆముదాలు పంచటమనే పద్ధతి వాడుకలో ఉంది మచ్చుకు వెయ్యి రూపాయలు నలుగురికి బాకీపడ్డ వ్యక్తి దగ్గర చివరకు వంద రూపాయలు మాత్రమే మిగిలి ఉంటే, వారు వారిచ్చిన అప్పు దామాషా ప్రకారం ఈ నూరు రూపాయలనూ పంచిపెట్టి ఋణం తీరిందనిపించుకోవటాన్ని ఆముదాలు పంచటమంటారు వర్తక ప్రపంచంలో ఈ మాట [illegible] వాడుకలో ఉండేది ఈ

ACC No. 49356

పద్ధతిలో ఎక్కువ అప్పిచ్చినవాడికి ఎక్కువ భాగం, తక్కువ ఇచ్చినవాడికి తక్కువ భాగం దక్కేది మొత్తం ఎవరికీ తిరిగిరాదు ఇది రుణగ్రస్తుడి దగ్గర మిగిలిందని లెక్కతేలిన సొమ్ముకే పరిమితం – ఆస్తులకు కాదు ఆస్తులంటే – అంటే స్థిరాస్తులుంటే వాటిని అమ్మించి నగదు రూపంలోకి మార్చిన తరవాత అముదాలు పంచి బయటపడా లన్నమాట బాకీదార్లకు తెలియకుండా దాచుకోగలిగిన ఆస్తిగాని, సొమ్ముగాని మిగలవచ్చు మరోసారి ఆ రహస్యం బయటపడ్డ తరువాత అముదాలు పంచే అనవాయితీ లేదు పంచమని నిర్బంధించే పద్ధతులున్నట్లు తెలీదు అందువల్ల ఒక్కో సమర్థుడు ఎన్నిసార్లయినా దివాలా తీయగలుగుతుండేవాడు అన్నిసార్లూ ఎంతోకొంత మిగుల్చుకోగలిగేవాడు అందువల్ల తెలుగులో ఒక సామెత పుట్టింది – 'ఏడుసార్లు దివాలా తీసినవాణ్ణి వెతికి పట్టుకొని పిల్ల నివ్వా'లని! అన్నిసార్లు బాకీదార్లను ముంచి తాను బాగుపడ్డవాడు సామాన్యుడు కాదు గనుక, అతడి సమర్థతను గుర్తించేగాక అతడిదగ్గర పుష్కలంగా డబ్బు మిగిలి ఉండి తీరుతుందన్న నమ్మకంతో కూడా ఈ సామెత పుట్టివుంటుంది అముదం ఒంట్లోని కల్మషాన్ని వదిలించినట్లు అముదాలు పంచటం రుణగ్రస్తతను వదిలించేస్తుంది (అముదాన్ని విరేచనకారిగా వాడటం పరిపాటి పూర్వం.)

*ఆరుద్ర వాన:* ఆరుద్ర కార్తెలో పడే వాన అదరగొట్టుందని అనుభవజ్ఞులంటారు 'ఆరుద్ర వాన అదరువాన' అనే సామెత కూడా పుట్టింది ఆయేటి ఫలసాయం ఆ వాన తీవ్రతమీద ఆధారపడి బాగుపడటమో నష్టపోవటమో జరుగుతుంది అందువల్ల ఆ కార్తెలో వాన కురుస్తుంటే రైతులు భయపడటం సహజం ఈ లక్షణాన్ని పురస్కరించుకొని ఎవరయినా దూకుడుగా గబగబా మాట్లాడుతున్నా తిట్టుకొంటున్నా ఆరుద్రవానలా ఉందని ఆక్షేపిస్తుంటారు అనుభవంలోని ప్రకృతి లక్షణాలను వ్యక్తుల ప్రవర్తనకు అన్వయించి వాడే జాతీయాల్లో ఇదొకటి

*అర్బత్‌నాట్ క్షౌరం:* ప్రపంచ యుద్ధకాలంలో వాడుకలోకి వచ్చిన మరోమాట ఇది అంతకుముందూ ఆ తరువాతా మన భాషలో ఇమిడిపోయింది తిరుపతి క్షౌరం మాత్రమే ఇది అంతకన్నా వేలరెట్లు ఎక్కువ తీవ్రమయింది సర్వాంగక్షౌరంలాంటి దన్నమాట ఆకాలంలో అర్బత్‌నాట్ కంపెనీ అని ఒకటుండేది దానికి ప్రపంచవ్యాప్తంగా శాఖలూ ఉపశాఖలూ ఉన్నాయి బ్రహ్మాండంగా వ్యాపారం చేసిన ఆ సంస్థలో వాటాలు కొన్నారు, పెట్టుబడి పెట్టారు – నానాదేశాల్లో యుద్ధకాలంలో ఆ కంపెనీ అకస్మాత్తుగా దివాలా తీసింది లక్షల మంది సమస్తం కోల్పోయారు వందలమంది గుండెలు పగిలి చచ్చారు ముఖ్యంగా మధ్యతరగతి జనం ఉన్నదీమన్నదీ ఊడ్చిపెట్టి వాటాలు కొన్నారు డబ్బు దాచుకున్నారు అంతా పోగొట్టుకున్నారు తొలితాకిడి తీవ్రత తగ్గిన తరవాత కావాలని దివాలా తీయించారని కొంతకాలం గోల పుట్టింది. దరిమిలా ఆ వివరాలు అందరూ మరిచిపోయినా భాషలో మిగిలిపోయింది అర్బత్‌నాట్ క్షౌరం అనే మాట మాత్రం వ్యాపారంలో మొత్తం మునిగినా ముంచినా అర్బత్‌నాట్ క్షౌరమయినట్లే లెక్క

*ఆవంలో రాగిముంత:* ఆవమనేది కుమ్మరావమే పచ్చి కుండలను కాల్చేచో టది అక్కడ ఏ లోహమూ కనిపించదు బంకమట్టి, అడుసు, సారె వంటివి తప్ప ఇనుం, రాగి వగైరా లక్కడ ఉండవు అయినాసరే ఓ మహానుభావుడు కుమ్మరావంలో

రాగిముంతయినా ఉండకపోతుందా అని వెతికా డంటారు అజ్ఞానానికి అది నిదర్శన పైపెచ్చు వృధాశ్రమ ప్రయోజనం లేని పాటు ఆవంలో రాగిముంత ఉండదు కాబట్టి ఆ మాట కర్థం లేని వస్తువని కుందేలు కొమ్ములాంటిది. గాడిద గుడ్డులాంటిది బొగ్గుల్లో రామచిలక ఉంటుందేమో కాని ఆవంలో రాగిముంత ఉండనే ఉండదు లేని వస్తువు కోసం, దొరకనిదానికోసం, అది ఉండటానికి వీలు లేనిచోట వెతికే తెలివితక్కువ పని రాగిముంత కోసం ఆవంలో వెదకటం

**ఆశ్లేష వాన:** ఆశ్లేష కార్తెలో పడే వానకు అరికాలు తడిస్తే గొప్ప అనేది అనుభవజ్ఞుల మాట వానకారుకు ఉండవలసిన లక్షణాలన్నీ ఉన్నా ఉరుములూ మెరుపులూ జోరుగా ఉండి, మబ్బు గాలికి తేలిపోతుంది టపటప నాలుగు చినుకులు పడి వచ్చినంత త్వరగానూ ఆగిపోతుంది ఈ ప్రకృతి లక్షణం ఆధారంగా పెద్ద పెద్ద వాగ్దానాలు చేసి పిసరంత చేతిలో పెట్టే దాతల విషయంలో ఈ మాటలు వాడుతుంటారు ఆర్భాటమేగాని త్యాగం తక్కువ చేతికి ఎముక లేనట్లు కోతలు కోసి రెండో అంతస్తు కట్టిస్తామని ఆకుపూజ చేయించే బాపతు దాతలను ప్రస్తావించేటప్పుడు 'ఆయన వాగ్దాన వర్షానికేం లెండి! అదంతా ఆశ్లేష వాన" అని ఈసడిస్తుంటారు మాటలు కోటలు దాటినా కాలు గడప దాటని, బడాయి మనుషుల రీతిని ఈ జాతీయం ద్వారా వ్యక్తపరుస్తారు

**ఆషాఢభూతి:** నిజం చెప్పటం ఎంత బాధాకరమో హరిశ్చంద్రుడి కథచెప్పి వివరించేవాళ్ళు, అబద్ధాన్ని ఎంత పకడ్బందీగా చెప్పి ఎంతగా నమ్మించి ఇతరులను ముంచవచ్చో నిరూపించడానికి 'ఆషాఢభూతి'ని స్మరించకతప్పదు తనను విద్యార్థిగా చేర్చుకున్న గురువుకు తనమీద పూర్తివిశ్వాసం కల్పించాడు చివరకు ముంజూరు తాటాకు ముక్కలు తలకు తగులుకుంటే తిరిగియిచ్చాడు సమయం వచ్చేదాకా వేచివుండి గురువుగారి మూటాముల్లే సంగ్రహించి పారిపోయాడు అతడు గజదొంగ, అచ్చపుదొంగ, కేపుమారి, మాయలమారి, మోసగాడు, వంచకుడు ఈ పాత్ర పంచతంత్రం లోది చిన్నయసూరి నీతిచంద్రికలో వెలిసింది ఆషాఢమంటే మోదుగకర్ర బ్రహ్మచారి లక్షణాల్లో అ కర్రను పట్టుకొని తిరగటం ఒకటి అదొక్కటే అతడికున్న భూతి (ఆస్తి) అంత దరిద్రు డతడు తనకన్నా మెరుగ్గావున్న గురువు నాశ్రయించాడు. అదనువచ్చేదాక నిజంతప్ప మరొకటి చెప్పలేదు నమ్మించి మోసగించాడు తడిగుడ్డలతో గొంతు కోశాడు గురువుకు పంగనామాలు పెట్టాడు అందుకే అలా ప్రవర్తించేవాడు ఆషాఢభూతి అని మామూలుగా వాడుతుంటారు

నయవంచనచేసే మోసగాణ్ణి ఆషాఢభూతి అని పిలుస్తారు రాజకీయాల్లో ఈ రకం మనుషుల సంఖ్య ఎక్కువ ఇతర వృత్తుల్లో ఉండరనీకాదు, లేరనీకాదు పరద్రవ్యంమీద ఆశలేదని చెప్తూ ధనసంపాదనచేసే మోసగాడు ఆషాఢభూతి అయితే అతడు చేసేదీ చేయగలదీ చిల్లరదొంగతనం మాత్రమే.

**ఆషామాషీ (కబుర్లు):** సరదాగా, వినోదం కోసం, కాలక్షేపం కోసం మాట్లాడుకొనే మాటలను ఆషామాషీ కబుర్లంటారు 'ఆషామాషీ'గా మాట్లాడారంటే పెద్ద పట్టించుకోకుండా, తేలికగా, మాటవరుసకు మాట్లాడారని అర్థం ఈ మాట మన భాషలోకి ఎలా వచ్చిందో ఎప్పుడు వచ్చిందో ఖచ్చితంగా చెప్పటం కష్టం పోలికను బట్టి హిందీ/ఉర్దూ నుంచి దిగుమతి అయిందనిపిస్తుంది గాని ఆ భాషా నిఘంటువుల్లో ఈ

మాట కనిపించదు అశ్/అష్ అనే పర్షియన్ పదానికి 'మాంసం, తినుబండారాలు, కిరాణా వస్తువులు, పులుసు, కూరలు, వంటకాలు' లాంటి అర్థాలున్నాయి. మాషక్ అనే అరబిక్ పదానికి 'నచ్చిన వస్తువు, ప్రియురాలు' వగైరా అర్థాలున్నాయి. తిండి, నిద్రలకు సంబంధించిన చిల్లర విషయాలేగాని తీవ్రమయినవి, ప్రధానమైనవి కావనే భావంతో ఈ జంట మాటల కలయికలతో ఈ జాతీయం ఏర్పడిందేమో నన్నది అనుమానం మాత్రమేగాని నిష్కర్షకాదు అసమ్/అషమ్ అనే హిందీ శబ్దానికి వ్యక్తి అని అర్థం మౌసమ్ అనేదానికి కాలం, వాతావరణమని అర్థం ఈ రెంటినీ మన అలవాట్ల ప్రకారం కలిపి కొందరు (తెలిసిన) వ్యక్తుల గురించి స్థల కాలాల గురించి అలవోకగా మాట్లాడే మాటలు కావచ్చునుకొని ఈ పదబంధాన్ని సృష్టించారని చెప్తారు నిజం పెరుమాళ్ళకే ఎరుక అషామాషీ అంటే 'ఉబుసుపోక' అనే అర్థంలో మటుకు తెలుగువాళ్ళ వాడుకలో నిలిచింది ఈ పదబంధం

**ఆసులో కండె:** ఈ మాట ప్రధానంగా చేనేత కార్మికుల వ్యవహారంలో వినిపిస్తుంది మగ్గంలేని యింట్లో ఆసులో కండె ఎలా ఆడుతుందో చూడటానికి అవకాశం లేదు. గుడ్డలు నేసేటప్పుడు ఆసులో దారమున్న కండె కుడి ఎడమలకు తిరుగుతునే ఉంటుంది మగ్గం గుంటలోని పావుకోళ్ళను నొక్కగానే కండె ఎడమనుంచి కుడికి వేగంగా కదులుతుంది మగ్గ మాడుతున్నంతసేపూ కండె కూడా ఆడుతుంటుంది – నిర్విరామంగా. ఈ లక్షణాన్ని పరిశీలించినవాళ్ళు ఊపిరాడకుండా అటూ ఇటూ తిరుగుతున్న వ్యక్తులను గురించి ప్రస్తావిస్తూ "వాళ్ళు ఆసులో కండెలా తిరుగుతున్నా" రంటారు కండెకు స్వతంత్ర ప్రతిపత్తి లేదు నేతగాడి ఇష్టానుసారం, అతడు పావుకోళ్ళను తొక్కితేనే కదులుతుంది అంటే, స్వబుద్ధి లేకుండా ఇతరులు చెప్పిన ప్రకారం నడుచుకొనే వ్యక్తి కూడా ఆసులో కండెలాంటివాడే. ఆ కదలికలో కూడా స్వేచ్ఛ లేదు ఒకే గాడిలో అటూ ఇటూ కదలాలి మార్గాంతరం లేదు. అందుచేత విధిలేని పరిస్థితుల్లో మాత్రమే కదిలి, పనికి దిగే వ్యక్తుల గురించి కూడా ఈ మాటలను వాడుతుంటారు కొందరు ఆసులో దారమని మరో రూపభేదాన్ని వ్యవహారంలో ప్రయోగిస్తారు

**ఇక్ష్వాకుల బారసాల:** చాలా పాతకాలంలో జరిగిన విషయమనటానికి ఇక్ష్వాకుల బారసాలనాటి సంగతని చెప్పటం పరిపాటి బిడ్డ పుట్టిన తరవాత పేరు పెట్టడానికి చేసే వేడుకను బారసాల అంటాం 'ఇక్ష్వాకుల బారసాల' అని బహువచనంలో వ్యవహరించట మొక విశేషమైతే, ఎవరి బారసాలో స్పష్టంగా చెప్పకపోవటం మరో లక్షణం. మన సంస్కృతిలో రెండు ఇక్ష్వాకు వంశాలున్నాయి ఒకటేమో శ్రీరామచంద్రుడి వంశం రెండోది క్రీస్తుశకం రెండో శతాబ్దం తరవాత దక్షిణ భారతంలో శాతవాహన సామ్రాజ్యం అంతరించినప్పుడు కొంత రాజ్యభాగాన్ని పాలించిన రాజవంశం వీటిలో ఏ వంశంలో ఎవరి బారసాలను ప్రస్తావిస్తున్నామో గాని, ఏదైనా చాలాకాలం కిందట జరిగిన వేడుకే ఒకటి పురాణాలు పేర్కొన్న వంశమయితే, రెండోది చరిత్రకు తెలిసిన వంశం ఎప్పుడో (అనిశ్చితకాలంలో) జరిగిన సంగతి అని చెప్పటానికి ఈ పదబంధం ప్రయోగిస్తారు

**ఇంగువ కట్టిన గుడ్డ:** ప్రపంచంలో ఎన్నో సువాసన ద్రవ్యాలుండగా ఇంగువను ఎంపికచేసి గుడ్డలో కట్టి భద్రపరచటంమీద ఓ జాతీయం పుట్టడమే విచిత్రం. గుడ్డలో ఇంగువ

లేకపోయినా దాని వాసనమాత్రం చాలాకాలం అంటుపెట్టుకొని ఉంటుంది అందులో ప్రత్యేకత ఏమీ లేదు కాకపోతే ఘాటైన వాసన గల వస్తువు కాబట్టి దాని ప్రభావం చాలాకాలముంటుంది చాలా దూరం వ్యాపిస్తుంది అందువల్ల ఎక్కువకాలం ఎక్కువ పేరు ప్రఖ్యాతులు నిలుపుకొన్న వ్యక్తిని గురించి ప్రస్తావించేటప్పుడు 'ఆయనకేమండి ఇంగువగట్టిన గుడ్డ' అంటారు అంటే, సుప్రసిద్ధుడని అర్థం పేరుమోసిన వాడని భావం మూటకట్టిన గుడ్డలో తరువాత ఇంగువ లేకపోయినా వాసన మిగిలివున్నట్లు పూర్వౌన్నత్యం, ఆస్తిపాస్తులు, అధికార దర్పాలూ లేకపోయినా ఉన్నవాడన్న ప్రతీతి మాత్రం మిగలవచ్చు అందువల్ల సుఖం లేకపోయినా పేరుంటుంది ఆదాయం లేకపోయినా పరపతి మిగులుతుంది అలాంటి స్థితిలో ఉన్న, పైపై మెరుగులతో పదిమందిలో తలయెత్తుకొని తిరిగే వ్యక్తులను ఇంగువ కట్టిన గుడ్డ అని వ్యవహరిస్తారు 'కట్టిన' అనే క్రియా పదానికి ఇప్పుడు కట్టిన అనే అర్థమే ఉండనక్కరలేదు- ఎప్పుడో కట్టినా సరిపోతుంది

**ఇత్యపులు:** పూర్వం వీధిబడిలోనే అమరకోశం కంఠస్థం చేయించేవాళ్ళు అర్థాలు చెప్పేవాళ్ళు కాదు అందువల్ల 'పికః కోకి లేత్యపి' అనే పర్యాయపద పట్టిక చదివి కోకిల శబ్దానికి 'ఇత్యపి' అనే పర్యాయపద మందనుకొన్నవాడు "ఇత్యపుల్ కూయంగ పేరంబు డాడంగి" అని పద్యం రాశాడట! వెక్కిరింతగా అర్థంలేని చదువు చదివిన వాడనటానికి 'ఇత్యపులు అంటే ఏమిటోయ్?' అని ప్రశ్నించటం పరిపాటి అయింది

**ఇనపకచ్చడాలు:** కచ్చడం అంటే గోచి (పాత) అది గుడ్డతోకాక ఇనపరేకుతో చేసింది కావటమే విచిత్రం అల్లసాని పెద్దన 'ఇనుపకచ్చడాలు' కట్టిన మునిముచ్చులందరూ వేశ్యాలోలురే ననిపించాడు వరూధిని చేత కఠోరమైన బ్రహ్మచర్య దీక్షలో ఉన్నామని చెప్పుకునే మహర్షులుకూడా అప్సరసలు తపోభంగం చేయటం కోసం తైతక్కలాడినప్పుడు వాళ్ళకి లొంగిపోయారని అనేక పురాణ గాథలు చెప్తాయి జగత్ప్రసిద్ధుడైన విశ్వామిత్రుడి వంటి వాళ్లందరూ ఇలా భంగపడ్డవాళ్ళే ఇనపకచ్చడాల మీద తాపీ ధర్మారావుగారు ఓ పెద్ద వ్యాసమే రాశారు నానా దేశాల్లో యుద్ధాలకు బయలుదేరిన వీరులు తిరిగివచ్చేదాకా తమ భార్యలు శీలవతులుగా ఉండటానికి ఇనపతొడుగులు తగిలించి తాళాలు వేసేవాళ్లని ఆయన నిరూపించాడు తాళాలున్న చోట మారుతాళా లుంటాయని ఊహించకపోవటమే వారి ప్రత్యేకత అలాగే మగవాళ్లక్కూడా కొన్ని బందోబస్తులుండేవి అటువంటిదే ఇనపకచ్చడం పందెపు గుర్రాలకు ఇనుముతో కాకపోయినా తోలుతో కచ్చడం చేయించి దానిలో చిన్న మేకులు పెట్టించి 'ఘోటక' బ్రహ్మచర్యం సాధించటం నేటికీ కద్దు ఇనపకచ్చడాలు కట్టడమంటే ఘోరబ్రహ్మచర్యంలో ఉండటం

**ఇనపగజ్జెల తల్లి:** సంపదలిచ్చే లక్ష్మీదేవి బంగారుగజ్జెల తల్లి అయితే, దరిద్రమిచ్చే ఆమె అక్కగారు ఇనపగజ్జెల తల్లి పరమదరిద్రురాలన్న అర్థంలో ఈ మాట వాడుతుంటారు సాధారణంగా స్త్రీలను నిందించటానికే ఈ సమాసం ప్రయోగిస్తారుగాని దరిద్రులైన పురుషులకు ఈమె తల్లి కానట్లుంది - లింగభేదంవల్ల ఈ ప్రస్తావన చేయరు ఇనుము ఆ మాటకువస్తే - నల్లటి వస్తువులన్నీ - దారిద్ర్యానికి చిహ్నాలు తెల్లగొడ్డుకున్న గౌరవంవల్ల నల్లగొడ్డు ఎంత ఎక్కువ చాకిరి చేసినా మెచ్చుకోలేరు దరిద్రుల యింట్లో ఈ పెద్దమ్మ ఇనుపగజ్జెలు ఘల్లుమంటుండగా నాట్యం చేస్తుంటుందని కవులు వర్ణిస్తుంటారు

**ఇల్లో నారాయణమ్మ:** ఉన్నంతలో తాను తిని, ఎంగిలిచేయి కూడా చూపని ఉత్తమ యిల్లాలిని ఇల్లోనారాయణమ్మ అంటారు విష్ణుమూర్తి తనకు అంతవుండికూడా మానవజాతిలో అత్యధికసంఖ్యాకులను దరిద్రులుగానే ఉంచాడు కాబట్టి నారాయణ శబ్దాన్ని 'లోభి'కి పర్యాయపదంగా వాడుతుండేవారేమో తెలీదు 'పిల్లికి బిచ్చం పెట్టనివాళ్లని లోభులని నిందిస్తాం ఇందరు మనుష్యులూ ఇన్ని జంతువులూ ఉండగా పిల్లినే ఎందుకు బిచ్చగాణ్ణి చేశారన్న అనుమానం రావటంలో తప్పు లేదు ఈ మాట ధ్వనిసాదృశ్యంవల్ల వచ్చింది పిలుచు అనే ధాతువుకు పూర్వరూపం పిలు (ఇప్పటికీ విధ్యర్థంలో ఈ క్రియారూపం వాడ్తాం) 'పిలి' అంటే పిలిచి నొక్కిపలికితే పిల్లి అయింది అప్పుడు మన పిల్లి అనే నామవాచకం క్రియారూపంలో పరకాయ ప్రవేశం చేసింది పిలిచి బిచ్చం పెట్టని లోభి పిల్లికి పెట్టనివాడైనాడు అటువంటి లోభిని ఇల్లోనారాయణమ్మ అంటారు

**ఇసక తక్కెడ, పేడ తక్కెడ:** ఈ పేరిట కథలు ఒకప్పుడు వాడుకలో ఉండేవి ఒకడు ఇసుకను బంగారమని అమ్మితే మరొకడు పేడను అలాగే అంటగట్టేవాడు ఇద్దరూ మోసగాళ్ళే – లోకుల్నేగాక తమను తాము కూడా మోసగించుకోగలిగిన నేర్పరులు తనను మోసగించబోయిన వ్యక్తిని తానే మోసం చేయగలిగితే, ఆ యిద్దర్నీ కలిపి "చెప్పనక్కర్లేదు ఒకడు ఇసుక తక్కెడయితే, మరొకడు పేడ తక్కెడ" అంటారు – సమ ఉజ్జీలన్న అర్థంలో ఈ మాటను పోటీదార్ల విషయంలో, ఒకర్ని మించినవా ళ్లింకొకరన్న అర్థంలో వాడుతారు

**ఇసక పాతర:** భూమిలోకి తవ్వి ధాన్యం వగైరాలను దాచి ఉంచే గుంట పాతర అన్ని రకాల నేలల్లోనూ పాతర తవ్వవచ్చుగాని రాతినేలలో కష్టతరం, మొరం నేలల్లో కష్టతరం ఇసుక నేలల్లో సులభమే – పారకూ పలుగుకూ అడ్డుపడేదేమీ ఉండదు ఎంత లోతుకు తవ్వినా తవ్వవచ్చు అలాగని తవ్వటం మంచిది కాదు కొద్ది లోతులోనే నీళ్లు పడవచ్చు ఒకవైపు తవ్వుతుంటే మరో వైపు నుంచి అండలు రాలి తవ్విన భాగం పూడిపోవచ్చు పూడిక తీస్తుంటే మరోవైపున కావలసినదానికన్నా ఎక్కువ ప్రాంతం గుంట పడవచ్చు అంటే, కనిపించని శ్రమ తప్పదన్నమాట తవ్వే కొద్దీ శ్రమ కూడా పెరుగుతూనే ఉంటుంది పని పెరుగుతుంటుంది తడినేల అయితే పని సులభమేగాని పాతరగా పనికిరాదు పొడినేల తవ్వకం విసుగు పుట్టిస్తుంది అడుగునా, అన్ని వేపులా గడ్డివెంటి పెట్టితేనే పాతర నిలుస్తుంది – కుప్పగూలకుండా అందువల్ల చిరాకు పుట్టించే విసిగించేపని ఇసక పాతర ఇవ్వటం 'చాలా శ్రమపడ్డాడు గాని, అదంతా ఇసక పాతరే' అనే మాటలు వినిపిస్తాయి అంటే, అనవసర పరిశ్రమ చేయవలసి వచ్చిందని భావం శ్రమ ఎక్కువ, ఫలితం తక్కువ అయితే, అది ఇసక పాతర శ్రమిస్తుండగా నీళ్ళు పడితే పాతర తవ్వకం వృథాశ్రమ అవుతుంది అందుకని దండగమారి పని, ఎడతెగని శ్రమ అనే అర్థాల్లో ఈ మాట వాడుకలోకి వచ్చింది

**ఈశ్వరవేరు:** కొందరు ఈశ్వరివే రంటారు ఈ వేరు దగ్గరుంటే భర్తగాని భార్యగాని ఒకరొకరికి వశపడిపోతారని నమ్మకం దీనితో అనేకరకాల వశీకరణ వస్తువులను తయారు చేస్తారు ఆయుర్వేదంలో వాజీకరణ (ఇంద్రియశక్తిని పెంచటం), వశీకరణ (లొంగదీసుకోవటం) అనేవి జనాకర్షక భాగాలు వాత్స్యాయనుడి కామసూత్రాల్లోనూ చాణక్యుడి అర్థశాస్త్రంలోనూ ప్రత్యేక ప్రకరణాలున్నాయి ఈ విషయాన్ని వివరిస్తూ

మొదటి గ్రంథం శరీరసుఖారోగాలకు సంబంధించిందయితే, రెండోది శత్రువులను లొంగదీసుకొనే అనేక మార్గాల్లో ఇదొకటని విశదీకరిస్తుంది వైద్యశాస్త్రానికి సంబంధించిన ఈ మాటను నిత్యవ్యవహారంలో కూడా ప్రయోగించి ఫలానా వ్యక్తి ఈశ్వరవేరు వంటివాడని ప్రసంగిస్తుంటారు అంటే, మాయలతో మర్మాలతో ఎదుటి వ్యక్తిని తనకు అనుకూలం చేసుకోగలవాడని అర్థం. కొందరు ఇదే మాటను బుర్ర ఖరాబు చేసే వ్యక్తి అనే విపరీతార్థంలో కూడా ఉపయోగిస్తారు మనసు మార్చగల శక్తిగల ఔషధం కాబట్టి తలను తొలిచేస్తుందనే నమ్మకంతో అలా వ్యవహరిస్తారు

*ఉంగరాల చేయి:* డబ్బున్నవాళ్ళు యథాశక్తి బంగారపుంగరాలు అయిదువేళ్ళకూ తగిలించుకోవచ్చు నడమంత్రపు సిరిపట్టిన వాళ్ళు పదివేళ్ళకూ ఉంగరాలు పెట్టుకోవచ్చు కానీ అవి ఉంగరాల చేతులు కావు రాజోద్యోగంలో ఉన్న వ్యక్తికి అధికార చిహ్నంగా 'ముద్రిక' ఉంటుంది ఆ ఉంగరం మీది గుర్తులే అధికారానికి గుర్తులు లక్కమీద ఆ ఉంగరాన్ని అద్దినప్పుడు అధికారపూర్వకంగా ఆజ్ఞలు జారీ చేసినట్లు రాజాస్థానంలో ప్రవేశించటానికి ఆ ఉంగరమే సంకేతం అందువల్ల అటువంటి అధికారచిహ్నమైన ఉంగరం వేలికుంటే ఉంగరాల చేయి అంటారు అంటే, అధికారం కలవాడని అర్థం అలా అధికార సూచకమైన ఉంగరం ఉన్న చేత్తో ఆజ్ఞోల్లంఘనం చేసినవారి నెత్తిమీద మొట్టికాయలు వేస్తే – అది ఉంగరాల చేత్తో మొట్టడం అవుతుంది అంటే, శిక్షించటమనిపించుకొంటుంది

*ఉట్టిలో గుమ్మడికాయ:* మంచి గుమ్మడికాయను విశ్వామిత్ర సృష్టిగా లెక్కించేవాళ్ళు శుభకార్యం తలపెట్టి పందిరి వేసినా, నూతన గృహప్రవేశం చేయబోతున్నా ఉట్టిలో బూడిదగుమ్మడికాయను కట్టి ఉంచటం ఆచారమయింది అలాగే ప్రవేశద్వారం దగ్గర గుమ్మడికాయను బద్దలు చేయటం కూడా ఉట్టిలో ఉంచిన గుమ్మడికాయను కదిలించే పనిలేదు దానంతట అది ఎండి రాలిపోవలసిందే విడిగా ఉంచిన కాయనయితే వడియాల తయారీలో వాడేవాళ్ళు గింజలను వేరుచేసి విభూతి రాసి ఎండబెట్టి పిల్లలకు తినబెట్టేవారు ఉట్టిలో ఉన్నది దైవస్వరూపం అది కదిలే పనీలేదు – దాన్ని కదిలించేదీ లేదు ఉట్టి తీసివేయటం, కాయను దించటం అమంగళమని భావిస్తారు కాబట్టి ఉట్టిలోని గుమ్మడికాయ స్థిరంగా ఉంటుంది మాటా పలుకూ లేకుండా, కదలకుండా మెదలకుండా కూర్చున్న వ్యక్తిని ఆ గుమ్మడికాయతో పోల్చటం అలవాటయింది మూగమొద్దులాగా బండబారినట్లున్న వ్యక్తిని 'ఉట్టిలో గుమ్మడికాయ' అంటారు

*ఉడతలు పట్టేవాడు:* ఈ మాటను నిందార్థంలోనే వాడుతుంటారు పనీ పాటాలేని సోమరి వ్యక్తిని ఉడతలు పట్టేవా డనటం కద్దు కానీ నిజానికి మన సమాజంలోని ఒక బలహీనతను ఈ మాట బయట పెడ్తుంది ఇప్పటిలాగా రంగుకుంచెలు బజార్లో అమ్మకానికి దొరకని కాలంలో రకరకాల జంతువులను పట్టి, వాటి వెంట్రుకలతో పాతకాలపు చిత్రకారులు సొంతంగా కుంచెలు చేసుకొనేవాళ్లు ఉడత వెంట్రుకలు చిన్నవిగా బిరుసుగా ఉంటాయి కాబట్టి రంగుకుంచెలుగా అవి చాలా శ్రేష్ఠమైనవి అందువల్ల చాలా శ్రమపడి ఎంతో ఓర్పుతో మాటువేసి ఉడతలను పట్టుకోవటం ఆనాటి చిత్రలేఖకులకు అవసరమయ్యేది చేసినపనిగాని, అందుకోసం పడ్డశ్రమగాని, చూపిన ఓర్పుగాని కనిపించేవికావుగానీ మరేపనీ లేకుండా చేయకుండా, ఉన్నదొక్కటే

లోకానికి తెలిసింది అందుకని ఉడతలు పట్టేవాడంటే చాలా తేలికభావం కలిగింది ఇంతా చేసి వాటిని చంపి తిని కడుపు నింపుకోవటం కూడా జరిగేదికాదు అందువల్ల అనవసరమైన పనిచేసే, సోమరి కింద లెక్కగట్టి వ్యవహరిస్తూవచ్చారు

మరోకారణం లేకపోలేదు చిత్రకారులు, నటులు, శిల్పులు వగైరా లలితకళోపాసకులు ఇప్పుడు అనేక రంగాల్లోకి విస్తరించారు రాజకీయాల్లోనూ రాణిస్తున్నారు వీళ్లనుమాత్రం చూసిన ఈ తరంవాళ్లకు యాభైసంవత్సరాల కింద కూడా నాటకాలు వేసేవాళ్లను, సంగీతం పాడేవాళ్లను, నాట్యకత్తెలనూ, చిత్రకారులనూ, శిల్పులనూ సమాజంలో ఎంత అగౌరవంగా నీచంగా ఈసడింపుగా చూసేవాళ్లో తెలీదు వాళ్లను 'అపాంక్తేయు' లనేవాళ్లు అంటే – వాళ్లు మనతో సమానంగా సరిపంక్తిలో భోజనం చేయటానిక్కూడా తగ రనేవాళ్లు వాళ్లు చెప్పే సాక్ష్యం కోర్టుల్లో చెల్లేదికాదు అటువంటి కాలంలో చిత్రకారులను ఉడతలు పట్టేవాళ్లని నిందించే మాట పుట్టింది

**ఉడుంపట్టు:** ఉడుము బల్లిజాతి జంతువు దాన్ని పూర్వం రాజులూ సేనాధిపతులూ పెంచేవాళ్ళు ముద్దుచేసేవాళ్ళు ముద్దుపేర్లతో పిలిచేవాళ్ళు కోట గోడలు ఎక్కవలసిన సమయంలో దాని నడుముకు మోకులు కట్టి, శక్తికొలదీ పైకివిసిరే వాళ్ళు అది ఎంత జారుడు బండల గోడలయినా కరుచుకుందంటే ఇక వదిలేది కాదు సాయుధులైన వీరభటుల బరువును మోసేది అది చప్పుడు చేయదు కాబట్టి నిశ్శబ్దంగా తాళ్ళుపట్టుకొని పైకిపాకి సైనికులు కోటగోడలమీదికి చేరుకునేవాళ్ళు అది ప్రధాన యుద్ధ సాధనంగా ఉండేది ఒకప్పుడు దాని చర్మం చాలా దళసరిగా ఉంటుంది కాబట్టి చచ్చిన ఉడుం చర్మంతో కవచాలు తయారు చేసేవాళ్ళు! ముఖ్యంగా అల్లెతాటిని లాగి విడిచేటప్పుడు వేళ్ళు కోసుకుపోతాయి చేతివేళ్ళకు రక్షణగా ఉడుం చర్మంతో చేసిన కవచం తొడిగేవాళ్ళు దాన్ని 'గోధాంగుళిత్రాణ' మనేవారు సంస్కృతంలో గోధ అంటే ఉడుము అంగుళి అంటే వేలు త్రాణమంటే కవచం మాటా పలుకూ లేకుండా తాననుకున్న కార్యాన్ని పట్టుదలగా దీక్షతో నెరవేర్చుకునే వ్యక్తుల పట్టుదలను ఉడుం పట్టంటారు భల్లూకం అరుస్తుంది ఆర్భాటం చేస్తుంది ఉడుము మాత్రం నిశ్శబ్దంగా ఎంత బరువైనా మోస్తూ ఏటవాలుగా నిలువుగా ఉన్న కోటగోడలను కరుచుకుని తన పని నెరవేరుస్తుంది పాతకాలపు యుద్ధాల్లో రహస్య సమాచారం పంపటానికి పావురాళ్ళూ, రహస్యంగా కోట ఎక్కడానికి ఉడుములూ అత్యంత ప్రధానమైన సాధనాలు వాటి సామర్థ్యంమీద యుద్ధఫలితం చాలావరకు ఆధారపడి వుండేది

**ఉత్తరాషాఢ పూర్వాషాఢలు:** ఇవి రెండూ నక్షత్రాలు ఒంటిగా మినుకు మినుకుమనే చుక్క తార అలాటి తారల సమూహం నక్షత్రం జ్యోతిషంలో వీటి స్థానమేదైనా నిత్యజీవితంలో మానవులకు స్పష్టంగా వీటి వల్ల లాభనష్టాలు రెండూ లేవు అయితే, నక్షత్ర పరిగణనలో ఇవి పూర్వాషాఢ, ఉత్తరాషాఢాలుగా పక్కపక్కన వస్తాయి మనిషికి వచ్చే కొన్ని రుగ్మతలు ఇలా జంటగా వస్తుంటాయి అలాంటి సందర్భాన్ని పురస్కరించుకొని ఆ రోగాలకూ ఈ నక్షత్రాలకూ ముడి వేశారు వాంతులూ విరేచనాలూ సాధారణంగా అజీర్ణవ్యాధిలో భాగంగా వస్తాయి ఆ రెంటిలో ఏదో ఒకటి మాత్రమే వస్తే అంత ప్రమాదం లేకపోవచ్చుగాని ఆ రెండూ కలిసివస్తే అది తీవ్రవ్యాధికిందే లెక్క కలరాలో ఈ జంట బాధలు తప్పవు కొన్ని

శరీర భాగాలనూ, జబ్బులనూ ప్రస్తావించటం సభ్యంగా ఉండదని డొంక తిరుగుడుగా చెప్పటం ఆచారమయింది అటువంటిది వాంతులనూ విరేచనాలనూ పూర్వాషాఢ, ఉత్తరాషాఢలని పిలవటం కొందరు 'జబ్బు చేసిందట గదా?' అని అడిగితేనే తప్పు పట్టారు 'రోగం వచ్చిందా?' అంటే తిట్టుకింద లెక్క అందుకని అక్షరాలను/ధ్వనులను వ్యత్యయం చేసి, "ఇటీవల గోరంగా ఉన్నారన్నారు ఇప్పుడు కులాసాయే కదా?" అని సుకుమారంగా అడగటం పరిపాటి – రోగాన్ని గోరంగా మార్చి అలా అడిగితే తప్పులేదన్నమాట సంస్కృతగ్రంథాలు చంకన పెట్టి మాత్రసంచితో తిరుగులాడే పూర్వకాలపు ఆయుర్వేదవైద్యుల్లో ఎవరో ఈ నక్షత్రాల పేరిట ఈ రోగాలను పిలిచి వుంటాడు అందుకు జ్యోతిషజ్ఞానం కూడా తోడ్పడిందేమో తెలీదు

ఉత్వాదుజ్జులు: ఇది కేవలం వ్యాకరణ పండితుల వాడుకలో వినిపించే ప్రయోగం సంస్కృత శబ్దాలను తెలుగులో వాడే సందర్భంలో వ్యాకరణ శాస్త్రంలో ఈ మాటలు పరిభాషగా వినిపిస్తాయి సంస్కృతంలో పుంలింగశబ్దమై తెలుగులో మహద్వాచకమై (అంటే మానవుల్లో మొగజాతిని సూచించేది) తెలుగు వాడుకలోకి వచ్చేమాట రెండు మార్పులు పొందుతుంది మొదట సంస్కృత పదం చివరి అకారం ఉకారంగా మారుతుంది ఉదాహరణకు సంస్కృతంలోని 'రామ' శబ్దం 'రాము'గా మారుతుంది తరవాత దానికి ప్రథమావిభక్తి ఏకవచనంలో 'డుజ్' అనేది చేరుతుంది అంటే సంప్రదాయవ్యాకరణ బద్ధరూపాల్లో అరసున్నా గాని, నిండు సున్నా గాని ముందున్న 'డు' అనే ప్రత్యయం చేరుతుంది రెంటినీ కలిపి ఉత్వాదుజ్జు లంటారు పరిభాష జోలికి గాని, ఇతర శాస్త్ర చర్చల జోలికి గాని పోకుండా చెప్తే ఉత్వాదుజ్జులు అనే రెండూ మొగవాడని సూచించే వ్యాకరణాంశా లనారి ఆడంగి రేకుల వాడనో, నపుంసకుడనో తిట్టదలచినప్పుడు ఫలానా వ్యక్తికి ఉత్వాదుజ్జులు లేవని శాస్త్ర మర్యాదలో దూషిస్తారు ఆ రెంటికీ కలిపి 'మొగతనం' అనే అర్థం కల్పించుకున్నారన్నమాట ఈ ప్రత్యయాలు చేరని 'శంభువు, విష్ణువు' వంటి రూపాలు, వీటిలో ఏ ఒక్కటే చెరని 'ధాత' వంటి వనేకమున్నాయి అయినా, వీటిని ఈ ప్రత్యేకార్థంలో వాడటం అలవాటయింది

ఉత్సవిగ్రహం: ఉత్సవవిగ్రహమనే మాటకు ఇది వాడుకలో నిలిచిన రూపాంతరం ఆలయం గర్భగుడిలో ఉండే దేవుడు విరాడ్విగ్రహం (విరాట్–విగ్రహం) అతడే మూలదైవం పండగలూ పబ్బాలూ వచ్చినప్పుడు, ఊరేగింపులు జరిపేటప్పుడు మూలమైన ప్రతిమను కదిలించగూడదు కాబట్టే దానికి బదులుగా చిన్నచిన్న విగ్రహాలు (చేసి ఉంచుతారు) ఊరేగుతాయి ఉత్సవ సమయంలో ఊరేగే విగ్రహం ఉత్సవవిగ్రహం గర్భగుడిలో స్థావరంగా ఉండే విగ్రహం మూలవిరాట్టు అసలు పూజలూ మహిమలూ సమస్తం మూలదైవానికే గాబట్టి ఉత్సవవిగ్రహాలు ఊరేగటానికి మాత్రమే పనికి వస్తాయన్న భావంతో పెద్ద నాయకుల అనుచరవర్గాన్ని వాటితో పోల్చి ఉత్సవిగ్రహాలనటం పరిపాటయింది ఏ శక్తి లేనివాడు, స్వతంత్రంగా వ్యవహరించ లేనివాడు వగైరా అర్థాల్లో ఉత్సవిగ్రహమనే మాట వాడుక కెక్కింది

ఉద్యోగ రాఘవుడు: రఘువంశంలో పుట్టాడు కాబట్టే రాముడ్ని రాఘవుడన్నారు, 'రఘురాము'డని కూడా పిలుస్తారు – పరశురామ, బలరామాదులకన్నా విభిన్నుడని చెప్పడానికి ఏ పనినయినా ఉద్యోగమనవచ్చు – పైకి తెచ్చే యోగం (అదృష్టం)

కల్పించేది కాబట్టి రాఘవుడనే పురాణ పురుషుడు ఎవరి దగ్గరా ఎక్కడా ఎప్పుడూ ఉద్యోగం చేసినట్లు లేదు ఆ లోపం తొలగించడానికా అన్నట్లు శ్రీరామచంద్రులవారు ఎడతెగని ఉద్యోగ రాఘవుడనే మాట పుట్టించిన ఘనత తెలుగువాళ్లదే

రాక్షస వధ అనే పుణ్యకార్యం చేపట్టి శ్రీరాముడు నిరంతరం అందుకే కృషి చేశాట్ట అయన విరహబాధలూ, కపి సైన్యాన్ని నాలుగు దిక్కులకూ సీతాన్వేషణకు పంపిన వైనం అంత ముఖ్యం కావుగాని కోతిమూకను పోగుచేసుకొని యుద్ధప్రయత్నాలు ఊపిరాడకుండా చేయటం ఎక్కువ ఆకర్షణకరమయింది జంతువులతో సేన సిద్ధం చేశాడు. పక్షుల ద్వారా శత్రు వెవరో తెలుసుకున్నాడు. చివరికి ఉడతలవంటి చిన్న జంతువులచేత మట్టి మోయించి సముద్రానికి వారధి కట్టించాడు లంకా ప్రవేశం కోసం సమస్త చరాచర ప్రపంచ సహాయమూ పొందాడు ఒక గొప్పపనికోసం ఎందరి సహకారమో పొందాడు అందుకు ప్రయత్నించాడు ఈ నిరంతర ప్రయత్నమే ఉద్యోగం ఆ ఉద్యోగం (పని) అంత శ్రద్ధగా పట్టుదలతో చేసిన రాఘవుడు ఉద్యోగ రాఘవుడైనాడు

"అయనకు మా చెడ్డ పట్టుదల అనుకొన్న పని నెరవేరేదాకా నిద్రపోడు ఉద్యోగ రాఘవుడనుకో!" వంటి వాక్య పరంపర తెలుగువాడుకలో ఉంది కార్యసాధనకోసం వారూ వీరనే భేదం లేకుండా అందరి సహాయ సహకారాలూ పొందేవాడు, పని నెరవేరేదాకా విశ్రమించనివాడూ ఉద్యోగరాఘవుడే పట్టుదలగల కార్యశూరులను ఈ పేరుతో పిలుస్తారు.

**ఉప్పుతో తొమ్మిది:** ఆరు రసా లున్నాయంటారు కషాయం (వగరు), మధురం (తీపి), లవణం (ఉప్పు), కటువు (కారం), తిక్తం (చేదు), అమ్లం (పులుపు) ఇందులో ఉంటాయి. ఆరు రకాల తిండి వస్తువు లున్నాయి భక్ష్యం (కొరికి తినేది), భోజ్యం (నమిలి మింగేది), పేయం (తాగేది), చోష్యం (జుర్రుకునేది), పిచ్ఛిలం (గడ్డ కట్టింది) ఆ మొదటి షడ్రుచులూ ఈ తరవాతి షడ్రసాలూ ఆరేసి షడ్రుచుల్లో ఉన్న ఉప్పును కూడా కలిపి తొమ్మిదని ఎందుకన్నారో తెలీదు కానీ 'మృష్టాన్నం, కడుపునిండా పెట్టిన భోజనం' అనే అర్థాల్లో ఈ జాతీయం వెలిసింది చాలా ఎక్కువ పెద్ద సంఖ్యను చెప్పడానికి 'తొంబ' అని వాడుతుంటాం 'ఆ సభకు తొంబలు తొంబలు జనం వచ్చారు' అంటాం అ తొంబ స్థానంలో ఈ తొమ్మిది చేరిందేమో చెప్పలేం వాడుకలోమాత్రం ఈ జాతీయానికి 'సమృద్ధి' అనే అర్థం వచ్చింది – అదీ భోజన విషయంలో

**ఉప్పు పిరికి:** కొందరీమాటకు ఉప్పులా నీళ్లు కారిపోయే భయస్థుడనే అర్థం చెప్తారు నిజానికి అది సరికాదు ఉప్పనబట్టి/చెరపట్టి అనే బాలక్రీడలో ఎదుటి జట్టును తప్పించుకొంటూ పోయి ఉప్పు తేవటం చురుకుదనానికీ, ధైర్య సాహసాలకూ నిదర్శనం హంసడిభకులు యాదవులను తాము చేసే రాజసూయానికి కప్పంగా ఉప్పు తెమ్మని కబురుపెట్టారు "యాదవు లుప్పుమోవగ మురారికి సోలలు మోయకెందుబోరాదు" అన్న సాత్యకి యుద్ధరంగంలో "ఉప్పనబట్టె లాడునెడ నుప్పును దెత్తురుగాక యాదవుల్" అని ప్రత్యుత్తరమిచ్చినట్లు నాచన సోమన ఉత్తర హరివంశంలో రాస్తాడు అలా యుద్ధరంగంలో ఎదుటి వారి దెబ్బలు తప్పించుకొంటూ గెలుపు సాధించటం ఉప్పు తేవటం అందుకు భయపడేవాడు ఉప్పు పిరికి ఈ మాటకు

యుద్ధం సంగతి దేవు డెరుగు, చివరకు ఆటల్లో కూడా భయపడే పిరికివాడని అర్థం అంతేగాని, కేవలం ఉప్పులా నీళ్లు కారిపోయేవాడనే సామాన్యార్థం సరిపోదు

ఉమ్మాయ జగ్గాయలు: వీళ్లిద్దరూ తోడుదొంగలు శ్రావణభాద్రపదాల్లా కలిసిమెలిసి ఉంటారు ఉమ్మాయ అనే పదం ఉమామహేశ్వర శబ్దానికి సంగ్రహరూపం. జగ్గాయ అనేది జగన్నాథస్వామి అనే మాటకు సంక్షిప్తరూపం మొదటివాడు శివుడు; రెండోవాడు విష్ణువు శివుడు వరాలిచ్చి ఇబ్బందుల్లో పడ్డప్పుడు ఆదుకోవటం విష్ణుమూర్తి కర్తవ్యం విష్ణువు చిక్కుల్లో పడ్డప్పుడు శివుడే సాయం చేయాలిగాని మరెవ్వరూ తోడ్పడలేరు వీరిద్దరూ అన్యోన్యానికి నిదర్శనా లన్నమాట! పార్టీ కార్యకర్తలు తలలు బద్దలు కొట్టుకొంటుంటే నాయకులు సయోధ్యగా ఉన్నట్లు, భక్తులు ఒకరి పొడ మరొకరికి గిట్టక శత్రుత్వం వహించినా ఈ దేవుళ్లిద్దరూ కలిసికట్టుగానే ఉంటారు ఈ సంగతి కనిపెట్టినవాళ్లు హరిహరారాధన చేస్తారనుకోండి ఈ ఉమ్మాయ జగ్గాయలు కూడా పరస్పర విరుద్ధ స్వభావాలతో ఉన్నా మౌలికంగా ఒకరొకర్ని ప్రేమించుకుంటారు ఒకరికొకరు సాయపడతారు తత్వంలో వీరిద్దరూ ఒకటే కానీ, ఆచరణ భిన్నంగా ఉంటుంది పైకి పోరాడుకుంటున్నట్లు నటించినా అంతర్యంలో ఒక్కటిగానే ఉంటారు – లోకదృష్టిలో నిజానికి ఒకేరకం స్వభావమున్న ఇద్దరికన్నా విరుద్ధస్వభావాలున్న ఇద్దరే పరస్పరాకర్షణతో స్నేహం కట్టారు. అలాంటి సందర్భమే ఉమ్మాయ జగ్గాయల జంట కూడా సమాజంలో ఏ ఇద్దరయినా కార్యసాధనలో ఏకోన్ముఖంగా ఉండి ప్రవర్తనలో భిన్నంగా కనిపిస్తే వాళ్ల నీపేరుతో పిలుస్తుంటారు

ఉవాచ: ఇప్పుడీ మారుమూల సంస్కృత క్రియా రూపం తెలుగులో విశేష్యంగా ప్రయుక్త మవుతున్నది 'ఇది ఆయన ఉవాచ (అంటే మాట, అభిప్రాయం)' లాంటి ప్రయోగాలు కోకొల్లలు అత్యంత ప్రాచీన కాలంలో ఎవరైనా ఏమైనా చెప్తే దాన్ని సంస్కృతంలో ఈ క్రియాపదంతో సూచిస్తారు ఇది ఆ భాషలో మధ్యమపురుష ఏకవచన రూపం అంటే 'అతడు చాలా పురాతన కాలంలో (ఇలా) చెప్పాడు' అని అర్థం. సాధారణంగా ఈ క్రియారూపాన్ని దేవతలు, మహర్షులు మొదలైన సుదీర్ఘ జీవులు చెప్పినప్పుడే వాడేవారు భాష సరిగా తెలియకపోయినా భక్తికోసం భగవద్గీత లాంటి పారాయణ గ్రంథాలు చదివిన వాళ్లు "సంజయ ఉవాచ, భగవాన్ కృష్ణ ఉవాచ" మొదలైన వచన భాగాల్లోని 'ఉవాచ'ను చెప్పాడు, చెప్పింది అనే అర్థాల్లో వాడినట్లు సందర్భాన్నిబట్టి గ్రహించివుంటారు "సంజయుడు చెప్పింది" అన్నట్లు అర్థం చేసుకున్నవాళ్లు 'ఉవాచ'కు 'మాట, భావం' వగైరా అర్థాలు కల్పించుకున్నారు ఫలితంలో ఇది నామవాచక మనుకొని తక్కిన విశేష్యా లెన్నిటినో ఎరువు తెచ్చుకొన్నట్లు దీన్నికూడా తెలుగులో వాడటం మొదలుపెట్టారు. ఇలా సంస్కృతంలోని క్రియారూపం తెలుగులో నామవాచకమై, జాతీయమయింది

ఋష్యశృంగుడు: రామాయణంలో ఋష్యశృంగుడు చిన్న పాత్ర ఆయన ఒక మహర్షి అమాయకుడు అడవిలో పుట్టి పెరిగి, గడ్డాలూ మీసాలూ ఉన్న మహర్షులను తప్ప మరే మానవమాత్రులనూ చూడకుండానే గడిపాడు చాలాకాలం పైగా అతడికి గుండె మీద ఓ కొమ్ములాంటిది ఉంది రాజ్యంలో వర్షాలు లేవని దిగులుపడుతున్న దశరథుడికి సలహా యిచ్చారు పెద్దలు–సదరు రుష్యశృంగుణ్ణి ఏదోరూపంగా నగరానికి తెస్తే వానలు పడ్తాయని అతణ్ణి ఆకట్టుకోడానికి మామూలుగా దేవతలు తపోభంగానికి

చేసే పనే మంచి దనుకున్నారు నాట్యకత్తెలను పంపారు వారికి రెండేసి శృంగాలున్నా యేమని (రెండు స్తనాలని తెలియక) మహర్షి విస్తుపోయాడు చెప్తాం రమ్మని అయోధ్యకు తెచ్చారు అయన అడుగు పెట్టగానే వర్షాలు పడ్డాయి అయనకు దశరథుడు తన కుమార్తె శాంతనిచ్చి పెళ్ళి చేసి మనుష్య ప్రపంచంలోకి తెచ్చారు ఈ కథ కారణంగా స్త్రీ విముఖుడయిన, ఆడదాని మొహమెరుగని అమాయకుణ్ణే రుష్యశృంగుడని వ్యవహరించటం మొదలయింది ఈ మాటనే స్త్రీలోలుడయిన వ్యక్తిని గురించి ఎగతాళిగా ప్రస్తావించటమే విచిత్రం తిరుగుబోతును గురించి చెప్తూ "అబ్బో! అయన రుష్యశృంగుడేనండి!" అని వెటకారం చేస్తారు

**ఎండగట్టు:** ఎండకు ఎండేటట్లు ఏ వస్తువునయినా పరవటం, వేలాడదీయటం ఎండగట్టడం తడి, చెమ్మ తొలగించటానికి పొగాకు వంటివాటిని అరగట్టారు వరుగులు చేయటానికి కూరగాయల ముక్కలను ఎండబెడ్తారు పూర్వం పప్పుధాన్యాలను మొదట తడిమట్టిలో ఉంచి, మొలక రాగానే మట్టిని కడిగి తుడిచి నూనెమెరుగురాసి ఎండగట్టేవాళ్లు ఎండిన తరువాత కుండల్లో పెట్టి, కావలసినప్పుడు కావలసినంత బయటకి తీసి, వండుకు తినేవాళ్ళు అప్పట్లో కందులు, మినుములు, పెసలు వగైరా పప్పు ధాన్యాలను మొత్తంగానే వంటలో వాడేవాళ్ళు కందిపప్పు, మినప్పప్పులుగాని, పొట్టులేని చాయపప్పును గాని వాడటం అనారోగ్యకరం అనే అభిప్రాయం ఉండేది ఇలా తడిపి, కడిగి, నూనెరాసి, ఎండబెట్టి రకరకాలుగా భిన్నదశల్లో కొంతకాలముంచటం శ్రమతో కూడినపని అయా వస్తువులను శిక్షించిన ట్లనిపించేది రాను రాను ఆ మాటను మనుషులక్కూడా వర్తింపజేసి 'బాధించటం' అనే అర్థంలో ఎండగట్టడమనేది జాతీయ మయిపోయింది ఇప్పుడు అదే మాటకు 'లోపాలను బయటపెట్టడం, రహస్యాలను బజారుపాలు చేయటం, దుష్కృత్యాలను బహిరంగపరచటం' అనే అర్థవిశేషాల్లో వాడుతున్నాం

**ఎంబెన్న:** సుబ్బారావుపాటి చదువుగాని, శివుడిలా సర్వజ్ఞత్వంగాని లేని మరో వ్యక్తి ఎంబెన్న అసమర్థతలో ఇతడిముందు సుబ్బారావు దిగదిడుపు క్కూడా పనికిరాడు ఇతడు తెలుగువాడే కొందరి దృష్టిలో "యం బ్రహ్మ వేదాంతవిదో వదన్తి" అనే శ్లోకాన్ని సరిగ్గా చదువలేక ఎంబెన్న అనే పేరుతెచ్చుకున్నవాడు అయితే "యం బ్రహ్మ" అనే మరో మహాత్ము డున్నాడని ఈ యిద్దరూ ఒకటి కాదనీ మరోవాదముంది

ఎంబెన్న అక్షరజ్ఞాన శూన్యుడు ఎవరయినా అతనాడి కేమయినా చిన్న విషయం చెప్పినా అర్థం చేసుకోలేడు ఏ పనీ తిన్నగా చేయలేడు పల్లెటూరి రైతు పయిపెచ్చు ఛాందసుడు ఏమీ తెలియనివాణ్ణి ఎంబెన్న అని వ్యవహరిస్తారు

**ఎదురు చుక్క:** చుక్క ఎదురనే మాటనే తిప్పి ఈ రూపం సృష్టించారు ఎదురుగా అనే మాటకు 'ఎదుట, శత్రుత్వం, విరోధం' వంటి అర్థాలున్నాయి ఎదురుగా ఉన్న శుక్రగ్రహం బాటసారికి ఎంత ప్రమాదకరమో – ఫలానా వ్యక్తి తన విషయంలో అంత శత్రుత్వం గలవాడని చెప్పటానికి 'ఆయనండీ! అయన నాకు ఎదురు చుక్క' అంటారు

**ఎదురుపెట్టి చదరంగమాడటం:** చదరంగం వ్యసనస్థాయికి తీసుకపోయే ఆట అది ఒక్కరే ఆడుకొనే 'గాడిద ఆట' వంటి పేకాటలాంటిదికాదు రెండు వైపులా ఎత్తులూ పైఎత్తులూ ఒకరే వేయటం విసిగించే పని అందువల్ల ఆ ఆటమీద

'రంధి' ఎక్కువగా ఉన్నవాళ్ళు మరొకర్ని ఆహ్వానించి, అతగాడు ఆడనంటే సొమ్ము ఎరువిచ్చిగాని, ఊరికే సొమ్మిచ్చిగాని ఆటలోకి దింపుతారు ఇంతా చేస్తే ఎదురిచ్చినవాడు గెలుస్తాడన్న నమ్మకం లేదు గెలిచినా ఓడినా ఇచ్చిన సొమ్ము తిరిగిరాదు సొమ్మూ పందెమూ రెండూ పోగొట్టుకోవలసి రావచ్చు తానే గెలిస్తే గెలుపు మిగిలినా సొమ్ము పోతుంది తమ పనులు నెరవేర్చుకోడానికి లంచమిచ్చినవాడి గతి ఈలాంటిదే లంచం తిన్నవాడు పని చేస్తాడన్న నమ్మకమేగాని చేసి తీరుతాడన్న మాట లేదు పని చేయలేదేమంటే నాలుగు తన్ని పంపినా దిక్కులేదు ఫలితంలో లంచమిచ్చి దెబ్బలు తినటమే మిగుల్తుంది ఇలాంటి భావంతో ఎదురిచ్చి చదరంగం మాడటమనే జాతీయాన్ని వాడుతుంటారు పూర్వకవి ఎవరో "లంచాऽలంచయో ర్మధ్యే యతో లంచ స్తతో జయః, ఉభయో ర్లంచయో ర్మధ్యే యతోऽధిక స్తతో జయః" అన్నాడు ఒకరు లంచమిచ్చి మరొక రివ్వకపోతే ఇచ్చినవాడికే జయం ఇద్దరూ ఇస్తే ఎక్కువ ఇచ్చినవాడికి విజయం అని శ్లోకభావం లంచమిచ్చీ అనుకొన్న పని నెరవేరుతుందని గట్టిగా చెప్పలేనట్లు ఎదురు మదుపుపెట్టి కూడా గెలుస్తామన్న విశ్వాసం లేదు ఉండదు లోక జ్ఞానం లేనివాడని చెప్పడానికి ఫలానా వ్యక్తి ఎదురిచ్చి చదరంగమాడే రకమని ఆక్షేపణగా ప్రస్తావిస్తుంటారు

ఎనిమిదో అట్ఠం: అట్టం, అట్ఠం, అట్టకం, అష్టకం అనే రూపాంతరాలున్నాయి ఈ మాటకు అష్టక మనేది మూలశబ్దం అది వెదభాగం వేదాల్లో రువ్వులు, రుక్కులు, అష్టకాలు వగైరా విభాగాలున్నాయి వేదం తర్వాత ప్రశస్తమైనదని ఈ మాటకు అర్థం కాదు వేదాల్లో ఎనిమిది అష్టకా లున్నాయి కాబట్టి ఇది తొమ్మిదో అష్టకమని కూడా కొందరు వ్యవహరిస్తుంటారు అయితే దీనికి మంచి అర్థంలేదు 'బూతు, తిట్టు' అనే అర్థం ఈ మాటకు వచ్చింది ఎందువల్లనోగాని, పచ్చి బూతులు మట్లాడుతుంటే 'ఏమయ్యా! సంస్కృతం మాట్లాడుతున్నావు?' అనే వాళ్ళున్నారు – ఆక్షేపణగా మనకు రానిది, మనకు కానిది బూతుకిందే లెక్క ఆ భావంతో ఎనిమిదో/తొమ్మిదో అట్టానికి బూతు అనే అర్థం చెప్పారు తిట్టిన తిట్టే మళ్ళీ మళ్ళీ తిట్టుంటే "ఎనిమిదో అట్టం పారాయణం చేస్తున్నా"డనటం కూడా కద్దు

ఎమ్డెన్: ఈ మాట తెలుగులో స్థిరపడ్డ జర్మన్ పదం రెండో ప్రపంచ యుద్ధకాలంలో దూర దూరాల్లో ఉన్న మిత్రమండలి యుద్ధనౌకలు అకస్మాత్తుగా మునిగిపోయేవి శత్రువు కనిపించడు తరవాత తెలిసింది అది ఎమ్డెన్ అనే పేరుగల జలాంతర్గామి నిర్వాకమని సప్త సముద్రాల్లోనూ విహరించిన ఆ జలాంతర్గామి మద్రాసు నగరం మీద కూడా బాంబులు విసిరింది ఒక గుండు అక్కడి హైకోర్టు భవనం గోడలో ఒక చోట రంధ్రం చేసింది అప్పటికి ఈ రకం పడవల గురించి వినటమేగాని అవి యుద్ధనౌకలని చాలామందికి తెలియదు కొంతకాలం తరవాత దాన్ని ముంచి వేశారనుకోండి అది దొంగదెబ్బ తీసి అంతర్ధానమయ్యేది మళ్ళీ కొన్ని వందల మైళ్ళ దూరాన మరోచోట ప్రత్యక్షమయ్యేది వాస్తవ పరిస్థితి తెలియని జనం దాని ధాటిని తలుచుకొని విస్తుపోయారు దాని చురుకుతనానికి స్పందించారు గబగబా మాట్లాడినా "ఆహా! ఎమ్డెన్‌లాగా మాట్లాడాడండి!" అని మెచ్చుకొనే స్థాయికి వచ్చారు–పడవ మాట్లాడదని తెలీకకాదు అది నీళ్ళమీద తేలుతూ అందులో మునగటం ఏదో విచిత్రంగా తోచింది విచిత్రమైన, విడ్డూరమైన పని చేసినా, సాహస ప్రదర్శన

చేసినా, సగటు మనిషి చేయలేని ఏ పనిచేసినా 'ఎమ్డెన్'గా చేశాడనటం మొదలయింది ఎమ్డెన్ మొదట విశేష్యంగా ఉంది. తరవాత విశేషణంగా మారింది ఈ తరం జనం ఈ మాట వినివుండకపోవచ్చు ఎమ్డెన్ అంటే అద్భుతం, ఆశ్చర్యకరం, మహత్తరం వగైరా అర్థ విశేషాలు వచ్చాయి. అసలు జర్మన్ భాషలో ఆమాట కర్థమేమిటో తెలీదు.

ఎలుగు తంటసం: ఈ మాటను కొందరు ఎలుగ్గొడ్డు తంటస మంటారు ఇదోరకం వృధాయాసం కోడి గుడ్డుకు వెంట్రుకలు లేవు కానీ ఉన్నాయని వాటిని పీకే వాళ్లుంటే, ఒంటినిండా వెంట్రుకలున్న ఎలుగుబంటి శరీరంమీది నుంచి ఒక్కొక్క వెంట్రుకే పీకాలని ప్రయత్నించేవాళ్ళూ ఉన్నారు ఎన్ని పీకినా కొన్ని మిగిలిపోతాయి ఒక వరస పీకటం పూర్తయ్యేలోగా కొత్త వెంట్రుకలు మొలుస్తాయి వాటిని పీకక తప్పదు కుక్కతోక వంకర తీసినట్లు ఈ ప్రయత్నం ఒక పట్టాన నెరవేరేదీ కాదు నెరవేరిం దనుకొంటుండగానే మళ్ళీ మొదలయ్యేది కూడా ఇదీ వృధా పరిశ్రమే కోడి గుడ్డు విషయంలో లేనిచోట వస్తువును సృష్టించాలని అనవసరంగా ప్రయాసపడితే, ఎలుగుబంటి విషయంలో ఉన్న వస్తువులను తొలగించటానికి నిష్ఫల ప్రయాసపడతా రన్నమాట మూలంలో మార్పేగాని ప్రయత్నంలో లేదు - ఫలితంలోనూ లేదు. తేలే పనీ తెమిలే పనీ కానిదాన్ని సాధించాలని శ్రమిస్తుంటే ఆ పరిశ్రమ అంతా ఎలుగుతంటస మంటారు

ఎల్లమ్మ: నాంచారమ్మ ఎలాటిదయినా సౌమ్యురాలు జగడాలమారి కాదు దానధర్మాలు చేయాలనుకోదేమోగాని ఇతరుల సొమ్ముమీద ఆమెకు ఆసక్తి లేదు ఆమెకు అనేకవిధాల విరుద్ధమైన ప్రవృత్తిగల మరో మహాతల్లి ఎల్లమ్మ ఎల్ల అంటే పొలిమేర, హద్దు గ్రామ సరిహద్దులో మరం పెట్టి ఊరిని కాపాడే దేవత కూడా కావచ్చు ఆమె శక్తి సామర్థ్యాలను స్పష్టంగా వివరించాలంటే ఆమె పూర్తి విలాసం చెప్పాలి అది 'ఏనుగు మింగిన ఎల్లమ్మ'

ఎవరయినా, పరద్రవ్యాన్నయినా సరే - తమ కందుబాటులో ఉందంటే కబళిస్తారనుకోండి ప్రపంచంలో ఉన్న సమస్త వస్తువులూ తనవే కావాలనీ, తన అనుభవంలోనే ఉండాలనీ అనుకుంటారనుకోండి ఆ లక్షణాన్ని 'అబ' అంటారు కదా? అన్నదమ్ములు పంచుకున్న కొత్తల్లో ఆ వీధిని పెద్దపులి పోయినా తలా తోకా చెరోవైపు పట్టుకొని చంపి పంచుకుంటా రంటారే - అంత తీవ్రమయిన అబగల వ్యక్తి ఎల్లమ్మ ఆమె ఏనుగుల్నయినా మింగుతుంది కానీ ఏమీ ఎరగ నట్లుంటుంది ఎవరైనా క్రూరంగా ప్రవర్తిస్తూ పైకి నిశ్చలంగా కనిపిస్తే వారిని ఏనుగు మింగిన ఎల్లమ్మతో పోలుస్తారు

*ఏటావలి గిలిగింతలు:* ఏరు అంటే ప్రవాహం, వాగు. దానికి ఆవల అంటే - అవతలి ఒడ్డున దొరికే గిలిగింతలంటే సంతోషాలు. అవి ప్రేమ కావచ్చు, స్నేహం కావచ్చు రవాణా సౌకర్యాలు లేనిరోజుల్లో ఒక నదికి ఇవతలి ఒడ్డున ఉన్నవాళ్ళు అవతలి ఒడ్డున ఉన్నవాళ్ళతో స్నేహం చేయటం, ప్రేమలో పడటం కష్టసాధ్యంగా ఉండేవి అలా దూరతీరాల్లో ఉన్న మిత్రులు సమయానికి సాయపడగలరని అనుకోవటం భ్రమ అన్ని ఋతువుల్లో నదులు దాటడం సాధ్యపడదు ఏ పుట్టి మీదనో నదిని దాటడం ప్రమాదకరం కూడా ఆవలి ఒడ్డున ఉన్న వ్యక్తి ఎంత కావలసిన స్నేహితుడయినా

అకస్మికంగా వచ్చిపడే కష్టాలు పంచుకోలేదు, ప్రయత్నించి కూడా. ఆ దృష్టితో పాతకాలంలో ఏటావలి స్నేహం నిరర్థకమని, నిష్ప్రయోజనకరమనీ భావించేవాళ్ళు. ఆ మైత్రి వల్ల, ఆ ప్రేమ వల్ల ఎంత ఆనందం కలిగినా, అది అందుబాటులో లేని స్నేహం. గంటల్లో ఖండాంతరాలకు చేరుకోగల ఈ కాలంలో కూడా ఉన్న ఊళ్లో వ్యక్తికి చేసిన ఫోను, రాసిన ఉత్తరం అందటం లేదన్నది అనుభవంలోని విషయం. అందువల్ల పూర్వం దూరస్నేహాలు నిష్ప్రయోజనకరమనీ, పొరుగూరి సేద్యంలాగా బాధాకరమనీ అనుకున్నారంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

ఏడుకట్ల సవారీ: సవారీ అనే మాట హిందీ/ఉర్దూలనుంచి వచ్చింది. అల్లసాని పెద్దన 'అసివారు' అనే రూపంలో వాడుక చేస్తే, నిత్యవ్యవహారంలో స్వారీ అనే రూపభేదంతో నిలిచింది. ఈ మాటకు 'వాహనం, వాహ్యాళికి పోవటం' మొదలయిన అర్థాలున్నాయి. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి ప్రహసనాల్లో ఈ మాటకు అనేక పర్యాయాల వాడుక కనిపిస్తుంది. ఏడుకట్లు కట్టేది 'పాడె'కు మాత్రమే. చనిపోయిన వ్యక్తి ఏడు ఊర్ధ్వ (పై) లోకాలు దాటిపోవాలన్న నమ్మకానికి చిహ్నంగా ఏడుకట్లు కట్టారని కొందరి వివరణ. సప్త వ్యసనాలున్న వ్యక్తి అనే సూచనకోసం ఏడుకట్లు కట్టారనీ, బతికి ఉండగా ఈ ఏడు దుర్లక్షణాలున్నా వాటికి అతీతంగా ఉండే లోకాలకు వెళుతున్నందున అలా అన్ని కట్లు కడ్తారని మరికొందరి విశదీకరణ. ఎవరి వ్యాఖ్యాన మెలా ఉన్నా ఇన్ని కట్లు కట్టి పాడెమీద పడుకోవాలనుకోవటం ఆచారమే గాని శాస్త్రం కాదంటారు. ఎంత పరమ నిర్భాగ్యుడికైనా దరిద్రుడికయినా బతికి ఉండగా దొరక్కపోయినా చచ్చినప్పుడయినా లభించే వాహనయోగం ఇదే. 'మరణాంతాని వైరాణి' అనే నమ్మకమున్న మన దేశంలో పరమ శత్రువులు కూడా ఈ వాహనయోగం కల్పించి శ్మశానానికి తీసుకపోతారు. వ్యక్తితోబాటు అతడిమీది శత్రుత్వం కూడా నశిస్తుందన్నమాట. జీవించి ఉండగా దొరకని భోగం–పాడె అనే వాహనమెక్కటం–మరణించిన తరవాత లభ్యపడుతుంది. బంధుమిత్రులు ఊరేగింపుగా రుద్రభూమికి తీసుకపోతారు. తన దరిద్రాన్ని, అభాగ్యాన్నీ ప్రస్తావించి విసుక్కొనే సమయంలోనూ, ఇతరుల భోగాలను ఈసడించి మాట్లాడే వేళల్లోనూ 'ఏడుకట్ల సవారీ' తప్పదని వ్యాఖ్యానిస్తుంటారు. పుట్టినవారు గిట్టక తప్పదు. కాబట్టి ఇదొక్కటే అందరికీ దొరికే వైభవమన్న ఆక్షేపణ ఈ మాటలో ఉంది.

ఏనుగుదాహం: ఏనుగు పెద్ద శరీరం కలది కాబట్టి దాని దప్పిక కూడా గొప్పదేనన్న నమ్మకంతో పుట్టిందీమాట. ఏనుగంత మనిషి, ఏనుగుబలం వగైరాల్లోలాగానే ఈ పదానిక్కూడా విపరీత దాహం, అత్యాశ అనే భావాలను సూచించటానికి ఏనుగుతో లంకె వేశారు గాని, ఒంటె దాహంతో పోలిస్తే ఏనుగు తాగే నీళ్ళు ఎక్కువేమీ కాదు. దురాశ అనే అర్థంలోనే ఈ మాటకు వాడుక. మంచి అర్థంలో దీనికి ప్రయోగాలు కనిపించవు.

ఏనుగుపాడి: సామాన్య సంసారు లెవరూ ఏనుగులను పెంచుకోలేరు. పెంచుకున్న మారాజులు కూడా దాని పాలు పితికి తాగలేరు. అయినా, ఏనుగుపాడి అనే మాట పుట్టింది. ఏనుగు పెద్ద జంతువు కాబట్టి దాన్ని పెంచి, పాడి పశువుగా ఉపయోగించగలగటం మహదైశ్వర్యానికి చిహ్నమని ఊహించారన్నమాట! 'సమృద్ధి,

సంపద' అనే అర్థంలో ఈ మాటను వాడుతుంటారు 'ఆయన కేమండి? ఏనుగుపాడి' అంటే, ఆ వ్యక్తి మహాభోగి, సంపన్నుడు అని మాత్రమే అర్థం

ఏలేశ్వరోపాధ్యాయుడు: ఈయన యథార్థ వ్యక్తి ఎవరైనా వాదులాడుకొంటుంటే కల్పించుకొని అయినాసరే తీర్పు చెప్పేవాళ్ళుంటారు కొందరు అందుకు ఉభయ పక్షాలచేతా చీవాట్లు తినేవాళ్ళ సంఖ్య ఎక్కువ ఉభయులూ గౌరవించి ఆ తీర్పును అంగీకరించేట్లు చేయగలవాళ్ళు చాలా కొద్దిమంది తనకు వివాద విషయంలో స్వప్రయోజనం లేకపోయినా ఎవరూ తప్పుబట్టలేనివిధంగా ధర్మం చెప్పటం, చెప్పగలగటం కోటి కొక్కరికయినా సాధ్యం కాదు అలాంటి అసాధ్యమైన ప్రతిష్ఠ సంపాదించినవారిలో ఏలేశ్వరోపాధ్యాయు లొకరు ఈయనను గురించి అర్ధశతాబ్దం కిందకూడా కథలుకథలుగా చెప్పుకొనేవాళ్ళు చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు తమ "కథలు – గాథలు" అనే గ్రంథంలో ఈ ఉపాధ్యాయులవారిని ఎన్నోసార్లు స్మరించారు

ఇంతకూ ఆయన ఎవరు? ఏనాటివాడు? ఏం చదివాడు? ఏం చేశాడు? అనేది పరిశోధకులకు కావలసిన విషయాలు "నా మాటకు తిరుగులేదు" అని ఎవరైనా బుకాయిస్తే, "ఏం? నీవు ఏలేశ్వరోపాధ్యాయుడివా?" అని అడిగించుకున్నవాళ్ళు చాలామంది ఉండవచ్చు ఎవరితో పోల్చి ఈ మాట అన్నారో అది ముఖ్యం అనేక శాస్త్ర విషయాల్లో ఆయన నిర్ణయానికి తిరుగులేదనే పేరు వచ్చింది అది ప్రధానం ఏలేశ్వరోపాధ్యాయుడి తీర్పు తిరుగులేని ధర్మమనే ప్రఖ్యాతి వచ్చింది ఆయనది తుది నిర్ణయం, తిరుగులేని నిర్ణయం అంతటివాడు తప్ప మరెవరూ ప్రశ్నించడానికి వీలులేని నిర్ణయం ఈ భావం కోస్తాజిల్లాల్లోని పండితులూ కవులూ సగౌరవంగా అంగీకరించిన వాస్తవం

ఒజ్జల పుచ్చకాయ: ఇది కొంచెం పాతకాలపు మాట ఒజ్జ అంటే గురువు, ఉపాధ్యాయుడు గురువుగారు శిష్యులకు పుచ్చకాయ తినటం పాపమని పాఠంలో చెప్పారుట ఆ సంగతి మరిచిపోయి కొంతకాలం తరవాత ఓ పుచ్చకాయ పట్టుకు రమ్మని ఒక శిష్యుణ్ణి పురమాయిస్తే అతడు తెల్లబోయాడు ఇదేమండీ గురువుగారూ! అంటే, మీరు తినగూడదన్నాను గాని, నేను తినగూడదని చెప్పలేదే అని కసురుకున్నాడని కథ తనకు వర్తించని, తాను ఆచరించని ధర్మాలను ఇతరులు పాటించాలని చెప్పే మన ప్రస్తుత రాజకీయవాదివంటివా డన్నమాట ఆ గురువు అందువల్లనే తమకు మాత్రమే కావలసిన వాటినీ, ఇతరులకు నిషిద్ధమయిన వాటినీ ఒజ్జల పుచ్చకాయ అనేవాళ్ళు

ఒంటికంటి రామలింగం: ఈ రామలింగానికి ఇంటిపేరుందో లేదోగాని పౌరుషనామంగా 'ఒంటికంటి' అనే ఇంటిపేరు వచ్చింది "ఒకరికున్నదని ఏడిస్తే ఒక కన్ను పోతుంది" అనే సామెత ప్రకారం ఇతరులను చూసి ఓర్వలేక ఒక కన్ను పోగొట్టుకొన్న రామలింగమన్నమాట ఇతగాడు తెలుగువాళ్లకు వందల వేల రకాల పేర్లుండగా రామలింగమనే పేరే ఎందుకు వచ్చిందనేది ప్రశ్న అతడు శైవుడూ వైష్ణవుడూ అనే భేదం లేని స్మార్తుడు కాబట్టి ఆ పేరు వచ్చిందంటారు కొందరు మరికొందరు తెనాలి రామలింగడి వర్ణనమీద ఆధారపడి, అది నచ్చి ఇలా పేరు పెట్టారంటారు "

తెనాలి రామలింగణ్ణి ఓ రాజు తననుగురించి ఉన్నది ఉన్నట్లు వర్ణించమని కోరాడట రాజుగారికి ఒకే కన్నుంది ఆ విశేషాన్ని ఆధారంగా చేసుకొని ఒక కవి "అన్నాతిఁగూడ హరుఁడవు, అన్నాతిం గూడకున్న అసురగురుం డౌ, దన్నా! తిరుమలరాయా!

కన్నొక్కటి లేదుగాని కంతుఁడవయ్యా!" అని పొగిడా డంటారు! రాణీగారి రెండు కళ్లూ రాజుగారి ఒంటికన్నూ కలిపితే వెరశి మూడు అయింది కాబట్టి శివుడంతటివాడ వన్నాడు. శివుడు ముక్కంటి. పైగా అర్ధనారీశ్వరుడు కాబట్టి అలా కలిపి లెక్కించటమే సరయిందన్నాడు. ఈ కూడిక చేయకపోతే శుక్రాచార్యు డంతటివా డన్నాడు. శుక్రుడికన్నా రాజనీతివేత్త లేడు కాబట్టి, ఆయన రాక్షసగురువు కాబట్టి అదికూడా గొప్ప పోలికే. ఒక కన్ను లేకపోతేనే మన్మథుడంతటి చక్కటివాడయితే రెండూ ఉంటే ఇబ్బడి చక్కదనం కలవాడన్నమాట! ఈ పొగడ్తమీద ఆధారపడి రామలింగమనే పేరు వచ్చిందనటం అంత నప్పదు. ఎందుకంటే, ఇక్కడ ఓర్వలేనితనమే ప్రధానం కాబట్టి, చక్కదనం సంగతి అప్రస్తుతం కాబట్టి, ఈ వివరణ అతకదు. అయినా కొంద రదే సరయిం దంటారు.

తనకు లేదనికాక ఇతరులకున్నదని ఏడ్చేవాడు ఒంటికంటి రామలింగం. అతడు ఇతరుల సుఖశాంతులనూ భోగభాగ్యాలను భరించలేడు. తనకున్నదో లేదో విచారించడు. తనకేమీ లేకపోయినా పరవాలేదుగాని ఇతరు లెవ్వరు వేళకు ఇంత అన్నం తిన్నా సహించలేని ఈర్ష్యాపరుణ్ణి ఈ పేరుతో పిలుస్తారు.

**ఒంటుపక్క సున్న:** ఒంటు అనేది అంకె– ఒకటినుంచి తొమ్మిది దాకా ఉండే సంఖ్య. దాని ఎడమపక్క ఎన్ని సున్నాలున్నా ఒకటే. ఒంటు విలువ పడిపోతుంటుంది. కుడివైపు సున్నా లెన్నిచేరితే ఒంటు విలువ అంత పెరుగుతుంది. అయితే, సున్నాకూ ప్రత్యేకంగా విలువ లేదు. ఎన్ని సున్నాలు రాసినా ఫలితం శూన్యమే. ఇతరుల సహాయ సహకారా లున్నప్పుడు విజృంభించి, అవి లేనప్పుడు చేతులు ముడుచుకొని చచ్చినవాడిలా ప్రవర్తించే వ్యక్తిని 'ఒంటుపక్క సున్న' అని పిలుస్తారు. ఈ మాటకు తెలంగాణా వ్యవహారంలో వాడుక ఎక్కువ. ఇతర ప్రాంతాల్లో 'లెక్క మీద సున్న' అంటారు. నిరర్థకుడు, నిష్ప్రయోజకుడు, పరభాగ్యోపజీవి అనే నీచార్థాల్లో ఈ మాటను వాడి తక్కువగా చూస్తారు.

**ఒంటెత్తు పోకడ:** ఇతరులతో సంబంధం లేకుండా, ఇతరుల మార్గాలను అనుసరించకుండా తనకు తోచిన పద్ధతిలో తాను నడవటాన్ని ఒంటెత్తు పోకడ అంటారు. ఎందుచేతనోగాని ఈ జాతీయానికి కమ్యూనిస్టు పరిభాషలో ఎక్కువ వ్యాప్తి వచ్చింది. ఒంటరి ప్రవర్తన అనే భావంతో వాడే ఈ సమాసాన్ని కొందరు 'ఒంటెద్దు' అనే రూపాంతరంతో ప్రయోగిస్తుంటారు– ఎద్దుకూ ఎత్తుకూ సంబంధం లేకపోయినా!

**ఓ మను:** ఓం అనే ధ్వనిని ఉచ్చరించటాన్ని ఓమనటం అంటారు. సనాతన మత విశ్వాసాల ప్రకారం ఓంకారంతోనే సృష్టి ఆవిర్భవించిందట. విశ్వాంతరాళంలో ఓం అనే ధ్వని వినిపించిందనీ ఆ శబ్దశక్తి వల్లనే చరాచర ప్రపంచం ఉద్భవించిందనీ నమ్ముతారు. వేదాలనుంచి రకరకాల మంత్రాల వరకూ ఓంతో మొదలవుతాయి కాబట్టి 'మొదలుపెట్టు' అనే అర్థంతో 'ఓం' అను అనే మాట పుట్టింది. ప్రాచీన పద్ధతిలో అక్షరాభ్యాసం చేసేటప్పుడు కూడా అకారంతో కాక ఓంకారంతోనే దిద్దబెట్టడం మొదలవుతుంది గాని, పాత పద్ధతిలో చివరిభాగం చిత్రంగా అంతమవుతుంది. "ఓం నమశ్శివాయ, సిద్ధం నమః" అని పలకమీదనో నేలమీదనో రాసి పిల్లల చేత దిద్దించేవాళ్ళు. శివుడికే నమస్కార మన్నంతవరకు శైవమో హైందవమో అయితే తరవాతిభాగం జైనమతానికి సంబంధించింది కావటమే విడ్డూరం. జైనులు "నమ స్సిద్ధేభ్యః" అని

మొదలేసేవాళ్లు తెలుగుదేశంలో జైన ప్రాబల్యం ఉన్న కాలంలో ఈ భాగం అక్షరాభ్యాసంలో భాగంగా చేరింది సిద్ధ శబ్దానికి జైనముని అనే అర్థంకాక పురాణాదుల్లో వినిపించే సిద్ధులనే మహర్షులనే అర్థం కల్పించుకొని సరిపెట్టుకొనేవాళ్లున్నారు జైన సంప్రదాయం శైవ సంప్రదాయంతో కలిసిందనేదే సమర్థనీయమని సురవరం ప్రతాపరెడ్డిగారి వంటి పండితుల అభిప్రాయం అక్షరాభ్యాసమేగాక ఏ పని మొదలుపెట్టినా ఓంతో అరంభించటం మంచిదనే విశ్వాసం వల్ల ఓం అంటే మొదలు అనే అర్థం స్థిరపడిపోయింది అయితే ఈ లక్షణం, భావం అంకెల విశయంలో వర్తించవు ఒకటి అనకుండా 'లాభం' అని, ఏడు అనకుండా 'అరున్నొక్కటి' అనే సంప్రదాయముంది అక్షరాల విషయంలో పనులకు సందర్భించి ఓం అనటం అంటే మొదలుపెట్టడమనే అర్థం

**కంచంత కాపరం:** కంచి అంత పెద్ద కాపరమని అర్థం ఇంటినిండా జనం ఉండి, తీర్థయాత్ర ప్రజల్లాగా వచ్చిపోయే బంధుమిత్రులున్న సంపన్న కుటుంబాన్ని, ఉమ్మడి సంసారాన్ని కంచంత కాపరమంటారు కంచి మహానగరమేగాక శైవ వైష్ణవు లుభయులకూ తీర్థయాత్రా స్థలం కాబట్టి జన సమ్మర్దం పూర్తిగా ఉన్న ఊరు. విశాలమయింది కూడా చాలా పెద్ద సంసార మనటానికి ఈ పోలికను చెప్తుంటారు. మూడు నాలుగు తరాల వాళ్లు కలిసి బతికే ఇంటికీ సంసారానికీ ఈ పేరు వచ్చింది. కొందరు "లంకంత కొంప" అంటారు అది రావణాసురుడి ఇంటికి సూచకం వాల్మీకి రామాయణంలో లంకా నగర వర్ణనం చదివితే అతడి భోగ భాగ్యాలూ కుటుంబ విస్తృతీ తెలుస్తుంది తల తిరిగిపోతుంది ఆ లంక ఇప్పటి శ్రీలంక కాదనీ, అది గోదావరి లంకల్లో ఒకటనీ, గోండ్వనా ప్రాంతంలోదనీ సురవరం ప్రతాపరెడ్డిగారూ తదితరులూ వాదించారు ఈ వాదమే నిజమయితే ప్రాచీనాంధ్ర దేశానికి దక్షిణ సరిహద్దులో కంచి, ఉత్తరాన లంక అనే మహానగరా లుండేవని, వాటితో పోల్చి మనవాళ్లీ జాతీయం సృష్టించుకున్నారనీ చెప్పవచ్చు తెలుగు దేశ చరిత్రలో మొట్టమొదటి మహానగరం ఓరుగల్లు అది పోలికకు రాలేదంటే బహూశా ఈ మాటలు క్రీస్తు శకం పన్నెండో శతాబ్దానికి ముందు పుట్టి వుండాలి కాపరానికి బదులు 'కొంప' అనే మాట వాడ్తారు కొందరు అయితే "లంకంత కొంప" అంటారేగాని కంచంత కొంప అని అంటున్నట్లు తెలియదు

**కంచిగరుడ సేవ:** కంచి పుణ్యస్థలం. అది విష్ణుకంచి, శివకంచి అని రెండు భాగాలు మొదటి దాంట్లో గరుత్మంతుడి విగ్రహముంది ఆయన విష్ణుమూర్తికి అత్యంత సన్నిహితుల్లో ఒకరు కాబట్టి ఆయనకు సేవచేస్తే దేవుడికి సిఫారసు చేసి ఉద్ధరిస్తాడనేది విశ్వాసం ఆయనకు చేసే సేవలు చాలా కష్టమైనవి ఒక పట్టాన తేలేవి తెమిలేవీ కావు ఇంతా చేస్తే అదంతా వృధా ప్రయాస కావచ్చు ఒక్కోసారి ఈ సేవలు విపరీత పరిణామాలను తెచ్చిపెట్టవచ్చు తనకు చేయవలసిన సేవలను తన సేవకుడికి చేసినందుకు అసలు దేవుడికి కోపం వచ్చినా దిక్కులేదు దుష్కరమైన ఈ సేవల్లో అనాచారంలాంటి అపచారాలు జరిగితే అందుకు గరుడాళ్వారు కోపించి బాధించనూవచ్చు తేలని, తెమలని, ఎంత చేసినా తృప్తిలేని, ఫలితం లేని సేవలను కంచి గరుడ సేవ అంటారు నిష్ఫలప్రయాసను ఈ పేరుతో పిలుస్తారు

**కంచిమేక:** కంచి ప్రాంతాల మేకలకు పెద్ద పొదు గుంటుంది అంటే ఎక్కువ పాలిస్తాయి అయితేనేం? ఆ పాలు పిండుకొని తాగేవా ళ్లుండరు అవన్నీ వృధాగా

పొయ్యేవే. మహా అయితే దాని పిల్లలకు మాత్రం ఉపయోగపడతాయి. అందువల్ల కావలసినంత డబ్బుండి, దానబుద్ధి లేక, తన పిల్లలకు మాత్రమే అస్తులిచ్చి పొయ్యేవాళ్లను కంచి మేక లంటారు. వారికున్న సొమ్ము లేనివారికి ఏమాత్రం పనికిరాదు – దక్కదు. కానీ వారి దగ్గర మూటలున్నాయని అందరికీ తెలుసు. ఆ మూటలు దక్కే మార్గం లేదు – వారసులకు తప్ప. ఈ కారణంగా త్యాగబుద్ధిలేని ధనవంతులను కంచి మేక లంటారు.

**కట్టు బానిస:** భారతదేశంలో బానిస విధానం పూర్వం లేదని కొందరి నమ్మకం. బానిస శబ్దం 'బానసం' అనే మాటనుంచి పుట్టింది. బానసం అంటే వంట. పూర్వం ఒక తండా మీద మరొకటి విరుచుపడి జయించినప్పుడు ఓడిన వారిచేత గెలిచిన వాళ్ళు వంటలు చేయించుకొనేవారని కొందరి కథనం. ఇప్పటికీ తెలంగాణా వాడుకలో 'అంట్లు తోమటం' అని కోస్తావారి వ్యవహారంలో ఉన్న మాటను 'బాసనలు కడగటం' అంటారు. బాసన అనేది బానస శబ్దం వర్ణ వ్యత్యయం పొందినందున ఏర్పడ్డ రూపం. (సంస్కృతంలోని పారావతశబ్దం తెలుగులో మొదట పారువంగా మారి, తరవాత పావురమని స్థిరపడ్డట్లు బానసం అనేది బాసనంగా మారింది) తరతరాలుగా ఈ విధమైన బానిస పనిలో ఉన్న వ్యక్తి కట్టుబానిస. కట్టు అంటే ఒప్పందం, ఏర్పాటు. తండ్రో తాతో చేసిన ఈ చాకిరీని తానుగూడా ఒట్టు వేసుకున్నట్లు చేసేవాడన్నమాట. మూలార్థం మరుగున పడిపోయి వెట్టిచాకిరి అనే అర్థంలో నిలిచిన ఈ జాతీయం వ్యక్తుల దీన చరిత్రను గుర్తుకు తెస్తుంది.

**కత్తిమీద సాము:** నేలమీద సాము చేయాలంటేనే ఆరోగ్యం, బలం, నేర్పు కావాలి. కత్తి అంచున నిలిచి సాము చేయటం మాటలతో పనికాదు. అలా చేసినవాళ్లున్నారో లేదో తెలీదు. తాళ్లమీద, తీగలమీద నడిచే వాళ్లున్నారు. కత్తుల్లాంటి మేకులున్న బల్లమీద పడుకొని బరువు లెత్తించుకొని బతికిన వాళ్లున్నారు. కానీ విచ్చుకత్తి మొనమీద నిలిచి సాము చేసినవాళ్లు ఉన్నట్లు దాఖలా లేదు. అయినా, అదో మహత్తర విద్య. అదెంత భయంకరమో మన ఊహకే అందుతుంది. కళ్ళారా చూస్తేగాని నమ్మవలసిన విషయం కాదది. అత్యంత ప్రమాదకరమూ అసాధ్యమూ అని చెప్పడానికి ఫలానా పని కత్తిమీది సా మంటుంటారు.

**కత్తుల బోను:** సర్కసులాంటి ప్రదర్శనల్లో కత్తుల గుచ్చిన బోను చూస్తుంటాం. అన్ని వైపులనుంచి చిక్కులూ ప్రమాదాలూ వచ్చిపడుతుంటే ఎలాగో ప్రాణాలు దక్కించుకుంటూ చావుబతుకుల మధ్య ఊగిసలాడుతూ ఉండటాన్ని కత్తుల బోనులో ఉన్నట్లు చెప్తుంటారు. కత్తులు అచ్చం కత్తులు కావు. బోను ఉండ నక్కరలేదు. విసిగిన గృహస్థుడు తన సంసారం కత్తుల బోనులా ఉందని వ్యసనపడుతుంటాడు.

**కథల కామరాజు:** యుగంధరుడిలాంటివాళ్ళు కథలో పాత్రలయితే, కథలే అల్లిన మహనీయుడు కథల కామరాజు. ఈ కామరా జెవరో నిష్కర్షగా చెప్పలేంగాని "మదనకామరాజు కథలు" ఆయన చెప్పినవే ననేవాళ్ళున్నారు. జానపద పద్ధతిలో రాజకుమారుల కథలు చెప్పటంవల్ల కామరాజుకు మంచి కథకుడనే పేరు వచ్చింది. ఎవరయినా అభూతకల్పనలతో మానవులనూ దానవులనూ దేవతలనూ పాత్రలుగా పెట్టి, అవసరార్థం మరికొన్ని జంతువులను చేర్చి కథలు చెప్తే – వారిని 'కథల కామరాజు' అంటారు. కాలక్రమాన నిజంకన్నా కల్పన, సాధ్యంకన్నా అసాధ్యం,

విశ్వసనీయతకన్నా అభూతకల్పన ఎక్కువ పాళ్లలో ఉండేట్లు మాట్లాడేవాళ్లను కథలకామరా జినటం పరిపాటి అయింది

**కందవిత్తు:** కంద దుంపకు విత్తన మేమిటన్నది ప్రశ్న దుంపను నాటితే మొక్క మొలుస్తుంది మళ్ళీ ఆ మొక్కే నేలలో దుంపలు పెడుతుంది ఈ విధంగా ఒకే కుటుంబంలో సంతానవృద్ధి జరుగుతుంటే అది కందవిత్తులాంటి సంసారమంటారు ఆర్భాటం, పరిశ్రమ లేకుండా అభివృద్ధి సాధించటాన్ని కూడా కందవిత్తుతో పోలుస్తారు

**కందాలరాజు:** కొందరుంటారు – ఎప్పుడూ తేరతిండికోసం ఎదురుచూస్తూ వాళ్ళకూ మనకూ ఎలాంటి సంబంధమూ ఉండదు మహా ఉంటే బాదరాయణ సంబంధం ఉండవచ్చు అయినాసరే, అటూ ఇటూ ఏడు తరాల సంబంధం కల్పించుకొని ఊదరపెడ్తారు సరిగ్గా ఏ తిండివేళకో వేంచేస్తారు మొహమాటానికయినా ఈ పూట మా ఆతిధ్యం స్వీకరించమనక తప్పదు గృహస్థుడైన వాడు అనకపోయినా ఆహ్వానించకపోయినా "మిమ్మల్ని చూసి ఎన్నాళ్లయిందో కదా! చిన్నపిల్లల్ని ఓసారి చూసి ముద్దుచేసి మా చెల్లెలి చేతివంట తింటేగాని ఈ పాడు జీవికి తృప్తిలేదు కోరికలు తీరకుండాపోతే దయ్యా లవుతారంటారు " ఇలా సోదిచెప్పి తిండికి తయారవుతారు ఈ బాపతు మనిషిని 'కందాలరాజు' అంటారు మన కతడితో చిన్నమెత్తు పని వుండదు ఉన్నా అతడు చేసిపెట్టేది లేదు అతగాడికీ పనిలేదు – తేర తిండి తినిపోవటం తప్ప, ఇచ్చకాలు పలకటంతప్ప ఇలా ఉట్రవుడియంగా వచ్చిపడి తేరతిండి తినిపొయ్యే వ్యక్తిని కందాలరా జంటారు అటువంటి వాళ్లకు ఆతిధ్యమివ్వకపోతే అప్రతిష్ఠ తప్ప మనకి వచ్చిపడేదేమీ ఉండదు – ఇంటింటికీవెళ్ళి తనకు మనం చేసిన అమర్యాదను గురించి దుష్ప్రచారం చేస్తారు కాబట్టి

**కన్నాకు:** కన్నా కంటే మొదటి అకు చెట్టుకుగాని తీగకు గాని మొట్టమొదట పుట్టిన ఆకు చెట్టో తీగో మొదటిసారిగా 'కన్న', చిగిర్చిన ఆకన్నమాట అదే చెట్టు బతికిందనడానికి చిహ్నం అందువల్ల 'ముఖ్యమైన, శ్రేష్ఠమయిన, తలకట్టువంటి' అనే అర్ధాలు వచ్చాయి 'ఆ వూరి కాయన కన్నాకులాంటివాడు' అంటే 'గ్రామపెద్ద, ముఖ్యుడు, గొప్పవాడు' అనే అర్ధం అయితే, ఈ మాట అన్ని సందర్భాల్లోనూ పొసగదు "పోరాని చుట్టాలు వచ్చారు – వంగివంగి తమలపాకులు తుంచ" మనే వాక్యముంది తమలపాకుల విషయంలో నయితే తీగ మొదలు దగ్గరున్న అకులు ముదురువి తాంబూలానికి పనికిరానివి 'ఇప్పటికి చేసిన మర్యాదలు చాలు, ఇక బయటికి పంపటం మేలు' అనే భావంతో పైవాక్యం పుట్టింది తమలపాకులు లేతవి కావాలి ముదురాకుల తాంబూలం 'ఇక వేంచేయండి' అని సూచించటానికి గుర్తు ఆ తీగ కన్నాకు అనాదరానికి చిహ్నం

**కప్పగంతులు:** దీపావళి సరంజామాలో చాలా చౌకగా, ఎక్కువ ఆనందకరంగా ఉండే వస్తువుల్లో కప్పగంతు లనేవి ప్రధానం చాలాకాలం క్రితమే వీటి అమ్మకాలను నిషేధించారు ఇవి పాతకాలపు దమ్మిడీ అంత పరిమాణంలో, అదే రూపంలో ఉండేవి ఇప్పటి (నయా) పైసకన్నా చిన్నగా ఉబ్బెత్తుగా ఉండేవి వాటిని గోడమీదనో, బండమీదనో రాసిపడేస్తే చిటపటలాడుతూ ఎగిరిపడుతుండేవి ఏపాటి ఒరిపిడికయినా నిప్పురవ్వలు రాల్చేవి వీటివల్ల అగ్నిప్రమాదాలు ఎక్కువ గుడ్డలు అంటుకోవటం, చిల్లులు పడటం

సాధారణం. పిల్లలకు విశేషానందం కలిగించిన ఈ కప్పగంతులు ఇప్పుడు కనిపించవు కప్పల్లాగా గంతులు పెట్టాయి కాబట్టి వీటికి కప్పగంతులని పేరు పెట్టారు గాని, నిజానికి ఎటువంటి కప్పా వీటిలాగా అన్నివైపులకూ ఎగరలేవు ఇవి కుప్పిగంతులూ కావు కుప్పించి - అంటే పైకి మాత్రం - ఎగిరితే అవి కుప్పిగంతులు "కుప్పించి ఎగసిన కుండలంబుల కాంతి గండభాగద్యుతి గడలు కొలుప" అనే పోతన భాగవతంలో శ్రీకృష్ణుడు చక్రం చేతబట్టి భీష్ముడి మీదికి దూకినప్పటి వర్ణన కప్పగంతులకు ఒక దిశ లేదు పెద్ద మంటలు రావు వెలుగు లేదు చిటపటలాడుతూ నానా దిక్కులకూ ఎగిసిపడేవి అందువల్ల ఎప్పుడూ చిర్రుబుర్రులాడుతూ, మాటలాడుతూ, తిట్టుకుంటూ, ఇతరులను తిడ్తూ మండిపడేవాళ్ళని కప్పగంతులని పిలిచేవాళ్ళు. అటువంటి వ్యక్తులు నేటికీ ఉన్నారుగాని వారిని పోల్చిచెప్పే కప్పగంతు లిప్పుడు లేవు వస్తువు లేకపోయినా మాట నిలచింది ఆ మాటతో వర్ణించే మనుష్య లక్షణం శాశ్వతంగా ఉంటుంది

**కంబళపురీషం:** పురీషం అంటే మలం, పెంట మల విసర్జన కంబళి మీద జరిగితే దాన్ని శుభ్రపరచటం ఇంచుమించు అసాధ్యం అసలే పెంట అది కడగటానికీ, తొలగించటానికీ ఒక పట్టాన వీలుగాని చోట ఉంది అసహ్యం భరించక తప్పదన్నమాట అందువల్ల ఎన్నటికీ తేలని దరిద్రపు వ్యవహారాన్ని కంబళపురీష మని వ్యవహరిస్తారు అది ఒక పట్టాన వదలదు- వదిలించుకోవాలన్నా సాధ్యం కాదు 'పిల్లపోయినా పీతివాసన పోలే' దన్నట్లు వదిలించుకున్నా మనుకున్నా వదలని వేధింపును, బాధను, పీడను కంబళపురీష మంటారు

**కంభం చెరువు:** పూర్వం కర్నూలు జిల్లాలో, ఇప్పుడు ప్రకాశం జిల్లాలో ఉన్న కంభంలో బ్రహ్మాండమైన చెరువు ఉంది ఆ చెరువు కింద పండే పంట మేలు రకం వర్షాకాలంలో గట్లు పొంగి వరద వస్తుంటుంది ఆ ధాటికి ఎన్ని గొడ్లు చస్తాయో, ఎంత పంట నష్టమవుతుందో లెక్కలేదు అందుకే 'కంభం చెరువు కింద పండిన పంటే లెక్కగాని చచ్చిన గొడ్లు లెక్కలోకి రావు' అనే సామెత పుట్టింది ఆ రాళ్ల సీమలో అంత గొప్ప జలాధారం ఉన్నందుకే సంతోషం విశాలమైన వస్తువులను కంభం చెరువుతో పోలుస్తారు 'కంభం చెరువంత పొట్ట' అని తిండిపోతును వర్ణిస్తారు కృష్ణాజిల్లాలోని 'కళ్ళేపల్లి' చెరువు కూడా అలాంటిదే గొడ్లచావు లెక్కలో విషయం కాదు గాని, ఇలా భిన్న స్థలాల్లో చాలా చెరువులున్నాయి - ఇలా పోలికతో చెప్పేవి

**కరటక దమనకులు:** "తోడుదొంగలు" అనే అర్థంలో ఈ మాటను తెలుగులో వాడ్తాం పంచతంత్రంలోని జంతు పాత్ర లివి నక్కలు చిన్నయసూరి నీతిచంద్రికలో ఇవి ఎంతో స్నేహంగా ఉన్న సంజీవకమనే ఎద్దునూ పింగళకమనే సింహాన్ని విడదీయగలుగుతాయి పైకి ఒకరు వద్దంటే రెండోవారు కాదంటూ నటించినా ఉభయులకూ లక్ష్య మొక్కటే - మిత్రభేదం సాధించటం మాయమాటల్తో చాపకిందనీరులాగా స్వప్రయోజన దృష్టి పెట్టుకొని స్నేహం చెరిచినవాళ్లు కరటక దమనకులు పైకి ఒకరొకరి మాటలకు పొంతన లేనట్లుంటుంది కాని, ఇద్దరూ కలసికట్టుగా సాధించదలచింది నెరవేర్చుకోగలుగుతారు అందువల్ల మోసగాళ్లను, అభిప్రాయభేదం కలిగించేవాళ్ళను, తోడుదొంగలనూ కరటక దమనకు లని వ్యవహరిస్తుంటాం

**కరణం దస్త్రం:** కరణీకం చేసే వ్యక్తి గ్రామంలోని ఆస్తిపాస్తుల వివరాలను లెక్కలు రాసి, ఆ పుస్తకాలను దస్త్రంలో కట్టి ఉంచడమనేది వృత్తిధర్మం వెనకటి కొక కరణంగారు చిన్నకొడుక్కి కూడా పెళ్లి చేశాడు కోడలు కాపరానికి వచ్చింది తాను పెద్దవాడవుతున్నాడు కాబట్టి 'గ్రామ లెక్కల' వివరాలన్నీ కుమారుడికి బోధించటం మొదలుపెట్టాడు పగలంతా ఈ దిక్కుమాలిన లెక్కలతో ఊపిరాడని కొడుకు రాత్రివేళకు అలసిపోయి తలగట్టుకొని పడుకోవటం మొదలుపెట్టాడు కొత్తకోడలు ఉసూరుమన్నది. కానీ చేయగలదేమీ లేదు. ఆ సమయంలో ఇంటి ఆవు పెయ్యదూడను కన్నది. దూడ చెంగనాలు పెడ్తూంటే మామగారు వినేట్లు కోడలన్నదట – 'అంత మిడిసిపాటు పనికిరాదు మామగారికి చెప్పి మెడలో కరణం దస్త్రం కట్టిస్తాను. జాగ్రత్త' అని! ఈ మాట విన్న కరణం కొడుక్కి విద్య నేర్పటాన్ని వాయిదా వేశాడని కథ. కదలటానికీ మెదలటానికీ వీలుగాకుండా కాళ్ళకు బందె మేసినట్లు, మోతబరువుకు నడుములు విరిగేట్లు, కూర్చున్న పాటున మెడ పట్టినట్లు వేధించే పనికి 'కరణం దస్త్రం' అనే అర్థం వచ్చింది దాన్ని మెడకే కట్టారుట, చిక్కు లెక్కలతో తల తిరిగిపోవటానికి. కరణం దస్త్రం మెడకు కట్టుకున్నట్లని అర్థం చెప్తారు భారమయినపని, బాధాకరమైన కార్యం, స్వాతంత్ర్యం లేని చాకిరీ మొదలయిన అర్థవిశేషాల్లో ఈ జాతీయాన్ని వాడుతుంటారు.

**కరతలామలకం:** కొందరు "హస్తామలకం" అని కూడా వ్యవహరిస్తారు. అమలకం అంటే ఉసిరికాయ చేతిలో ఉన్న ఉసిరికాయ అని ఈ మాటకు మామూలర్థం 'చాలా సులభమైన, స్పష్టమైన విషయం' అనే అర్థంలో ఈ పదబంధం ప్రయోగిస్తారు. నిమ్మకాయలాగానే ఉసిరికాయ కూడా చేతిలో బాగా ఇముడుతుంది కాబట్టి కరతలామలకం అంటే సులభం అంటారు కొందరు ఉసిరికాయలోపలి విత్తనం/గింజ కూడా స్పష్టంగా కనిపిస్తుంది కాబట్టి బాగా తెలిసిన విస్పష్టమయిన విషయమని చెప్పాలని కొంద రంటారు ఫలానా శాస్త్రం ఫలానా వ్యక్తికి కరతలామలకం అంటే అందులో ఆయన నిష్ణాతుడనీ, ఆ శాస్త్రమూలం (బీజం–విత్తనం–మూలకారణం) కూడా ఆయనకు తెలుసుననీ అర్థమన్నమాట నాకిది బాగా తెలుసు ననడానికి ఇది నాకు కరతలామలక మనటం సరిపోటి

**కర్రెల్ల కామక్క:** కామక్క చాలా పెద్దదయిపోయింది తిండి గడుస్తున్నదేమోగాని ఊరూపేరూ లేకుండా బతికింది చివరిదశలో తానేమైనా గొప్పపని చేసి పేరు సంపాదిద్దా మనుకొంది. అమె అమరావతిని పాలిస్తున్న వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారికి సమకాలికురాలట ఆ రాజు ఏటా తులాభారం తూగి, ఆ సొమ్మును దానధర్మాలకు వినియోగించేవాడు కామక్క తానూ అంత పని చేద్దామనుకొంది అయితే, ఆయన బంగారం తూగేవాడు. తనకంత శక్తి లేదు అందుకని ఆయన కోటలో బంగారం తులాభారం తూగినప్పుడు తాను పేటలో వంకాయలతో తూగింది. బంగారాన్ని అమ్ముకొని మాత్రమే తినగలరు – వంకాయలను వండుకొని తినవచ్చు ఆ దానం పట్టినవాళ్ళుకూడా ఈ దానం స్వీకరించారు!

ఫలితం ఆయన బంగారానికి వచ్చిన పేరే ఈమె వంకాయలకూ వచ్చింది. తన శక్తికి తగ్గట్లు అమె పేరు తెచ్చుకొంది గుంటూరు కృష్ణా జిల్లాల్లో ఆయన్ను స్మరించినట్లే ఈమెనూ తలచుకొంటారు – ఎగతాళికయినాసరే. ఆయన తాహతుకు బంగారమే దానం చేయాలి ఈమె శక్తికి వంకాయ లాపాటివే ఈవిధంగా ఆమె

పేరు ఆ ప్రాంతంలో ఒక జాతీయ మైపోయింది. ఎవరైనా పోటీకి అవతలివారు చేసిన పనిలాంటిదే చేయబోతే "ఆహా! కరెళ్ల కామక్క కూడా తులాభారం తూగిం"దని వేళాకోళం చేస్తారు. వెంకటాద్రినాయుడికి బంగారం పంచడం లెక్కలో విషయం కాకపోవచ్చుగానీ ఈమె వంకాయలు పంచడం ఖరీదైన త్యాగమే!

కలగూరగంప: కలవేసిన (అంటే రకరకాల) కూరల (కూరగాయల) గంప (బుట్ట)ను కలగూరగంప అంటారు కొందరు ఒకే కూరాకునో, ఒకే రకం కాయలనో, పళ్లనో అమ్ముతారు మరికొందరు రకరకాల ఆకులూ కూరలూ కాయలూ పళ్లూ అమ్ముతారు భిన్నజాతులకు చెందిన కాయగూరలున్న గంప కలగూరగంప. గంప లేకపోయినా కాయగూర ల్లేకపోయినా, రకరకాల వస్తువులుంటే కలగూరగంప అనే అంటారు పదబంధంలో మొదటవున్న 'కల' అన్నది 'కలిసేట్లు, కలగాపులగంగా ఉన్న' అనే అర్థంగల విశేషణపదం 'కలనేత' చీరెలో ఒకటికి మించిన రంగుల దారాలు కలిసివుంటాయి కలగాపులగంలో తెల్ల, పచ్చ ఖాద్యద్రవ్యాలు కలిసివుంటాయి అలాగే కలగూరగంపలో భిన్నభావాలు, వస్తువులు ఏవైనా కలిసి వుండవచ్చు కాయలూ గంపా మాత్రం ఖండితంగా ఉండనక్కరలేదు

కవలవాడి తలనొప్పి: కవల పిల్లలు అన్ని విధాలా ఒకరొకరిని పోలివుంటూ రనుకుంటాంగాని సయామీస్ కవలలు కూడా ఏదో చిన్నభేదం లేకుండా ఉండరు లోకదృష్టిలో కవల పిల్లల్లో ఒకరికి తలనొప్పివస్తే రెండోవారికీ వస్తుందనే నమ్మకముంది. తనకు ఆ బాధ రావటానికి కారణం లేకపోయినా రెండోవాడికి వచ్చినందువల్ల తనకు తప్పదనేది విశ్వాసం అంటే నిష్కారణంగా వచ్చిపడ్డ బాధ అన్నమాట స్నేహంవల్లనో, బంధుత్వంవల్లనో ఇతరుడు చేసిన తప్పువల్ల తాను కూడా బాధపడవలసివస్తే "నా తప్పేం లేదండి ఇదంతా కవలవాడి తలనొప్పి" అని విచారపడటం కద్దు. "పృష్ఠతాడనా ద్దంతభంగః" అన్నట్లు, ముడ్డిమీద తన్నితే మూతిపళ్ళు రాలినట్లు, తోటివాడో సాటివాడో చేసిన తప్పుకు తాను ప్రతిఫలం అనుభవించవలసివస్తే అది కవలవాడి తలనొప్పి కిందలెక్క

కశ్శన్న: 'కశ్చన' అనే సంస్కృత పదానికి "ఎవడో ఒకడు" అని అర్థం ఆ మాటే తెలుగువారినోట 'కశ్శన్న' గా మారిందని కొందరంటారు మరి కొందరు పురాణార్థాలు చెప్తారు పరశురాముడు రాజులను చంపి తాను సంపాదించిన భూ భాగ మంతటినీ కశ్యప మహర్షికి దాన మిచ్చాడు ఆ 'కశ్యపన్న' కాలక్రమాన కశ్శన్నగా మారాడంటారు అందుకో ఉపపత్తి చెప్తారు ". గోత్రస్య " అని 'ఫలానా గోత్రానికి చెందిన నేను చేస్తున్న పూజ' అని దేవుడికి చెప్పుకుంటారు – ఆయన రికార్డులో నమోదయితే పుణ్యం వస్తుందని సమయానికి స్ఫురించకపోయినా, దత్తతవంటివాటివల్లగాని అనాథగా బతకటంవల్లగాని స్పష్టంగా తెలియకపోయినా, 'కాశ్యపగోత్రస్య' అని చెప్పుకోవచ్చు కశ్యపుడు సంపాదించింది కాబట్టి ఈ భూమికి 'కాశ్యపి' అనే పేరు వచ్చిందట 'ఈ భూ మండలంలోనే పుట్టి పెరిగిన నేను' అని అస్పష్టంగా నయినా తన ప్రవర చెప్పుకోవలసిన వ్యక్తి కశ్యపన్న ఉరఫ్ కశ్యన్న/కశ్శన్న అని వివరించేవాళ్ళున్నారు అంటే, ఫలానా అని ఖండితంగా చెప్పడానికి వీలులేని వ్యక్తి అన్న మాట చెప్పుకోదగిన ఊరుగాని పేరుగాని లేని వ్యక్తిని గురించి ఈసడింపుగా మాట్లాడేటప్పుడు 'ఎవడయితేనేం ఎవడో ఒక కశ్శన్న వాడు నా సొమ్ము తీసుకుని ఎగేశాడయ్యా!' అని విదిలించి

మాట్లాడ్తారు కళ్ళన్న ఒక అభాగ్యుడు, ఒక అనామకుడు అడ్రసులేని మనిషి ఉన్నా మనం గుర్తించని మనిషి మనల్ని విసిగించే వ్యక్తి మనకు సాటిగానివాడు తక్కువవాడు మనం అసహ్యించుకొనేవాడు!

**కాకదంత పరీక్ష:** కాకికి పళ్ళున్నాయో లేదో ఒక పెద్ద మనిషి తేల్చుకొని లెక్కపెట్టా మనుకున్నాడట పక్షులకు పళ్ళుంటాయో లేదో కూడా అతగాడికి తెలియదు పైపెచ్చు అనుమానం మనిషి లేకపోతే ఫరవాలేదుగాని ఉంటే ఎన్ని ఉన్నాయో తేల్చుకోవడం మంచిదని జాగ్రత్తగా పరీక్షించా డంటారు లోకజ్ఞానం లేని వ్యక్తి అన్నీ తెలుసుకోవాలనే ఆరాటంతో హైరానా పడుతుంటే కాకదంత పరీక్ష చేస్తున్నా డంటారు పదిమందీ లేవన్నా ఉండకపోతాయా అన్న అనుమానంతో శ్రమించటాన్ని కూడా 'కాకదంత పరీక్ష' అంటారు అంటే వృధా ప్రయాస పడట మన్నమాట.

**కాకతాళీయం:** కాకిమీద పుట్టి, బహుళవ్యాప్తిలో ఉన్న జాతీయాల్లో ఇదొకటి ఒకసారి ఓ కాకి చెట్టుమీద వాలింది – పరిపక్వమైన ఒక పండు మీద వాలింది ఆ పండు రాలిపడ్డది నిజానికి కాకి వాలకపోయినా ఆ పండు రాలిపోయేదే ఆ పండు రాలేటప్పుడు కాకి వాలాలని కూడా ఏమీ లేదు అది వాలటం, ఇది రాలటం అనుకోకుండా ఒకే సమయంలో జరిగిన పనులు అలా జరుగుతుందని ముందుగా ఒకరు ఊహించనూ లేదు ఒకదానితో మరొకదానికి ఎలాటి సంబంధమూ లేకపోయినా, ఏదో పరస్పర సంబంధమున్న ట్లనిపించే సంఘటన/దుర్ఘటన కాకతాళీయంగా జరిగిందంటారు అనుకోకుండా జరిగిన పనిని కాకతాళీయ మనటం పరిపాటి కాకమంటే కాకి, తాళమంటే తాటిచెట్టు

**కాటికాపరి యేడ్పు:** పెళ్ళికన్నా సంతోషప్రదమైనదీ చావుకన్నా దుర్భరమైనదీ లేదు–ఉండదు (వల్ల)కాడు దగ్గర కాపరిగా ఉండే వ్యక్తి నిత్యం చావులు చూస్తుంటాడు గుండె రాయి చేసుకొని బతకవలసినవాడు కాబట్టి, చచ్చిన ప్రతి మానవుడి కోసం విచారపడలేడు అలవాటై అతడు ఎవరికోసమూ ఏడవలేడు అయినా, మానవ శరీర ధర్మంగా ఏడ్పు సహజం అయితే, శవ సంస్కారమే అతడి వృత్తి ధర్మమూ జీవనాధారమూ కాబట్టి అందుకు అవకాశం లేనప్పుడు ఏడ్చితీరుతాడు తప్పదు లోకమంతా చచ్చిన వాళ్ళను తలంచుకొని ఏడిస్తే, అతగాడు చావులు లేకపోతే ఏడుస్తాడు– రోగులూ రోగాలూ లేవని వైద్యులూ ఔషధవిక్రేతలూ ఏడ్చినట్లు లోకదృష్టిలో అది అసహజమైనా అతడి బతుకుతెరువు దృష్టిలో అది అత్యంత సహజం ఈ కారణంగా 'కాటికాపరి యేడ్పం'టే లోకం సుఖంగా బతుకుతున్నందుకు ఏడ్చే ఏడ్పనే అర్థం వచ్చింది అది దొంగ ఏడ్పుకాదు తన కష్టాలను తలచుకొని ఏడ్చే ఏడ్పు లోకం కోసం ఏడ్చేదీకాదు– లోకబాధలకూ స్పందించేదీ కాదు కేవలం స్వప్రయోజన పరాయణం

**కామారపు జీడి:** జీడి ఎక్కడున్నా ఒకటే స్వభావం దానిది అంటుకుంటే వదిలిపెట్టదు కాకపోతే కామారపు జీడి మరింత ప్రశస్తం కాబట్టి గట్టి పట్టే పడ్తుంది ఒక పట్టాన వదలదు – బహుశా కల్తీ లేనందువల్ల కావచ్చు ఏ మనిషైనా వెంటపడి వేధిస్తూ వదిలి పెట్టకుండా బాధిస్తుంటే "కామారపు జీడిలా తగులుకొన్నాడు, ఒక పట్టాన ఎదిలెట్టు లేడని" విసుక్కోవటం కద్దు

కాలనేమి జపం: చేపలను పట్టడానికి నీళ్ళలో నిశ్చలంగా నిలిచి అవి దొరికినప్పుడు తటాలున పట్టే కొంగ జపాన్ని గురించి మనం వినేవుంటాం ఆ విధంగా మాటువేసి ఎదురుచూసి ఆహారం సంపాదించటాన్ని కొంగజపం, బక జపం, బక ధ్యానమని కూడా పిలుస్తారు. ఆహార సంపాదనకు ప్రకృతి నిర్ణయించిన మార్గమది కొంగకు. అది స్వాభావికం అస్వాభావికంగా తనతో ప్రత్యక్ష సంబంధంలేని వ్యక్తిని చంపడానికి ఎదురుచూస్తూ దొంగవేషంలో జపతపాలు చేసినవాడు కాలనేమి సీతారాములను మాయలేడి వేషంలో మోసగించిన మారీచుడి కితడు పుత్రరత్నం అసలు మోసగా డనటానికి "వాడు మారీచుడు" అనే పేరు సంపాదించినవాడు తండ్రి అతడి కొడుకు రామరావణ యుద్ధం జరుగుతున్నప్పటిక్కూడా బతికేవున్నాడు రావణుడి ప్రోద్బలంవల్ల హనుమంతుణ్ణి మోసగించి చంపడానికి ప్రయత్నించాడు

రావణాసురుడి కొడుకు ఇంద్రజిత్తు ధాటికి లక్ష్మణుడు మూర్ఛపోతే హనుమంతుడు సంజీవ పర్వతాన్ని పెకలించుకొని వచ్చి మూర్ఛ తేర్చాడని చాలామందికి తెలుసు. దరిమిలా రామ రావణులకు యుద్ధం జరుగుతున్నప్పుడు రావణుడి శక్తివల్ల మరోసారి ఒళ్ళు హూనమై లక్ష్మణాదులు మూర్ఛపోయారు సూర్యోదయంలోగా ద్రోణగిరి మీది విశల్యకరణి అనే ఔషధాన్ని తెస్తేతప్ప ప్రాణప్రమాదం తప్పదని జాంబవంతుడు చెప్తే మరోసారి హనుమంతుడు ఆ పని చేయడానికి సిద్ధమైనాడు ఈ వార్త వేగులద్వారా రావణుడికి తెలుస్తుంది వెంటనే అంతటి రాక్షసుడూ చంద్రహాసం చేతబట్టి స్వయంగా కాలనేమి ఇంటికి వెళ్ళి, ద్రోణగిరి మార్గంలో మునివేషం ధరించి ఆశ్రమం నిర్మించుకొని అంజనేయుణ్ణి ఆకర్షించి, దారి తప్పించి ఆ దాపుల ఉన్న సరస్సులో స్నాన మాడేట్లు చేయమంటాడు రావణుడు పూర్వం తన తండ్రి చెప్పినట్లే కాలనేమికూడా ధర్మపన్నాలు చెప్పబోతే, నరికి కుప్పలు వేస్తానని బెదరించి అంగీకరింపజేస్తాడు రాక్షసరాజు.

ద్రోణగిరికి బయల్దేరిన హనుమంతుడు మార్గ మధ్యంలో దప్పిక తీర్చుకోవడానికి నీటికోసం చూస్తుంటే కాలనేమి మహర్షివేషంలో జపంచేస్తూ కనిపిస్తాడు అంజనేయుడు నమస్కరించి దారి చెప్పమంటే, తన శిష్యులద్వారా దగ్గరి సరస్సులో కడుపునిండా నీళ్ళు తాగితే ఎక్కడలేని శక్తివచ్చి కార్యసాధన సులభ మవుతుందని నమ్మిస్తాడు ఆ కొలనులో ధాన్యమాలిని అనే శాపగ్రస్తురాలయిన అప్సరస మొసలి రూపంలో ఉంటుంది నీటిలో దిగీ దిగగానే హనుమంతుణ్ణి పట్టుకొంటుంది బ్రహ్మరాక్షసులనే లెక్కించనివాడు మొసలిని చంపటమేం లెక్క? అంతకుముందు దేవేంద్రాదులు కూడా ఆమెకు భయపడి ఆ కొలను చాయలకు రాలేదుగాని అంజనేయుడు నిర్భయంగా చంపిపారేయగలిగాడు ఆమెకి శాపవిమోచన మయింది. అసలు రూపంలో ఆమె కృతజ్ఞత చెప్పుకొని, కాలనేమి దురాలోచన వివరించి, ద్రోణగిరికి మార్గం చెప్పి అదృశ్యమవుతుంది హనుమంతుడు కాలనేమి ఆశ్రమానికి వస్తాడు

నీకు నీటిదారికే చోటు చెప్పినందుకు 'గురుదక్షిణ' ఇమ్మంటాడు కాలనేమి దానికేం భాగ్యమని చావచితకతన్ని నరకలోకానికి పంపుతాడు ఆ తరువాత ద్రోణగిరి కాపలావాళ్లను ఎలా జయించి ద్రోణగిరిని పెకలించుకొని బయలుదేరాడో, రామకార్యం ఎలా నెరవేర్చాడో రామాయణం వర్ణిస్తుంది ఆ వివరాలు మన కక్కరలేదు పంచతంత్రం/నీతి చంద్రికలో కనిపించే 'రుద్రాక్ష పిల్లి'లా మాయమాటలు చెప్పిన కాలనేమి, కొంగజపం

చేస్తూ నమ్మించదలచిన కాలనేమి తన కోరిక నెరవేర్చుకోలేకపోయాడు. మాయవేషంలో మోసగించదలచి దొంగజపం చేసేవాళ్లని కాలనేమిగా డంటారు. లోకవంచనకోసం చేసే తప్పుడు పూజా పురస్కారాలనూ జపతపాలనూ కాలనేమి జపమంటారు. ఆషాఢభూతి సొంతవేషంలోనే ఉండి మోసం చేయగలిగితే, కాలనేమి దొంగవేషం వేసి సాధించలేకపోగా చచ్చిపూరుకున్నాడు అదీ భేదం

కాలుగాలిన పిల్లి: పనీపాటా లేకుండా ఊరికే అటూ ఇటూ పక్కలెగరేస్తూ తిరిగే వ్యక్తిని కాలుగాలిన పిల్లితో పోలుస్తుంటారు సొంత పని అంటూ లేదు. కాబట్టి అనవసర ప్రసంగాలు చేస్తూ వింటూ అటుమాట ఇటుచెప్పి చిచ్చు పెట్టే బాపతన్నమాట అన్నదమ్ములు నలుగురూ ఉమ్మడిన ఒక పిల్లిని పెంచి, తలా ఒక కాలు పంచుకున్నారని ఓ కట్టుకథ తన కాలుకు దెబ్బ తగిల్తే అందులో ఒకడు దానికి నూనె రాసి కట్టుకడితే, దానికి నిప్పంటుకొని తక్కిన ముగ్గురి దూది మూటలను కూడా తగలబెట్టిందని ఆ కథ చెప్తుంది కాలు సరిగా లేదు కాబట్టి దానికే నిప్పంటుకున్నా భయంతో పరిగెత్తేటప్పుడు తక్కిన మూడు కాళ్ళూ సాయపడ్డందువల్లనే పరశురామ ప్రీతి జరిగిందనీ, అందువల్ల నాలుగో కాలువాడి తప్పేమీ లేదనీ తగాదాపడ్డ సోదరులను ధర్మాసనం వారు సమాధానపరిచారనీ అందులో ఉంది. పిల్లి తప్పుకూడా లేదు కాళ్ళన్నీ సరిగా ఉంటే నిశ్శబ్దంగా తిరుగుతుండేది ఒక కాలు మంటలెత్తేసరికి తోచక అటూ ఇటూ పరిగెత్తింది. ఒంటి కాలితో పరుగుతీయ్యలేదు కాబట్టి తక్కిన కాళ్ళు సాయపడ్డాయి. అందులోనూ తప్పులేదు. ఎటొచ్చీ పంపకంలోనే తప్పుంది. పనిలేని సోమరి పదిమందితో కబుర్లాడక తప్పదు. విన్నమాటలను నలుగురికీ చెప్పకా తప్పదు పెదవి దాటితే పృథివిదాటే మాటలదీ తప్పులేదు. ఒకరి అభిప్రాయాలను మరొకరికి తెలియబరచటంలో మాటల తప్పూ లేదు. వాటివల్ల మనస్పర్థలు పెరగటంలో విడ్డూరమూ లేదు అందువల్ల తప్పంతా అటువంటి వ్యక్తికి పని లేకపోవటంలోనే ఉంది పని లేనివాడు కాబట్టి పనికోసమైనా తిరక్కా తప్పదు ఇలాంటి పరస్పర విరుద్ధ కారణాలవల్ల పనిమాని తిరిగే వ్యక్తిని కాలుగాలిన పిల్లితో– అంటే ఇంటికి చిచ్చుపెట్టే పిల్లితో–పోలుస్తుంటారు వ్యవహారంలో

*కావేరి గుఱ్ఱం:* 'కావేరి గుఱ్ఱాలు కాలుకొద్దీ పరిగెత్తుతాయి' అనేది సామెత. ఒకప్పుడు కావేరీ నదీ ప్రాంతంలో మంచి గుఱ్ఱాలు దొరికేవేమో! అరేబియా గుఱ్ఱాలు, ఆజానేయపారశీకాశ్వాలు, జవనాశ్వాలూ గ్రంథాల్లో కవుల వర్ణనల్లో జాతిగుఱ్ఱాలని చదువుతాం కావేరి గుఱ్ఱాల ప్రశస్తి వాడుకలోనే గాని కావ్యాల్లో కనిపించదు యుద్ధంలోగాని, పందెంలోగాని మహావేగంగా పరిగెత్తే గుఱ్ఱాలను కావేరిగుఱ్ఱా లంటారు. ఈ లక్షణాలను మనుషులకు అనువర్తించి – పారుబోతులను, పిరికిపందలను ఈ పేరుతో పిలుస్తుంటారు. బహుశా తమిళులమీద తెలుగువాళ్లకున్న సద్భావాన్ని పురస్కరించుకొని ఈ మాట పుట్టి వుండవచ్చు 'తన గీతి అరవజాతిని పాటకులనుగా దిద్ది వర్ధిల్లిన తెలుగువాణి' లాంటి పదప్రయోగాలు సృష్టించటంలో అబ్బురం లేదు. ఏమయితేనేం, భయపడి వడిగా పారిపొయ్యేవాళ్లకు కావేరి గుఱ్ఱాలనే బిరుదు లభిస్తుంది తెలుగులో. అంతేగాని పందెం గుఱ్ఱాలకు, పరుగువీరులకూ కాదు.

కీలుబొమ్మ: తోలు బొమ్మలను రంగు రంగులుగానో, రంగుల్లేకుండానో ముక్కలు ముక్కలుగా చేస్తారు అంచుల్లో రంధ్రాలు చేసి అతుకుతారు తరవాత శరీర

ప్రమాణాలనుబట్టి ముక్కలుగా నరికిన కొయ్యలకు తాపడం చేసి కీళ్ళ దగ్గర జారుముడి వేస్తారు– బొమ్మల శరీర భాగాలు సులభంగా కదలటానికి వీలుగా. కీళ్ళ దగ్గర దారాలకు మరికొన్ని పొడవాటి దారాలు కట్టి వాటిని వేళ్ళతో పట్టిన కళాకారులు తెర వెనుక నిలబడి ఆడిస్తారు. అతడి శక్తినిబట్టి ఆయా బొమ్మల భాగాలు ఎలా కావాలంటే అలా కదులుతాయి. ఎగురుతాయి. దూకుతాయి. ఆడతాయి. ఆడించేవాడి నేర్పు మీద ఆధారపడి బొమ్మ లాడుతుంటాయి. బొమ్మలకు వ్యక్తిత్వం లేదు, స్వాతంత్ర్యం లేదు అంతా ఆడించేవాడి దయ, ఇష్టం, సరదా అవసరం. ఈ లక్షణాలను పురస్కరించుకొని ఇతరుల అభిప్రాయాల కనుగుణంగా, స్వబుద్ధి ప్రయత్నాలు లేకుండా వ్యవహరించేవారిని కీలుబొమ్మలని ఎద్దేవా చేయటం అలవాటయింది. చివరికి కీలుబొమ్మ ప్రభుత్వాలు కూడా సంక్రమించాయి

**కుంభకోణం:** మోసమనే అర్థంలో కుంభకోణ మనేమాట తెలుగులోనేకాక మొత్తం దక్షిణ భారతంలో స్థిరపడిపోయింది అది ఊరిపేరుమాత్రం తమిళనాడులో ఉంది ఆంగ్లేయులు తొలి తరంలో పాఠశాలలు స్థాపించిన ఊరది ఆంగ్లవిద్య భారతీయులను మోసగించి తమ సంస్కృతినుంచి దూరం చేయటానికి వచ్చిందని నాటినుంచి నేటిదాకా ఒక విశ్వాసముంది ఆ విద్యవల్ల ఇంగ్లీషువారుండగా ఎక్కువ బాగుపడ్డవారు తమిళులే అయినా మోసమనే భావం ఆ ఊరుపేరిట అక్కడకూడా నిలిచిపోయింది. పెద్ద ఎత్తు మోసాన్నే కుంభకోణ మంటారు

**కుక్క బలుపు:** పోషణ బాగుంటే వ్యక్తులకుగాని, జంతువులకు గాని, మొక్కలకుగాని బలుపువస్తుంది అందులో వింతేమీ లేదు కానీ కుక్క బలిసే పద్ధతే జనాన్ని ఆకర్షించి, ఈ మాట పుట్టించింది ఎంత తక్కువ ఆహారంతోనయినా బతకగల జీవుల్లో కుక్క ఒకటి ఒక్క కడి ఎక్కువ తిన్నప్పుడు అది వెంటనే బలిసినట్లు కనిపిస్తుంది – వేటకుక్క కాకపోతే ఆ జాతి కుక్కమాత్రం ఎంత పెట్టినా ఎంత తిన్నా ఎండుకపోయినట్లే ఉంటుంది కుండలో తలపెట్టి గతికిన కుక్క మెడదగ్గరనుంచి బలిసిపోతుంది అందువల్ల తిండి పూర్తయిన తరవాత మెడ లాక్కోలేక అటూఇటూ ఏ గోడకో వేసి కొట్టి కుండను పగలగొట్టుంది మూతి దగ్గర గట్టిగా ఉండే వలయం మాత్రం కంఠాభరణంలాగా కంటెలాగా నిలిచిపోతుంది. అప్పటి కుక్క దర్జా, ఠీవీ చెప్పతరం కాదు అది జాతీయానికి ముఖ్యంకాదు కానీ నిముషాలమీద మెడనుంచి పొట్టదాకా బలిసిపోవటమే లోకదృష్టిలో విడ్డూరమై ఈ మాట పుట్టింది నిన్నమొన్నటిదాకా దరిద్రమనుభవించి దొంగతనంవల్లనో, ఏ వారసత్వం వల్లనో, ముదనష్టపు ఆస్తి వచ్చి పడ్డందువల్లనో, అనుకోని పరిస్థితుల్లో వ్యాపారం అధిక లాభార్జన చేసినందువల్లనో తెల్లవారేసరికి ఐశ్వర్యవంతు లయినవారున్నారు వారిది కుక్కబలు పంటారు

**కుక్కచావు:** నీచంగా బతికినా, చచ్చినా, ఒకరిమీద ఆధారపడి (కుక్కలా) వారి సేవలు చేస్తూ హీనంగా బతికినా 'కుక్కచావు చస్తున్నా'మని చెప్పకోవటం కద్దు దిక్కులేని చావు అనే అర్థంలో కూడా ఈ జాతీయం వాడుతుంటారు పిచ్చి కుక్క కరిచిన మనిషి నీళ్ళంటే భయపడటంతో కుక్కచావు మొదలవుతుంది కుక్క పిచ్చిదో మంచిదో తెలుసుకోవటానికి నీళ్ళు బ్రహ్మాండంగా పనికివస్తాయి అందుకే పూర్వం బాటసారులు నీటిపాత్ర, కర్ర లేకుండా పొరుగూరు పోగూడదనేవారు మంచికుక్కను

అదిలించటానికి చేతికర్ర ఉపయోగపడితే, నీళ్ళు దాని మొహాన చిలకరించి అది పిచ్చిదో కాదో తెల్సుకోవచ్చు మంచిదయితే భయపడక మీదిమీదికి వస్తుంది. పిచ్చిదయితే తిరిగి చూడకుండా పారిపోతుంది పాతకాలంలో పిచ్చికుక్క కాటుకు మందే లేదు మంచి కుక్క కరిస్తే కరిచిన చోట చెప్పుదెబ్బ కొడ్తే ప్రమాదం లేదని నమ్మేవాళ్ళు అందుకే 'కుక్కకాటుకు చెప్పుదెబ్బ' అనే సామెత పుట్టింది పిచ్చి కుక్క కరిచిన వ్యక్తి నీటికి భయపడటం తొలిదశ అయితే, కుక్కలా అరవటం, కరవటం, చివరికి చేతులూ, కాళ్ళు నేలకానించి పాకటం చివరిదశ ఇప్పుడు ముందు జాగ్రత్తకు ఇంజెక్షన్లు వచ్చాయిగాని, రోగం (దానిపేరు రాబిస్) వచ్చిన తరువాత మనిషి దక్కటం కష్టం ఆ వ్యక్తి చొంగ తగిలినా ఇతరులకు అదే వ్యాధి సంక్రమిస్తుంది దానికి విరుగుడు లేదు అందువల్ల మార్గాంతరంలేని హీనస్థితిలో, బతకడానికి గత్యంతరంలేని దుర్భరస్థితిలో బతికినా చచ్చినదానితో సమాన మనుకున్నప్పుడు కుక్కచావు చస్తున్నా డంటారు ఆ బాధలనుంచి విముక్తి లేదనే నమ్మకం కుదిరినప్పుడు అది కుక్క చావవుతుంది దిక్కులేని చావవుతుంది

**కుక్కతోక:** 'కుక్కతోక వంకర' అని చిన్న తరగతుల్లో బోధిస్తారు – అపాటి పిల్లలు గమనించలేదని! అసలు ఏ తోక అయినాసరే చిన్నపిల్లలకు ఆకర్షకంగానే ఉంటుంది 'అతడి బుద్ధి వక్రం' అనడానికి 'కుక్కతోకలాంటి బుద్ధి' అనటం మామూలు ప్రయత్నపూర్వకంగా సరిచేసినాసరే మళ్లీ మొదటిరూపానికి వచ్చే కుక్కతోకను వక్రతకు చిహ్నంగా గ్రహిస్తాం ఈ తోక శాస్త్రజ్ఞులను మరో కారణంగా ఆకర్షించింది అందువల్ల 'ఛిన్నపుచ్ఛేతు శ్వత్వ వ్యవహారవత్' అనే పరిభాషను ఏర్పాటు చేసుకున్నారు – వ్యాకరణంలో 'తోకతెగినా కుక్కకుక్కేనన్నట్లు' అనేది ఆ మాటలకర్థం ప్రపంచంలో అన్ని జంతువులకూ తోకలుండగా కుక్కతోకే ఎందుకు ప్రస్తావనకు వచ్చిందో తెలీదు. 'కుక్కతోకబట్టి గోదావరి ఈదడం' అనే నానుడి కూడా ఉంది తెలుగులో – పనికిరాని వస్తువును సాధనంగా వాడటం నిష్ప్రయోజనకరమనే అర్థంలో కొందరు 'గేదెతోకబట్టి' అనే పాఠాంతరం చెప్తుంటారుగాని వేమన పుణ్యమా అని కుక్కతోకకే వాడుక ఎక్కువ.

**కుచేలుడు:** శ్రీ కృష్ణుడి సహాధ్యాయిగా సందీపని దగ్గర చదువుకొన్న పేదవాడు కుచేలుడు కుచేలుడంటేనే చింపిరిగుడ్డలవాడు పేరులోనే ఆయన దరిద్రం అన్వర్థంగా వినిపిస్తుంది దారిద్ర్యానికీ అతి సంతానానికీ ప్రపంచమంతటా ఏదో విడదీయరాని సంబంధముంది పేద దేశాల్లో జన మెక్కువ ధనిక దేశాల్లో ప్రజలు తక్కువ జనసంఖ్య వల్ల పేదరికం పెరగటం సమంజస మనిపిస్తుందిగాని పిల్ల లెక్కువ కావటం విడ్డూరమే దరిద్రుడనే అర్థంలో మాత్రమే కుచేలుడు అతడు కుచేలుడంటే అధిక సంతానవంతుడనే అర్థం కుచేల శబ్దంకన్నా "కుచేల సంతాన" మనే పదబంధానికే వాడుక ఎక్కువ

**కుటుంబరావు:** కుచేలుడనే పేరుకన్నా ఇటీవలి తెలుగు సాహిత్యంలో కుటుంబరావనే మాటకే వ్యాప్తి ఎక్కువ అనేక కథల్లో, కథానికల్లో, నాటకాల్లో,నవలల్లో సంతానవంతుడై పేదరికంలో బతుకు వెళ్ళదీస్తున్న మధ్యతరగతి చిరుద్యోగికి కుటుంబరావనే పేరు తగిలిస్తున్నారు రచయితలు సంతానసంఖ్యకన్నా, అతడు కట్టే చీకిపోయిన గుడ్డలకన్నా అతడికున్న కుటుంబ సమస్యలే ప్రధానమని భావించారేమోగాని ఎందరో రచయితలు

ఈ మేరకు అభిమానించి వాడుతున్నారు కుచేలుడు ఏ భారతీయుడయినా కావచ్చు గాని కుటుంబరావు మాత్రం పదహారణాల - ఇప్పటి లెక్కన నూరుపైసల - తెలుగువాడు ఈయనకూ పరంధామయ్యకూ చాలా పోలికలున్నాయి కట్టుబొట్టు వగైరాల్లో భేదం వయసులో మాత్రం పరంధామయ్యకు ఉద్యోగ విరమణ తనకు దగ్గర్లో ఉంటే, కుటుంబరావు ఉద్యోగంలో చేరుతూ మానుతూ ఉంటాడు సాధారణంగా గుడ్డలకొట్లలోనో చిన్న దుకాణాల్లోనో లెక్కలు రాసిపెడ్తుంటాడు అనిశ్చిత జీవనం గడుపుతుంటాడు పరంధామయ్య సీనియర్ గుమాస్తాగా నయినా ఉంటాడు–పొద్దు గుమాస్తా కాకపోతే కుటుంబరావు మొదటిమెట్టు నుంచే జారుతూ మళ్ళీ ఎక్కుతూ ఉంటాడు అది ప్రధాన భేదం ఆ యిద్దరి మధ్యా

**కుండమార్పిడి:** ఈ జాతీయంలోని విడి మాటలకు కుండలను మార్చుకోవటమనే అర్థంగాని, మొత్తం సమాసానికున్న అర్థం వేరు కుండ శబ్దాని కిక్కడ స్త్రీయని అర్థం ఒక కుటుంబంలోని సోదరీసోదరులు మరో కుటుంబంలోని సోదరసోదరీమణులను పెళ్ళాడితే అది కుండమార్పిడి అంటారు సాధారణంగా మేనరికం పెళ్ళిళ్ళలో ఎదురు మేనరికం కూడా పాటిస్తే ఈ మాటతో ఆ మార్పిడిని వర్ణిస్తారు ఈ రెండు పద్ధతులూ కేవలం దక్షిణ భారతంలోనే ఆచారంగానో, సంప్రదాయంగానో ఉన్నాయిగాని ఉత్తర హిందూస్థానంలో ఇవి నిషిద్ధాలు అక్కడ అన్న చనిపోతే వదినను పెండ్లాడక తప్పదనే ఆచారముంది అది తప్పుకాదుగాని, దక్షిణాది సంప్రదాయం అనాచారమని వారు భావిస్తారు మేనరికంతో నిమిత్తంలేని సందర్భాల్లో కూడా ఇప్పుడీ పద్ధతి తెలుగుదేశంలో అమల్లోకి వస్తున్నది

**కుండల్లో గుర్రాలు:** ఇంట్లో కూచుని తాను కదలక ఇతరులకు పనులు పురమాయించి తొందరపెడ్తుంటే కుండల్లో గుర్రాలు తోలుతున్నా డంటారు గుర్రాలను తోలేదీ దౌడు తీయించేదీ ఊరిబయట వాగుల మీదినుంచీ వంతెనల మీది నుంచీ దూకించి యుద్ధాశ్వాలకు తరిఫీదు ఇస్తుంటారు రెడ్డి రాజుల కాలంలో ఒక యోధుడు "హరి దాటించె పురోపకంఠమున వాహ్యాళి ప్రదేశంబునం, దిరువైనాలుగు మూళ్లు" అని అదో రికార్డులా శ్రీనాథుడు వర్ణించాడు పన్నెండు బారలు - దాదాపు అన్ని మీటర్లు - గుర్రాన్ని దూకించా డన్నాడు అది వీరకృత్యం చేతావాతాగాని అసమర్థుడు వంటయింట్లో చేరి తొందరపెడ్తుంటే కుండల్లో (వంటింటి కుండల్లో) గుర్రాలు దూకిస్తున్నాడని/ తోలుతున్నాడనీ ఆక్షేపిస్తుంటారు ఊరికే తొందరపెట్టడాన్ని ఈ మాటతో వర్ణిస్తారు హడావిడి మనిషి, అసమర్థుడు, వంటయింట్లో మాత్రమే పరాక్రమం ప్రదర్శించగల వ్యక్తి అనే అర్థాల్లో "ఆయనండీ! కుండల్లో గుర్రాలు తోలగల"డని వెక్కిరిస్తుంటారు

**కుండోదరుడు:** ఈ పేరుగల రాక్షసులు కనీసం పురాణాని కొకరయినా దర్శనమిస్తారు ఉదరం అంటే పొట్ట కుండ శబ్దానికి సంస్కృతంలో మన 'గుండ' మనే అర్థం తెలుగు మాట ఆ సంస్కృత పదంనుంచే పుట్టింది 'యజ్ఞకుండం' వంటిమాటల్లో అని వినిపిస్తుంది ఎప్పుడూ ఆకలితో నకనకలాడుతూ ఎందరినయినా పీక్కొని తినగలవాడన్న అర్థంలో కుండోదరుడనే మాట పుట్టింది అయితే, తెలుగు 'కుండ'కూ దీనికీ ధ్వని సామ్యం ఉన్నందువల్ల 'బానకడుపు రాక్షసు'డనే అర్థం మనవాళ్లు

సరిపెట్టుకున్నారు ఈ తిండిని లంచం తినటంతో సమానమని భావించారు ఫలితంలో లంచగొండిని (తిండిపోతునుకాదు) కుండోదరు డనటం అలవాటయింది 'అమ్మో! ఆయన కుండోదరుడండి!' అని అవినీతిపరుడయిన ఉద్యోగిని గురించి మాట్లాడటం మొదలయిం దెప్పుడో పురాణాల్లోని కుండోదరుడు రాక్షసుడు, మనవాడుకలోని కుండోదరుడు భక్షకుడు అంతే భేదం

**కూనలమ్మ పదాలు:** కూనలమ్మ మామూలు స్త్రీ మాత్రమో, ఏ పోలేరమ్మలాంటి దేవతో చెప్పలేం ఆమె పేరిటనే 'కూనిరాగాలు' అనే మాట పుట్టిం దంటారు అసలవి 'కూన' రాగాలనీ, అంటే – కొద్దికొద్దిగా మొదలుపెట్టిన చిన్న (కూన) రాగాలనీ కొందరి వివరణ పదాలంటే ఇక్కడ పాటలని అర్థం కొందరు పదాలకు బదులు సంగీత మంటారు "కవితారసపు జల్లు, ఖడ్గాల ఘలుఘల్లు, కరణాలకే చెల్లు, ఓ కూనలమ్మా!"లాంటి పాటలు కొన్ని ఏనాటినుంచో వాడుకలో ఉన్నాయి ఈ మకుటంతోనే ఆరుద్ర చాలా పాటలు అదే చందస్సులో రాశాడు "కూనలమ్మ పదాలు వింటే పుణ్యం లేదు, వినకపోతే పాపంలేదు" అనే సామెత కూడా తెలుగులో పుట్టింది దీన్నిబట్టి ఈ పాటలు దేవతాపరమైనవి కావని నమ్మవచ్చు. వీటినే "లిల్లాయిపదాలు"అని కూడా పిలుస్తారు తోచీతోచని పిచ్చిపాటలు పాడుతుంటే కూనలమ్మ పదాలు పాడుతున్నారంటారు ప్రయోజనం లేని పిచ్చిపాటలను కూనలమ్మ పదాలంటారు

**కూపస్థమండూకం:** కూపం అంటే బావి మండూకం అంటే కప్ప బావిలోనే పుట్టి పెరిగి రాలిపోయే కప్పకు ఆ బావి తప్ప మరేమీ తెలిసే అవకాశం లేదు కాబట్టి అదే ప్రపంచ మనుకుంటుందని చెప్తారు – నిజంగా అలా ఊహించగల జ్ఞానం దానికున్నా లేకపోయినా దానికి జ్ఞానమున్నప్పటికీ అంతకన్నా గొప్పగా ఆలోచించలే దనేది విశ్వాసం అందువల్ల తన పరిమిత ప్రపంచంలో అనుభవంలో ఉన్నదే వాస్తవమని సంకుచితంగా అమాయికంగా భావించే వ్యక్తిని కూపస్థ మండూక మంటారు లోకజ్ఞానం లేనివా డని అర్థం ఇదే అర్థంలో కొందరు 'కూపకూర్మ' మని కూడా వ్యవహరిస్తారు కూర్మం అంటే తాబేలు బావిలో ఉన్న తాబేలూ, కప్పా ఒకే విధంగా ప్రపంచ జ్ఞానశూన్యంగా ఉంటాయనేది ఇక్కడ ప్రధానం

**కూరగాయ కవి(త):** నిజానికి కూరగాయలకూ కవికిగాని కవిత్వానికిగాని ఎలాంటి సంబంధమూ ఉండనక్కరలేదు 'అగ్గిపుల్ల, కుక్కపిల్ల' వగైరాలనుకూడా కవితా వస్తువులుగా స్వీకరించేవాళ్లక్కూడా కూరగాయలమీద కవిత్వం చెప్పవలసిన అగత్యం లేకపోవచ్చు కానీ కవిత చెప్పి సంపాదించిన సొమ్ము కూరనారలు కొనుక్కోవ టానిక్కూడా చాలని సందర్భంలో చిల్లర కవులు చెప్పిన కవిత్వాన్ని కూరగాయల కవిత్వమనీ, అది రాసినవాళ్లని కూరగాయల కవులనీ ఆక్షేపిస్తుంటారు పెద్ద కవులు 'మేం చిల్లర కవులమయితే వాళ్లు టోకు కవులా?' అని ఎదురుతిరిగిన వర్తక కవులు లేకపోలేదు జగన్నాథ పండితరాయలనే తెలుగువాడు ఢిల్లీ సుల్తానును మెప్పించి కాశీకి సూబేదా రయ్యాడు ఆయన చెప్పిన శ్లోకమొకటుంది సంస్కృతంలో "ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా, హిమాలయం పూరయితుం సమర్థః, అన్యైర్నృపాలైః పరిదీయమానాః, శాకాయ వాస్యా ల్లవణాయవా స్యాత్" అని అంటే – ఢిల్లీ చక్రవర్తిగాని, సాక్షాత్తూ భగవంతుడుగాని హిమాలయ పర్వతాలంత దానధర్మాలు చేయగలరు తక్కిన చిల్లర

రాజు లివ్వగలిగే సొమ్ము ఉప్పుకో కూరలకో సరిపోవచ్చని తాత్పర్యం బహుశా ఈ కవిగారి పుణ్యమా అని తెలుగులో కూరగాయ కవి(త) అనే జాతీయం పుట్టిందేమో అంతకుముందు (17 వ శతాబ్దికి ముందు) ఆ రకం కవి(త) లేకపోవటం విద్వారమే.

**కృత్యాద్యవస్థ:** "ఈ పని నెరవేర్చటం కృత్యాద్యవస్థ అయిపోయింది" వంటి వాక్యాలు వింటుంటాం సందర్భాన్నిబట్టి 'చాలా కష్టమైపోయింది' అని అర్థం చేసుకుంటాం కృతి–అది–అవస్థ–అని ఈ మాటకు పదచ్ఛేదం కృతి అంటే కావ్యం/గ్రంధం. దాని 'అది'లో (దాని రాయటం మొదలుపెట్టిన తొలిదశలో) పడ్డ 'అవస్థ' (కష్టం, బాధ, ఇబ్బంది) అనేది ఈ సమాసానికి అసలర్థం. సాధారణంగా కవులకూ రచయితలకూ ఈ కష్టం వస్తుంది ఏదో ఒక పుస్తకం రాయటం మొదలుపెట్టేటప్పుడు మొట్టమొదటి పద్యమో శ్లోకమో వచనమో ఎలా రాస్తే ప్రయోజనకరంగా, ఆకర్షకంగా ఉంటుందో వాళ్లు మధనపడి తరవాత రాస్తారు. ఆ ఆలోచన, శ్రమ ఒక కొలిక్కి వచ్చి రాయటం మొదలయితే ఇక ఆగటమంటూ ఉండదు మొట్టమొదటి మాటలు అకట్టుకోకపోతే తరవాతి భాగం రంజింపజేయలేదు. తాము పుస్తకాలు రాసినా రాయకపోయినా, "ఎలా మొదలు పెట్టాలి, ఏమని?" అనే ఆలోచనలో పడవలసిన స్థితి లేకపోయినా, ఏం చేయాలో తోచని పరిస్థితిని కృత్యాద్యవస్థ అనటం అలవాటయింది అవస్థ ఉన్నా కృతి లేదు దానికి ఆదీ లేదు అయినాసరే కష్టముంది కాబట్టి దాన్నే సూచించటానికి ఈ జాతీయం వాడుకలో పుట్టింది

**కెరటాల కరణం:** కెరటమంటే అల ఈ మాట ఎక్కువగా గోదావరి జిల్లాల్లో వాడుకలో ఉంది ఇతరత్రా 'అల'కే వాడుక ఎక్కువ. బోలెడు తెలివితేటలు ప్రదర్శించి, ఏట్లో పారేసినా ఎదురీది, నేర్పుగా బతకగల వ్యక్తిని 'కెరటాల కరణ' మంటారు అందుకో కధ చెప్తారు ఈ కథ బ్రిటిష్‌వారి రాజ్యకాలంలో జరిగిందని బల్లగుద్ది చెప్పవచ్చు.

అనగా అనగా ఒక కరణం ఊళ్లకు ఊళ్లే పీక్కుతింటున్నాడని సర్కారువారికి తెలిసింది అవినీతిని రోసి ఆయనకు ప్రభుత్వం ద్వీపాంతరవాసశిక్ష విధించింది అంటే, అండమాన్ ద్వీపాల్లో ఎక్కడో ఒకచోట వదిలిపెట్టారన్నమాట పారిపోయే వీలులేదు కాబట్టి అలా పడివుండమన్నారు స్వేచ్ఛగా. ఆయన ఓ రూళ్లకర్ర, కాసిని తెల్లకాగితాలు, కలమూ, సిరా ప్రసాదిస్తే చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా రామకోటి రాసుకుంటా నన్నాడు సరే నన్నది ప్రభుత్వం. ఆయన సముద్రపు ఒడ్డున ఓ చెట్టు నీడన విశ్రమించి కాగితాలమీద రూళ్లు గీసుకున్నాడు. పాత అలవాటు ప్రకారం తేదీ, సమయం, అలలు బయలుదేరినవేళ, వాటి సంఖ్య, ఒడ్డుదాకా వచ్చినవాటి సంఖ్య, మధ్యలో విరిగినవాటి సంఖ్య, ఎదురుపోయినవాటి సంఖ్య, రేటు, మొత్తం (రూ అ పై – అంటే రూపాయలూ, అణాలూ, పైసలూ – పాతలెక్కన) వగైరా నిలువు గళ్లు గీసి సరైన సమయం కోసం ఎదురుచూస్తూ గళ్లు నింపుతున్నాడు అదే ఆయన రాసే రామకోటి(!). కాలనేమి జపమో, బక ధ్యానమో చేస్తుండగా కొద్దికాలం గడిచింది

ఒకానొక దుర్ముహూర్తాన ఓ పెద్ద పడవ లంగరు వేసింది ఒడ్డుకు కొంతదూరంలో. ఓడ కేప్టన్ కొందరు అనుచరులతో డింగీమీద ఒడ్డు చేరాడు కరణంగారు తలగుడ్డ ఎగరేసి దగ్గరికి రమ్మని పిలిచాడు వచ్చిన కేప్టన్‌మీద నానా కేకలూ పెట్టాడు మీ పడవ (విక్టోరియా) రాణిగారి సముద్రంలో ప్రవేశించి ఇన్ని అలలు పెంచింది

కాబట్టి మీకు ఇంత జరిమానా విధించక తప్పదన్నాడు. అదిన్నీ మొదటి తప్పు కాబట్టి ఇంతటితో పోయింది. ఇక్కడ జరిమానాగాని, అనుమతి రుసుముగాని చెల్లించకుండాపోతే రాణీగారి యుద్ధ నౌకలు మీ పడవను ముంచి పారేస్తాయని బెదిరించాడు కేప్టెన్ జడుసుకొని ఈయన చెప్పిన కాకుల్లెక్క ప్రకారం రుసుం చెల్లించాడు పోబోతుంటే ఆపి, "ఏమయ్యా! నేనిదంతా అక్రమంగా చేస్తున్నాననుకున్నావా? నాకేదో లంచమిచ్చి తప్పించుకుపోతున్నావా?" అని కోప్పడి, రాణీగారి ప్రతినిధిగా 'క్రమమైన రసీదు' కూడా ఇచ్చాడు – పైకం ముట్టినట్లు!

అంతటితో ఆగలేదు – 'సర్కారువారి సముద్ర ప్రాంతంలో నీలాగా ఎవరైనా అనుమతి లేకుండా ప్రయాణం చేసినా, చేపలు పట్టినా చెమడాలు ఒలుస్తామని నలుగురికీ చెప్పు'మని పురమాయించాడు! దరిమిలా ఆయన రికార్డు పెరిగింది. ఆదాయం పెరిగింది ఈ విషయం బయటపడి ప్రభుత్వోద్యోగులు వచ్చి ఇదేమంటే, "నేనేం తప్పు చేయలేదు శిక్షాకాలంలో కూడా సర్కారువారికి ఆదాయం సంపాదించిపెట్టాను నా జీతం ఈ లెక్కన మినహాయించుకొని తక్కిన సొమ్ము తీసుకపోయి ఖజానాలో జమ చేయండి అన్నట్లు రికార్డు కాగితాలూ గట్రా మరికాసిని పంపండి" అని గదమాయించాడుట! ఇంత మేధావిని వదులుకోలేని ప్రభుత్వం శిక్ష రద్దుచేసి కొత్త పన్నులు చెప్పే సలహాదారుగా వేసుకొందని కథకు ఫలశ్రుతి అలా ఏ పరిస్థితిలోనైనా లంచం పట్టగల మహనీయుణ్ణి కెరటాల కరణ మన్నారు. అదీ సంగతి

*కేతిగాడు:* బొమ్మలాట విషయం రాగానే గుర్తుకు వచ్చే పాత్ర కేతిగాడు రామాయణ ప్రదర్శనలోనేగాక ఇతరవిధాల తోలుబొమ్మలాటల్లో కూడా ఇది విదూషక పాత్రగా (హాస్య పాత్రగా) తప్పని వేషం తెలివితక్కువ తనం, వెర్రి వేషాలు దీని లక్షణాలు. వెకిలిగా మాట్లాడినా, కుప్పిగంతులు వేసినా, అల్లాయి పదాలు పాడినా – 'వాడా? వాడో కేతిగాడు' అని వెక్కిరించటం పరిపాటి తెలుగు జానపద ప్రదర్శనల్లో మన పాలిట చార్లీఛాప్లిన్ ఈ పాత్రధారి కేతిగాడనే వెక్కిరింత పురుషులకు మాత్రమే వర్తిస్తుంది

*కొంగుబంగారం:* కొంగున చుట్టి దాచుకున్న బంగారం అనుక్షణం అందుబాటులో ఉన్న ధనంతో సమానం ఏ కుండలోనో మూకుడులోనో దాచి, దానికి వాసెన కట్టి భూమిలో పాతిపెట్టి భద్రపరచటం పాతకాలపు దాపరికానికి మార్గం లోహయుగం అవతరించిన మీదట రాగిబిందెల్లో విలువైన ఆభరణాలనూ నాణేలనూ నింపి భూగర్భంలో దాచేవాళ్ళు గోడల మధ్య దాచటం, నేలమాళిగలు ఏర్పాటు చేసి వాటిలో దాచటం తరువాతికాలంలో వచ్చిన వసతులు ఈ విధానా లన్నిటిలో ఎవరూ చూడకుండా, ఎవరికీ తెలియకుండా దాచుకోవటం తప్పనిసరి అలా దాచిన బంగారాన్ని తవ్వి బైటికి తీయడానికి సమయం పడుతుంది అనుకూల రహస్యసమయం కూడా దొరకాలి అందువల్ల వెంటనే వాడటం వీలుపడదు పైగుడ్డ చెరగులో చుట్టిన బంగారాన్నయితే ముడివిప్పి వెంటనే తీసుకోవచ్చు రొంటిలో చీరచెరగునో అంగవస్త్రం అంచునో గుచ్చి ఉంచుతారు కాబట్టి, అది సొంతదారు ఒంటిమీదే ఉంటుంది కాబట్టి కొంగుబంగారమంటే ఎప్పుడూ అందుబాటులో ఉన్న, తక్షణం వాడుకోడానికి వీలయిన సొమ్మనే అర్థం వచ్చింది

చీరనుగాని పంచెనుగాని ఒకటికి రెండుపొరలుగా ఒంటికి చుట్టుకొంటారు ఆ

వస్త్రాలకు రెండు కొంగులు(అంచు)లుంటాయి లోపలి కొంగుకు చుట్టుకోవటం, దానితో భద్రపరచటం రహస్య వ్యవహారంగా సాగాలి అదే ముందున్న కొంగున చుట్టుకుంటే దాచటం, వాడటం రెండూ సులభం ఆ దృష్టితో 'ముంగొంగు బంగార' మని కొందరు వాడుతుంటారు ముంజేతి అద్దంలాగా ఏ సమయంలోనయినా దాచటానికీ వాడటానికీ వీలయినదనే భావంతో ముంగొంగు బంగారం అనే జాతీయాన్ని వాడటం కద్దు గర్భాదాన సమయంలో భర్తచేత భార్యకు నవరసు కాకపోతే చిన్నమెత్తు బంగారమయినా ఇప్పించే ఆచారముంది సంసార నిర్వహణకోసం భర్త భార్యకు తొలి సమాగమ సమయంలోనే కొంత సొమ్మివ్వాలని, ఇచ్చాడని సూచించటానికి ఈ ఆచారం పుట్టింది అయితే ఈ ఇప్పించటం గర్భాదాన సమయంలో స్త్రీజన సమక్షంలో రహస్యంగా జరుగుతుంటుంది కాబట్టి "లంచమిస్తేగాని మంచమెక్క"డనే మరో సామెత పుట్టుకొచ్చింది కొంగు బంగారమనే మాటకు నాటికీ నేటికీ – అందుబాటులో ఉన్న ధనం, ఐశ్వర్యమనే అర్థమే నిలిచింది

**కొంగుముడి:** కుట్టుపని తెలియనిరోజుల్లో పుట్టినమాట ఇది శాతవాహనులకాలంనాటికి రెండు వస్త్రఖండాలను కలిపి కుట్టడం వాడుకలోకి రాలేదు నేసిన గుడ్డను ఒకటికి రెండు పొరలుగా ఒంటికి చుట్టు కోవటమేగాని గుడ్డ పీలికను కుట్టి రవికలు తయారుచేయటం అప్పటికి తెలీదు అంటే క్రీస్తుశకం నాలుగో శతాబ్ది నాటికి కూడా మనవాళ్ళకు తెలియదు కుట్టుపని (దాన్ని కుట్రపుపని అనేవాళ్ళు పూర్వం దర్జీపని అన్నారు మధ్యకాలంలో దర్జీని కుట్రపువాడని వ్యవహరించేవాళ్ళు) తెలిసిన తరవాతగాని జేబులంటూ ఏర్పడలేదు స్త్రీల వస్త్రధారణలో నిన్న మొన్నటిదాకా చీరచెరగేగాని జేబు అనేది విలువగల వస్తువులను దాచేందుకు ఉపయోగపడలేదు అందువల్ల దాచదగ్గ వస్తువులను చీరకొంగులో చుట్టబెట్టడం అలవాటయింది పురుషులు కట్టే వస్త్రాల విషయంలో కూడా అదే తీరు రెండు వస్త్రఖండాలను కలపాలంటే కుట్టుపని తెలియని కాలంలో ఆ రెంటి చెరగులనూ ముడివేయటం తప్ప మరో మార్గం లేదు దాచదలచిన వస్తువులను చెరగులో చుట్టబెట్టి రొంటిలో దోపుకొని భద్రపరచటం సాధారణ మార్గంగా ఉండేది

మన వివాహ వ్యవస్థలో స్త్రీ పురుషుల కలయికను సూచించటానికి వారు ధరించే వస్త్రాల చివరి భాగాలకు ముడివెయ్యటం ఆ కాలంలో మొదలయింది వైదిక పద్ధతి వివాహాలను, వివాహపద్ధతులను దక్షిణభారతంలో అపస్తంబ మహర్షి కాలంలో అయన నిర్ణయించిన పద్ధతిలో రూపొందించారనీ ఆ కాలం బహుశా నేటికి పద్దెనిమిది వందల సంవత్సరాల క్రితాని దయివుంటుందనీ ఊహ కట్టుగుడ్డా పైగుడ్డా అనే రెండు వస్త్రఖండాలను స్త్రీ పురుష లుభయులూ విడివిడిగా ధరించేవారు పైగుడ్డ కొంగులో దాచిన వస్తువును చుట్టబెట్టి కట్టుగుడ్డలో (రొంటిలో) భద్రపరచటం అనవాయితీ ఆ కాలంలోనే స్త్రీపురుషుల పైగుడ్డల చివరి భాగాలను ముడివేసి వివాహ బంధానికి చిహ్నంగా భావించటం మొదలయింది అదే కొంగుముడి కొంగుముడి వేశారంటే వివాహితు లయినారని అర్థం ఆ మాట రానురాను అన్యోన్యతకు గుర్తయిపోయింది

**కొండ తిమ్మిరి:** రక్త ప్రసారం సరిగా లేనప్పుడు శరీర భాగాలకు తిమ్మిరెక్కుతుంది ఒక్కోసారి అది ఎక్కువై, వెంటనే తగ్గుతున్నప్పుడు ఈ దురవస్థ వస్తుంది కాళ్ళూ

చేతులూ ప్రయత్నపూర్వకంగా కదిలించి, విదిలించినప్పుడు ఈ బాధ ఉపశమిస్తుంది ప్రాణంగాని రక్తప్రసరణగాని లేని కొండకు తిమ్మిరెక్కటమే విడ్డూరం అయినా తిమ్మిరెక్కిన మనిషి ప్రవర్తించినట్లు ఒళ్ళు కదిలించటం, జలదరించటం, వణకటం అనే లక్షణాలు ప్రదర్శించే కొండ కూడా ఉంటుందని ప్రజలు ఊహించారు. కొద్దిపాటి (భూ) ప్రకంపనాలు వస్తే – అంటే కొద్దిగా కొండ కదిలినట్లనిపిస్తే – కొండ తిమ్మిరి వచ్చిందని ఒంగోలు ప్రాంతంలో వాడుక అక్కడి కొండ కడుపులో గంధకముందని, అందువల్ల అప్పు డప్పుడది వణుకుతుందని విశ్వసించి, కొద్దిపాటి భూకంపం వస్తే కొండతిమ్మిరి వచ్చిందనటం అక్కడి వాడుక

*కొండవీటి చేంతాడు:* పర్వతమయమైన పలనాటి సీమలోని కొండవీటిలో నీటికరువుండటం విశేషమేమీ కాదు పాతాళందాకా తవ్వితేగాని జల పడదు అందుకని అక్కడి బావుల్లో నుంచి నీళ్ళు చేదుకోవటానికి 'హనుమంతుడి తోక' అంత పొడుగాటి చేంతాళ్ళు కావాలి ఆ తోక లాగానే ఈ చేంతాడును కూడా దీర్ఘత్వానికి – నిడివికి – గుర్తుగా వాడుతుంటారు 'ఆయన ఉపన్యాసం కొండవీటి చేంతాడులాగా సాగింది' వగైరా మాటలు పుట్టాయి ఇలాగే కొండ ప్రాంతాల్లో ఎక్కడి కక్కడ సన్నిహితంగా ఉన్న ఊరి పేరిట చేంతాళ్ళు వెలిశాయి తెలుగుగడ్డలో అవన్నీ పేర్కొంటే ఈ రచన కూడా కొండవీటి చేంతాడంత అవుతుంది

*కొండుభట్లు/పెద్దిభట్లు:* విస్సన్న వేదానికి విరుద్ధంగా ఎవరి నిర్ణయం, అనుమతీ అనవసర మనిపించినప్పుడు ఈ రెండు పేర్లలో ఏదో ఒకదాన్ని వాడుతుంటారు "గోదావరి స్నానానికి కొండుభట్లు అనుజ్ఞ కావాలా?" అంటారు కొంద రతడి స్థానంలో పెద్దిభట్లను నిలుపుతారు తాత్పర్యం ఎవరి అనుమతీ అక్కరలేదనే అక్కరలేని విషయంలో ఈ పేర్లు వచ్చాయి' అధికారం లేకపోయినా తమ అనుమతి అవసరమని దబాయించినవాళ్ళకు సమాధానంగా ఈ వాక్యం ప్రయోగిస్తుంటారు బహుశా ఈ పెద్దలు తాము స్నానం చేయిస్తేనేగాని పుణ్యం రాదని ప్రలోభపెట్టేవాళ్ళేమో తెలీదు ఏనాటివాళ్ళో చెప్పలేం కానీ గోదావరి ప్రాంతీయులని సామెతనుబట్టి ఊహించవచ్చు ఎలాగయితేనేం మంచిదో చెడ్డదో వీళ్ళకో పేరు వచ్చింది అదే విశేషం

*కోటికి పడగెత్తటం:* 'పోకకు పుట్టెడమ్మే రోజుల్లో పోక పుట్టక చచ్చా' రనే సామెతుంది దాని ప్రకారం ఒకప్పుడు 'పోక' కరెన్సీగా చెలామణీ అయిందని తెలుస్తుంది 'గుడ్డి గవ్వ ఖరీదు చేయదు' లాంటి ప్రయోగాలు 'గవ్వ'లు కూడా నాణేలుగా చెల్లేవని గుర్తు చేస్తాయి ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రా చరిత్ర చదివితే ఇవి నిజమేనన్న నమ్మకం కలుగుతుంది అలాంటి కాలంలో కోటికి పడగెత్తటమంటే కోటీశ్వరుడు కావటమనే అర్థముండేది ఒకప్పుడు లక్షాధికారి అంటేనే గొప్ప కోటీశ్వరుడి విషయం చెప్పనక్కర లేదు అలా కోట్లు గడించిన వ్యక్తి తన తాహతుకు చిహ్నంగా ఇంటిమీద ఒక జెండా/బావుటా/పడగను ఎగరేసేవాడట. పార్టీలకూ, పెద్ద పెద్ద సంస్థలకూ, సేనాదళాలకూ ప్రత్యేకంగా పతాకాలుండటం ఈనాటికీ సంప్రదాయంగానే ఉంది అలాగే పూర్వం తన ధనధాన్యసంపత్తిని లోకానికి ప్రదర్శించటం కోసం 'పడగెత్తే'వారు అంటే, సొంత జెండా ఎగరేసేవారు ఇప్పుడు దొంగల భయానికీ, దోపిడీ భయానికీ కాకపోయినా ఇన్‌కంటాక్సు భయానికయినా ఎవరూ ఈ పని చేయటం లేదు

(ఉన్న సొమ్ము బ్యాంకుల్లో దాచుకునే అవకాశం వచ్చిన తరవాత దొంగల నోట దుమ్ముపడ్డ దంటారు ) ఇప్పుడా పాత అలవాటు వాడుకనుంచి తొలగిపోయినా మాట మాత్రం వాడుకలో నిలిచింది కోటీశ్వరు డనటానికి బదులుగా ఈ జాతీయాన్ని ఇంకా వాడుతూనే ఉన్నారు

*కోడిగుడ్డు తంటసం:* తంటసం అంటే చిమ్మట వెంట్రుకలను లాగటానికి వాడే సాధనం దానికి తండసమనే రూపాంతరముంది నున్నగా ఉండే కోడిగుడ్డుపై నుంచి లాగటానికేమీ లేదు. మనక్కనిపించకపోయినా – ఏమో ఉండకపోతుందా అన్న అనుమానంతో కోడిగుడ్డును చిమ్మటతో లాగే వాళ్ళుంటారా అంటే, ఉంటారు కొందరు కోడిగుడ్డుకు వెంట్రుక లుంటాయని నిర్ణయించుకొని వాటిని లాగడానికి, పీకటానికి ప్రయత్నించే దురాశాపరులు లేకపోలేదు ఏమీ లేనిచోటినుంచి ఏదో ఒకటి సంపాదిద్దామని ప్రయత్నించే వాళ్ళున్నారు ఆ ప్రయత్నం అనవసరయినా, అది నిష్ఫలప్రయాసే అయినా వదలకుండా ప్రయత్నించే వ్యక్తు లున్నారు కోడిగుడ్డు వెంట్రుకలు లాగి దానితో కుచ్చుల జడ వేసేవా ళ్ళున్నారంటారు సాధారణంగా ఈ బాపతు అనుమానంతో బతికే రకం ఎవరినీ నమ్మరు, దేన్నీ నమ్మరు ప్రతి విషయాన్నీ వస్తువునూ శోధించి అందులోనుంచి ఏదో మహత్తర ప్రయోజనం సంపాదించాలన్న ఆశ వాళ్ళకు విపరీతం ఫలితం ఉండదని ఎవరు చెప్పినా వినరు ప్రయత్నం మానరు ఈ లక్షణాలను వ్యక్తీకరించటానికి ఈ జాతీయం వాడ్తారు వృధాశ్రమ అని దీనికర్థం

*ఖండవల్లి మడుగు:* ఒకనాటి ఆస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు బండ్ల కెత్తేటన్ని పుస్తకాలు రాశారు ఆ చేత్తోనే 'బొబ్బిలి యుద్ధం' నాటకం కూడా అందులోని "కడుపా౨ అయ్యది ఖండవల్లి మడుగా౨" అనే పద్యభాగం ఒకప్పుడు చాలా ప్రశస్తికి వచ్చింది నాటకం అంతా కాకపోయినా ఆయన కవిత్వం ప్రజాదరణకు నోచుకోకపోయినా ఈ మాటమటుకు మోగిపోయింది ఇదికూడా కంభం చెరువులాగే వైశాల్యానికి చిహ్నం కొందరు 'కొల్లేరి మడుగు/చెరువును' ఇలాగే ప్రస్తావిస్తుంటారు తమకు సమీపంలోని, తమ అనుభవంలోని వస్తువులను ఇలా జాతీయాలుగా మలుచుకోవటం పరిపాటి

*గంగాభాగీరథీ సమానురాలు:* ఇప్పు డెవరూ వాడుతున్నట్లు లేదుగాని విధవాస్త్రీల పేరు ముందు ఈ మాటను సంక్షేపించి 'గం భా స' అని రాసే అలవాటుండేది కొంతకాలంక్రితందాకా లక్ష్మి వివాహ సౌభాగ్యానికి చిహ్నమయితే విధవత్వానికి చిహ్నంగా – పోటీగా గంగానది పేరు వాడటంలోని ఔచిత్య మేమిటో పూర్తిగా అర్థంకాదు మామూలు దృష్టిలో గంగ, భాగీరథి అనేవి పర్యాయపదాలు కాని, ఇక్కడి గంగ 'ఆకాశ గంగ'కు పర్యాయపదం మన పూర్వుల విశ్వాసం ప్రకారం ఆకాశంలో అసలు సిసలు గంగానది ఉంటుంది పుణ్యం సంపాదించి స్వర్గానికి వెళ్ళిన వాళ్ళూ దేవతలూ ఆ నదిలో స్నానం చేస్తారు ఆ నదిలో బంగారు తామర పూలు పూస్తాయని పూర్వకవులు వర్ణిస్తుండేవాళ్ళు దాన్ని 'అభ్రగంగ' అని కూడా అంటారు రాత్రిళ్ళు ఆకాశంలో కనిపించే 'పాలపుంతే' ఆకాశ గంగానది అని వివరించిన విద్వాంసు లున్నారు తన పెద్ద తండ్రులను పునర్జీవింపజేయటానికి సగర చక్రవర్తి మనమడు భగీరథుడు అష్టకష్టాలు పడి తపస్సు చేసి భూమి మీదికి తెప్పించాడు ఆకాశ గంగానదిని భగీరథుడు రప్పించిన గంగను భాగీరథి అన్నారు. ఆ వ్యవహారం

మొత్తాన్ని పురాణాలు వర్ణించాయి భర్తృహరి సుభాషితత్రిశతిలో ప్రస్తావించాడు ఆకాశంలో ఉన్న అసలు గంగలా, భూలోకానికి దిగివచ్చి ప్రవహించి సముద్రంలో కలిసిన భాగీరధిలా ఉభయ లోకాల్లోనూ పవిత్రురాలయిన స్త్రీ కాబట్టే విధవరాలిని గంభాస అని వ్యవహరిస్తుండేవారు భర్త లేకపోయినా తీర్థయాత్రలు, పూజలు, ఒక్క పొద్దులు వగైరా పుణ్యకార్యాలవల్ల పవిత్రీభూతురాళ్ళయిన పతివ్రతలను గంగాభాగీరథీ సమానురాళ్ళని ప్రస్తుతించి, ఇంటి చాకిరీ చేయించుకోవటం పరిపాటి భర్త లేని స్త్రీ విధవ అన్నట్లు భార్యలేని పురుషుణ్ణి విధురు డంటారు ఎందుచేతనోగాని విధురులకు ఇటువంటి పవిత్రమైన బిరుదు భాషలో పుట్టలేదు

**గచ్చపొద:** గచ్చపొద గాలికి గలగల్లాడుతుంటుంది అలాగే నిర్విరామంగా తెగవాగేవాళ్ళను 'గచ్చపొద' అని వెక్కిరించటం అలవాటయింది ఈ మాటను సాధారణంగా స్త్రీల విషయంలోనే ప్రయోగిస్తుంటారు 'గయ్యాళి-గచ్చపొద' వగైరా పదబంధాల్లో ప్రమాదకరమైనా కాకపోయినా తిట్లయినా దీవనలయినా ఎడతెగకుండా మాట్లాడేవాళ్ళను ఈ పేరుతో పిలుస్తారు

**గజకచ్ఛపాలు:** గజం అంటే ఏనుగ కచ్ఛపం అంటె తాబేలు ఈ రెండూ ఒకప్పుడు రాత్రింబవళ్ళు హోరాహోరి పోరాడుకున్నాయిట పూర్వం విభావసుడు, సుప్రతీకుడు అనే అన్నదమ్ము ఉండేవారుట తమ్ముడు అన్నను తన వాటా ఆస్తి తన కిచ్చెయమని అడిగాడు అన్నకు కోపం వచ్చి 'నీవు ఏనుగ'వైపొమ్మని శపించాడు తమ్ముడు 'నీవు తాబేలు'వైపొమ్మని ప్రతి శాపమిచ్చాడు భారతం ఆదిపర్వంలోని ఈ కథ ప్రకారం వీరిద్దరూ అటిమారిన రూపాలు ధరించారు అన్న విభావసుడు ఆరు యోజనాల ఎత్తు, పన్నెండు యోజనాల వైశాల్యం గల ఏనుగైనాడు తమ్ముడు మూడు యోజనాల ఎత్తు, పది యోజనాల వెడల్పుగల తాబేలయినాడు ఈ మహాకాయాలు ఆస్తికోసం - అవతారాలు మారినా పోరాడుతుండేవి ఇంద్రుడి మీద దండెత్తి అమృతకలశం తెచ్చి దాస్యవిముక్తి కోసం బయలుదేరిన గరుత్మంతుడికి ఈరెంటినీ పెక్కుతింటె ఆ మహా ప్రయాణానికి కావలసిన బలం వస్తుంది పొమ్మన్నాడు తండ్రి కశ్యపుడు చెరో కాలికింద పట్టుకొన్నవాడికి ఎక్కడ ఈ అతికాయాలను పెట్టుకొని తినాలో వెతుక్కోవలసి వచ్చింది రోహిణమనే మహావృక్షం నూరామడల విశాలమైన తన కొమ్మమీద నిలిచి తినమన్నది కానీ వాలగానే విరిగిపోయిం దాకొమ్మ దానికి తలక్రిందులుగా వేలాడుతున్న వాలఖిల్యాది మహర్షులను మరో చోటుకి పంపి, ఆ కొమ్మను నిష్పురుష నగం మీద పారేసి హిమవంతం మీద వీటిని తిని చక్కాపోయాడు గరుత్మంతుడు

ఈ కొలతలు అత్యుక్తులే కావచ్చు ఎంత వయసొచ్చి ఎంత పెద్దవాళ్ళయినా ఆస్తులకోసం అహరహం పోట్లాడుకొనే అన్నదమ్ములను గజకచ్ఛపా లంటారు ఇంతా చేసి వీళ్ళు సాధించి వచ్చిందేమి లేదు పిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చిందన్నట్లు గరుడాళ్వారు ఇద్దర్నీ తిని తెగి బలిశాడు ఇంతకుముందు సుందోపసుందులనే అన్నదమ్ములు తిలోత్తమ కోసం కొట్టుకొని ఇద్దరూ చచ్చారని చదివాం వాళ్ళు స్త్రీ కోసం చచ్చారు ఉభయులూ సాధించింది చావేగాని మరోటి లేదు వాళ్ళు స్త్రీని వదిలేసి వెళ్లారుగాని ఎవరికీ ఇచ్చిపోలేదు తామునా వీళ్ళ మూడోవాణ్ణే బాగుచేసి తాము

చచ్చారు ఇంతే భేదం దాయాదులు ఆస్తికోసం నిర్విరామంగా పోరాడుకోవటాన్ని గజకచ్ఛపాల పోరంటారు

*గజగర్భం - గాంధారిగర్భం:* ప్రాణాంతకం కాకపోయినా బహుకాలం గర్భవతిగా ఉంటే 'గజగర్భ'మంటారు ఏనుగు చాలాకాలం బిడ్డను మోసికాని కనదనే నమ్మకంతో లెక్క తప్పుగా వేసుకొని ప్రసవ సమయం పదినెలలకు పైకాలానికిగాని రాకపోతే 'అయమ్మ గాంధారిలా మోస్తున్న'దని బుగ్గమీద వేలేసుకుంటుంటారు గాంధారికన్నా ముందే కశ్యపుడి భార్య వినత చాలాకాలం కడుపులో మోసి చివరికి రెండు గుడ్లు పెట్టిందని, ఒకదాన్ని తొందరపడి చిదిమితే కాళ్ళులేని 'అనూరుడు' జన్మించి రెండోగుడ్డును అలా తొందరపాటు లేకుండా కాపాడితే మహాబలవంతుడు జన్మిస్తాడని చెప్పి, తాను సూర్యుడి రథానికి సారథిగా వెళ్ళాడనీ పురాణకథ రెండో అండం నుంచి పుట్టినవాడే గరుత్మంతుడు అతడు విష్ణువుకు వాహనమైనాడు ఆ తల్లి కన్నబిడ్డలిద్దరూ రథసారథిగానూ, రథంగానూ బతికారు అయితే, వినత విషయం కథగానే మిగిలిపోయిందిగాని జాతీయం కాలేదు గాంధారి గర్భం 'దీర్ఘకాలిక' మనే అర్థంలో వాడుక కెక్కింది అలాగే ఎన్నాళ్లకూ తేలని విషయాన్ని 'గాంధారి గుడ్డు' అనికూడా వ్యవహరించటం మొదలయింది అదేవిధంగా ఎన్నటికోగాని తేలనిదాన్నికూడా 'గజగర్భ'మని వ్యవహరిస్తుంటారు

*గజ్జెలగుర్రం:* పూర్వం పెళ్ళిళ్లలో మేజువాణీ నడిపేవాళ్ళు ఏడురోజులు, అయిదు రోజులు, చివరికి మూడు రోజుల పెళ్ళిళ్ళలో కూడా ఈ తంతు నడిచేది ఆ సమయంలోనే భోగం మేళాలు పెట్టి, సంగీత నాట్య ప్రదర్శనలు చేయించేవాళ్ళు వీటిని ప్రభుత్వం నిషేధించిన తరువాత కూడా మారుమూల గ్రామాల్లోనూ ధనవంతుల అధికారవంతుల ఇళ్ళల్లోనూ కొంతకాలం ఈ వినోద ప్రదర్శనలు నడిచాయి ఇది ఇంటి యజమాని ఐశ్వర్యానికి చిహ్నంగా సాగేది భార్యకాక మరోసాని తనకు ఉంపుడుగత్తెగా ఉండటం ఒకనాటి సంఘంలో గౌరవానికి చిహ్నం చిలకమర్తి, కందుకూరి వగైరాలు రాసిన ప్రహసనాల్లో భార్యలే స్వయంగా మరొకర్ని "ఉంచుకోమని" నిర్బంధించిన ఘట్టాలు కనిపిస్తాయి ఇలా ఒకరిని నమ్ముకొని మరో భార్యగా ప్రవర్తించిన సానులను 'నాయకురాలు' అని పిలిచేవాళ్లు ఇంత ఖర్చు భరించలేనివాళ్ళు 'ఆట గుర్రాలను' తెప్పించి ఆడించేవారు పెళ్ళికొడుకుచేత దానిమీద స్వారీ చేయించేవాళ్ళు ఆ గుర్రాల కాళ్ళకు గజ్జెలు కట్టేవాళ్ళు గుర్రాలకు ఆట నేర్పిన వ్యక్తి దరువులు వేస్తుంటే అవి ఆడేవి అవి బండి కట్టడానికీ బరువులు మోయడానికీ పనికిరానివి స్వారీకి పందేలకూ అసలు పనికిరావు - ఒక్క పెళ్ళిళ్ళలో ఆడటానికి తప్ప. ఘల్లు ఘల్లుమని రకరకాల విన్యాసాలతో నడుస్తుంటాయి కాబట్టి గజ్జెల గుర్రాలని కూడా వాటిని పిలిచేవాళ్ళు గుర్రంలాంటి పిల్లలు కాలి అందెల మోతతో విలాసంగా నడుస్తుంటే వాళ్ళను గజ్జెల గుర్రా లనేవాళ్ళు విలాసమైన నడకగల ఆరోగ్యవంతురాలిని ఆ పేరుతో పిలవటం అలవాటయింది ఈ ఆటలూ పాటలూ లేని ఈ రోజుల్లో కూడా గలగలా మాట్లాడుతూ ఘల్లుఘల్లుమని నడుస్తుండే ఆడపిల్లలను ఈ పేరున వ్యవహరిస్తూనే ఉన్నారు

*గణపతి పూజ:* శివుడి దగ్గరుండే ప్రమథగణాలన్నిటికీ, అంటే సేనలన్నింటికీ సేనాధిపతి వినాయకుడే అందువల్ల ఆయనకు గణపతి అని పేరు వచ్చింది హిందూ సమాజం

ముక్కోటి దేవతలను పూజిస్తుందిగాని, ఏ దేవుణ్ణి ఎప్పుడు పూజించదలచినా మొట్ట మొదట వినాయకుడి పూజ తప్పదు అలాగని ఆయనకు శివ పార్వతుల వరముందని పురాణాలు చెప్తాయి. అంటే, అన్ని పూజలకన్నా ముందు చేసేది గణపతి పూజ అందువల్ల 'మొదలుపెట్టడం, ఆరంభించటం' అనే అర్థాల్లో గణపతి పూజ అనే జాతీయం స్థానం సంపాదించింది. వీరవైష్ణవులు అడ్డబొట్టు వినాయకుణ్ణి స్మరించరు గణపతికి బదులు 'విష్వక్సేనుణ్ణి' పూజిస్తారు పూర్వం వీధి బడుల్లో తెలుగు రాయటం, ఒత్తులు సరిగా పలికించటం మొదలైన సమయాల్లో 'విష్వక్సేనుడు' అనే మాటను పలకమీద రాయించి చెప్పించేవాళ్ళు. స్మార్తులు (శివ విష్ణు భేదం లేకుండా ఇద్దరు దేవుళ్ళనూ సమానంగా గౌరవించేవాళ్ళు) గణపతి విష్వక్సేను లొకటేనని చెప్తారు. కానీ విష్వక్సేన పూజ అనే మాట పుట్టలేదు. మొదలు పెట్టడమనే అర్థంలో గణపతి పూజ అనే వాడ్తారు.

*గణానాం త్వా చేయు:* ఇది సాధారణంగా బ్రాహ్మణ కుటుంబాల్లో, అందులోనూ వైదిక కుటుంబాల్లో వాడుకలో ఉన్నమాట. గణపతి పూజలో 'గణానాం త్వాం' అనేది మంత్రభాగం దాన్ని చేయటమంటే పూజ మొదలుపెట్టడమనే అర్థం\ ఈ మంత్రభాగం చదివేటప్పుడు గంట వాయిస్తూ గణపతిని 'ఆవాహనం' చేస్తారు అంటే, ఈ వేదికమీదకు వచ్చి కూర్చోమని 'పిలుస్తారు.' అందువల్ల సగౌరవంగా, సమంత్రకంగా, మర్యాదగా పిలవటాన్ని 'గణానాంత్వాం' చేయటమనటం పరిపాటి అయింది. ఇంత ఘనంగా ఆవాహన చేసిన గణపతిని పూజించిన తరువాత అభిషేకిస్తారు. అంటే, విగ్రహాన్ని కడుగుతారు. ఆ తరవాత దేవతార్చన పెట్టెలో భద్రపరుస్తారు. అలా పెట్టేముందు 'పూజార్థం పునరాగమనాయ చ' అని కూడా జపిస్తారు. అంటే, మరోసారి పూజలు పొందడానికి మళ్లీ రావలసిందని కూడా కోరతా రన్నమాట ఇలా పూజానంతరం పునఃపూజకోసం రమ్మనటాన్ని 'ఉద్యాపన' మంటారు విగ్రహాన్ని పైకెత్తి – వేదికమీదనుంచి దింపి – భద్రపరచటమే ఈ తంతు హైందవ కుటుంబా లన్నిటిలోనూ ఏవో వ్రతాలూ పూజలూ జరుగుతూనే ఉంటాయి పూజలయిన తరువాత చేసేది ఉద్యాపనం. దీనికర్థం కడగటమేగాని ఏ బావిలోనో చెరువులోనో పారవేయటం కాదు అసలు మర్యాద సంగతీ, పునరాగమనం సంగతీ మరిచిపోయిన మహాత్ములు వినాయక విగ్రహాలను ఏ హుస్సేన్ సాగర్లోనో విసిరిపారవేయటమే (మళ్లీ తెచ్చుకోకపోవటమే) సరైన విధానమనే నిర్ణయానికి వచ్చారు. అదే సరైన భక్తి మార్గమనే నమ్ముతుండటం మరో విచిత్రం ఇది నేటి ఫ్యాషన్!

ఉపన్యాసమనే మాట చాలా గౌరవస్ఫోరకమయింది. మనవాళ్లు సభలూ సమావేశాలూ జరుపుతారు అందులో 'ముగింపు సమావేశం' చివరిది అతిథులకు కృతజ్ఞతలు చెప్పటంలో ఆ సమావేశం ముగుస్తుంది. వాళ్లను మళ్ళీ పిలిచినప్పుడు తప్పకుండా రమ్మని వేడుకోవటం ఉండదు ఒరిస్సాలోని ఆంధ్రులుమాత్రం ఇలాంటి సమావేశాలను 'ఉద్యాపన' సమావేశాలంటారు – దేవీదేవతలను పూజార్థం పునరాగమించమన్నట్లు ఈ మర్యాద శేషాంధ్రుల కెందుకో పట్టుబడలేదు

*గణికా శ్రాద్ధం:* గణిక అంటే వేశ్య ఆమెకు ఫలానా వ్యక్తి మాత్రమే భర్త అని చెప్పటానికి వీల్లేదు అందువల్ల ఆమెకు వైధవ్య మనే బాధలేదు తలిదండ్రులున్నా తల్లి తప్ప తండ్రి ఎవరో చెప్పలేం. నిజానికి మాతృత్వ మొక్కటే అందరి విషయంలోనూ

వాస్తవం పితృత్వం అనుమానమూ, తల్లి చెప్పిన మాటమీది విశ్వాసమూ తేల్చవలసిన విషయం. అయితే వేశ్యా విషయంలో తండ్రి పేరు అనవసరం, అప్రస్తుతం కాబట్టి తెలియని తండ్రికి శ్రాద్ధం పెట్టే ప్రసక్తి లేదు తెలిసిన తల్లికి తద్దినం పెట్టే అచారం లేదు. భర్త లేనే లేడు కాబట్టి అతడు చచ్చే పనీ లేదు. చచ్చినా అతణ్ణి తలుచుకుంటూ శ్రాద్ధం పెట్టే పని లేదు. కాబట్టి గణికాశ్రాద్ధ మనేది అనవస రార్భాటం, అశాస్త్రీయ వ్యవహారం

తద్దినం మంత్రాల్లో తండ్రినీ, తాతనూ, ముత్తాతనూ స్మరించవలసి వుంటుంది తండ్రే తెలియని వేశ్య వాళ్ళ పేర్లు చెప్పి పితృ పితామహ ప్రపితామహులకు పిండ ప్రదానం చేయటం కుదరదు భర్త విషయంలోనయితే అతడి తండ్రికీ తాతకూ పిండాలు పెట్టాలి ఆ వీలులేదు కాబట్టి గణిక శ్రాద్ధం పెడితే అది లోక వంచనకో, తాను ద్విజాతి స్త్రీ అని చెప్పకోటానికో తప్ప మరెందుకూ పనికిరాదు అది మోసమయినా కావాలి, ఆధిక్య ప్రదర్శనమయినా కావాలి. ఏదయినా ఏది కాకపోయినా అది అనాచారం మాత్ర మవుతుంది తల్లితండ్రులకు తద్దినాలు పెద్తున్నట్లు చెప్పకుంటూ వాస్తవానికీ శ్రాద్ధం పెట్టనివాళ్ళనూ, ఏదోవిధంగా తంతు నడిపి చేతులు కడుక్కునేవాళ్ళనూ ప్రస్తావించేటప్పుడు, ఫలితంలేని పని చేశా డనటానికీ, అధికారం లేని కార్యక్రమం నెత్తిన పెట్టుకున్నా డనటానికీ 'అతగాడు గణికాశ్రాద్ధం పెట్టాడులెండి!' అని ఈసడించి మాట్లాడటం పరిపాటి. ఉత్తుత్తి వ్యవహారాన్ని గణికాశ్రాద్ధమని వ్యవహరించడం కద్దు నిష్ఫల ప్రయాసను కూడా ఈ జాతీయ ప్రయోగంద్వారా సూచించటం లేకపోలేదు

*గంట వాయించు:* ఏ బడి గంటనో కాక గుడి గంటను దృష్టిలో పెట్టుకొని ఈ మాట పుట్టింది ఇంట్లో దేవతార్చన చేసే వాళ్ళు గంట వాయిస్తారు – తాము పూజిస్తున్నట్లు దేవుడికి వినిపించాలన్నట్లు ఏదో పని చేయాలనుకొని పూజలో పడ్డప్పుడు దాన్ని మరిచిపోవటం కద్దు – భక్తి పారవశ్యం వల్లనో, పుస్తకం చూసి మంత్రాలు చదవటంలో దృష్టి పూర్తిగా పూజా విషయంలో లగ్నమయినందువల్లనో. ఈ లక్షణం చాలామంది నిత్యదేవతార్చన చేసేవాళ్ళలో ఎక్కువ. అందువల్ల 'ఆయన గంట వాయించా'డంటే 'మరిచిపోయా'డనే అర్థం పుట్టింది దేవుడికి గంట వాయిస్తూ నైవేద్యం పెట్తారు దాన్ని దేవుడెటూ అరగించడు పేరుకు నైవేద్యమేగాని దాన్ని అనుభవించేవాడు, తినేవాడు భక్తుడే దొరికిన చోట అప్పు తెచ్చి, దాన్ని తిరిగి చెల్లించాలనే స్పృహ కూడా లేకుండా, ఎరగనట్లు దాని ప్రస్తావన కూడా చేయని వ్యక్తి కూడా గంట వాయిస్తున్నాడంటారు అంటే 'ఎగవేస్తున్నా'డని భావం దేవుడు తనకేమి ఇచ్చినా తాను తిరిగి ఇచ్చేదేమీ లేదు అలాగే ఎవరిదగ్గర తానేమి తీసుకున్నా తిరిగి ఇవ్వనివాడు నైవేద్య సమయంలో గంట వాయిస్తూ అర్భాటం చేసినట్లు – అదిగో ఇస్తా, ఇదిగో ఇస్తా ననటమేగాని ఇచ్చేదేమీ లేదు – అబద్దాలు తప్ప, అసత్య ప్రమాణాలు తప్ప అటువంటి మహాత్ముల్ని గంట వాయిస్తున్నా రంటారు

ఈ మాటను మరింత సాగదీసి 'గుంట(లో) బెట్టి గంట వాయిస్తున్నారం'టారు అక్కడి గుంట నేవైద్య ముంచిన పళ్ళెం అన్నమాట. గంట వాయిస్తూ నైవేద్యం చుట్టూ చేతులు తిప్పతూ 'స్వామీ, అరగించ'మనే భక్తుడికి భగవంతుడు తినడని గట్టిగా తెలుసు తెలిసికూడా స్వీకరించమని, అరగించమని గంట వాయిస్తూ ప్రార్థిస్తాడు తన

ప్రార్థన వినిపించకుండా ఉండటానికన్నా గంట వాయిస్తుండవచ్చు. అంటే, గంట వాయింపు సాక్షాత్తు దేవుణ్ణే మోసగించడానికి, మభ్యపెట్టడానికి ఉపయోగపడుతున్నదని మరో అర్థ విశేషం సాధించినవాళ్ళు – గంట వాయింపును 'మోసగించు' అనే మరో అర్థంలో కూడా వాడుతుంటారు. దేవతార్చన చేయటం, మరిచిపోవటం, ఎగవేయటం, మోసగించటం అనే నాలుగు భిన్నార్థాలను సూచిస్తూ ఈ జాతీయాన్ని వాడటం కద్దు.

*గండగత్తెర (పని):* ఈ మాటకు 'గండకత్తెర' అనే రూపాంతరముంది గండ/గండ్ర – అనే విశేషణానికి పెద్ద అని అర్థం. పెద్ద కత్తెర అని ఆ సమాసానికి మామూలు అర్థం అర్ధచంద్రాకారంలో ఉండే కత్తెర చెవులకు తాళ్ళుకట్టి వాటి చివరలను కాలిబొటన వేళ్ళకు కట్టుకుంటారు. వీరభక్తి ప్రదర్శనలో ఇదొక భాగం. భగవంతుడికి తాను తెలిసిగాని తెలియక గాని అపచారం చేసినట్లు అనుమానం వచ్చినా మెడకు గండకత్తెరను తగిలించుకొని, కాలు జాడిస్తే తల తెగిపోతుంది ఇలా తల నరుక్కొని ప్రాయశ్చిత్తం చేసుకునేవాళ్ళు ఇది నిజానికి ఆత్మహత్యాయత్నమేగాని – ఆత్మహత్య మహాపాతకమని చెప్పే మత సిద్ధాంతాలు ఇలాటి పనులను సమర్థిస్తాయి. పైగా, అవి మోక్షానికి దారి తీస్తాయని కూడా విశ్వసించటం కద్దు. పాండవులు ఉత్తరదిశగా ప్రయాణించి హిమాలయాల్లో కన్ను మూశారు. అది మహాప్రస్థానం పర్వతశిఖరాలమీది నుంచి లోయలోకి దూకి మరణిస్తే అది భృగుపాతమంటారు పుణ్యక్షేత్రంలో ఈ పని చేస్తే మోక్షం వస్తుందని నమ్మకం తిండీతిప్పలూ మానివేసి ధ్యానముద్రలో జీవితం చాలిస్తే దాన్ని (మహా)పరినిర్వాణ మంటారు బౌద్ధులూ, జైనులూ. ఇవి ఆత్మ హత్యా పాతకానికి దారి తీయవు పైపెచ్చు మోక్షమిస్తాయి అలాగే గండగత్తెర వేసుకొని తన తల తానే నరుక్కుంటే పుణ్యమని నమ్మేవాళ్ళున్నారు ఫలితంలో గండగత్తెర అంటే ప్రాణాంతకమనే భావం ముదిరింది ఆ మాటకు పని కూడా చేరిస్తే ప్రమాదకరమైన, ప్రాణం తీసే పని అనే అర్థం వస్తుంది చేయక తప్పనిది, చేయకుంటే ప్రమాదకరం అనే అర్థాల్లో ఈ జాతీయాన్ని వాడుతుంటారు.

*గండభేరుండం:* ఇదో పక్షి దీన్ని చూసినవా శ్ళెవరూ ఉన్నట్లు లేరు. సింద్‌బాద్ యాత్రా కథల్లో దాని కాలికి తలపాగాతో తనను కట్టుకొని సముద్రాలు దాటి ద్వీపాలకు యాత్రలు చేస్తాడు అంటే, ముస్లిం ప్రపంచంలో కూడా ఇటువంటి పక్షి ప్రస్తావనలో ప్రచారంలో ఉందన్నమాట ఈ పక్షి ఏనుగులను తన్నుకొని పోతుందని పిట్టకథల్లో వింటాం పూర్వం సేనాధిపతులూ మహారాజులూ ఈ మాటను బిరుదుగా వాడేవాళ్ళు – గండరగండ గండభేరుండ వగైరాలుగా గండ శబ్దానికి వీరుడని అర్థం గండరగండ అనే కన్నడ సమాసానికి వీరులకు వీరుడని అర్థం. అలాంటివారినీ లెక్కచేయని వీరాధివీరుడు గండభేరుండంగారు. ఒకప్పటి డినోసార్ల వంటి మహాజంతువులున్న ప్రపంచంలో విపరీత పరిమాణంలో ఉన్న పక్షులుండే వంటారు వాటిలో ఇది ఒకటై ఉండవచ్చు గాని, ఈ జాతి నశించి వేల సంవత్సరా లయివుంటాయి ఇది పురాణాల్లో వినిపించేదేగాని నిజంగా ఉన్నదికాదనే వాళ్ళున్నారు కవుల అతిశయోక్తుల వర్ణనల్లో ఇది పుట్టినా పుట్టి ఉండవచ్చు ఆ మాటకు వస్తే గరుత్మంతుడు కావలసిన జవసత్వాలను సంపాదించటానికి గజకచ్ఛపాలను – వేల యోజనాల పరిమాణం కలవాటిని – కాలికొకటి చొప్పున పట్టుకొని, దారిలో ఇబ్బందిపడి, తరవాత నిర్జన పర్వతపు ప్రదేశాల్లో చంపి తిన్నాడని మహాభారతం

ఆదిపర్వంలో ఉంది ఈ పురాణగాథను నమ్మినప్పుడు గండభేరుండమనే మహాపక్షి ఉందని కూడా నమ్మవచ్చు కేవలం శరీరప్రమాణానికేగాక, సాహసానికీ శౌర్యానికీ ప్రతీకగా ఈ మాటను వాడుతుంటారు విపరీతంగా తినేవాళ్లను, గిల్లికజ్జాలు పెట్టుకొని కయ్యానికి కాలుదువ్వేవాళ్ళను, నిర్భయంగా ప్రవర్తించే వాళ్ళను గండభేరుండంతో పోల్చి చెప్తుంటారు. భాస్కర శతకంలో కోతి చెట్టు కొనకొమ్మమీద ఉంటే చెట్టుకింద ఉండేవాటిలో గండభేరుండాన్ని కూడా చేర్చారు నిజంగా ఉన్నా లేకపోయినా కవుల భావనలో వీరత్వానికి చిహ్నం గండభేరుండం

*గతజలసేతుబంధం:* జలం(నీళ్లు) గతమయిన తరువాత (పోయిన మీదట) సేతువును (అడ్డుకట్టను) బంధించటం (కట్టడం) గతజలసేతుబంధనం నీళ్ళున్నప్పుడు అవి నిలవటానికీ, పార్లి పోకుండటానికీ అవసరమైన అడ్డుకట్టను అవి లేనప్పుడు కట్టడం వృధా శ్రమ జరిగిపోయిన విషయాన్ని గురించి తరవాతికాలంలో బాధపడి, చేసిన తప్పును సవరించుకొన్నందువల్ల సాధించేదేమీ ఉండదు సకాలంలో చేయవలసిన పనిని దరిమిలా చేసినా ప్రయోజనం ఉండదు కొందరు ప్రస్తుత కర్తవ్యం ఆలోచించరుగాని జరిగిన అపకారాలనూ అపచారాలనూ తలచుకొని కుమిలిపోతుంటారు అందువల్ల మనస్తాపమేగాని కర్తవ్యసాధన ఉండదు అలాంటి సందర్భాల్లో గతజలసేతుబంధన మెందుకని హెచ్చరిస్తూ, ఓదారుస్తూ ఈ మాటలు వాడ్తారు

*గబ్బిలాయి:* ఈ మాటకు గబ్బిలం అనేది రూపాంతరం పావురానికి పావురాయిలాగా గబ్బిలానికి గబ్బిలాయి అనే రూపాంతర మేర్పడింది దీని పేరును కూడా స్మరించవద్దనేవాళ్ళు లేకపోలేదు– అమంగళమని దీన్ని విడిగా వాడేకన్నా 'పల్లెటూరు' శబ్దంతో జోడించి నిందార్థంలో వాడుతుంటారు గబ్బిలం పగటిపూట చీకటి గుహల్లోనో గుబురుగా ఉన్న చెట్లమీదనో తలకిందులుగా వేలాడుతుంటుంది రాత్రులు నివాసగృహాల్లోకి దారితప్పి వస్తే, దాన్ని తోలేదాకా జనం నిద్రపోరు పాడుబడ్డ కొంపల్లో గబ్బిలాలు చేర్తాయి కాబట్టి వాటిని అమంగళంగా భావిస్తారు సూర్యరశ్మిని చూడలేవు కాబట్టి వాటికి జ్ఞానజ్యోతి పనికి రాదనుకొని, పల్లెటూరివాళ్ళ అజ్ఞానమనే దుర్భావంతో వాళ్ళను గబ్బిలాయి శబ్దంతో న్యూనపరుస్తుంటారు అజ్ఞానాంధకారంలో ఉన్నారనేవాళ్ళకు ప్రపంచ జ్ఞానం లేదని నిందించటానికి ఈ మాట వాడటం కద్దు

*గంపశ్రాద్ధం:* శ్రాద్ధం అన్నది శ్రద్ధతో చేసే అపరకార్యం అంటే చనిపోయిన వారిమీద ప్రేమానురాగాలతో గౌరవంతో వారికి పుణ్యలోకాలు కలగాలనే కోరికతో చేయవలసిన పని శ్రాద్ధం భావం మంచిదే అయినా అది విసిగించే విచారకరమైన కార్యం మంత్రాలూ తంతులూ స్నానాలూ తడిగుడ్డలూ మొదలయిన ఆచార వ్యవహారాలు కలిగించే విసుగువల్ల పవిత్రభావం స్థానంలో తప్పనిసరి పని అనే నిర్లక్ష్యం, బాధాకరమనే నిర్వేదం చోటు చేసుకొని – శ్రాద్ధం పెట్టడం అంటే విధిలేని, తప్పని, ఇబ్బందిగా పరిణమించింది ఆ మాట చివరికి తిట్టుగా మారింది శ్రాద్ధసమయంలో పితృదేవతలకు పిండాలు పెట్తారు నెల నెలా మాసికాలు, ఊనషాణ్మాసికం, త్రైమాసికం, సాంవత్సరికం – ఇలా ఒక్క సంవత్సరంపాటు ఈ కలాపం తప్పదు అంటే గంపలకొద్దీ పిండాలు పెట్టక తప్పదన్నమాట భక్తితాత్పర్యా లెలావున్నా దానధర్మాలని, భోజన భాజనాలని బోలెడు ఖర్చులు తప్పవు శ్రమ తప్పదు మానాలంటే లోక మేమనుకుంటుందోనన్న భయ మొకటి ఏడిపిస్తుంటుంది అలవి మాలిన ఖర్చులూ బాధలూ అనే అర్థంలో

గంపశ్రాద్ధ మనేమాట వాడుక కెక్కింది 'ఈ గంప శ్రాద్ధపు కాపురం చేయలే'నని మొత్తుకోవటం కద్దు తలకు మించిన భారం అనే అర్థంలో ఈ మాటకు చాలా వ్యాప్తి వుంది

*గర్భం:* వంశాభివృద్ధికీ జాత్యాభివృద్ధికీ ప్రకృతి ప్రసాదించిన విధానం గర్భధారణ దీని ఫలితంగా సంతానోత్పత్తి జరిగినప్పుడు చూడాలని ప్రతి ప్రాణీ ఉబలాటపడుతుంది పూర్వంలా ఇప్పుడు ప్రసూతిమరణాలు మానవజాతిలో తక్కువ జీవరాశుల్లోని అయిదు ప్రాణులు మాత్రం గర్భధారణవల్లకాక ప్రసవానంతరం అంతరిస్తాయని తెలుసుకొన్న పూర్వులు "అళీ కుళీ వృశ్చిక వేణు రంభాః, వినాశకాలే ఫల ముద్భవంతి" అని సూత్రీకరించారు. తుమ్మెదలు, ఎండ్రులు, తేళ్లు, వెదుళ్లు, అరటిచెట్లూ చివరిదశలోనే గర్భం ధరిస్తాయని లేదా పండ్లిస్తాయనీ తేల్చారు. ఈ రకం మరెన్నో ఉండవచ్చు – ఉన్నాయి కూడా నిత్యకృత్యంలో కంటికి కనిపించినవాటినే వాళ్లు పేర్కొని ఉంటారు అరటి పిలకలను గెల దించిన తరవాత ఉంచి, మొక్కను నరికివేయటం పరిపాటి ఎండ్రకాయలూ తేలుపిల్లలూ తల్లి 'కడుపు చీల్చుకొని' బయటపడ్తాయి ఇటువంటి లక్షణాలను పునస్కరించుకొని కొన్ని జాతీయాలు పుట్టాయి

'కర్కటి గర్భ' మనేది ఒక జాతీయం కర్కటి అంటే పీత/ఎండ్రి/ఎండ్రికాయ 'ప్రాణాంతక'మనే అర్థంలో ఈ సమాసాన్ని వాడుతుంటారు అలాగే 'వృశ్చికీ గర్భన్యాయ' మనే దొకటుంది వృశ్చికి అంటే తేలు ఇంచుమించు కర్కటిగర్భమనే అర్థంలోనే ఈ మాటలు చెప్తారు తల్లి చావు పిల్లలను గురించి ప్రస్తావించేటప్పుడు పిల్లల కోసం కలవరించి చివరికి తల్లికాగానే కన్ను మూసిందనీ, ఇలా ఒక మేలు వెంట మరో కీడు రావటం వృశ్చికీగర్భన్యాయమని వివరిస్తుంటారు

*గాజుల మల్లారం:* మల్లార శబ్దానికి మలారమనే రూపాంతరముంది మట్టిగాజుల గుత్తిని మల్లారమంటారు నిజానికి గాజుల మల్లారమని గాజు శబ్దాన్ని చేర్చనక్కరలేదుగాని, ఆ గాజులు మట్టివి కావని గాజువేనని చెప్పటానికి పునరుక్తి అవసరమవుతుంది ఏపాటి పొరపాటు జరిగినా, ఎంత చిన్న తాకిడి తగిలినా గాజులు చిట్లిపోవచ్చు పగిలిపోవచ్చు విరిగిపోవచ్చు గాజులు మంచివయితే ఓటిమోత మోగవు గల్లుగల్లు మంటాయి మల్లారం కదిలిస్తే చిరుమోత వినిపిస్తుంది అయినా, గాజులు సుకుమారమైనవి కాబట్టి వాటిని మలారంనుంచి దించటం, దానికి ఎక్కించటం సుతారంగా, సున్నితంగా చేయవలసిన పని అందువల్ల మల్లారమే సుకుమారమైన వస్తువనే భావం పుట్టింది మాట పెళుసుగా వాడినా, పని మొరటుగా చేసినా ఫలితం దక్కదని, వ్యతిరేక ఫలితం రావచ్చుననీ హెచ్చరించటానికి "జాగ్రత్త! ఇది గాజుల మల్లారం లాంటి వ్యవహారం" అని హెచ్చరించటం కద్దు గాజులు కదిలించినా సుకుమారంగానే కదల్చాలి అలాగే పని సుతార మనటానికి ఈ మాట వాడుతుంటారు

*గాడిద గత్తర:* గత్తర అంటే గోల గాడిదలు ఓండ్రపెడ్తూ గోలగోలగా చికాకు పెట్టడాన్ని గాడిద గత్తర అంటారు ఇది కాకిగోలకన్నా దుర్భరం ఒకరి మాట ఒకరు వినిపించుకోకుండా కర్ణ కఠోరంగా అరుస్తూ పోట్లాడుకుంటుంటే "ఏమిటే గాడిద గత్తర" అని కోపగించుకుంటారు గాడిదకు బుద్ధిలేదనే భావంకూడా కలిపి తెలివితక్కువ తగాదాలనుకూడా గాడిత గత్తర అంటారు

**గాడిద గుడ్డు:** గాడిద నాలుక్కాళ్ళ జంతువు అది పిల్లల్నే కంటుందిగాని గుడ్లు పెట్టదు కాబట్టి గాడిదగుడ్డనేది కుందేటికొమ్ములాగా లేనిదానితో సమానం ఏమీ లేదనటానికి 'ఏముందీ? గాడిదగుడ్డు' అంటారు. గాడిదగుడ్డంటే శూన్యం. ఈ మాటను విసుగుతో నిందార్థకంగా మాత్రమే వాడ్తారు.

**గాడిదపిల్ల కోమలం:** మానవజాతిలోనేగాక సమస్త పశుపక్ష్యాదుల్లో కూడా పిల్లలు కోమలంగా (మృదువుగా) అమాయకంగా, చెలాకీగా ఉంటాయి. అందులో అనుమానం లేదు కాకపోతే ప్రత్యేకించి ఎందుకు ఈ మాట పుట్టిందనేది మాత్రమే ప్రశ్న. గాడిద మూర్ఖపు జంతువనటానికి నీతిచంద్రికలో కుక్కకు బదులు తాను అరిచి చావుదెబ్బలుతిన్న కధే నిదర్శనం 'అడ్డగాడిద, గాడిద బుద్ధి' వగైరాలు అనేకం వాడుకలో ఉన్నాయి అడ్డాలలో బిడ్డ అన్నట్లు పసితనంలో ఉన్న గాడిదను అడ్డగాడిద అంటారని కొందరు చెప్తారు మరికొందరు అడ్డ అంటే అర్ధ (సగం) అని, 'చిన్నగాడిద' అనే అర్థముందని వివరిస్తారు అటువంటి తెలివితక్కువగాడిద బిడ్డకూడా మెత్తగా ఉంటుందనేది వాస్తవం మెత్తగా అంటే శాంతంగానూ మృదువుగానూ. 'గాడిదకన్నా శాంతముం దాయనకు' అనటం కూడా కద్దు – 'గాడిదతన్నులు' తన్నేదాకా. శ్రీనాథుడు కాబోలు 'గాడిదపిల్ల కోమలముగా కనిపించును యౌవనంబునన్' అనే చాటువు విసిరాడు ఏ దరిద్రుడి, దీనుడి, అభాగ్యుడి బిడ్డ అయినా చక్కగా ఉంటే – వాస్తవం అంగీకరించటం ఇష్టపడక 'ఆఁ – ఏముంది? గాడిదపిల్ల కోమలం' అని వెక్కిరింతగా మాట్లాడటం కద్దు ఇష్టంలేని వ్యక్తుల మంచితనం, చక్కదనంవంటి సుగుణాలను మన్నించి మాట్లాడటం ఇష్టంలేకపోతే ఈ జాతీయం వాడి చప్పరిస్తుంటారు.

**గానుగెద్దు:** పొలం దున్నటానికి పనికిరాని ఎద్దు గానుగాడటానికి పనికివస్తుంది అది చెరుకుగానుగ కావచ్చు సున్నం గానుగ కావచ్చు. దాని కళ్ళకు గంతలు కట్తారు అందువల్ల చుట్టూవున్న ప్రపంచం దానికి కనిపించదు. గానుగ చుట్టూ తిరిగే దారి మాత్రం చూడగలదు ఏదో ఒక పనికి అంటిపెట్టుకొని ఉండి, చేసేపనితప్ప మరేమీ తెలియని, తెలుసుకోలేని వ్యక్తిని గానుగెద్దుతో పోలుస్తారు. దానికో క్రమ ముంటుంది మార్పుండదు పనిలో అభివృద్ధి ఉండదు స్వాతంత్ర్యం అసలే లేదు అలా నిర్విరామంగా నిరుత్సాహంగా శ్రమించి బతుకీడ్చే వ్యక్తులు గానుగెద్దులు. వారు చేసే పనికి గుర్తింపు గాని, గౌరవంగాని లేదు. అలాగని చేయకా తప్పదు వారికి ఇతరుల సానుభూతి లభించదు. పైపెచ్చు ఈసడింపు పుష్కలం మెప్పులేని సేవచేసే వ్యక్తి గానుగెద్దు కూపస్థమండూకంలా లోకం పోకడ తెలీని వ్యక్తి గానుగెద్దు

**గుగ్గిళ్ళ వ్యాపారం:** నూనెలో వేయించి గుగ్గిళ్ళు చేసి అమ్మకానికి తీసుకపోతే వీలయినంత త్వరలో వాటిని అమ్మితీరాలి. వేడి తగ్గితే బేరం తగ్గుతుంది కాలం గడిస్తే వాసన వచ్చి కొనేవాళ్ళు దొరకరు పప్పులు బాగుచేసి, వేయించి, బుట్టలో పెట్టి నెత్తిన పెట్టుకొని అరుస్తూ తిరిగినందుకు అవి మెత్తబడ్డా, చద్ది వాసన వచ్చినా ప్రతిఫలం లభించదు ఇంతా చేసి అవి ఖరీదయిన తినుబండారాలు కావు వాటి తయారీకి ప్రత్యేక శ్రద్ధానైపుణ్యాలూ అక్కరలేదు. బేరగాళ్ళు తిండీ గుడ్డా అంతగా లేని సామాన్యప్రజలు. గుగ్గిళ్ళు తిని నీళ్ళుతాగి కడుపు నింపుకోవలసిన వాళ్ళు అందువల్ల చౌకగా వేడిగా అమ్మితే తప్ప గుగ్గిళ్ళ వ్యాపారంలో గడించగలిగేది చాలా తక్కువ శ్రమ చాలా ఎక్కువ లాభసాటిగాని గొర్రెతోకలాంటి చిన్నవ్యాపారమది.

ఆ భావంతో గిట్టుబాటుగాని వ్యాపారాన్ని గుగ్గిళ్ళ వ్యాపార మంటారు. రోజంతా శ్రమించినా శ్రమకు తగ్గ ప్రతిఫలం లేనివాళ్ళు తాము వ్యాపారమే చేయకపోయినా ఏం చేస్తున్నారంటే గుగ్గిళ్ళ వ్యాపారమని బాధపడటం కద్దు

*గుడ్డిగుర్రం:* గుర్రం గుడ్డిదయినా దాణాకు లోపం లేదు అనేది సామెత గుర్రం గుడ్డిదయినంతమాత్రాన తిండి మానుకోలేదు సరిగదా, గడ్డి వాసన వచ్చినంతమేరకు మేసి తీరుతుంది 'గుడ్డెద్దు చేలో పడ్డట్లు' నోటికి అందినంతమేరకు భక్షిస్తుంది, అగదు అది పచ్చిగడ్డా, ఎండుగడ్డా, పంటచేనా అన్న విచారం దానికుండదు అలాగే ఎవరేమనుకున్నా, తాననుకున్న పని అనుకున్నట్లుగానే చేస్తూ పోయే వ్యక్తులను కూడా గుడ్డిగుర్రా లంటారు మనుషుల విషయంలో గుడ్డితనం ప్రధానం కాదు చూపున్నదా లేదా అన్నది ప్రశ్న కాదు చూస్తున్నాడా లేదా అన్నది ముఖ్యం చూస్తూకూడా చూడనట్లు, కనపడేనట్లు నటిస్తూ తన సంగతి జాగ్రత్తగా చూసుకొనే వ్యక్తి గుడ్డిగుర్రం ఈ బాపతు మనుషులకు దయాదాక్షిణ్యాలుగాని, మంచిచెడ్డల విచక్షణగాని, లోకాభిప్రాయాన్ని ఖాతరు చేయటంగాని ఉండవు తాము ఆడిందే ఆట, పాడిందే పాట అలా ఎవర్నీ దేన్నీ పట్టించుకోకుండా స్వలాభం చూసుకొనే పెద్దలు గుడ్డిగుర్రా లన్నమాట

*గుడ్లగూబ:* మన దేశంలో అత్యధిక సంఖ్యాకులు – ముఖ్యంగా రాత్రివేళల – ఈ పక్షి పేరెత్తటానికిక్కూడా భయపడతారు పాతకాలపువాళ్ళు పగటిపూట కూడా దీన్ని 'పెద్దపక్షి' అని మాత్రమే పిలుస్తారు అది రెప్పవాల్చకుండా పెద్ద పెద్ద కళ్ళతో చూస్తుందని – మిడిగుడ్లతో మిటకరించి చూసేవాళ్ళని గుడ్లగూబలని పిలవటం కద్దు అయితే, పాశ్చాత్య దేశాల్లో ఇది విజ్ఞానానికి చిహ్నం దీన్ని పెంచుకునేవాళ్ళు చాలామంది ఉన్నారు గుడ్లగూబకు సులోచనాలు తగిలించి బొమ్మలు వేసి విజ్ఞాన గ్రంథాలను ప్రచురిస్తుంటారు మన దేశంలో గుడ్లగూబ ఇంటి మీద వాలితే అపశకునమని భావించి ఇళ్ళు పాడుపెట్టే వాళ్ళున్నారు! పంచతంత్రంలో కాకోలూకీయమనే కథాభాగముంది కాకం అంటే కాకి ఉలూకం అంటే గుడ్లగూబ ఆ కథలో రాత్రులు గుడ్లగూబలు మండే కొరువులను కాకిగూళ్ళమీద పడవేసి శత్రు విధ్వంసం చేసినట్లు రాశారు ఆ మాటలు వాటి తెలివితేటలకేగాని తెలివితక్కువతనానికి నిదర్శనా లనలేం కదా? బహుశా ఆర్యసమాజంలో వాటికి మొదటినుంచీ గౌరవమున్నా దాక్షిణాత్య ద్రవిడ సమాజంలో అందుకు విరుద్ధమైన విశ్వాసా లున్నవని భావించాలి తెలివితక్కువ దద్దమ్మలా దేబిరించి చూసే వ్యక్తిని గుడ్లగూబ అని వ్యవహరించటం మన సంప్రదాయం తద్విరుద్ధంగా గౌరవించటం పాశ్చాత్య సంప్రదాయం

*గుంట ఓనమాలు:* "ఓనామః, శీవాయః" అని 'ఓం నమశ్శివాయ' అనే మంత్రాన్ని అక్షరాభ్యాస సమయంలో వికృతం చేసి చదివిస్తూ ఉంటారు శివశబ్దోచ్చారణ వైష్ణవులకు సరిపడదు కనక "ఓంనమః" అన్నంత వరకు ఓం అనే ప్రణవమంత్రానికి నమస్కరింపజేసి అక్షరాభ్యాసం మొదలుపెట్టారు. శివశబ్దస్థానంలో విష్ణుస్మరణ చేయిస్తారు మొత్తం మీద అందరికీ ఆమోదయోగ్యమైన భాగం మొదటి మూడక్షరాలకు పరిమితం దాన్ని విశేష్యశబ్దంగా భావించి తెలుగు బహువచన ప్రత్యయం చేర్చి ఓనమా లనటం పరిపాటి, తెలుగుదనం కల్పించి పలకలు కూడా లేని కాలంలో నేలమీద కొంతభాగం చదును చేసి సాఫీగా చేసి దానిమీద అక్షరాలు రాసి పిల్లల చేత ఆ గీతలను దిద్దించే వాళ్ళు

దిద్దగా దిద్దగా వేళ్ళు బండబారేవి. నేలమీద గుంటలు పడేవి అలా గుంటలు చేస్తూ నేర్చుకొనే ఓనమాలను గుంట ఓనమాలన్నారు. విద్యాభ్యాసంలో ఇది మొదటి అంచె కాబట్టి గుంట ఓనమాలంటే తొలిమెట్టు అనే అర్థం వాడుకలోకి వచ్చింది.

అక్షరాలనే నేలమీద రాసి దిద్దుకోండని బడిపంతులుగారు సొంత పనులు చూసుకొంటుంటే పిల్లలు క్రమంగా దిద్దేవాళ్లు కాదు. తెలివైన పిల్లలు వేళ్లతో కుళ్ళగించి గుంటల లోతు పెంచి చాలా శ్రమపడ్డట్లు, వందలసార్లు దిద్దినట్లూ నటించేవాళ్లు. గురువులు ఏ చీపురుపుల్లనో తీసుకొని గుంటలో అక్కడక్కడ మచ్చుకు లోతెంత ఉందో కొలిచేవాళ్లు. నిజంగా దిద్దివుంటే గుంట అంతటా సమానమైన లోతు ఉంటుంది. కుళ్ళగించిన గుంటల్లో లోతులు అసమానం. ఆ పరీక్ష పూర్తి చేసి, మోసగించిన పిల్లలను దండించటం కద్దు. దొంగతనం బయట పడకుండా నేర్పుగా కుళ్ళగించిన విద్యార్థి బడాయిమాటలు కూసి, మరు రోజున శిక్ష అనుభవించటం పాతకాలపు అనుభవం

**గుంట బెట్టు:** మతభేదాలను బట్టి ఆచారాలు మారుతుంటాయి. వైష్ణవులు శవదహనం చేస్తే శైవులు పూడ్చిపెట్టారు. ఇలా మతాచారాలనుబట్టి శవ సంస్కారం చేస్తారు గుంటలో పెట్టడమంటే పూడ్చిపెట్టడం అంటే, రూపుమాపటం, నాశనం చేయటం మళ్ళీ తిరిగి రాకుండా ఏర్పాటు చేయటం అనే భావంతో గుంటబెట్టారంటే ధ్వంసం చేశారని, చంపారని, పాతిపెట్టారని అన్నట్లు. ఈ దృష్టితో ఈ జాతీయం పుట్టింది.

**గుర్రం చెవులు కడగటం:** గుర్రాల పెంపకం, గుర్రబ్బండ్ల నిర్వహణ తగ్గిపోయినందువల్ల ఈ మాటక్కూడా వాడుక తగ్గిపోయింది గుర్రానికి రోజూ మాలిషు చెయ్యాలి. అంటే – మర్దనం చెయ్యాలి. నీళ్ళతో కడిగి స్నానం చేయించాలి. నూనెతో ఒళ్ళంతా తోమి కడగాలి. ఆ సమయంలో పొరపాటున అయినా దాని చెవుల్లోకి నీళ్ళుపోతే ఇంతే సంగతులు. దానికి విపరీతమైన చెవిపోటు వస్తుంది. అలివికాదు ఎగిరిపడుతుంది. జబ్బు పడుతుంది. అందువల్ల గుర్రం చెవులు కడిగేవాడు అజ్ఞాని మూర్ఖుడు. అసమర్థుడు. గుర్రబ్బండ్లు ఎక్కడబడితే అక్కడ కనిపించే రోజుల్లో ఒక బండివాడు రెండోవాణ్ణి సుకుమారంగా తిట్టదలిచినప్పుడు 'పోరా, గుర్రం చెవులు కడిగేవాడా!' అని నిందించేవాడు, విషయజ్ఞానంలేని మూర్ఖుడనే అర్థంలో.

**గువ్వకుత్తుక:** గువ్వ అంటే అడవిపావురం సహజంగా ఆరోగ్యంగా బలంగా ఉంటుంది, తిండికి లోపం లేదు కనుక. గువ్వ ఎంత తిన్నా దాని గొంతు (=కుత్తుక) మాత్రం బలహీనంగానే వినిపిస్తుంది. అది కువకువలాడుతుంటే పది రోజులు తిండి లేనివాడు పలకరించినట్లుంటుంది. బావిలో పడ్డవారు కేకలు పెట్టినట్లుంటుంది అంటే – హీనస్వరంలా వినిపిస్తుంది. అది సహజమైన కంఠధ్వనేగాని బలహీనతకు నిదర్శనం కాదు. కొందరు భీమబలు లుంటారు. మీసాలమీద నిమ్మకాయలు నిలుపుతారు అయితేనేం? వాళ్లగొంతుమాత్రం పీలగా, సన్నగా, హీనస్వరంగా ఉంటుంది. ఆ లక్షణాన్ని గువ్వకుత్తుక అంటారు. అంటే – హీనస్వరం అన్నమాట. ఒక్కోసారి ఎంత గంభీరస్వరమున్న వ్యక్తి అయినా దుఃఖంవల్లనో, బాధవల్లనో సన్నగా హీనస్వరంతో మాట్లాడితే అయనకు గువ్వకుత్తుక పడ్డదంటారు. ఈ లక్షణాన్ని కావ్యాల్లో 'ఎలుంగు రాల్పడ నేడ్చెన్' అని వర్ణించేవాళ్లు. దుఃఖభారంలో కూడా బావురుమని గొంతెత్తి

ఏడ్చేవాళ్ళుంటారు. ధృతరాష్ట్రుడు తన పిల్లల చావువిని 'అవరచిన ట్లరచెన్' అని తిక్కన వర్ణించాడు! ఇందుకు కేవలం వ్యతిరేకమైన లక్షణం గువ్వకుత్తుక.

గొడారి బేరం: గొడారి శబ్దం గొడగరికి రూపాంతరం. తోలుపనివాడని అర్థం. ఈ జాతీయాన్ని రెండు విధాల వ్యాఖ్యానిస్తుంటారు. 'గొడారి దగ్గర తోలుకొన్నట్లు' అన్న సామెత ఒకటుంది. తోలుకొని, దానితో చెప్పులూ, వారెలూ తయారుచేసి అమ్ముకొని బతికేవాడు ఆ తోలునే అమ్మి బతకలేడు– కాబట్టి అమ్మడు అంటే, అసాధ్యమని, కాని పని అనే అర్థాల్లో ఈ సామెత పుట్టింది. గొడారి బేరంలో క్రయమే గాని విక్రయం లేదు – అంటే కొనటమేగాని (ఆ ముడిపదార్థాన్ని) అమ్మటమన్న ప్రశ్నే లేదు. గొడారి బేరం చేసి జంతువును కొనేటప్పుడు దాని చర్మం తనకెంతవరకు ఉపయోగపడుతుందో ఆలోచించుకొని కొంటాడేగాని దాన్ని పోషించి పాలు పిండి అమ్మి బతకాలనుకోడు. మొత్తం జంతువును బేరం చేసి కొన్నా దాని తోలు ఒలిచి ఉపయోగపెట్టడానికే కొంటాడు కాబట్టి వీలయినంత తక్కువ ధరకే కొంటాడు. పైపెచ్చు అతడికి కొనగలిగిన స్తోమతు కూడా చాలా తక్కువ. వీలయితే ఊరికే తీసుకపోతాడేగాని డబ్బిచ్చి కొనలేడు అలా వీలుకాకపోతే చెప్పుల రూపంలో వస్తు వినిమయం వాగ్దానం చేసి గొడ్డును తీసుకపోతాడు ఫలితంలో గొడారి బేరం కనిష్ఠాతికనిష్ఠ మన్నమాట. పేరుకు బేరమే గాని ప్రతిఫలం లేని, ఇవ్వని, ఇవ్వలేని బేరగా డతడు. అందువల్ల గొడారి బేరమనే జాతీయానికి కన్నీటి తుడుపు బేరమనే అర్థం. బేరం కాని బేర మది చివరికి 'వృథాప్రయాస, అనవసర పరిశ్రమ, కక్కుర్తి బేరం' అనే అర్థాల్లో ఈ జాతీయం వాడుకలో ఉంది.

గొడ్రాలు, గొడ్డుమోతు: మొదటి మాటకు గొడ్డురాలు అనే రూపాంతరముంది. అలాగే రెండోదానికి గొడ్డుబోతు అనే రూపభేదముంది. అలు స్త్రీవాచకం, పోతు పురుష వాచకం. ఈ రెంటికీ సంతానం లేనివాళ్ళనే అర్థం. గొడ్డు శబ్దానికి 'సంతులేని' అనే విశేషణార్థం ఎలా వచ్చిందో తెలీదు. కానీ వచ్చింది. పెద్దలు నిస్సంతు అనే భావానికి ప్రకృతి పరిశీలన జ్ఞానంతో అర్థవిస్తృతి సాధించారు. అప్పట్లో 'అష్టపుత్ర బహుధనావాప్తి రస్తు' అని (కనీసం) ఎనిమిది మంది పిల్లలను కనమని ఆశీర్వదించేవాళ్ళు. ఆ కాలంలోనే 'కోడలు కంటానంటే అత్త వద్దంటుందా?' అనే సామెత కూడా పుట్టింది. ఆ దృష్టితోనే "కాక వంధ్య, కదళీ వంధ్య" అనే మాటలు పుట్టించారు. వంధ్య అంటే గొడ్రాలు. గొడ్రాలితనంలో మరి రెండు రకాలు తేల్చారన్నమాట. ఆ మాటకు ఒక్క బిడ్డను మాత్రమే కన్న గొడ్రాలని అర్థం! కాకి ఒక్క గుడ్డు మాత్రమే పెట్టుండేమో – జంతుశాస్త్రజ్ఞులో పక్షిశాస్త్రజ్ఞులో చెప్పవలసిన మాట. కదళి అంటే అరటి. సాధారణంగా పిలక పుట్టగానే అరటిచెట్టును కొట్టి వేస్తారు. అలా చేయకపోతే మరో పిలక పుట్టి అంతటితో వంశ విస్తరణ ఆగిపోతుందేమో – అంతకన్నా తెలీదు. అయితే, ఇద్దరు పిల్లలను మాత్రమే కన్నస్త్రీని కదళీవంధ్య అనేవాళ్ళు. లోకప్రవాదంలో మాత్రం అరటిచెట్టు పిలక పుట్టగానే చస్తుందని ఉంది. అరటిచెట్టుకు మరో ప్రయోజనం కూడా ఉండేది పాతకాలంలో. బాలింత చూలింత చావులు విపరీతంగా ఉన్న రోజుల్లో పిల్లల కోసం ఒక భార్య చనిపోగానే మరొకరిని పెళ్ళాడే దుస్సంప్రదాయం ఉండేది. ఆరుగురు భార్యలు వరస వెంట చనిపోతే ఏడో పెళ్ళి చేసుకొనే మగవాడిచేత అరటిచెట్టుకు తాళి కట్టించేవాళ్ళు! తరవాత పెళ్ళి

కూతురి మెడకు కట్టించేవాళ్ళు. సుప్రసిద్ధ తెలుగు కవి వడ్డాది సుబ్బారాయుడుగారు (భక్తచింతామణి శతకకర్త) అరటిచెట్టుకు తాళిగట్టిన అభాగ్యుణ్ణని చెప్పి వాపోయారు! ఈ ఏడో భార్య కదళీవంధ్య కావాలనే ఉద్దేశం ఉండేదేమో తెలీదు. కాలంతోబాటు సమాజధర్మం మారుతుంది కాబట్టి, ప్రస్తుతం 'ఇద్దరు లేదా ముగ్గురు' అనే నినాదం ఇద్దరితో సరిపెట్టుకొమ్మని మారినట్లు, భవిష్యత్తులో కాకవంధ్యత్వందాకా పరిమితం కాదని చెప్పలేం

**గొంతుసన్నం గోవిందరాజులు:** విష్ణుమూర్తికున్న వేలాది పేర్లలో గోవిందరాజులనేది ఒకటి దీనికి రాయలసీమ దక్షిణ ప్రాంతంలో, తమిళనాడు సరిహద్దుల్లో వ్యాప్తి ఎక్కువ. తిరుపతిలో కూడా గోవిందరాజస్వామి విశ్రాంతిగా, తలకింద మానిక పెట్టుకొని పడుకొని ఉంటాడు. పెళ్ళికి కుబేరుడి దగ్గర తెచ్చుకొన్న సొమ్ముకు చెల్లించేందుకు ఆయనకు మానిక అవసరమట. ఆయన అప్పుచేసేనాటికి కాగితం కరెన్సీ లేదు–అంతా రొక్కం, నగదు. అందువల్ల ఆ చిల్లర సంపాదనను – భక్తులు తనకు సమర్పించుకొన్న చిల్లరడబ్బును – మానికల్తో కొలిచి చెల్లిస్తుంటాట్ట పాపం!

రెండో ప్రపంచ యుద్ధ మయిన తరువాత కూడా చాలాకాలం రూపాయి బిళ్లలే నోట్లకన్నా ఎక్కువ వాడుకలో ఉండేవి (ఇప్పుడు లేవనికాదు) వాటిని వెయ్యేసి చొప్పున అల్లిన సంచుల్లో పోసి మూతికట్టేవాళ్ళు. అందుచేతనే "ఆ పెళ్ళికి ఇన్ని సంచుల కట్నం చదివించారు" లాంటి మాటలు పుట్టాయి. అప్పట్లో గవర్నమెంటు ట్రెజరీల్లో తూకంవేసి నోట్లకు బదులుగా రూపాయలను మార్చి ఇచ్చేవాళ్ళు అరిగిన రూపాయలుంటే ఒకటి రెండు ఎక్కువ వచ్చేవి! ఒక్కోరూపాయి బరువు తులం ఉండేది రెండో ప్రపంచ యుద్ధానికి ముందు వెండి రూపాయలే ఉండేవి. కాలం మార్పుతో దరిద్రం పెరిగింది. నికెలు నాణేలు వచ్చాయి అలనాటి దమ్మిడీలు రాగివి అవి రూపాయికి 192. రాగికి ఇప్పుడున్న ఖరీదు ప్రకారం రూపాయికి అన్ని రాగిదమ్మిడీలిస్తే ప్రభుత్వం దివాలా తీస్తుందనుకోండి. అదంతా వేరే విషయం.

నగదు గోవిందరాజస్వామికీ సంచులకూ మానికలకూ ఉన్న సంబంధం పాతకాలాన ఇది. ఇటీవలి కాలంలో అంతటి దేవుడిపేరు మరో వస్తువుకు పెట్టారు – వృత్తి మాండలికంలో, ముఖ్యంగా వైష్ణవపరిభాషలో. సీసాలకు గొంతు సన్నంగా ఉంటుందికదా, మద్యం నింపిన సీసాలకు బయటివాళ్ళు విన్నా విషయం తెలీకుండా ఉండేందుకు "గొంతు సన్నం గోవిందరాజుల వారిని ప్రవేశపెట్టు – పెద్దలు వేంచేశారు!" అనడం కద్దు వారేంచేస్తున్నారంటే – గోవిందరాజస్వామి సేవలో ఉన్నారనటం వినిపిస్తుంది అంటే శ్రీవారు మద్యసేవలో ఉన్నారని అర్థం. గొంతుసన్నమన్న సంగతికూడా ప్రస్తావిస్తే సాధారణంగా అది బీరు అని అర్థం చేసుకోవాలి.

**గొంతులో (పచ్చి) వెలక్కాయ:** వెలగకాయ ఎంత చిన్నదయినా గొంతులో అది ఇమడటం అసాధ్యం – ఎంత పెద్ద నోరున్నవారికయినా. కొందరు పచ్చి అనే విశేషణం లేకుండా ఈ మాట వాడుతుంటారు. అది నిజంగా పడితే మెత్తపడే వస్తువు కాదు కాబట్టి ప్రాణాంతక మవుతుంది. ఒక పట్టాన జీర్ణమయ్యేది కాదుకాబట్టి నానా అవస్థలూ పడి మింగినా కొంప తీస్తుంది. వెలగపండయితే గాలి పోయిన బంతిలా కొంచెమైనా ఎగురుతుంది. గట్టిగా ఊదితే అవతల పడవచ్చు. పచ్చిదయితే ఎత్తిపడేస్తే

పడేసినచోట ఉంటుంది అంత గట్టి డిప్పతో వెలక్కాయ గొంతుకు అడ్డం పడితే అంతే సంగతులు. ప్రమాదకరం, ప్రాణాంతకమనే అర్థంలోనే బహుశా ఈ విపరీత దృష్టాంతం వాడుకలోకి వచ్చి ఉంటుంది. 'పచ్చి' కాదు 'వచ్చి' (తనంతట తానుగానో ఎవరయినా పడేస్తేనో) గొంతులో పడవచ్చునని కొందరి భాష్యం.

చిత్రమేమిటంటే – మామూలుగా బోధపడే విషయాన్ని శాస్త్రంగా భావించి వ్యాఖ్యానిస్తేగాని పండితులు ,కాదు గిరీశం చెప్పిన 'కుప్పుస్వామయ్యర్ మేడ్ డిఫికల్టు'లాగా శాస్త్రపరంగా చర్చించటానికి కొందరు వైద్యశాస్త్రాన్నీ ఆయుర్వేదాన్నీ ఉదాహరిస్తారు. ఓ శ్లోకముంది– "వార్తాకం కోమలం పథ్యం, కూష్మాండం కోమలం విషం, కపిత్థం సర్వదా పథ్యం, కదళీ న కదాచన" అని. దీన్ని తమకర్థమయిన పద్ధతిలో వివరిస్తూ 'వార్తాకం' (వంకాయ) లేతదయితే పథ్యంగా మంచిది. గుమ్మడి ముదిర్తేనే పథ్యం కపిత్థం (వెలగ) సర్వదా (ఎల్లప్పుడూ) పథ్యమేగాని, కదళి (అరటి మాత్రం) ఎప్పుడూ (పథ్యం) కాదని వ్యాఖ్యానించటం పరిపాటి మొదటి రెండు వస్తువుల విషయంలోనూ పేచీ లేదు. కానీ శ్లోకం పేర్కొన్నది బూడిదగుమ్మడినేగాని మంచి గుమ్మడిని కాదు. మంచిది – విదేశాలనుంచి వచ్చింది. అందుకే అది శ్రాద్ధ యోగ్యం కాదు అది విశ్వామిత్ర సృష్టిలోని వస్తువు. అపర కర్మల్లో, అశుభకార్యాల్లో (అవి మతాచారాలకు లోపం రాకూడని సందర్భాలు కాబట్టి) మంచి గుమ్మడి పనికిరాదంటారు. అందుచేతనే గుమ్మడి పులుసు, ధప్పళం అనేవి శుభకార్యాల్లో మాత్రమే ఉపయోగించే వంటకాలు. లేతగా ఉన్న బూడిద గుమ్మడి దేనికీ పనికిరాదు.

ఇక శ్లోకంలోని రెండో భాగంలో తిరకాసుంది. కపిత్థ మనేది ఎల్లప్పుడూ పథ్యమయితే – కదళి కాదు. ఒకవేళ మొదటిది అపథ్యమైతే రెండోది అన్ని సమయాల్లోనూ పథ్యమే 'సర్వదా', 'పథ్యం' అనే మాటల మధ్య రాతలో తెలుగువాళ్ళు 'పరక' అనీ, సంస్కృతంలో 'అవగ్రహ' అనీ పిలిచే గుర్తున్నట్లయితే ఏది పథ్యం ఏది కాదనే వివరణ తలకిందులుగా మారిపోతుంది. 'సర్వదా పథ్యం' అనేది సవర్ణదీర్ఘసంధి రూపమయితే (సర్వదా అపథ్యం). అరటి లేతయినా ముదురయినా ఎప్పుడూ పథ్యమేనని, ఎట్టి పరిస్థితుల్లోనూ వెలగకాయగాని, పండుగాని పథ్యంకానే కాదనీ అర్థం వస్తుంది ఇదే సరైన భావం ఏనుగులు తిని జీర్ణం చేసుకోలేని వెలగ పండు (లేదా వెలక్కాయ) రోగులకు జీర్ణమవుతుం దనుకోవటం విడ్డూరం – వింతల్లో వింత ఆ శ్లోకాన్ని సంస్కృతంలో మాట్లాడే కాలంలో సవర్ణదీర్ఘమున్నట్లు విడమరిచి చదివి ఉంటారు. రాసినప్పుడు అవగ్రహతో రాసి ఉంటారు. కేవలం వినికిడి మాటల పాండిత్యమున్న ఆయుర్వేద వైద్యులు, అటు అనుభవంగాని ఇటు శాస్త్ర 'వాసన'గాని లేని స్థితిలో వెలగకాయ, వెలగ పండు పథ్యానికి పనికి వస్తాయని నమ్మి ఉండవచ్చు. ఈ నమ్మకం, ఈ భేషజం ఎందరు రోగులను ఆపదలో పడేసిందో చిత్రగుప్తుడికే తెలియాలి రోగుల గొంతుల్లో మాత్రం పచ్చి వెలగకాయే పడి, ప్రాణాంతకమయి ఉంటుంది

*గొంతెమ్మ కోరిక:* తీరని, అసాధ్యమయిన కోరికలను గొంతెమ్మ కోరిక అంటారు. కుంతీదేవికి తెలుగు పేరు గొంతి. చివరి అమ్మ శబ్దం చేర్చి గొంతెమ్మ అన్నారు. అటు పాండవులూ ఇటు కర్ణుడూ అంతా బతికి వుండాలని ఆమె కోరుకున్నది. పాండవుల్లో – ముఖ్యంగా, అర్జునుడు భారతయుద్ధంలో గెలవా లనుకోవటం బాగుంది.

కానీ తానే తన కొడుకని ఆఖరిక్షణందాకా చెప్పక దాచి, కర్ణార్జునుల్లో ఎవరో ఒకరు మాత్రం బతుకుతారనే నిర్ణయానికి వారిద్దరూ వచ్చిన తరవాత ఇద్దరూ బతకాలని కోరుకోవటం సాధ్యమయ్యే పనికాదు అలా వీలుకాని, ఎన్నటికీ తీరని కోరికలను గొంతెమ్మ కోరిక లంటారు

గోడచేర్పు: గోడచేర్పంటే ఆసరా, సహాయం, మద్దతు గోడకు ప్రాణం లేదు. అది ఒక జడపదార్థం. కదలిక లేనిది. గోడలాగనే ఆధారమాత్రంగా ఉండి మరేవిధమైన మానవ సహాయంలాటిదీ లేని మద్దతును గోడచేర్పు అంటారు అసమర్థుడైన భర్త, పనికిమాలిన ఉద్యోగం, మాట సహాయం గూడా లేకపోయినా మౌనంగా తోడుండటం వంటివన్నీ గోడచేర్పు కిందనే లెక్క 'ఆడదానికి గోడచేర్పు అవసరం' అనే నానుడి మన సమాజంలో స్త్రీకి ఉన్న అసహాయస్థితికి అద్దం పట్టుతుంది ఏనాటివాడో ఒక సంస్కృత కవి "నిరాశ్రయా న శోభంతే కవితా వనితా లతాః" అని కవిత్వమూ, తీగె, స్త్రీ ఏదో ఒక ఆధారం, ఎవరిదో ఒక సహాయం, ఏదో ఒక మగదిక్కు, ఏదో ఒక గోడచేర్పు లేకపోతే శోభించవని అన్నాడు

గోముఖవ్యాఘ్రం: గోవంటే ఆవు వ్యాఘ్రం అంటే పెద్దపులి నీతికథల్లో ఒకానొక పెద్దపులి ఆవుతోలు కప్పుకొని వేటకు బయలుదేరింది. ఆవనుకున్నవాళ్లు అన్యాయమయిపోతారు పైకి సాధువుగా కనిపిస్తూ మనసులో ప్రవర్తనలో క్రూరంగా ప్రవర్తించే వాళ్లను గోముఖ వ్యాఘ్రాలంటాం. 'ఆవుమొకంపులి' అని తెలుగులో ఎవరూ అనరు – మక్కికి మక్కి అనువాదంచేసి. మన వాడుక "మేకవన్నె పులి" అని మాత్రమే తెలుగులో శరీరవర్ణానికే ప్రాముఖ్యంగాని తెచ్చిపెట్టుకొన్న ఆవుమొకం ముసుక్కు ప్రాధాన్యం లేదు పులి ఒంటిమీది చారలను తెలుగువాళ్లు పట్టించుకొన్నట్లు లేదు రుద్రాక్ష పిల్లి/పులిలాగా గోముఖవ్యాఘ్రం పయికి నమ్మదగినట్లే కనిపించి, ప్రాణాంతకమవుతుంది అలా పైకి మెత్తగా కనిపిస్తూ ప్రాణం తీసే పాపాత్ములను గోముఖవ్యాఘ్రాలని సంస్కృతపదాలతోగాని, మేకవన్నెపులి అని తెలుగుమాటలతోగాని వ్యవహరిస్తారు

గోరోజనం: ఈ మాటకు 'గోరోజం' వంటి రూపాంతరాలూ 'రోచన' వంటి పర్యాయపదాలూ ఉన్నాయి ఆవు కడుపు తిత్తినుంచి వైద్యం నిమిత్తం తీసే పదార్థమిది దీన్ని పిత్తాశయం నుంచి తీస్తారు కాబట్టి ఇది పైత్యానికి చిహ్నమయిపోయింది నిజానికి ఈ వస్తువుకూ మనుష్య స్వభావానికీ ఎటువంటి సంబంధమూ లేదు కానీ 'ఆయనకు గోరోజనం చాలా ఎక్కువలెండి!' లాంటి ఆక్షేపణలు వినిపిస్తుంటాయి పైత్యపు కోపం ఎక్కువ, తలతిక్క మనిషి, పొగరుబోతు, అహంకారివంటి భావాలను ప్రకటించటానికి ఈ మాట వాడుతుంటారు ఏ ఆయుర్వేద వైద్యుడో ఆ అర్థాల్లో వాడి వుంటాడు తరువాత ఆ వస్తువును గురించిగాని, దానికున్న వైద్య ప్రయోజనం గురించిగాని ఏమీ తెలియని వ్యక్తుల వాడుకలో దీనికి అర్థభేదం కలిగి మనిషి అహంకారానికి ప్రతీకగా ప్రయోగం వచ్చింది

గోవత్సం: గోవు అంటే ఆవు వత్సం అంటే దూడ ఈ సమాసానికి మామూలు అర్థం 'ఆవుదూడ ' అని మాత్రమే అయితే దూడకు విలువ లేదని, ఆవుకు మాత్రమే ఉంటుందని వ్యాపార రంగంలో నిరూపితమయింది ఆవునమ్మినప్పుడు దూడకు విలువ

కట్టరు. ఆవు ఖరీదులోనే దూడ వెల కలిసిపోతుందిగాని, ప్రత్యేకంగా దానికంటూ వెల లేదు అందుకే గోవత్సన్యాయమనే మాట పుట్టింది 'తండ్రిచాటు కొడుకు, తల్లిచాటు బిడ్డ' అన్నట్లు ప్రత్యేక వ్యక్తిత్వం లేని మనిషిని గోవత్సమని వ్యవహరిస్తారు పెద్దలు చెప్పిన ప్రకారం నడుచుకుంటూ సొంత అభిప్రాయంగాని, అభిమతంగాని లేనట్లు ప్రవర్తించే మనిషి గోవత్సం. కొందరు అచ్చతెలుగులో 'పెయ్యనాకుడుగాడు' అనికూడా ఇదే అర్థంలో ప్రయోగిస్తుంటారు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఒకానొక చాటువులో 'అయ్యదేవరవాడు పెయ్యనాకుడుగాడు' అని కాశీశ్వరరావును వెక్కిరిస్తారు అంటే – పెద్ద నాయకులు చెప్పినట్లు వినడం, వ్యవహారించడమేగాని సొంతంగా ఆలోచించి నిర్ణయం తీసుకోలేని అస్వతంత్రుడని అర్థం.

**గోవింద కొట్టడం:** గోవులకు (పశువులకు) విందమయిన (సంతోషకరుడయిన) వాడు గోవిందుడు. న్యాయంగా ఈ మాట శ్రీకృష్ణావతారానికే ఎక్కువగా సరిపోతుంది. అయినా గో శబ్దానికి భూమి అనే అర్థం చెప్పి, విష్ణుమూర్తికి ఇది పర్యాయ నామంగా వాడుతుంటారు వైష్ణవాలయాలకు – ముఖ్యంగా తిరుపతికి – పోతున్నవాళ్ళూ, కొండ ఎక్కుతున్నవాళ్ళూ, దర్శనం చేసుకొంటున్నవాళ్ళూ 'గోవిందా' అని పెద్దగా పలుకుతుంటారు. అది గోవింద నామ జపం మాత్రమే కానీ గోవింద కొట్టాడంటే "దివాలా తీశాడు, చచ్చిపోయాడు" వగైరా అర్థాలు వాడుకలోకి వచ్చాయి అంతిమయాత్రా సమయంలో నారాయణ శబ్దానికి బదులుగా దాని పర్యాయపదమైన గోవింద శబ్దం వాడవచ్చునన్నట్లు 'లేచిపోయాడు' అనే అర్థంలో ఈ మాటలు వాడుకలోకి వచ్చాయి.

**గౌతముడి గోవు:** గౌతముడనే ఒక మహర్షికి ఒక ఆవు ఉండేదట. ఆయన దాన్ని పోషించిన విధానంవల్లనో, సహజంగా దాని శరీరతత్త్వమే అంతో చెప్పలేంగాని అది పరమ సుకుమారమయింది పొరపాటున దాన్ని ఎవరయినా తాకితే అది కిందపడి చచ్చిపోయేది. మరో జంతువు చస్తే వచ్చే పాపంకన్నా గోహత్యాపాతకం భయంకరమయింది ఏ పొరపాటూ చేయకపోయినా ఈ పాపం చుట్టుకొంటుం దన్నమాట. నిష్కారణంగా, అనవసరంగా, అనుకోకుండా వచ్చిపడే ప్రమాదాన్ని గౌతముడిగో వంటారు దొంగభయం లేకుండా ఉండటానికి ఆ ముని ఈ ఏర్పాటు చేశాడేమో తెలియదు. కానీ అకారణంగా వచ్చే ప్రమాదాన్ని ఈ పేరుతో పిలవటం అలవాటయింది.

**గౌరీకల్యాణం:** గౌరి అంటే పార్వతి ఆమె వివాహమే గౌరీకల్యాణం ఆ వివాహ ఫలితంగా పుట్టిన కుమార స్వామి తారకాసుర విధ్వంసం సాధించాడు. గౌరీ కల్యాణానికి ముందు మన్మథుణ్ణి శివుడు భస్మం చేశాడు. ప్రపంచానికీ, జీవవ్యవస్థ కొనసాగటానికీ కారకుడైన మన్మథుడి చావుతో మొదలై ప్రపంచాన్ని ఉగ్రూతలూగించిన పరమ దుర్మార్గుడి చావుతో పూర్తయిందేమంటే గౌరీకల్యాణమే ఈ మాటను రెండు విధాల వాడుతుంటారు. 'ఏముంది? గౌరీకల్యాణ మయిపోయిం'దని వెటకారంగా చెప్తే – చెడిపోయిందని అర్థం వివాహ సమయంలో వధూవరులకు నలుగులు పెట్టేటప్పుడు గౌరీకల్యాణం అనే యక్షగానం పాడే ఆచారం ఉండేది పూర్వం గౌరీకల్యాణం

పాడుతున్నారంటే వివాహం తంతు మొదలుకాబోతున్నదని అర్థం సందర్భాన్నిబట్టి అర్థం గ్రహించాలన్నమాట.

గ్రంథసాంగుడు: అంగం అంటే భాగం, అవయవం సాంగం అంటే భాగాలతో కూడినదని అర్థం. ఒక గ్రంథంలోని భిన్న భాగాలన్నిటినీ అధ్యయనం చేసినవాడు గ్రంథసాంగుడు. ఇలా అర్థం చెప్పదగిన, విగ్రహవాక్యం సాధ్యమయిన ఈ పదం తెలుగు నిఘంటువుల కెక్కలేదు! వాడుకలో మాత్రం రాష్ట్రవ్యాప్తంగా వినిపిస్తుంది. అయితే, బాగా చదువుకున్నవాడన్న అర్థంలో కాదు – నేర్పరి, మోసగాడు, చమత్కారి, రసికుడు లాంటి భిన్నార్థాల్లో ఈ మాట వాడుతుంటారు మంచివాడనే అర్థంలో వాడుక లేనేలేదు. సాధారణంగా తిరుగుబోతు, వ్యభిచారి అనే అర్థాల్లో వాడుక ఎక్కువ. బహుశా గ్రంథిసాంగుడు (గ్రంథి అంటే ముడి) అనే రూపానికి ఇది వికృతి కావచ్చు. ఎటువంటి ముడినైనా విప్పేవాడు, విప్పగలవాడు అనే అర్థం మొదటిదయి వుండవచ్చు. గ్రంథికన్నా గ్రంథశబ్దం బాగా పరిచయమైనది కాబట్టి ఈ మార్పు వచ్చివుండవచ్చు

ఘటశ్రాద్ధం: కొందరీమాటను ఘటాశ్రద్ధమని కూడా వ్యవహరిస్తారు. ఛాందస కుటుంబాల్లో దీనికి వాడుక ఎక్కువ. పన్నెండు సంవత్సరాల కాలం ఒకరి ముఖం మరొకరు చూసుకో(లే)కపోతే ఒకరికొకరు చచ్చినట్లే లెక్క. చదువుకోసమో, ఉద్యోగ వృత్తుల కోసమో ఇల్లు విడిచి పన్నెండేళ్ళలోగా తిరిగిరాని వ్యక్తి మరణించినట్లే భావించి వారికి శ్రాద్ధకర్మలు చేసే ఆచారం ఉండేది ఇంకా కొందరు చాదస్తులు తమకు పిల్లాజెల్లా ఏర్పడక పోయినా, ఉండి మరణ సమయానికి అందుబాటులో లేకపోయినా, సకాలంలో శ్రాద్ధకర్మ జరుగుతుందో లేదోనన్న భయంతో తమకుతామే ఆ పని తాము బతికివుండగానే చేసుకొనేవాళ్ళు! దానికి ఘటశ్రాద్ధమని పేరు. ఘటం అంటే కుండ మానవ శరీరాన్ని దానితో పోల్చి చెప్పటం కద్దు "ఆ ఘటం ఉండగా ఈ పని జరగదు; అయనంతటి మొండి ఘటం మరి పుట్టబోడు" వగైరా వాక్యాలు వినిపిస్తుంటాయి సదరు ఘటానికి పెట్టే, పెట్టుకొనే శ్రాద్ధం ఘటశ్రాద్ధం. "తెగతెంపులు చేసుకోదలచాను, తరాలు తెంచుకుంటున్నాం" అనే అర్థంలో ఘటశ్రాద్ధం పెట్టానని, పెట్టేనని చెప్పటం పరిపాటి "నా మాట వినక నీ యిష్టం ప్రకారం నడిస్తే ఘటశ్రాద్ధం పెట్తా"నని బెదిరించే వాళ్ళుండేవారు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి "కంఠాభరణం" నాటకంలో బావమరిది రామశాస్త్రి చదువుకోటానికి కాశీకి వెళ్ళి పన్నెండేళ్ళుగా తిరిగి రాలేదని అయన బావగారు ఘటాశ్రాద్ధం పెట్టి, చెల్లెలి తలవెంట్రుకలు కూడా తీసిపారేస్తాడు తన పిల్లలు తనకన్నా ముందే చనిపోతే తనకు శ్రాద్ధయోగం లేకపోతుందేమోనని ఘటశ్రాద్ధం పెట్టుకుంటాడు (తానూ తన కొడుకులూ పోతే తల చెడిన తమ భార్యలకు ఇబ్బంది గాని, బతికి వున్నవారి అగ్నిహోత్రాలకుగాని ఇబ్బంది లేకుండా ఏర్పాట్లు చేస్తాడనేది మరో విశేషం). మొత్తంమీద ఈ మాటను సంబంధాలు తెంచుకోవటం అనే అర్థంలో వాడుతుంటారు

ఘట్టకుటీ ప్రభాతం: ఘట్టమంటే రేవు, ప్రదేశం – ముఖ్యం పన్నులు వసూలు చేసే ప్రదేశం 'కుటీ' అంటే గుడిసె పూర్వం రాజుల నగరాలన్నీ కోటగోడల మధ్యే ఉండేవి ఊళ్ళో జనంగాని బయటివాళ్ళుగాని కోట సింహద్వారాలనుంచే రాకపోకలు చేయాలి అక్కడే పన్ను వసూలు చేసే అధికారులు ఒక గుడిసె వేసుకొని ఉండేవారు

ఒకానొక వర్తకుడు ఒకసారి తాను అమ్మకానికి తీసుకుపోతున్న సరుకుతో సందులూ గొందులూ తిరిగి ఏ అర్ధరాత్రి వేళో, రాజభటులు నిద్రలో ఉండగా పన్ను కట్టకుండా పోదామని ప్రయత్నించాడు. అయితే దురదృష్టం వెన్నాడి తీరా ఆ గుడిసె దగ్గరికి చేరే సరికి ప్రభాతమయింది - అంటే తెల్లవారింది. రాజభటులు మేలుకొని ఉన్నారు, పన్ను వసూలు చేయనూ చేశారు. ఈ కథ ఎప్పుడు పుట్టిందో అప్పటినుంచీ ఘట్టకుటీ ప్రభాతమనే మాట పుట్టింది. తప్పించుకుందామని విశ్వప్రయత్నం చేసినా అది సాధ్యం కాకపోతే ఘట్టకుటీ ప్రభాత మయిందని చెప్తారు. సంకల్పించిన పనికి విఘాతం కలిగితే ఘట్టకుటీ ప్రభాత మయినట్లు లెక్క.

**ఘుణాక్షరం:** పూర్వం కాగితాలు లేని రోజుల్లో తాటాకులమీద రాసేవాళ్లు. కాలక్రమాన సదరు ఆకులకు పురుగులు పట్టాయి. ఇప్పటి సిరా రాతలు కొంతకాలానికి చెరిగిపోవచ్చు; మాసిపోవచ్చు. అప్పటి తాటాకు రాతలు గంటంతో గుంటగా రాసినవి కాబట్టి చెరిగిపొయ్యేవికాదుగాని, పురుగులు కొట్టినందువల్ల కొత్తగుర్తు లేర్పడి అవికూడా అక్షరాలే ననిపిస్తాయి. పురుగు తొలిచినప్పుడు అక్షరాలు రాయాలనుకోలేదు. అనుకోకుండా తొలిచిన భాగంలో మరో అక్షరం ఏర్పడ్డదని మనం భ్రమిస్తాం. ఉద్దేశరహితంగా జరిగిన పనిని ఘుణాక్షరం అంటారు.

**ఘోటక బ్రహ్మచర్యం:** ఘోటక మంటే గుర్రం. అది మనుషుల్లాగా బ్రహ్మచర్యం పాటిస్తుందనేది అబద్ధం. ఈ పదబంధాన్ని నక్క వినయం, బక ధ్యానం, పిల్లి శీలం అనే మాటలకు పర్యాయపదంగా వాడుతుంటారు - అంటే 'జరగని పని' అనే అర్థంలో. వాడు 'ఘోటకబ్రహ్మచారి' అంటే పెళ్ళిచేసుకోకుంజా పైచవులు మరిగిన వాడనే అర్థంగాని మామంచి బ్రహ్మచారి అని అర్థంకాదు. గుర్రాల్లో సంయమనం చాలా తక్కువ. అందుకే పందెం గుర్రాలే గాక బండి గుర్రాలు కూడా గోడిగ (=ఆడగుర్రం) కనిపిస్తే అలివి తప్పుతాయన్న భయంతో మర్మాంగం దగ్గర తోలుపటకా కడ్తారు - నిర్బంధం మీదనయినా బ్రహ్మచర్యం అవలంబిస్తుందన్న ఆశతో. అయితే, బ్రహ్మచర్యం అనే మాటకు అనంతామాత్యుడు భోజరాజీయంలో ఓ వ్యాఖ్యానం చేశాడు.

ఒకప్పుడు వశిష్ఠాశ్రమానికి ఎదురుగా గంగానదికి అవతలి ఒడ్డున దుర్వాసమహర్షి తపస్సు మొదలెట్టాడు - నిరాహారదీక్షతో. గృహస్థుడయిన వశిష్ఠుడు భార్య అరుంధతి ద్వారా పూటపూటా తిండిపంపితే దుర్వాసుడు తృప్తిగా తిని తేన్చేవాడు. ఓ మారు గంగకు వరదలు వచ్చాయి. నది దాటే దెలాగంటే, వశిష్ఠుడు భార్య కుపాయం చెప్పాడు-"సదా బ్రహ్మచారి చెప్పాడను, గంగ దారి ఇస్తుం"దని. ఎవరి విషయంలో ఈ మాట అన్నాడో తెలియక ఆమె భర్త చెప్పినట్లు చేసి తిండిపెడ్తుంది. తిరిగిపోయే మార్గం చెప్పమంటే దుర్వాసుడు "సదా నిరాహారి చెప్పా"డని దారి తీసుకొమ్మన్నాడు! ఇంటికి వచ్చిన అరుంధతి భర్తను ఈ విడ్డూర మేమంటుంది. వందమంది సంతానం కన్న వశిష్ఠుడు సదా బ్రహ్మచారి కావటమేమని విస్తుపోతుంది. 'ప్రజాయై గృహమేధినాం' అన్న ప్రతిజ్ఞ ప్రకారం పిల్లలను కనడానికి మాత్రమే సంసారం చేసిన తాను సదా బ్రహ్మచారి నంటారు వశిష్ఠుడు! అలాగే తనంతట తాను భోజన ప్రయత్నం చేయక, అతిథి మర్యాదగా మరో గృహస్థుడు తెచ్చిపెట్టిన తిండిని నిరాకరించటం అమర్యాద, తప్పు కాబట్టి, కడుపారతిన్నా తాను సదానిరాహారినేనని దుర్వాసుడు భావించాడన్నమాట! ఇది మన రిలే నిరాహారదీక్షలవారికి తారకమంత్రంగా

ఉపయోగపడే కథ బ్రహ్మచర్య విషయం సంసారులందరికీ సరిపడే సంగతి ఘోటక బ్రహ్మచర్యం కూడా వీలుపడనప్పుడు ఆచరించే నిష్ఠగాని, కావాలని అవలంబించే వ్రతం కాదన్నమాట

**చండామర్కులు:** సుగ్రీవాజ్ఞలాగానే చండామర్కుల చదువు కూడా నిర్దాక్షిణ్యమయింది ప్రహ్లాదుడికి చదువు చెప్పమని నియమించాడు 'ప్రచండవితర్కు'లయిన చండామర్కులను వాళ్ళు చెప్పింది ప్రహ్లాదుడు విన్నట్లుకూడా చెప్పలేం తక్కిన పిల్లలు నేర్చుకున్నారో లేదో తెలీదు 'చదువులలో సారమెల్లఁ జదివితిఁ దండ్రీ!' అన్న ప్రహ్లాదుడు 'సారం' చదివేడేగాని 'చదువులు' చదువలేదు! చండామర్కులు చెప్పారో లేదో తెలియదు అప్పటి బోధన పద్ధతుల ప్రకారం విద్యార్థులను ఎంత కఠినంగా శిక్షిస్తే అంతగొప్ప ఉపాధ్యాయుడనే పేరు వచ్చేది ఈ తరంవాళ్లకు గోడకుర్చీలే తెలియవు కోదండం తెలుస్తుందని ఊహించటంకూడా అసాధ్యమే బడి పంతు లనగానే పేంబెత్తం మాత్రమే గుర్తుకు వచ్చేది కఠోరంగా దండించే గురువులను చండామర్కులని పిలవటం అందుకే అలవాటయింది

ఇప్పుడు విద్యను కొనుక్కుంటున్నాం – జీతాలు కట్టి, చందాలు చెల్లించి పూర్వం – పురాణాల కాలంలో – గురువులు ఆశ్రమాలు పెట్టుకొని ముక్కు మూసుకొని కూచుంటే, వారికి తెలిసిన విద్యలేవో తెలుసుకున్న తల్లిదండ్రులు తమ పిల్లల్నక్కడికి పంపేవారు అంటే, శిష్యుడు గురువును వెతుక్కుంటూ పోయేవాడు తిండీ గుడ్డా ఇచ్చి గురువు చదువు చెప్పేవాడు అంతకన్నా ముఖ్యం – చాకిరీ చేయించుకునేవాడు లోకానికి నేర్పినవిద్య కనిపించకపోయినా చేయించుకున్న సేవలు కానవచ్చేవి కాబట్టే 'శుశ్రూష' అనే మాటకు 'సేవ'లనే అర్థం వచ్చింది నిజానికి దానికున్న అర్థం 'వినాలనే కోరిక'

చండామర్కులు ఇతర విద్యార్థుల సేవలందుకొన్నారేమోగాని ప్రహ్లాదుడు రాజ కుమారుడు కాబట్టి అతడి విషయంలో అలాంటి పురమాయింపులు చేసివుండరని నమ్మవచ్చు అందులోనూ హిరణ్యకశిపుడి కొడుకు చేత సేవలు చేయించుకోవటమే? ఎన్ని గుండెలు కావాలి? మోతుబరుల, పెద్దల, రాజుల పిల్లలు పాఠాలు సరిగా వినకపోయినా, వల్లించపోయినా దెబ్బలు తినేవాళ్ళు కాదు – వీధి బడుల్లో కూడా వారికి బదులు, వారి తరఫున దండనలు పొందటానికి వేరే సేవకులను పెట్టేవాళ్ళు! వాళ్ళు నిష్కారణంగా తన్నులు తింటుంటే జాలిపడి కులీన విద్యార్థి చక్కగా చదువుకుంటాడని ఒక సిద్ధాంతం! సేవకుల నిలా చావగొట్టాలని గ్రహిస్తాడేమోనన్న అనుమానంకూడా ఆ పెద్దలకు లేకపోవటమే విశేషం మొత్తంమీద చండామర్కులంటే చావగొట్టి చెవులుమూసే గురువులనే వాడుక వచ్చింది

**చండీ:** చండి అనేది పార్వతీదేవికున్న పేర్లలో ఒకటి ఆమె సంగతి కాదిది ఆ పేరు పెట్టుకొన్న ఒక పుణ్యాత్మురాలు వాడుకలో ప్రసిద్ధి పొందింది ఒకానొక మహర్షికి (ఆయన పేరు పురాణాని కొక రకం కాబట్టి ఆ పతివ్రతకు పొరపాటున మరొకర్ని భర్తగా పరిగణించడానికి భయపడి చెప్పటం లేదు) చండి అనే ఇల్లాలుండేది ఆమె కాపరానికి వచ్చేటప్పుడే ఒక ఒట్టేదో పెట్టుకుంది – భర్త చెప్పినదానికి పూర్తిగా విరుద్ధంగా ప్రవర్తించాలని! ఆ సంసారం నరకప్రాయ మయింది ఒకమా రామహర్షి ఇతర పురుషులతో మొరపెట్టుకున్నాట్ట–చివరికి భార్య నా తండ్రి తద్దినం కూడా

సరిగా పెట్టనిచ్చేట్లు లేదని నలుగురూ ఆలోచించి మంత్రోపదేశం చేశారు దాని ప్రకారం తండ్రి తద్దినం పెట్టనన్నాడు భార్యతో పెట్టితీరాల్సిందే నన్నదా పతివ్రత అంతే – సలక్షణంగా నెరవేరిన ఆనందంతో భర్త పిండాలను ఆవులకు పెట్టమని నోరుజారి చెప్పాడు అంతే – ఆమె వాటిని పిల్లులకు పెట్టింది అందాకా ఆమె భర్త మాటలకు వ్యతిరేకంగానే ప్రవర్తించింది ఇలా ఎడ్డెమంటే తెడ్డెమని తలకిందులుగా, వ్యతిరేకంగా ప్రవర్తించే మూర్ఖురాలినీ, మొండిమనిషినీ 'చండి' అనటం ఆనాటి నుంచే మొదలయిం దంటారు అయితే, అది ఏనాడో చరిత్రకందే విషయం కాదు

చందమామ ఘుటిక: ఘుటిక అంటే గుటక పసిపిల్లలు తిండి తినక మొరాయిస్తున్నప్పుడు 'చందమామ రావే! జాబిల్లి రావే!' ఇత్యాదిగా పాడుతూ చంద్రుణ్ణి చూపిస్తుంటే ఆ ఆనందంలో గుటకలు వేస్తూ పెట్టింది తింటుంటారు, అసంకల్పితంగా పిల్లలు గుటకలు మింగడంలో చందమామే పెట్టాడని భ్రాంతి పడటంలో చందమామ పాత్ర ఆకర్షణే తప్ప మరేమీ కాదు నిజంగా తినిపించినవాళ్ళకూ తిన్నవాళ్ళకూ చందమామ చక్కదనమే, చల్లదనమే మరిపించే వస్తువు వాస్తవకారణం పిల్లల ఆకలి – తల్లి తినిపించటమున్నూ అనుభవంలో లేని వస్తువు మీది ఆకర్షణకూ, అదే యథార్థమనే భావనకూ అందువల్ల చందమామ ఘుటిక అనే పేరు వచ్చింది ఫలితంలో అనుభవానికి రానిదాన్నీ, సొంతం కానిదాన్నీ చందమామ ఘుటిక అనటం మొదలయింది

చకార గుడులు: చకారానికి గుడి ఇస్తే 'చి' అవుతుంది, హ్రస్వ రూపంలో; 'చీ' అవుతుంది దీర్ఘరూపంలో నిజానికి అసహ్యంతో, కోపంతో 'ఛీ, ఛా' అని ఒత్తులు పల్కుతాం దీర్ఘమైన అకారం గూడా వాడ్తాం అయినా సరే నింద, తిట్టు వగైరాలను సూచించడానికి చకారగుడులు దక్కించుకున్నా డనటం అలవాటుయింది నకార ప్రయోగంలాగానే ఇది కూడా చదువుకున్న వాళ్ళ వాడుకలోనే ఎక్కువగా వినిపిస్తుంది సామాన్యులకు ఈ వ్యాకరణ లక్షణాలు పట్టవు; వీటితో వచ్చిన జాతీయాలు ఒక పట్టాన అర్థం కావు

చంకదుడ్డు శరణార్థి: రక్షించమని కోరుతూ దగ్గరకు వచ్చిన వ్యక్తి శరణార్థి అతడు సహజంగా నిరాయుధుడుగా ఉండాలి తన్ను తాను కాపాడుకోలేక ఇతరులను ఆశ్రయించే శరణార్థి తన చంకలో దుడ్డుకర్ర నుంచుకున్నాడంటే నమ్మరాని వ్యక్తి అన్నమాట మోసగించి, భయం నటించి, దగ్గరకు చేరి దెబ్బతీసే అవకాశముంది కాలు పట్టుకోబోయి లాగిపడవేసే బాపతన్నమాట అందువల్ల చంకదుడ్డు శరణార్థి అంటే 'మోసగాడు' అనే అర్థం వచ్చింది నమ్మరాని వ్యక్తి అని కూడా చెప్పవచ్చు

చతుర్ముఖ పారాయణం: బ్రహ్మదేవుడికి మొదట్లో అయిదు తలకాయలుండేవి అయిదో తలమాత్రం గాడిద తలలాగే ఉండేదట! ఆ తలను భైరవ రూపంలో ఉన్న శివుడోసారి నరికిపారేశాడని బ్రహ్మపురాణం చెప్తుంది చివరికి నాలుగే మిగిలాయి ఒకేసారి ఒక్కో తలతో (నోటితో) ఒక్కోవేదం పఠిస్తుంటాడట బ్రహ్మదేవుడు నాలుగు ముఖాలున్నవాడు కాబట్టి చతుర్ముఖుడన్నారు ఒక్కోతల ఒక్కో దిక్కు చూస్తుంటుందని పురాణాలు వర్ణిస్తాయి ఈ దిక్కుల వివరాలతో నిమిత్తంలేకుండా ఆయనకు నాలుగు తలలున్నా యన్నంతమాత్రం లెక్కలలోకి తీసుకొని ఒక వ్యసనానికి చతుర్ముఖ పారాయణమనే వాడుక వచ్చింది అది పేకాట వాడుకలోకి వచ్చిన తరవాతనే పుట్టింది

పేకముక్కల్లో బొమ్మలు నాలుగువైపులా నాలుగు ముఖాలు పెట్టినట్లు ముద్రిస్తారు వాటితో ఆడే ఆటను - అంటే పేకాటను - చతుర్ముఖ పారాయణ మని పిలుస్తారు నాలుగు ముఖాల దేవుణ్ణి నిజంగా పూజించేవాళ్ళకున్నాడా పేకాట ఆడేవారి కున్నంత ఏకాగ్రత, భక్తి ఉంటాయని చెప్పలేం తండ్రి పోయాడంటే "ఇటేగదా శవాన్ని తీసుకపోయేది? ఇటు వచ్చినప్పుడు ఆటలోనుంచి లేస్తా" నంటారనే ప్రవాదం పుట్టింది అదోవిధమైన తన్మయత్వం, నిశ్చలభక్తి కాబట్టి, దాన్ని పారాయణం (అంటే - జప) మన్నారు ఇతర దేవతాపూజలకన్నా ఇది చాలామంది మహాభక్తులకు ఆకర్షణకర మయింది వ్యసన విజయమనే అసంపూర్తి నాటకంలో తిరుపతి వేంకటకవులు దీని ఘనతను కీర్తించినట్లు తెలుగుసాహిత్యంలో మరెవరూ వర్ణించినట్లు లేదు

చర్వితచర్వణం: చర్వణం అంటే నమలటం చర్వితం అంటే అంతకుముందు నమిలింది ఆవుల్లాంటి జంతువులు గబగబా గడ్డి మేసి తరవాత తీరికగా నెమరువేస్తుంటాయి నిజానికి చర్వితచర్వణం అనేది అలాంటి పశువులు చేసే పని అయినా చెప్పిందే చెప్పటం, రాసిందే రాయటం వగైరాలను నిత్యవ్యవహారంలో చర్వితచర్వణంగా భావించి ప్రయోగిస్తుంటారు కొత్త విషయం లేదనీ, ఇంతకుముందు చెప్పిందే మళ్లీ చెప్పి విసిగి స్తున్నాడనీ ఎవరినయినా ఆక్షేపించదలచినప్పుడు 'ఆయన ఉపన్యాసమంతా చర్వితచర్వణ' మంటుంటారు అంతేగాని, నెమరువేయటం, అంతకుముందు చెప్పిన విషయాన్ని ఆలోచించి గుర్తుకు తెచ్చుకోవటం అనే అర్థాలు లేవు

చాంద్రాయణ(వ్రత)ం: చంద్రుడికి సంబంధించింది అనే అర్థంలో ఈ మాట పుట్టింది చంద్రుడికి వృద్ధి క్షయాలున్నాయి పదిహేనురోజులు క్రమంగా పెద్దదయ్యే చంద్రబింబం తరవాతి పక్షంలో క్రమంగా చిన్నదవుతుంది ఈ లక్షణాన్ని పురస్కరించుకొని చాంద్రాయణ వ్రతమనేది కల్పించుకున్నారు ప్రధానంగా ఇది తిండికి సంబంధించింది తొలి రోజున ఒక్క ముద్దతో సరిపెట్టుకున్న వ్రతదీక్షాపరుడు క్రమంగా వాటి సంఖ్యను పెంచుతూ, పక్షం తరవాత క్రమంగా తగ్గిస్తూ ఒక నియమం ప్రకారం భోజనం చేస్తాడు అదిన్నీ శాకాహారం మాత్రమే నీతిచంద్రికలో ఈ వ్రతం పాటిస్తున్నట్లు పిల్లీ గద్దా లోకవంచనకు ప్రచారం చేసుకున్న కథలు అందరికీ తెలిసినవే కాలక్రమాన ఈ మాటకు మరో అర్థం వచ్చింది చంద్రుడు భూమి చుట్టూ తిరుగుతుంటాడన్న శాస్త్రజ్ఞానంతో అర్థంలో మార్పు సాధించారు సొంతపనులకోసం ఆఫీసులచుట్టూ తిరిగేవాళ్ళూ, ఉద్యోగ వృత్తిధర్మంవల్ల పర్యటన చేయవలసినవాళ్ళూ చాంద్రాయణం చేస్తున్నా రనటం వాడుకలోకి వచ్చింది ఈ అర్థంలో ఇది వ్రతం కాదు - అవసరార్థం తిరగటం అనుకొన్న పని నెరవేరక ఊరక తిప్పట తప్పని పరిస్థితుల్లో "ఏముంది? నా బతుకు చాంద్రాయణంతో తెల్లవారిపోతున్న" దంటారు అంటే, వృథా ప్రయాస అనే మూడో అర్థంకూడా వ్యవహారంలోకి వచ్చిందన్నట్లు

చిదంబర రహస్యం: చిదంబరం తమిళనాడులోని పుణ్యక్షేత్రం ఇది శివక్షేత్రం గర్భగుడిలో ఒకప్పుడు నటరాజస్వామి విగ్రహం ఉండేదని, దాన్ని తొలగించారనీ, మళ్లీ ప్రతిష్ఠించారనీ చెప్తారు దాని ముందు తెర ఉంది అర్చాసమయంలో తెర తప్ప మరేమీ కనిపించదు - ఒక బంగారు బల్లి తప్ప 'చిత్+అంబరం' అనే రెండు సంస్కృత పదాల కలయికవల్ల చిదంబరశబ్ద మేర్పడింది అంబరం అంటే ఆకాశం చిత్ - అంటే తెలివి, బుద్ధి భగవంతుడు చిదానంద స్వరూపుడు అంటే

తెలివితేటలద్వారా (మనిషి) సాధించగల ఆనందం రూపు కట్టినవాడు అతడే సత్త లేదా సత్యం తెరనుంచటంలోని పరమార్థం జ్ఞానమార్గంలో భగవంతుణ్ణి గుర్తించమని చెప్పటం ఇదంతా వేదాంతుల, భక్తుల వివరణ సామాన్యవ్యక్తికి చిదంబరంలో తాను ఆరాధించగల విగ్రహం కనిపించదు - తెర తప్ప తెరే ఆకాశం అంటే, శూన్యం అందువల్ల దాన్ని శోధించి తెలుసుకోవలసిన రహస్యం - అంటే భగవత్ స్వరూపం - అంతంతమాత్రాన అందుబాటులోకి వచ్చేదికాదు ఫలితంలో అది చాలా మందికి చాలా వరకు రహస్యంగానే మిగిలిపోతుంది కాబట్టి చిదంబర రహస్యం అంటే ఏమీ లేదని, ఏమీ తెలియనిదని వాడుకలో నిలిచింది అక్కడి నటరాజస్వామిమీద సాక్షాత్తు మహాయోగి, వ్యాకరణవేత్త అయిన పతంజలి రాసిన స్తవాన్ని నిత్యం గానం చేస్తారు రావణస్తుతిలాగా అది ఎంతో శ్రావ్యగంభీరంగా ఉంటుంది చిదంబర రహస్యం సంగతి మాత్రమే పట్టించుకొనే సామాన్య భక్తులు ఏమీ లేదనే భావంతో ఈ మాట పుట్టించారు

**చిల్లర శ్రీమహాలక్ష్మి:** టోకువ్యాపారంకన్నా చిల్లరబేరం లాభసాటి అంటారు ఒక వస్తువుకు రూపాయిధర పెట్టేకన్నా ఏ 25 పైసలో పెడ్తే చౌకధర అనే నమ్మకం కుదురుతుంది మిగిలిన అయిదు పైసలూ చిల్లర లేదని కొట్టువాడుంచుకున్నా అంత కష్టం కలగదు అందుకే చాలా కంపెనీలు తమ సరుకులకు రేటు నిర్ణయించటంలో చిల్లరకు ప్రాముఖ్యమిస్తాయి చిల్లర సంపాదన కొంతకాలానికి పెద్దమొత్త మవుతుంది ఈ గడననుచూసి ఒంటికంటిరామలింగంకూడా విడవడు అందుకే ముఖ్యంగా వర్తకుల్లో ఈ మాట పుట్టింది టోకు బేరానికి పెద్ద పెట్టుబడి కావాలి ఆదాయప్పన్నులాంటి ఈతిబాధ లుంటాయి చిల్లర బేరానికి అలాంటి చిక్కులూ పెద్ద పోకడలూ ఉండవు ఇది కానరాని సంపాదన అందుకే శ్రీమహాలక్ష్మితో సమాన మన్నారు ఎంత చిల్లరకొట్టువాడికయినా కోడిగుడ్డంత బంగారముంటుందనే విశ్వాసముందికానీ అతణ్ణిచూసి ఎవ్వరూ ఈర్ష్యపడరు

**చీకటి మడి:** 'మడి కట్టుకోవటం'లో ఇదో రకం మడి అంటే మడుగు, అంటే, మడత పెట్టిన గుడ్డ శుభ్రంగా ఉతికి మడతలు పెట్టిన గుడ్డను మడి/మడుగు అంటారు కాలక్రమాన 'శుభ్రత' అనే భావం మరుగునపడిపోయింది ఉతకటం కన్నా తడపటం ముఖ్యమనుకోవటం మొదలయింది ఒకటికి నాలుగుసార్లు తడవటంవల్ల నీరుకావి పడ్తాయి గుడ్డలు కొంతకాలానికి ఆలుగుడ్డల్లా చిర్రచిరిసిపోతాయి అయినా సరే, అవే 'మడిబట్ట'లనుకొని వాటిని ధరించి, శుభ్రపడ్డట్లు, పవిత్రమైనట్లు భావించడం మొదలయింది ఒక్క జత కొల్లాయి గుడ్డల్తో బతికే మహాత్ములు తడిపి, పిడిచి కట్టుకుంటే మడి కట్టినట్లు - అంటే, ఉతికి ఆరవేసి మడతలు పెట్టి కట్టుకున్నట్లు భావించి సంతృప్తిపడేవాళ్లు ఆడవాళ్ళకయితే కొల్లాయిగుడ్డలు సరిపోవు మానరక్షణకు చీరెలకు కర్చెక్కువ అందువల్ల ఆ ఇబ్బంది ఉన్నా మడిగట్టుకొనే మార్గం కనిపెట్టారు అదేమంటే - ఉన్న చీరెను విప్పి 'మడి'గా - అంటే దిగంబరంగా - కర్తవ్యం నెరవేర్చటమన్నమాట! దానికి ముద్దుగా 'చీకటి మడి' అని పేరు పెట్టారు! చీకటిమడికి ఫలితంలో దిగంబరత్వమనే అర్థం వచ్చింది

**చీము పట్టినవాడు:** పుండో కురుపో ఉండి దానికి సరయిన వైద్యం చెయకపోతే చీము పట్టవచ్చు అది రోగచిహ్నం కానీ చీము పట్టినవాడంటె రోగికాదు చిన్నపుండు

చుట్టూ చీముపట్టి దాని పరిమాణం పెరిగినట్లు కొద్దిపాటి పెట్టుబడితో ఎక్కువ సంపాదించిన వ్యక్తిని చీము పట్టినవాడంటారు! చీము అంటే ఎంత అసహ్యమో అటువంటి వ్యక్తి సంపాదించిన సొమ్మన్నా అంతేనన్న చిరాకు, ద్వేష భావం, ఈర్ష్య వగైరా ఉన్నప్పుడు ఈ మాట అంటారు ఏవిధంగానయినా సరే, ఎటువంటి దుర్మార్గం, నీచకార్యం చేసయినా సరే – డబ్బు సంపాదించినవాడు చీము పట్టినవాడన్నమాట

**చుక్కవాలు:** శుక్రగ్రహానికి ఎదురుగా ప్రయాణించటం ప్రమాదకరమైతే వాలుగా పోవటం మేలుకాకతప్పదు అందువల్ల 'మేలయిన, మంచి' అనే అర్థాల్లో 'ఆయన కేమధ్య అన్నీ చుక్కవాలుగా నడుస్తున్నా' యంటారు ఈర్ష్యతోగాని, అభిమానంతోగాని అంటే ఏ పని చేపట్టినా సుఖంగా నెరవేరుతున్నవనీ, అదృష్టవంతుడనీ చెప్పటమన్నమాట అంగారక బుధగ్రహాలుక్కూడా ఇలాంటి లక్షణాలే ఉన్నా ఎందుచేతనో వాటికింత ప్రతీతి రాలేదు వ్యాప్తి రాలేదు బహుశా శుక్రగ్రహం పెద్దది కాబట్టి అది మాత్రమే ఆకట్టుకొని ఉండవచ్చు

**చుక్కెదురు:** చుక్క అనే మాట శుక్ర శబ్దభవం జ్యోతిశ్శాస్త్రంలో – ప్రయాణించే వ్యక్తి శుక్రగ్రహానికి, బుధగ్రహానికి, అంగారక గ్రహానికి ఎదురుగా పోతే ప్రమాదమని చెప్తారు యుద్ధసన్నాహంలో ఆ విధంగా బయలుదేరిన రాజు సేన సర్వధ్వంస మవుతుందని చెప్తారు శాస్త్ర ప్రమాణంలోనుంచి ఈ మాట నిత్యవ్యవహారంలో శత్రుత్వమనే అర్థంలో వాడుకలోకి వచ్చింది ఆ ఇద్దరికీ చుక్కెదు రంటారు అంటే పడదనీ, విరోధమనీ అర్థం

**చుట్టాల సురభి:** సురభి అనేది ఒక ఆవు మామూలు ఆవు కాదు స్వర్గలోకంలో ఇంద్రుడి అధీనంలో ఉండి కోరిన కోర్కెలన్నీ తీర్చే కామధేనువు కొంద రుంటారు ఇంట్లోవాళ్లకు విదల్చకపోయినా ప్రతిష్ఠకోసం ముఖ్యంగా చుట్టాలకు ఏ లోపం లేకుండా చూసుకుంటారు ఈ ప్రవృత్తిలో దాతృత్వంకన్నా కీర్తికండూతి ఎక్కువగా వుంటుంది అలా బంధుప్రీతి ప్రదర్శిస్తూ చూసీచూడకుండా అంతో ఇంతో సమర్పించుకొని సంతృప్తిపడేవాళ్లని 'చుట్టాల సురభి' అంటారు

**చూపులగుర్రం:** ఎందుచేతనోగాని ఆడపిల్లలనే గుర్రంతో పోల్చి ఈ మాట లంటారు ఒడ్డూ పొడుగూ ఆరోగ్యం ఉన్న పిల్లని గుర్రంలా ఉందని వర్ణించటం పరిపాటి గుర్రంలా శక్తిమంతురాలై ఇంటి చాకిరీ చేస్తుందనీ, శరీరమెంత బలవంతంగా ఉన్నా స్వభావంలో మెతక కాబట్టి స్వాధీనంలో ఉంటుందనీ ఇలాంటి పోలికలు తెస్తా రనిపిస్తుంది కొందరు చూడటానికి గుర్రంలా ఉన్నా, 'పనిమంతురాళ్లు'గా ఉండకపోవచ్చు నున్నగా పొన్నకాయలా ఉన్నా అనారోగ్యవంతురాలు కావచ్చు అటువంటివాళ్ళని చూపుల గుర్రం అంటారు చూడముచ్చటగా ఉండి, పనిపాటలు చేతగాని స్త్రీని చూపుల గుర్ర మంటారు

**చేట భారతం:** ఈ మాటకు 'చాటు భారత'మనే రూపాంతర ముందంటారు కొందరు కానీ ఆ రెంటికీ అర్థాలు వేరు 'చేట' తెలుగు మాట, 'చాటు' సంస్కృత పదం 'అప్పటి కప్పుడు చెప్పిన, నోటి మాటగా చెప్పిన' అనే అర్థాలున్నమాట 'చాటు (వు)' చెరగటానికి వాడే 'చేట' తెలుగు వస్తువు గ్రంథ ప్రమాణాల వంటివి చూపకుండా భారత కథను చెప్తే అది చాటు భారతం నిజాని కది జాతీయమే

కాదు. చేట భారతం వేరు. నాలుగు మాటల్లో సరిపొయ్యే విషయాన్ని తెగ సాగదీసి విపులంగా చెప్పినా, రాసినా దాన్ని చేట భారతమనే అంటారు. అయితే, ఈ మాట ఇటీవల పుట్టిందనటానికి నిదర్శనం ఉంది దాదాపు డెబ్బై ఎనభై సంవత్సరాల కిందట, అచ్చు యంత్రాలు అందుబాటులోకి వచ్చిన కాలంలో ఇప్పటి దినపత్రికలకన్నా కొంచెం చిన్నవైన కాగితాల్లో భారతం ముద్రించారు అంటే – చేటంత పెద్ద కాగితాల మీద అచ్చొత్తారన్నమాట! ఆ గ్రంథాలు ఇప్పటికీ కొన్ని పాతకాలపు గ్రంథాలయాల్లో భద్రంగా ఉన్నాయి సీస పద్యాన్ని అయిదు పంక్తుల్లో, వృత్తాలను రెండు పంక్తుల్లో, కందం, తేటగీతి, ఆటవెలది వంటి పద్యాలను ఒకే ఒక పంక్తిలో ముద్రించేవాళ్ళు ఆ గ్రంథాలను కూర్చుని చదవాల్సిందే 'వ్యాసపీఠా'ల్లో అవి ఇమిడేవి కావు అందువల్ల వాటిని 'చాలా పెద్దవి' అనే అర్థంలో చేట భారతా లన్నారు విస్తరించి చెప్తే చేట భారతం చెప్పినట్లు తెగకుండా, తేలకుండా చెప్తే భారతం చెప్పినట్లు

**చేతిచమురు భాగవతం:** పూర్వం భాగవత ప్రదర్శనలుండేవి భాగవతంలోని కృష్ణలీలలు, ప్రహ్లాద చరిత్ర వగైరాలను అభినయపూర్వకంగా ప్రదర్శించేవాళ్ళు అప్పట్లో నాటక ప్రదర్శనశాలలు లేవు కాబట్టి, నడివీధిలో మంచె కట్టి దాని మీద నిలిచి భాగవతం చెప్పేవాళ్ళు పగలు ఎవరి పనులు వారికుంటాయి కాబట్టి రాత్రిళ్ళే ఈ ప్రదర్శనలు సాగేవి వీధుల్లో ప్రదర్శించేవాళ్ళు కాబట్టి 'వీధి భాగవతా'లన్నారు ప్రదర్శించేది భాగవత కథ కాకపోయినా కాలక్రమాన వాటన్నిటినీ వీధి భాగవతాలనే పిలవటం అలవాటయింది

ఈ ప్రదర్శనల ఆరంభ కాలంలో వీధి దీపాలు లేవు కరెంటు లేదు అందుకని చమురులో ముంచిన కాగడాలను వెలిగించేవారు రంగస్థలంలో అందువల్ల ప్రదర్శన లిచ్చేవాళ్ళు ప్రేక్షకులకు కనిపించేవాళ్ళు. ప్రేక్షకులు చీకట్లోనే ఉన్నందువల్ల దృశ్యం బాగా కనిపించేది. రాను రాను ఈ ప్రదర్శనలను ఏ పర్వదినాల్లోనో 'భాగవతుల' చేత ప్రదర్శింపజేయడం గ్రామంలోని స్థితిపరుల ఘనతకు, ఔదార్యానికీ చిహ్నమైపోయింది ఆ కథలను అభినయించేవాళ్ళను 'భాగవతు'లనీ, వీధి భాగోతం వాళ్ళనీ పిలవటం పరిపాటయింది ప్రదర్శకులు కొందరు స్వయంగానే ఈ ఏర్పాట్లు చేసుకొనే దశలో, వాళ్ళ అసమర్థత వల్లనో, ప్రదర్శన సమయంలో అనుకోకుండా ఏ వర్షమో వచ్చినందువల్లనో ప్రేక్షకు లుండేవాళ్ళు కాదు ప్రదర్శన రక్తి కట్టిస్తే 'చదివింపులు' వచ్చిపడేవి అంతో ఇంతో ప్రేక్షకులు ముట్టజెప్పేవాళ్లు అది భగ్నమైతే వేషధారణాదులకోసం వెచ్చించిన సొమ్ముతోబాటు డబ్బిచ్చి కొన్న చమురు కూడా వృథా అయిపోయేది ఆ నూనె చేతిలో ఉన్న సొమ్ముతో కొన్నది కాబట్టి అది చేతి చమురు భాగవత ప్రదర్శనకోసం కొని నష్టపోయింది కాబట్టి చేతి చమురు భాగవతం ఇలాంటి దురనుభవాల వల్ల చేతిచమురు భాగవతం అంటే 'నిష్కారణంగా నష్టపోయిన సొమ్ము' అనే అర్థం వచ్చింది కొందరు దీన్ని 'దండగ భాగవతం' అంటారు 'చేతిచమురు'కు 'సొంత డబ్బు' అనే అర్థం వచ్చింది

**జమాబందీ సిరాబుడ్డీ:** గ్రామాలనుంచి వసూలుచేసిన పన్నుల వివరాలనూ లెక్కలనూ కరణాలు తాసీల్దార్ వంటి రెవిన్యూ అధికారులకు నివేదించేవారు ఆ పద్ధతిని

జమాబందీ అని పిలిచేవాళ్లు ఈ విధానం ముస్లిం పరిపాలన కాలంలోనే మొదలై, ఇంగ్లీషు రాజ్యంలో కూడా నడిచింది నానా గ్రామాల నుంచి లెక్కలు తెచ్చిన కరణాలు వాటిని సరిదిద్దుకోడానికి, సవరించిన లెక్కలు చూపడానికీ కలమూ, సిరా అవసరమయ్యేవి కలాలు వాళ్ళే తెచ్చుకొంటే సిరా మాత్రం బుడ్లలో పోసి కార్యాలయాల్లో ఉంచేవాళ్లు బాల్‌పాయింటు కలాలు, ఫౌంటెన్ పెన్నులూ (వాటిని 'ఊటకలా'లని కూడా పిలిచేవాళ్లు) లేనిరోజుల్లో 'పుల్లకలా' లుండేవి ఏదో ఓ చిన్న పుల్లకు ఒకవైపున 'పాళీ'ని దారంతో కట్టేవాళ్లు ఇప్పటిలాగా సిరా సీసాలు మార్కెట్లో దొరకని ఆ పాతకాలంలో ఎవరి అవసరానికి వాళ్ళు సిరా తయారుచేసుకోవలసి వచ్చేది కొంతకాలం 'బిళ్ళలు' వచ్చేవి. వాటిని నీళ్ళలో కరిగిస్తే సిరా తయారయ్యేది అంతకు ముందు 'కరక్కాయ సిరా' వాడుకలో ఉండేది ఇప్పుడు 'ఇండియన్ ఇంక్' అనేది ఎంత మన్నికగల సిరాగా ఉండేదో అప్పట్లో కరక్కాయ సిరాకు అంతే ప్రఖ్యాతి ఉండేది రాసినప్పటికన్నా ఎండిన తరవాత పక్కారంగులోకి మారేది, జీడిగుర్తులాగా అలాగే కాగితం చినగాల్సిందేగాని సిరా మరక చెరిగిపోయేది కాదు ఒకప్పుడు బడిపిల్లలు సిరాబుడ్లకు ఉగ్గం కట్టి, పుల్ల కలాలు చేతబట్టి, ఒళ్ళంతా సిరామరకల్తో బడికిపోతూ వస్తూ ఉండేవాళ్లు కరణాలు సిరాబుడ్లు మోయకుండా రెవిన్యూ కార్యాలయాల్లో (ఇప్పుడు పోస్టాఫీసుల్లో అతకని జిగురు ఉంచినట్లు) సిరాబుడ్లుండేవి వాటినే జమాబందీ సిరా బుడ్లనేవాళ్లు వాటిమీద అందరికీ సమానహక్కుంటుంది అంటే – ఎవరయినా వాడుకోవచ్చు ఉమ్మడి సొత్తు, "ఊరికే దొరికిన వస్తువు" అనే అర్థాలు ఈ కారణంవల్ల ఈ జమాబందీ సిరాబుడ్డి అనే సమాసానికి వచ్చింది

ఈ సిరాబుడ్లనే శిక్షించటానిక్కూడా వాడేవాళ్లు – ముఖ్యంగా హైదరాబాద్ సంస్థానంలో అక్కడి అధికారభాషను పార్శీ ఉర్దూలో (అంటే పెర్షో అరబిక్ లిపిలో) రాయాలి దాన్ని కుడి నుంచి ఎడమకు రాస్తారు సరిగా పనిచేయని, మందకొడిగా పనిచేసే గుమాస్తాలను వేధించటానికి సిరాబుడ్డిని ఎడమచేతివైపుంచి, రాయమనే వాళ్లు! కలాన్ని సిరాలో ముంచి విదిలించి కుడిచేతివైపు నుంచి రాయటంలో కాగితం మీద సిరా మరకలు పడేవి అప్పుడు మళ్ళీ శుభ్రంగా సరిగా రాసేదాకా విడిపించే వాళ్ళు ఇదే రకం వేధింపును సర్కారు జిల్లాల్లో సిరాబుడ్డిని కుడివైపుంచి రాయించి అమలు జరిపేవాళ్లు ఇప్పుడివన్నీ తాతలనాటి కబుర్లయిపోయాయి

**జైనుడి చేతిలో పేను:** జైన మతస్థులు అహింసా ధర్మాన్ని పరమ శ్రద్ధతో పాటిస్తారు దారిలో నడుస్తున్నప్పుడు కాలి కింద పడి పురుగులు చస్తాయన్న భయంతో చీపురుతో ఊడుస్తూ పోతారు (చీపురు కింద చచ్చినవి లెక్కలోకి రావు!) గాలి పీల్చేటప్పుడు సూక్ష్మజీవులు ముక్కులోకి పోయి చావవచ్చు మాట్లాడేటప్పుడు నోట్లో పురుగులు పడి చావవచ్చు అందుకని నోటినీ ముక్కునూ కప్పుతూ గుడ్డ కట్టుకుంటారు (అలా కప్పే ముందూ కప్పిన తరవాతా చచ్చిన పురుగులను లెక్కించరు) ఇంత దయాదృష్టి గల ఒకానొక జైన మతస్థుడి తలలో పేలు పడ్డాయి పేను చావకుండా జాగ్రత్తగా పట్టుకున్నాడు చంపటానికి ధర్మం ఒప్పుకోదు చంపకుండా వదిలిపెట్టడం వల్ల ఆత్మ హింస తప్పదు ఆత్మహింసా పరహింసల్లో ఏది ముఖ్యం, ఏదముఖ్యమని ఆలోచిస్తూ, పట్టుకున్న పేను చావకుండా జాగ్రత్తపడుతూ, దీర్ఘ విచారంలో ఉన్నాడు అటు చంపనూ చంపడు ఇటు వదలనూ వదలడు ఉరిశిక్ష పడి, తలారికోసం

ఎదురుచూస్తూ కారాగారంలో ఉన్న అభాగ్యుడిలా పేను విలవిల్లాడుతోంది అది హింస అని జైనుడు అంగీకరించడు ఇలాంటి ధర్మ సందేహాలు వచ్చినప్పుడే ఏంచేయాలో తోచదు పిల్లికి చెరలాటం, ఎలుకకు ప్రాణసంకట మన్నట్లు పేనుకేమో అది చచ్చిన చావూ కాదు - బతికిన బతుకూ కాదు జైనుడూ సుఖపడటం లేదు, అతడికి జీవహింస చేసిన పాపమూ రాదు, హింసించనందువల్ల పుణ్యమూ రాదు అయినా సరే, ధర్మసంకటంలోంచి బయటపడేదాకా అతడు చచ్చినా సరే పేనుకు విడుదల లేదు జైనమతస్థుల ఈ విపరీత సిద్ధాంతాన్ని వెక్కిరిస్తూ ఎవరో ఈ మాట పుట్టించారు పుట్టించినవాళ్ళు జైనులు కారు, మరెవరైనా కావచ్చు గాని - బొద్దులతోసహా ఇంతకూ ఉండటమో ఊడటమో తేలని సందిగ్ధస్థితిలో పేనుంటే, ఉంచాలో తుంచాలో తేల్చుకోలేని దుర్భరగ్లానిలో జైను దుంటాడు చావూబతుకూ కాని పరిస్థితిలో ఉన్నవాళ్లు జైనుడి చేతిలో పేనువంటి వాళ్ళన్నమాట చావటం సాధ్యం కాదు బతకటం వీలుపడదు ఇది జీవన్మరణ సమస్య బతికి చచ్చినట్లో, చచ్చి బతికినట్లో తేలని దుస్థితి

జోడుగుఱ్రాల స్వారీ: కొందరు జోడు శబ్దానికి బదులు రెండు అనే మాటను వాడుతుంటారు రెండు గుఱ్రాలమీద సవారి చేయటం గొప్ప విషయం కాదు అయితే ఒకే సమయంలో సాధ్యం కాదు ఏ రథానికో బండికో కట్టి వాటిని తోలుతూ ప్రయాణించటం మామూలేగాని ఒకేసారి ఒకే సమయంలో రెండు గుఱ్రాలమీద తానెక్కి సవారి చేయటం అయ్యేపని కాదు ఏ గుఱ్రం స్వభావం దానిదే ఎన్నాళ్ళు ఎన్నేళ్ళు వాటికి తర్ఫీదిచ్చినా, సైనికులు కవాతు చేసినట్లు ఒకే వరసలో క్రమంలో నడవటం, పరిగెత్తటం నేర్పినా ఒకే వ్యక్తి ఏక సమయంలో వాటిమీద స్వారీ చేయలేడు చేయాలని ప్రయత్నించాడో ప్రమాదంలో పడ్డాడు అందువల్ల ఈ మాటకు ప్రమాదకరమనే అర్థం వాడుకలో నిలిచింది అంతేకాదు, ఏకాగ్ర దృష్టి ఉన్న వ్యక్తి ఎన్నడూ ఈ పిచ్చిపనికి పూనుకోడు కాబట్టి జోడుగుఱ్రాల స్వారీ చేసేవాడు మాట నిలకడగాని, మనసు నిలకడగాని లేని నమ్మరాని వ్యక్తి అనీ, దురాశాపరుడనీ వ్యవహారంలో ప్రయోగం

డోకిపఱ్ఱు కాపరం: "కన్ను కైకలూర్లో, కాపరం డోకిపఱ్ఱులో" ననే సామెత వుంది విధి లేకనో వీలులేకనో డోకిపఱ్ఱులో కాపురమున్నా చూపంతా కైకలూరుర్లోని మరో వ్యక్తి మీద ఉండట ఇలాంటి భావాన్నే తారాశశాంకంలో తార తీరును వర్ణిస్తూ కవి చెప్తాడు - "మేను పని చెంత, మనసు రేరేని చెంత" అని! అంటే గత్యంతరం లేక కాపరం చేస్తున్నా మనసు మాత్రం - లేదా చూపు మాత్రం పరస్థలంలోనే ఉందని ఇంత చెప్పకుండా "అయన్దా? డోకిపఱ్ఱుకాపరం లెండి!" అంటే - అయన గారికి వేరే ఏర్పాట్లున్నాయని, లోకవంచనకు ఇక్కడ కాపరం చేస్తున్నట్లు నటిస్తున్నాడనీ అర్థం 'అయన'కు బదులు 'అమె' శబ్దం ప్రయోగించినా సరిపోతుంది - విషయం సరిపోతే

తంజావూరారి సత్రం: తంజావురు తమిళనాడులోని సుభిక్ష ప్రాంతాల్లో కావేరి ఒడ్డున ఉన్న సంపన్న నగరం దానికి అయిదారు మైళ్ల దూరాన మన త్యాగరాజు జన్మస్థలం తిరువాయూరుంది తంజావూరులోని బృహదీశ్వరాలయం సువిశాలమైన శివాలయం శిల్పసంపన్నమయిన ఆలయం అయితే ఇవి ఏ కొందరికోగాని ముఖ్యమనిపించలేదు తంజావూరును (తెలుగు) నాయకరాజులు పాలించినప్పటి సరస్వతీ మహాల్ గ్రంథాలయం

దేశం మొత్తంమీద గొప్ప గ్రంధాలయం అదీ అంత ఆకర్షకం కాలేదుగాని, నాయకరాజుల కాలంలో అక్కడ నడిపిన సత్రం సంగతి మాత్రం జనరంజకమయింది ఇప్పటికీ మంగమ్మ సత్రం వంటివి లేకపోలేదు కానీ అవి ఇప్పుడు సత్రాలు కాదు – హోటళ్ళు ఆ రోజుల్లో యాత్రికుల సౌకర్యం కోసం అన్నసత్రాలు పెట్టారు నాటి రాజులు ఉచితంగా తిండి దొరుకుతున్నది కాబట్టి పనీ పాటా లేని దౌర్భాగ్యులందరూ ఆ సత్రాల్లో పడి తెగతిని బలిసేవాళ్ళు సత్రాలు నడిపిన రాజులకు పుణ్యం వచ్చిందో లేదోగాని (అపాత్రదానంవల్ల పాపమే వచ్చి ఉండవచ్చు), తేరతిండిపోతుల సంఖ్య పెరిగింది తిండి గడిచిన తరవాత మిగిలిన పాడు అలవాట్లన్నీ అబ్బినాయి శ్రమపడి భోజనం సంపాదించటం కాక, సోమరిగా బతుకుతూ తిండికి లోపం లేని స్థితి వచ్చిందన్న మాట ఈ పరిస్థితిని పురస్కరించుకొని ఇంట్లో పదిమంది ఉన్నా సంపాదించేవా డొక్కడై తినేవాళ్ళు పని చేయనప్పుడు "ఈ కొంప తంజావూరు సత్రమయిపోయిం"దని వాపోవటం పరిపాటయింది 'తంజావూరు అన్నదాన ప్రహసనం' అనే గ్రంధంకూడా వెలిసింది ఆ కాలంలో

**తథాస్తు దేవతలు:** మానవుల కష్టసుఖాలను గమనించటానికి దేవతలు ఆకాశమార్గాన తిరుగుతుంటా రనేది నమ్మకం సాధారణంగా సాయంకాలాల్లో సంధ్యా సమయంలో అలా విహరిస్తుంటా రనేది మరో విశ్వాసం ఆ సమయంలో ఎవ రేమని అనుకుంటారో అది అలాగే జరగాలని దీవిస్తుంటారుట 'తథా, అస్తు' అనే రెండు మాటలకు క్రమంగా 'అలాగే, అగుగాక' అని అర్థం మంచి కావాలనుకుంటుంటే మంచి, చెడు కోరితే చెడు ఆ దేవతల ఆశీర్వాద ఫలితంగా జరిగి తీరుతాయని ఆ దేవతలకు తథాస్తు దేవతలని పేరుపెట్టి సంజె వేళల్లో ఒకరినొకరు తిట్టుకుంటే ప్రమాదమని భయపెడ్తుంటారు ఆ దేవతలున్నా లేకపోయినా, వాళ్ళ భూమిమీద మనం అనుకొంటున్న మాటలు విని అలాగే జరగాలని దీవించి అమలు జరిపినా జరపకపోయినా, ఈ భయానికయినా చెడ్డమాటలు మానాలని పెద్దల కోరిక వేకువజామునగాని, సందెచీకటి సమయంలోగాని కఠినమైన మాటలు మాట్లాడకపోతే ఆ పగలూ ఆ రాత్రీ హాయిగా గడుస్తాయని వాళ్ళ నమ్మకం పిల్లలు నిద్ర లేస్తుండగానే గొడవలు పెట్టుకొని తిట్టుకోకుండా, సాయంత్రం ఆటల్లో ఒకర్నొకరు శపించుకోకుండా ఈ దేవతల పేరుచెప్పి భయపెట్టడం కద్దు మంచిమాటలు పలికేటప్పుడు తథాస్తు దేవతలను స్మరించకపోయినా, పాడుమాటలు మాట్లాడకుండా నిరోధించటానికి వాళ్ళని పెద్దవాళ్ళు గుర్తుకు తెస్తుంటారు తమకు అన్యాయం జరిగిందనే అక్కసుతో ఎవరయినా తిట్టే, తిట్టినట్లే జరిగితే (ఏ కారణంవల్ల జరిగినా) 'అహా! తథాస్తు దేవతల్లాంటి వాళ్ళండీ!' అని ఆశ్చర్యపోతుంటారు శాపానుగ్రహ సమర్థులయిన మహర్షుల, పతివ్రతల కోవలో ఈ దేవతలు కూడా చేరుతారు

**తద్దినం నాటి జంధ్యం:** ఆర్యసమాజంలో తొలిదశలో వేటాడక తప్పలేదు అందరికి ఆయుధాలను వేలాడదీయడానికి జింక చర్మాన్ని పట్టెగా చీల్చి భుజాన ఏటవాలుగా తగిలించుకొనేవాళ్ళు అదే చర్మాన్ని నడుముకు పటకాగా ధరించి బాకువంటి ఆయుధాలను అందులో ముడిచే వాళ్ళు వేటాడటం స్థానంలో మంత్రాలు చదవటం వృత్తి అయినా పాతవాసనలు పోక జింకచర్మం స్థానంలో నూలుపోగులు తగిలించుకొని జందె మన్నారు నడుముకు పటకా స్థానంలో గోచిగుడ్డను నిలపటానికి మొలతాడు

వచ్చింది ఉపనయనం నాడు కొత్తగా జందెం తగిలించినప్పుడు దానికి జింకతోలు ముక్కను కట్టడమనేది ఆచారంగా మారింది ఎడమ భుజంమీదినుంచి కుడిభుజం కిందికి ధరించిన జందెం సవ్యంగా ఉన్నట్లు శుభకార్యాల పట్టున, ఇతర సమయాల్లోనూ జందెం ఉండవలసిన విధానమిది అయితే తద్దినాలు పెట్టే సమయంలో కొన్నిసార్లు కుడిభుజం మీది నుంచి ఎడమ భుజం కిందికి ఉండేటట్టు మారుస్తారు 'ఉపవీతి' అన్నప్పుడల్లా ఇలా మార్చుకుంటుండాలి జందేన్ని (తెలంగాణాలో 'ఉల్టాగా వేసుకోండి' అని పురోహితుల వారు సెలవిస్తుంటారు కొన్ని సమయాల్లో) అలవాటు ప్రకారం ధరించటం 'ప్రాచీనావీతి' ఈ రెండూ కాక ఒకసారి జంధ్యాన్ని మెడలో తావళంలాగా (దండలాగా) మార్చుకోవలసి వుంటుంది ఈ విధంగా మూడురకాల మార్పులు పొందుతుంది జందెం తద్దినం పెట్టేటప్పుడు అంటే నిలకడ లేకుండా, ఒక పద్ధతి లేకుండా మార్పులు చెందుతుందన్నమాట దాని స్థానం నిత్యజీవితంలో ఒడిదుడుకులు పడుతూ, ఎక్కడా నిలకడ గాని, నిబ్బరంగాని లేకుండా బతికే దురదృష్టవంతుడి జీవితాన్ని తద్దినం నాటి జందెంతో పోలుస్తారు నిశ్చితమైన సంపాదన, ఉనికి లేకుండా రోజుకొక తీరున కాలం దొర్లిస్తూ బతికేవాడు తద్దినం నాటి జందెంలాంటివాడు ఇన్ని మార్పులు చేయవలసినా జందేన్ని తీసిపారేయటాన్ని మటుకు శాస్త్రమెప్పుడు అంటే వదిలించుకోగూడని జంజాట మన్నమాట అందుకే వదిలిపెట్టలేని, అలవికాని బాధ్యతలను కూడా తద్దినం నాటి జందెమని చెప్తుంటారు

**తద్దినం పెట్టేవాడి తమ్ముడు:** నలుగు రన్నదమ్ములుంటే వారిలో పెద్దవాడు మాత్రమే తద్దినం మంత్రాలు చదువుతూ పురోహితుడు చెప్పిన పనులన్నీ చేస్తుంటాడు పితాళ్ళు (చనిపోయిన పెద్దలు) ఆ నలుగురికీ ఒక్కరే కావచ్చు పెద్దవాడికే ఈ శ్రమ అతడి తమ్ముళ్ళు చేయవలసిందల్లా ఒకటే పని – జందేన్ని ఎడమ బుజం నుంచి కుడి బుజానికి మార్చుకోవటం – అదిన్నీ 'ప్రాచీనావీతి' అని పురోహితుడు చెప్పినప్పుడల్లా మళ్ళీ పురోహితుడు 'ఉపవీతి' అన్నప్పుడు కుడిబుజం నుంచి ఎడమకు మార్చుకోవటం వాళ్ళపని ఉపవీతికి బదులు తెలంగాణాలో 'జందెం ఉల్టా వేసుకోండి!' అని ఉర్దూ తెలుగు మిశ్రభాషలో చెప్పడం కద్దు ఒక్కసారి మాత్రం తర్పణ లిచ్చే టప్పుడు మెడలో జందేన్ని తావళంలాగా (దండలాగా) వేసుకోవటం మరో పని మిగిలిన పనులన్నీ పెద్దవాడు చేస్తుంటే, ఈ మూడు సందర్భాల్లోనూ తమ్ముళ్ళు అన్న చేసినట్లు చేస్తుంటారు ఈ లక్షణాన్నిబట్టి తద్దినం పెట్టేవాడి తమ్ముడంటే అత్యంత స్వల్ప బాధ్యత మాత్రమే ఉన్నవాడనీ, కేవలం అనుసరించి బతకవలసిన అర్భకుడనీ అర్థాలు వచ్చాయి పెద్ద బాధ్యత లేమీలేని వ్యక్తిని ఈ పేరుతో వ్యవహరిస్తుంటారు

**తలారి పగ:** ఇప్పుడు ఎక్కడోతప్ప లేరుగాని పూర్వం రాజుల దగ్గర తలారి అనే ఉద్యోగి ఉండితీరేవాడు 'తలవరి' అనే పాత మాటకిది రూపాంతరం 'గ్రామపెద్ద' అనే అర్థంలో కూడా 'తలవర, మహాతలవర' వగైరా ఉద్యోగులుండేవాళ్ళు మధ్యయుగాల్లో తమిళంలో 'తలైవర్' అంటే పెద్ద (మనిషి/వాడు) అని ఇప్పటికీ అర్థం మొదట మొదట రాజకీయోద్యోగిగా ఉన్న తలవరి కాలక్రమాన చిన్న ఉద్యోగంలో (తలలు నరికేవాడుగా) స్థిరపడవలసి వచ్చింది మరణశిక్ష విధించినప్పుడు దోషి తల నరకటం మధ్యయుగాల్లో తలారి బాధ్యత అయింది ఇప్పటికీ ఉరిశిక్షకు గురయిన వ్యక్తిని ఉరితీసే ఉద్యోగిని తలారి అనే పిలుస్తున్నాం ఉద్యోగ ధర్మమే తల నరకటమైన తలారితో

తగువు పెట్టుకోవటం ప్రమాదం. అతడు పగ పట్టాడంటే తలదీసిగాని విశ్రమించడు అందుకే "తలారి పగ తలదీస్తే పోతుం" దన్న సామెత పుట్టింది ఫలితంలో తలారి పగ అంటే ప్రాణాంతకమైన శత్రుత్వమనే అర్థం వచ్చింది ప్రాణం తీసే శత్రుత్వాన్ని ఈ మాటతో ప్రస్తావిస్తారు

**తాతాచార్యులవారి ముద్ర:** ప్రస్తుతం ఒకసారి తాతాచార్యులవారిని స్మరిద్దాం వైష్ణవ మతం వ్యాప్తిలోకి వచ్చినప్పుడు (క్రీస్తుశకం 12 వ శతాబ్ది దరిమిలా) వెలసిన గురువుల్లో తాతాచార్య లొకరు వాలకాన్నిబట్టి తెలుగువాడనుకోవచ్చు శ్రీకృష్ణదేవరాయల కీయన గురువని ఒక ప్రతీతి వైష్ణవ మతం స్వీకరించినందుకు గుర్తుగా 'చక్రాంకితాలు' వేస్తారు అంటే – సుదర్శనచక్రంలాంటి గుర్తును వీపుమీదా బుజంమీదా కాల్చి వేస్తారు అలా శిష్యులకు మంత్రోపదేశం చేసి ముద్రలు వేసే అధికారం గురువులకు మాత్రమే వుంటుంది వైష్ణవ గురువుల్లో ఒకరకం పెద్దలను 'స్వయమాచార్య పురుష'లంటారు అంటే, వారు ఇతరుల దగ్గర మంత్రోపదేశం పొందనక్కరలేదు – తమకు తామే గురువులన్నమాట వారి చక్రాంకితాలను వాళ్ళే తగిలించుకోవచ్చు సొంతాన చక్రం ముద్రను కాల్చి తగిలించుకొన్నా, గురువుచేత ఆ పని చేయించుకున్నా వైష్ణవమతం స్వీకరించినట్లు గుర్తు అలా గురువు లెవరు ముద్ర వేసినా దాన్ని తాతాచార్యులవారి ముద్ర అనటం అలవాటయింది మతస్వీకారానికి చిహ్నంగా వుండే ఈ ముద్ర పడనిదే వైష్ణవులు కానట్లే అందుకే "తాతాచార్యులవారి ముద్ర వీపుకి తప్పినా బుజానికి తప్ప"దనే వాడుక పుట్టింది ఈ ప్రయోగానికి రెండర్థాలు ఒకటి ఏంచేసినా తప్పని పని అనేది, రెండోది గుర్తింపు అనేది తాతాచార్యుల ముద్రపడ్డదంటే (వైష్ణవుడిగా) గుర్తింపు పొందినట్లే లెక్క

**తాపత్రయం:** లేనిపోని బాధలను తెచ్చిపెట్టుకోవటమనే అర్థంలో ఈ మాటను వాడుతుంటారు. "ఎందుకింత తాపత్రయం?, అతడికి తాపత్రయం జాస్తి" వగైరాల్లో 'ఆరాటం' అనే అర్థం స్ఫురిస్తుంది నిజానికి మూడు రకాల తాపాలను ఈ మాట ప్రస్తావిస్తుంది. తన శరీరానికి, ఇంద్రియాలకు కలిగిన కష్టాలను, బాధలను తలుచుకొని దుఃఖించటాన్ని ఆధ్యాత్మిక తాపం అంటారు పెళ్ళాం బిడ్డలు, కుటుంబం, బంధువులు మొదలయినవారి కష్టనష్టాలనూ పాముకాటు, తేలుకాటు వంటి బాధలనూ తలుచుకొని దుఃఖపడటం అధిభౌతిక తాపం అతివృష్టి, అనావృష్టి, ఎండతాకిడి, నీటిఎద్దడి వంటి వాటివల్ల లోకులకూ లోకానికీ వచ్చిపడ్డ బాధలను తన నెత్తిన పెట్టుకొని, తనకు వచ్చిన కష్టాలని భావించి దుఃఖించటం అధిదైవిక తాపం ఈ మూడు తాపాలనూ భరించటం తాపత్రయంలో పడటం అంటే – తనకూ, తన కుటుంబానికేగాక యావత్తు ప్రపంచానికీ కలిగే బాధలు తనవిగా భావించి దుఃఖించటం తాపత్రయపడట మన్నమాట

ఏనాడు ఎవరు పైమాటను అచ్చతెలుగులోకి అనువదించారోగాని సమానార్థకంగా 'ముక్కాకలు' అనే మాటను సృష్టించారు. మూడు కాకలు (తాపాలు) ముక్కాకలు ముక్కాకలు తీరినవాడని, ముక్కాకల్లో ఆరితేరినవాడని సమర్థుడు, అసహాయశూరుడైన వ్యక్తిని గురించి వ్యవహరిస్తారు అయితే, అనేక యుద్ధాల్లో ఆరితేరినవాడనే అర్థంలోనే మన పూర్వకావ్యాల్లో ఈ మాటకు ప్రయోగం లభిస్తుంది తనకేగాక లోకానికి వచ్చిన కష్టాలను కూడా అధిగమించినవాడనే అర్థం వ్యవహారంలో చేకూరిందని చెప్పాలి

**తామరతంపర:** 'ఆ కుటుంబం తామరతంపరగా విస్తరించిం'దని మెచ్చుకుంటారు – భూమిమీది సంసారానికీ నీటిమీది తామరకూ ముడివేసి కొందరు 'తామరతంపం' అంటారు తంపర/తంపం–అనే మాటకు 'తూడు' అని అర్థం. తామరతూ డొక్కటుంటేచాలు అది క్రమంగా వందల వేల తామరాకులుగా పూలుగా విస్తరిస్తుంది నిజానికి నీటి అడుగున ఉన్న దుంప చిగుళ్లువేసి ఎన్నో దుంపలుగా, తూళ్ళుగా, తామరాకులుగా, పూలుగా పెరిగి వ్యాపిస్తుంది అలాగే కుటుంబ యజమాని శ్రమ సంపాదనల ఫలితంగా బాగా అభివృద్ధికి వచ్చిన సంసారాలను గురించి చెప్పేటప్పుడు వాళ్లు తామర తంపరగా వర్ధిల్లుతున్నా రంటారు ఇదంతా కుటుంబ నియంత్రణ దృష్టి అమల్లోకి రానప్పటిమాట ఆ కాలంలో 'అష్టపుత్ర బహుధనావాప్తి రస్తు'అని దీవించేవాళ్లు కొడుకులూ కూతుళ్లూ వెరసి ఎనిమిదిమంది పుట్టి, కావలసినంత డబ్బుండి, సుఖంగా బతకమనేది అప్పటి ఆశీర్వాదం ఈ కాలంలో సంతాన నిరోధం, కొన్ని సందర్భాల్లో ధనశక్తి నియంత్రణకూడా అమల్లోవున్నా అలవాటు బలిమిని ఈ ఆశీస్సు లందిస్తూనే ఉన్నారు.

తామర తంపరలో మరో విశేషముంది చెరువులో నీళ్లు సమృద్ధిగా ఉంటే తామరాకులూ పూలూ నీటిపైన కనిపిస్తాయి నీటిమట్టం తగ్గుతున్నా పరిస్థితిలో మార్పులేదు అందువల్లే 'నీరుకొలది తామర' అనే మాట పుట్టింది అవెప్పుడూ నీటి ఉపరితలానే ఉన్నట్లు, తామర తంపరగా ఉన్న కుటుంబంగాని కులంగాని ఆస్తిపాస్తులతో ఐశ్వర్యంతో దరిద్రంతో నిమిత్తం లేకుండా ఎప్పుడూ అభివృద్ధిలో ఉంటుందనేది ఆకాంక్ష తామరలాగే ప్రవర్తించే కలువపూల వంటివి ఉన్నా, పదిమందీ – చూసే పగటిపూట విప్పారి కనిపించే తామరకే ఈ జాతీయంలో ప్రాముఖ్య మిచ్చారు

**తాళం పట్టటం:** కేవలం ఆ మాటలకున్న అర్థాలను మాత్రమే పరిగణిస్తే కంచు, ఇత్తడి వగైరా లోహాలతో గుండ్రంగా, మధ్య ఉబ్బుగా చేసిన తాళం చిప్పలను పట్టుకోవటమే తాళం పట్టటం భజనలు చేసేటప్పుడో, నాట్యం చేస్తున్నప్పుడో ఈ తాళం చిప్పలను లయతాళాల సూచనకోసం వాడుతుంటారు అంటే, అవి పట్టినప్పుడు అవతలి వ్యక్తి గెంతులు పెట్టడమో గంతులు వేయటమో చిందులు తొక్కటమో జరుగుతుంది ఆ కార్యానికి కారణమైన తాళం పట్టడం అవతలివ్యక్తిని ఆడించటమని భావించారు ఫలితంగా 'చూడు! నీ తాళం పట్తా'ననేది బెదిరింపయి, నిన్ను ఆట ఆడిస్తానని, ఏడిపిస్తానని హెచ్చరించటంగా వాడుకలో నిలిచింది.

**తాళాధ్యాయం:** 'ఫలానావారి విషయం తాళాధ్యాయంలో ఉంది'లాంటి ప్రయోగాలు వినిపిస్తాయి అధ్యాయం అంటే ప్రకరణం, భాగం, చదువుకోవలసిన గ్రంధభాగం వగైరాలు తాళం అనేది ఇక్కడ చప్పట్లు అనే అర్థంలో వాడింది చప్పట్లు చరుస్తూ గేలి చేయటాన్ని తాళాధ్యాయం 'నడపట' మంటారు ఒక మహోపన్యాసం విని ఒక ఘనకార్యాన్ని చూసి మెప్పుతో చప్పట్లు కొడ్తారు ఇక చాలించు అని సూచించటానిక్కూడా చప్పట్లు చరుస్తారు. రెండు చేతులు కలిసినప్పుడు చప్పట్లు మోగినా, వాటితో వేసే తాళాన్నిబట్టి, ఆసమయంలో చప్పట్లు చరిచే వ్యక్తి ముఖలక్షణాలనుబట్టి, హావభావాలను బట్టి అది వెక్కిరింతో మెప్పుదలలో తెలుస్తుంది కానీ మెప్పుదలనుకాక దెప్పుదలను సూచించటానికే తాళాధ్యాయమనే జాతీయాన్ని ఎక్కువగా వాడుతుంటారు

తిక్క శంకరయ్య: శంకరుడంటే మేలు కలిగించేవాడని వ్యుత్పత్తి 'శం' అంటే శుభం అయినా అతగాడికి (సదరు శివుడికి) కోప మెక్కువ అతడు లయకర్త మూడోకంటితో సమస్త ప్రపంచాన్నీ భస్మం చేయగలడు ఆ బూడిదనే ఒంటికి రాసుకోనూగలడు – ఇంకా కోపం తగ్గకపోతే అయినా అత డొకపట్టాన మండిపడడు – తిక్క తిరిగినప్పుడు తప్ప తలతిక్కగా మాట్లాడినా, అనవసరంగా కోప్పడ్డా, అయినదానికీ కానిదానికీ అడ్డం తిరుక్కున్నా "పోవోయ్, తిక్క శంకరయ్యా!" అని ధిక్కరిస్తాం ఒకటిచెప్తే మరొకటి చేసినా "పోనిద్దురూ, వాడో తిక్క శంకరయ్య!" అని సరిపెట్టుకొంటాం. ఎవరెన్ని చెప్పినా తనకు తోచిన పనే చేసేవాణ్ణిగూడా "తిక్క శంకరయ్య లెండి! వాడికి తోచదు ఒకరు చెప్తే వినడు" అని వ్యవహరిస్తాం అలా ఒక ప్రత్యేకతా ఒక విలక్షణతా కలవాడు తిక్క శంకరయ్య

తిత్తిగాడు: పాటకు శ్రుతి వేయటం కోసం తిత్తిని వాడుతారు దాన్ని ఊదుతూ శ్రుతి నిర్దేశించేవాడు 'తిత్తికాఁడు' అని నిఘంటువుల నిర్వచన వాడుకలో 'తిత్తిగాడు' అనే రూపమే ప్రచురం సన్నాయి వాయించేవాడికి శ్రుతి పెట్టడం కోసం తిత్తిగా డవసరం సంగీత నాటకాలకు సమాజంలో గౌరవం ఉండేది కాదు నట విట గాయక గణికాజనమని వాళ్ళను ఈసడించటం కద్దు మధ్యయుగాలనుంచి ఈ శతాబ్దం తొలి దశాబ్దాలదాకా నటులను అపాంక్తేయులని వ్యవహరించేవారు అంటే, వారితో సహపంక్తి భోజనం చేయటం కూడా నిషిద్ధమన్నమాట నటుల సాక్ష్యాలకు విలువలేదు వారు అసత్యాన్ని సత్యంగా 'నటించి' చెప్తారనే విశ్వాసం ఉండేది సంగీత సాధకులకూ వాద్యకారులకూ గౌరవం లేనప్పుడు వారి వెంట, వారిని అనుసరించి బతికే అప్రధానుడైన తిత్తిగాడి సంగతి చెప్పనక్కరలేదు. నటులు విడిచిన గుడ్డల మూటలను కూడా అతగాడు మోయవలసి వుండేది భోగం మేళాల వెంట తిత్తిగాడుగా తిరిగే వ్యక్తి పరిస్థితి మరింత హీనంగా ఉండేది పాత గుడ్డల మోత నుంచి చిల్లర పనులన్నీ చేయవలసిం దతడే అందువల్ల సొంత వ్యక్తిత్వం లేని, ఎప్పుడూ ఎవరిమీదనో ఆధారపడి వుండే మనిషిని తిత్తిగాడని ఆక్షేపించటం వాడుక కెక్కింది. ఇది నిందార్థకమైన జాతీయం

తిమ్మరాజు – పోతురాజు: ఈయన మనిషో, మనిషికి పూర్వుడని ఈనాటి శాస్త్రజ్ఞులు నమ్మే కోతో ఖండితంగా చెప్పలేం కోతినీ అనాకారినీ తిమ్మయ్య, తిమ్మక్క అని వ్యవహరించటం కద్దు "తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు" అని ఇద్దరు రాజులు ఒకేవ్యక్తిగా చెలామణీ అవుతుంటారు. నిర్మొహమాటంగా చెడతినడానికి సిద్ధమైనా పనిచేయవలసివచ్చేసరికి బద్ధకించే వ్యక్తిని ఈలాగున పిలుస్తారు పోతు అనేది మొగ జాతి అని చెప్పటానికి పనికివస్తుంది సదరు 'పోతు' ఎనుబోతో మనుబోతో తెలీదు స్పష్టంగా. మరి నిజానికి దున్నపోతు చాకిరీ చేస్తుంది ఈ పోతురాజు పనిచేయడు. కాబట్టి మనిషే అయివుండాలి!

గ్రామదేవతల పూజారులుగా ఉండే పోతురాజు లున్నారు అమ్మవారు విగ్రహం కాబట్టి, ఆమె స్వయంగా ఏమీ తినదు ఆమెకు కోపం వచ్చిందని చెప్పి, పోతును బలి ఇవ్వాలని చెప్పి దాన్ని పీక్కుతినగల మహాత్ముడు – ప్రసాదంగానే ననుకోండి – పోతురాజు ఆయన దైవాంశసంభూతుడయినా కాకపోయినా దేవత ప్రతినిధి కాబట్టి ఆయన ఒళ్లువంచి పనిచేయటం సమాజానికి తలవంపనే నమ్మకముంది

ఆయన ఊరిని తినకపోయినా (ఆ పని అమ్మవారు స్వయంగా చేస్తుంది!) ఊరిమీదపడి తింటాడుగాని పని చేయడు తిండే ప్రధానంగాని పని కాదన్నమాట అందుకని ఈయన్ను తిమ్మరాజుతో జతగట్టి సామెతలో ఇరికించారు ఎవరో, ఏనాడో ఇది దున్నపోతు తిండేగాని సుకుమారంగా, తెలివిగా తినేదికాదు

*తిరుపతిక్షౌరం:* ఇది జగత్ప్రసిద్ధమైన జాతీయం పుణ్యక్షేత్ర మయిన తిరుపతికి అసంఖ్యాకంగా యాత్రికులు వస్తుంటారు కళ్యాణకట్టలోనో ఆలయం చుట్టుపక్కలనో తలనీలాలు సమర్పించుకుంటుంటారు ఇప్పుడున్న వసతులు లేని రోజుల్లో కొండమీదికి కాలినడకన పోవలసిన కాలంలో కొద్దిమంది క్షురకులు మాత్రమే తిరుమలలో ఉండే వాళ్ళు యాత్రికుల వెంటపడి బతిమాలి క్షౌరం మొదలుపెట్టేవాళ్ళు సగంలో పని ఆపి మరో యాత్రికుడికీ అదే పని చేసేవారు సగం సగం పని అనే అర్థంలో ఆ కాలంలో ఈ మాట పుట్టింది. ఇప్పుడు పరిస్థితి మారింది నున్నగా పొన్నకాయలా ఉండేట్లు గుండుచేసి పంపుతున్నారు కాబట్టి సంపూర్ణ క్షౌరమనే అర్థం వచ్చిపడింది

*తిలతండులాలు:* తిలలంటే నువ్వులు తండులాలంటే బియ్యం గింజలు ఈ రెంటినీ ఎంత కలిపినా రంగులోని భేదంవల్ల సరిగా కలవ్వు తలమీది జుట్టు సగం నెరసి సగం నల్లగా ఉంటే తిలతండులాలు కలిసినట్లున్నాయని శ్రీనాధుడు కాశీ అన్నపూర్ణాదేవి విషయంలో వర్ణించాడు లోకం దృష్టిలో కలిసి కాపురం చేస్తున్నట్లు కనిపిస్తూ నిజానికి పోట్లాడుకుంటూ ఉండే దంపతులనూ, భుజాలమీద చేతులేసుకొని తిరుగుతూ ఒకరికొకరు అపకారం చేసుకొనే మిత్రులనూ తిలతండులాలని వ్యవహరిస్తారు మనసులు కలవని జంటలు తిలతండులాలు అంటే – పాలూనీరులాగా భేదం కనిపించకుండా కలవని వాళ్లందరూ తిలతండులాలకిందనే లెక్క

*తిలోదకాలు:* నువ్వులూ నీళ్లూ (ఉదకం) కలిసి తిలోదకా లవుతాయి అపరకర్మలు చేసేటప్పుడు నీళ్లలో నువ్వులు కలిపి వదులుతారు అవి ప్రేతకో చనిపోయిన వ్యక్తికో స్వర్గం చేరేదాకా దారిలో బత్తెంగా పనిచేస్తా యనేది నమ్మకం తప్పక నరకానికే పోయి తీర్తారన్న నమ్మకమున్న వ్యక్తులకూ్కడా తమ ధర్మంగా తిలోదకాలు వదుల్తారు బతికున్నవాళ్లకేమైనా ఇస్తే ఎప్పుడో అప్పుడు ఏదోవిధంగా ఎంతో కొంతగా తిరిగివచ్చే అవకాశంగాని, వస్తుందన్న ఆశగాని ఉండవచ్చు చచ్చినవాళ్లనుంచి తిరిగి వచ్చేదేమీ లేదుకాబట్టి వారి కోసం సమర్పించిన తిలలూ నీళ్లూ కూడా తిరిగివచ్చే ప్రశ్నేలేదు శాశ్వతంగా పోయినట్లే లెక్క అందువల్ల ఏదైనా వస్తువు శాశ్వతంగా పోయినట్లు నమ్మకం కుదిరితే తిలోదకాలు సమర్పించామని నిట్టూర్చి చేతులు నలుపుకొంటారు ఎంత జాగ్రత్తపడినా సొమ్ము పోతే 'ఇంకేముంది? తిలోదకా లిచ్చినట్లే' నంటారు

*తీతువు (పిట్ట) రాయబారం:* 'తీతీ' అని ఎడతెగకుండా అరుస్తుంటుంది తీతువు పిట్ట ఓ కథ ప్రకారం అది సముద్రానికీ గరుత్మంతుడికీ తగాదావస్తే మధ్యలో సంధి ప్రయత్నంగా రాయబారం నడిపిందంటారు పోరాడుతున్నవాళ్ళు ఇద్దరూ బలవంతులు విషయమూ తీవ్రాతితీవ్రం రాయబారం నడిపే తీతువును ఆ యిద్దరిలో ఏ ఒక్కరూ ఖాతరు చేయరు అలాగని తీతువు తన ప్రయత్నం మాననూ లేదు ఆకాశం నుంచి సముద్రందాకా, మళ్ళీ కిందినించి పైకి ఎగురుతూ తన భాషలో 'తీతీ' అని కూస్తూ ఆ పిట్ట అవిరామంగా తిరుగుతూనే ఉంది ఎవరూ పట్టించుకోకపోయినా తనపని

తాను చేసుకుంటుదన్నమాట. తాడూ బొంగరం లేని పని నెత్తిన వేసుకొని, వారికీ వీరికీ మధ్య ఊపిరాడకుండా తిరుగుతూ, ఏ కార్యమూ సాధించలేనప్పుడు తీతువు రాయబారమని వెక్కిరింతగా అంటారు ఉదాహరణకు అమెరికా రష్యాల మధ్య భారతదేశం నడిపే రాయబారాన్ని దీంతో పోల్చవచ్చు ఉభయపక్షాలకన్నా బలవంతుడై, అవసరమైతే ఇద్దరికీ చెరి నాలుగు వడ్డించగల శ్రీకృష్ణుడి రాయబారమే విఫలమయ్యే సమయంలో ఎవరూ వినని, లక్ష్యపెట్టని, పట్టించుకోని దుర్బలుడి రాయబారం తీతువుపిట్ట రాయబారం అందువల్ల – ఉభయులూ రాజీపడ్డా కూడా – తనకు అవగింజంత ప్రయోజనం లేని నిష్ఫలప్రయాసలను తీతువు రాయబార మంటారు కొందరీ రకం వృథాప్రయాసను 'ఏట్రింత రాయబార'మని పిలుస్తారు ఈ పద బంధానికి అనవసర శ్రమ అనే అర్థమేకాక 'హాస్యాస్పదవిషయ'మనే అర్థం కూడా ఉంది అసమర్థుడి ప్రయత్నాన్ని తీతువు రాయబార మంటారు

**తీర్థకాకం:** పవిత్ర నదుల్లో స్నానం చేస్తే పాపాలు పోతాయనే నమ్మకముంది భారతీయుల్లో అందుకని తీర్థయాత్రలు చేస్తుంటారు (ఈ కాలాల్లో మందు కొట్టడానికి బారులకు పోవటాన్ని కూడా తీర్థయాత్ర అని వ్యవహరిస్తున్నారు 'నవ నాగరికులు!') తీర్థస్థలాల్లో స్నానాదికం పూర్తి చేసుకున్న తరవాత పితృదేవతలకు పిండప్రదానం చేయుటం ఆచారం పిండాలను కాకులకు పెట్టడం, కాకులను పితృదేవతల ప్రతినిధులని భావించటం పరిపాటి పదిమంది చేరి భోజనభాజనాలు చేసేచోట కాకులు తప్పకుండా చేర్తాయి అలా ఉచిత పిండాలకోసం – కర్చులేకుండా తిండి సంపాదించటంకోసం – తీర్థస్థలాల్లో ప్రత్యక్షమయ్యేవాళ్లను తీర్థకాక మంటారు యాత్రికుల చేత శ్రాద్ధాదులు పెట్టించే పురోహితు లుంటారు ఉత్తర హిందూస్థానంలోని కాశి, గయవంటి పుణ్యక్షేత్రాల్లో వాళ్లసంఖ్య అపారం అక్కడ వాళ్లను 'పండా' లంటారు నిజానికి వేదవిద్య తెలిసినవాడే పండా/పండితుడు. పాండిత్యమున్నా లేకపోయినా పొట్టకూటికోసం యాత్రాస్థలాల్లో కనిపించే వాళ్లను – దానధర్మాలు పట్టేవాళ్లని – తీర్థకాకా లంటారు మతసంబంధ మయిన విషయజ్ఞానం, శాస్త్రజ్ఞానం, మంత్రతంత్రాదులూ తెలిసినా తెలియకపోయినా పుణ్యక్షేత్రాలవద్ద గుమికూడే, దానాలు పట్టడంకోసం మాత్రమే తీర్థయాత్రలు చేసే వాళ్లను తీర్థకాకాలని పిలుస్తారు ఫలితంలో 'యాచకుడు' అనే అర్థం వచ్చింది ఈ మాటకు

**తుని తగవు:** తూర్పుగోదావరి జిల్లాకు ఉత్తర సరిహద్దులోని ఊరు తుని తగవంటే న్యాయం, ధర్మం – పోట్లాట కాదు వాడుకలో మాటలు కలిపి 'తుత్తగవు' అని కూడా పలుకుతారు ఇద్దరు వ్యక్తులు అప్పుసప్పుల గురించి, లావాదేవీల గురించి ఘర్షణ పడితే సంధి చేసే విధానాల్లో ఇదొకటి మాట వరుసకు ఒకరు పది రూపాయలు బాకీ వుందంటే, మరొకరు అయిదే తీసుకొన్నానంటే – సగటున ఏడున్నర రూపాయలిచ్చి తగాదా చంపుకొమ్మనటం తుత్తగవు ఉభయపక్షాలకూ సమానంగా బాధ కలిగించటమే ఇందులోని పరమార్థం తగాదాను కొనసాగించకుండా చంపటం రెండో లక్ష్యం ఇలాంటి భావంతోనే "రామాయపట్నం మధ్యస్థం" లాంటి జాతీయాలు పుట్టాయి ఇలా ఎన్ని ఊళ్ల పేర్ల మీద ఇదే భావం చెప్పే జాతీయాలు పుట్టాయో లెక్కగట్టడం కష్టం

**తూర్పారబట్టు:** ఈ కాలంలో పాతసంగతులనూ తగాదాలనూ గుర్తుకు తెచ్చుకుంటూ చెడతిట్టడాన్ని ఈ మాటకు అర్థంగా భావించి ప్రయోగిస్తున్నాం అసలది తూరు, పారు, పట్టు అనే మూడు విడిమాటల కలయిక తూరంటే తాలు, తబుకు పారబట్టు అనేది సమస్తక్రియ పొయ్యేటట్లు పట్టుకోవటమని దాని అర్థం పంటకళ్ళంలో ధాన్యంలోని తాలు పోగొట్టడానికి చేటతో కొంత తీసుకొని గాలివాలున కిందికి కొద్దికొద్దిగా వదులుతున్నప్పుడు గట్టిగింజలు కింద కుప్పబడితే తాలూపొల్లూ గాలికి దూరంగా కొట్టుకపోతాయి అది తూర్పార బట్టటం తేలికపాటి, గింజపట్టని పొల్లును తొలగించటానికి చేసేపని అది ఈ పని చేయకుండానే వ్యక్తిలోని లోపాలను బయటపెట్టూ తిట్టడాన్ని తూర్పారబట్టడ మంటున్నాం ఫలితంగా తిట్టడమనే అర్థమే మిగిలిపోయింది

ధాన్యం కంకుల నుంచి పొల్లుగింజలను తొలగించే ఈ పద్ధతిని భారత టిబెట్ సరిహద్దుల్లో మరో విచిత్ర భయంకర కార్యంలో పాటిస్తుంటారు ఆ తెగల దృష్టిలో వ్యక్తి మరణించిన తరవాత ఆ పాంచభౌతిక శరీరాన్ని పనసపొట్టు కొట్టినట్లు చిన్నచిన్న ముక్కలుగా కొట్టి చేటల్లో ఉంచి గాలికి కొట్టుకపోయేట్లు విసరిపారేస్తే సదరువ్యక్తి ప్రాణాలే కాక శరీరంకూడా అనంతవాయువులో కలిసిపోయి భగవంతుడిలో లీనమయిపోతుందనే నమ్మకముంది అది భయంకరాచారమని మనకనిపించినా అక్కడి ప్రజలకు అది విధ్యుక్తమయిన పవిత్ర కర్తవ్యమనే అనిపిస్తుంది మన వాడుకలోని తూర్పారపట్టడానికీ ఆ విధానానికీ క్రౌర్యతీవ్రతలో మాత్రమేగాక ప్రయోజనంలో కూడా భేదముంది

**తృతీయ హస్తం:** 'మూడో చెయ్యి' అనే అర్థంలో ఈ మాట పుట్టింది కొందరు 'మూడో హస్త'మని కూడా పిలుస్తారు ఈ మాట బ్రాహ్మణ వ్యవహారంలో ఎక్కువగా వినిపిస్తుంది "ఆయనకు తృతీయ హస్తం మొలిచింది" అంటే 'చాదస్తం పెరిగింది' అని అర్థం చాదస్తం వల్ల మడీ ఆచారాలూ పెరిగి స్నానాలకూ దేవతార్చనలకూ ఉన్న రెండు చేతులూ చాలటం లేదని వెక్కిరించడానికి ఈ మాట వాడ్తారు

**తృతీయ ప్రకృతి:** ప్రకృతి శబ్దాన్ని ఇక్కడ ప్రపంచార్థంలో వాడుతుంటారు అది నిరంతరాయంగా కొనసాగాలంటే జీవరాశు లన్నిటిలోనూ స్త్రీ పురుష భేదమూ ఆ రెండు తెగల కలయికా తప్పదు అంటే ఒకటి పురుష ప్రకృతి; రెండోది స్త్రీ ప్రకృతి సృష్టికి ఆధారభూతమయిన ఈ రెండూ కాక మూడోది మరొకటుంది అది నపుంసకుడయిన పురుషుడు కావచ్చు; మాచకమ్మ అయిన స్త్రీ కావచ్చు సంసారానికీ సంతానోత్పత్తికీ పనికిరాని వ్యక్తులను తృతీయ ప్రకృతి అని వ్యవహరిస్తారు పురుషుడిలా ఖండితంగా గాని, స్త్రీలాగా సుకుమారంగా గాని వ్యవహరించని వ్యక్తిని ఎగతాళిగా 'అతగాడిది తృతీయ ప్రకృతిలెండి' అని ఆక్షేపిస్తుంటారు అవుగాములు తేల్చకుండా నసపీకుడుగా మాట్లాడేవారిదీ, ఒక పట్టాన ఏదో ఒక నిర్ణయానికి రాలేని వారిదీ తృతీయ ప్రకృతి (మూడో స్వభావం) అని వ్యవహరించడమూ కద్దు

**తెగితే లింగడు రాయి:** వీర శైవులు మెడలో లింగకాయ కట్టుకొంటారు ఉన్నవాళ్ళు బంగారం, వెండి వంటి ఖరీదైన లోహాలతో లింగాలు తయారు చేయించుకొని కట్టుకుంటే ఆచారపరులు రుద్రాక్షలతోబాటు ఏ గుండ్రటి రాతినైనా కట్టుకొంటారు

రాతిని కట్టుకోవటం దరిద్రానికి చిహ్నం. అది మెడలో ఉన్నంతకాలం లింగం–శివలింగ మన్నమాట. రాతిని కట్టిన తాడు తెగి కిందపడితే అది రాయితో సమానం. దానికున్న పూజనీయత పోతుంది. లింగంగా కంఠాభరణంగా ఉన్నంతకాలం దాన్ని ధరించిన వ్యక్తి తాగే నీటినీ, తినే తిండినీ దానికి చూపి నైవేద్యం పెట్టినట్లు భావించి గౌరవిస్తాడు. నేలమీద రాయిగా ఉన్నప్పుడు దాని విలువ తగ్గిపోతుంది. అన్ని రాళ్ళ లాంటిదే అవుతుంది. అవసరపడితే ఆయుధంగా క్షిపణిగా కూడా పనికివస్తుంది. మెడలో ఉన్నప్పుడు దానికి పూజలేగాని అమర్యాద జరగదు. ఈ ఆచారాన్ని పురస్కరించుకొని ఈ మాట పుట్టింది. ఒక వ్యక్తిని సగౌరవంగా చూసినంత కాలం అతడు దేవుడిలాగా శాంతంగా ఉంటాడు. మర్యాద తప్పినప్పుడు రాయిలా బండబారి నాలుగు దెబ్బలు వడ్డించగలడు. ఈ విధంగా ఆలోచించి 'తెగ లాగవద్దు. తెగితే లింగడు రాయి' అని బెదిరించటం కద్దు.

**తెరచిరాజు:** ఇది చదరంగం నుంచి పుట్టిన జాతీయం. ఆటలో రాజు కెదురుగా ఉన్న బంటునో జంతువునో పక్కకు తప్పించినప్పుడు ఏనుగో, మంత్రో ఎదురయ్యేట్లు ఎత్తువేయటం తెరచిరాజు. అప్పుడు రాజే తప్పుకోవాలి–ఉన్న స్థానం నుంచి. తప్పుకొనే వీలు లేకపోతే ఆటకట్టవుతుంది. ఒక వ్యక్తికి ఎదురుగా ఎంతో వినయం ప్రదరిస్తూ ఉన్నట్లుండి దెబ్బతీయటాన్ని తెరచిరా జంటారు. కాళ్ళకు మొక్కడానికని వచ్చి అకస్మాత్తుగా కాలుపట్టుకు లాగి పడవేయటం లాంటిదిది. అనుకూలంగా ఉన్నట్లు కనపడుతూ నటిస్తూ కొంపదీస్తే తెరచిరాజు చెప్పా డనటం వాడుకలో నిలిచింది.

**తెల్లగుర్రం కొలువు:** గుర్రం మనిషికి ఎంత సేవ చేస్తుందో అంత చాకిరీ యజమానిచేత చేయించుకుంటుంది. దానికి ఒళ్ళు పట్టాలి. ఆ పనికి మాలీషు చేయటమని పేరు. గుర్రం తెల్లటిదయితే ఎంత నూనె రాసి, ఎంత మర్దించినా దుమ్ముపడి దాని చర్మం మాసిపోతుంది. మెరుగు తగ్గుతుంది. సొంతదారు ఈ పనికి కూలివాణ్ణి పెట్టుకుంటే తృప్తిపడలేదు. సేవకుడు యజమానికి తృప్తికరంగా పనిచేయనూ లేడు. ఇది ఎడతెగని చాకిరీ. ఎంతచేసినా మెప్పురాదు. పనివాడికీ మనస్తృప్తి ఉండదు. అందువల్ల తెల్లగుర్రం కొలువు కొంచెం తక్కువగా కుక్కతోక వంకర తీయటం లాంటి అసాధ్యకార్యం. అసంతృప్తి వ్యవహారం. కొందరీమాటకు వెల్లగుర్రం కొలువనే రూపాంతరాన్ని వాడుతుంటారు. వెల్ల, తెల్ల పర్యాయపదాలు.

**తేరగుర్రం:** ఈ మాటను కొందరు 'తేరగుర్రం తంగేడ బరికె' అని విస్తరించి ప్రయోగిస్తుంటారు. గుర్రం సొంతది కాదు. ఎవరి దగ్గరినుంచో ఉచితంగా తెచ్చుకున్నది. కొద్దికాలంపాటు ఉపయోగపెట్టుకొని తిరిగి ఇవ్వవలసింది. తేరగా వచ్చింది. అలా దొరికిన గుర్రంచేత పరుగులు పెట్టించటానికి ఓ ప్రబుద్ధుడు తంగేడు బరికెను (బెత్తాన్ని) వాడేడుట. అది చర్మాన్ని/తోలును పదునుపెట్టడానికి వాడే వస్తువు. సుకుమారంగా వాడుకొని జాగ్రత్తగా తిరిగి యివ్వవలసిన గుర్రాన్ని చావగొట్టి చెవులుమూసి చూసేవారికి అది అతడి సొంత గుర్రమనీ, దాన్నీ యథేచ్ఛగా శిక్షిస్తున్నాడనీ అనిపించేట్లు ప్రవర్తిస్తున్నా డన్నమాట. తాత్కాలికోపయోగం కోసం బతిమాలి తెచ్చుకొన్న వస్తువును సొంతవారికన్నా కఠోరంగా వాడటం ఆ వ్యక్తి దుర్వాంఛకూ దురహంకారానికీ మూర్ఖత్వానికీ చిహ్నం. ఊరక దొరికిన వస్తువును తేరగుర్ర మంటారు. దాన్ని నిర్దయగా వాడుకోవటాన్ని 'తేరగుర్రం – తంగేడు బరికె' అంటారు.

తేరసొమ్ము: ఈ మాటకు ఊరికే దొరికిన సొమ్మని అర్థం కళింగ ప్రాంతంలో సొమ్ము అనే మాటకు పశువనే అర్థముంది డబ్బు కూడా కావచ్చు. వస్తువూ కావచ్చు – తేరకల్లులాగా సొంత వస్తువుకన్నా ఇతరుల నుంచి ఊరికే దొరికిందాన్ని అబగా వాడుకొనే వాళ్ళున్నారు తేరసొమ్ము కోసం దేబిరిస్తూ రాత్రింబవళ్ళు సంపాదనాలోచనలో ఉండేవాళ్ళూ ఉన్నారు సొంతగాడికి సొంత సొమ్ముమీద ఉన్న అభిమానంకన్నా ఆర్జవంకన్నా తేరగాడికి తేరసొమ్ముమీద ఉండే ఆధిపత్యం తిరుగులేనిది ఆ దృష్టితోనే 'తేరసొమ్ము బీరపీచు' అనే సామెత పుట్టింది బీరకాయ పీచులు ఒకదానితో ఒకటి ఎంత గట్టిగా పెనవేసుకొని ఉంటాయో తేరసొమ్ముమీది వ్యామోహం అంత తీవ్రంగా ఉంటుందని తాత్పర్యం అవసరానికి మించిన అభిమానం ప్రదర్శిస్తే అది తేరసొమ్ము లెమ్మని ఆక్షేపించటం కద్దు.

తోకపద్యం: ఇది ఒకనాటి విద్యావంతుల వినోదం తమకున్న సాహితీ పరిచయాన్ని పరీక్షించుకోటానికి ఒకరు విశ్రాంతిగా కూర్చుని ఏదో ఒక పద్యం చదివితే, దాని చివరి మాటతో మొదలయ్యే మరో పదాన్ని రెండోవారు చదవగలగాలి. చివరి మాటనే 'తోక' అని పిలిచేవారు అలా చదవలేకపోతే ఓడినట్లు లెక్క చదివే పద్యాలన్నీ పూర్వ కవులు రాసినవై ఉండాలి ఆశుకవిత చెప్పగల పోటీదారు సొంత పద్యం రాసి చదివితే గెలిచినట్లు కాదు ఎవరు చదివినా పద్యం ఏ గ్రంథంలోదో ఏ కవిదో తాము చెప్పగలిగి ఉండాలి పద్యం తప్పుగా చదివినా, ఎవరిదో ఎక్కడిదో చెప్పలేకపోయినా ఓడినట్లే లెక్క. కొన్ని సమయాల్లో ఎవరికెన్ని గుణాలు (మార్కులు) వచ్చాయో లెక్కించి, విజేతలనూ స్థానాన్నీ నిర్ణయించుకొనేవారు ఈ పోటీ సాధారణంగా మిత్రులయిన సాహితీపరుల మధ్య జరిగేది ఈ పందెం వినోద ప్రధానమేగాని పోటీమూలకమయింది గాదు

మొదటి పద్యం చివరి అక్షరంతో కొందరు, పదంతోనే కొందరు రెండో పద్యం మొదలేస్తారు. ఆ రెండోదానికి తోక పద్యమని పేరు. భిన్న వ్యక్తులకున్న సాహితీ పరిచయం, ధారణశక్తి ఇందులో ప్రధానాలయినా సకాలంలో సరయిన పద్యం స్ఫురించటంమీద విజయం ఆధారపడి ఉంటుంది ఈ వినోదంతో నిమిత్తం లేకుండా ఎవరయినా మాటలను సాగదీసి, అభిప్రాయం తేల్చక నానుస్తుంటే తోకపద్యం చదువుతున్నాడని ఆక్షేపిస్తారు. నానుడు వ్యవహారాన్ని తోకపద్యంతో పోలుస్తుంటారు ఫలితంగా ఎడతెగని విషయం ఏదైనా తోకపద్యమని వ్యవహరిస్తారు కాలక్రమాన అవతలి వ్యక్తి చెప్పిన మాటలే పునరుద్ఘాటిస్తూ సమర్థిస్తూ మరొకరు అదే విషయం పునరుక్తిగా చెప్తుంటే 'మహానుభావుడు తోకపద్యం చదువుతున్నా'డంటారు పద్యమూ తోకా లేకపోయినా, చివరికి సొంత అభిప్రాయం బయటపెట్టకుండా, తన నిర్ణయం తేల్చకుండా, ఈనాటి సిద్ధాంత వ్యాసాల చివరి ప్రకరణాల్లో ఉండేవాటిని కూడా తోకపద్యా లంటారు తోకపద్యాలు చదవగలిగిన సంఖ్య పూర్తిగా పడిపోయినా దాని స్వభావం నరనరాల్లో జీర్ణించినవారి సంఖ్య పెరుగుతున్నది.

తోలుబొమ్మలాట: ఒక్క రామాయణమేగాక శ్రీకృష్ణ లీలలు, భారత కథా భాగాలు, తదితర పురాణాంశాలనూ తోలుబొమ్మలాటగా ప్రదర్శించటం ఆనవాయితీ ఈ బొమ్మల్లో భేదాలున్నాయి. చర్మాన్ని శుభ్రపరిచి, పలచని పొరలు చేసి, ఆయా పాత్రల స్వరూప వేషాలంకరణల ప్రకారం సిద్ధం చేయట మొకటి వాటిని కొయ్యముక్కల

కలికించి 'కీలు బొమ్మలు'గా మార్చి, దారాలతో కీళ్ళు కలిపి బొమ్మలను తెర వెనకనుండి ఆడించటం మరో పద్ధతి తోలు బొమ్మలకు రంగులద్ది ఆకర్షణీయంగా తయారుచేసే పనివాళ్ళుండేవాళ్ళు పోషణ లేక, ఆధునిక ప్రదర్శనల పోటీకి తట్టుకోలేక ఈ కళాకారులూ కళలూ మూలపడిపోవటం తెలుగువారి కళాపోషణకు నిదర్శనం. ఇప్పుడా ఆటలు ఎప్పుడో ఎక్కడోతప్ప లేకపోయినా మాటమాత్రం మిగిలింది ఈ జీవితాన్ని విషాదపూర్వకంగా ప్రస్తావించేటప్పుడు 'ఇదంతా తోలుబొమ్మలాట' అని నిట్టూర్చటం కద్దు వెర్రి వేషాలు వేసినప్పుడు కోపంతో 'ఇదేమన్నా తోలుబొమ్మలాటా?' అని కన్నెర్ర చేయటమూ కద్దు.

త్రిశంకుస్వర్గం: విశ్వామిత్రుడు సృష్టించిన 'త్రిశంకుస్వర్గం' సుప్రసిద్ధం స్వర్గంలో ఉంటాయని విశ్వసించిన అప్సరసలతో సహా కామధేనువు, చింతామణి, ఐరావతం, తెల్లగుర్రం వగైరాలను కూడా ప్రతిసృష్టి చేశాడని పురాణాలు వివరించటం లేదు ఒక వేళ స్వర్గంలో ఉండే వస్తువులనూ జీవరాశులనూ సృష్టించినా త్రిశంకుడికి 'దేవత్వం' కల్పించినట్లు నిదర్శనలు లేవు పైనున్న స్వర్గానికీ భూమికీ మధ్య మరో లోకాన్నో గోళాన్నో విశ్వామిత్రుడు సృష్టించి, అందులో త్రిశంకుణ్ణి ఉంచినా అతడికి అమరత్వం కల్పించగలిగాడని చెప్పలేం దేవతలకులాగా నిత్యయౌవనం (ఎప్పుడూ ముప్పయ్యేళ్ళ వయస్సులోనే ఉంటారు కాబట్టి వాళ్ళను త్రిదశులంటారు) అతడికుందో లేదో తెలియదు భూమికీ అతగాడికీ సంబంధం లేదు. స్వర్గంతోనూ అంతే ఒకవిధంగా చూస్తే త్రిశంకుడు "రెంటికీచెడ్డ రేవడి" బతుకు ఈడ్చివుండాలి. (ఈ రేవడి సంగతి మరోసారి ఆలోచిద్దాం) విశ్వామిత్రుడు పౌరుషానికి త్రిశంకుణ్ణి పైకిలేపి కిందపడకుండా ఉంచగలిగాడేగాని ఆ త్రిశంకుడి పరిస్థితిమాత్రం దయనీయమే అందువల్లనే ఎటూతేలని అనిశ్చిత పరిస్థితిలో ఉన్నప్పుడు, అటు నందిగానీ ఇటు పందిగానీ కాని దుస్థితిలో ఉన్నప్పుడు త్రిశంకుస్వర్గంలో ఉన్నామని భావిస్తుంటాం ఈ త్రిశంకుడి అసలు పేరు సత్యవ్రతుడని భాగవతం చెప్తుంది అతడు పురుకుత్సుడనే చక్రవర్తికి అయిదోతరంవాడు హరిశ్చంద్రుడి తండ్రి. "అమరులు మరల ద్రొబ్బఁ, దలక్రిందుగాఁ బడి దైన్యంబుతో రాఁగఁ, గౌశికుం డప్పటి ఘనత మెరసి, నిలిపె నాకసమున నేడు నున్నాఁడు" అని పోతన చెప్తాడు తలకిందులుగానే ఉన్నాడేమో తెలీదు, పాపం!

పురాణాల ప్రకారం ప్రాచీన భారతదేశంలో అరుగురు చక్రవర్తులు భిన్నకాలాల్లో పరిపాలించారు హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరుడు, కార్తవీర్యార్జునుడు అనేవాళ్ళు షట్చక్రవర్తులు శ్రీరామచంద్రుడు కూడా షోడశ(16) మహారాజుల్లో ఒకడేగాని చక్రవర్తికాడు శ్లోకంలో మొదట వచ్చిన హరిశ్చంద్రుడికి ఆరు తరాల ముందువాడు పురుకుత్సుడు – మధ్యలో వచ్చినా. సత్యవ్రతుడనే పేరుగల త్రిశంకుడికి హరిశ్చంద్రుడు పుత్రరత్నం. జన్మలో ఎన్ని కష్టాలు వచ్చినా ఆడిన మాటను తప్పక, చివరికి తన భార్యాపుత్రులనేగాక తనను కూడా అమ్ముకొన్న మహానీయుడు కాబట్టి "సత్యహరిశ్చంద్రు"డని పేరు తెచ్చుకున్నాడు. దేవుడిపేరిట ప్రమాణం చేయకుండానే నిజంతప్ప అబద్ధం చెప్పనివ్యక్తిని సత్యహరిశ్చంద్రుడనటం పరిపాటి

త్వాష్ట్రం: ఈ మాటకు 'తాష్ట్రం' అనే రూపాంతరముంది దీనికి 'మొరటు, మోటు, మొద్దు' అనే విశేషణార్థాలూ, నిష్ప్రయోజకుడనే విశేష్యార్థం కొన్ని తెలుగు

నిఘంటువుల్లోనయినా కనపడుతుంది త్వష్ట/త్వష్ట్రకు సంబంధించిన/పుట్టిన వాడు త్వాష్ట్రుడు/త్వాష్టుడు; పురుషేతరులయితే త్రాష్టాలు/త్వాష్టాలు. సంస్కృతంలోని పురాణ సాహిత్యంలో, వేదాల్లో 'త్వష్ట'కు ఎంత ప్రశస్తి ఉందో తెలుగులో అంత అప్రఖ్యాతితో వాడుక రావటం విచిత్రం త్వష్ట అనేది విశ్వకర్మ పేరు అతడు దేవతా శిల్పి మామూలు స్వర్ణకారుడనే అర్థం కూడా కోశాల్లో కనిపిస్తుంది త్వష్ట ద్వాదశాదిత్యుల్లో ఒకడని పురాణాలు పేర్కొంటాయి అయన దేవతలకు తేలికపాటి రథం చేసి పెట్టాడు ఇంద్రుడికి వజ్రాయుధం చేసి పెట్టాడు అనేక విధాల బాణాల్లో అతడి పేరిటి త్వాష్ట్రికం ఒక ప్రత్యేకత గలది యమాయములకు, అశ్వినీ దేవతలకూ అతడు తాత అతడి కొడుకు త్రిశిరాసురుడని కొన్ని పురాణాలు చెప్తే, వృత్రాసురుడు కూడా కుమారుడేనని మరికొన్ని వర్ణించాయి వడ్రంగాన్ని అతడి పేరిట త్వష్టి అంటారు అంతటివాడి పేరు చివరికి తిట్టుగా వాడుకలోకి వచ్చింది తెలుగులో అందుకు కారణాలు లేకపోలేదు అటు వృత్రుడికి తండ్రిగా ఉండి, అతడి చావుకు వాడిన వజ్రాయుధాన్ని ఇంద్రుడికి చేసిపెట్టటం అసహ్యానికి దారితీసి వుంటుంది స్వర్ణకారులకు మధ్యయుగ గ్రామార్థిక వ్యవస్థలో ప్రధాన స్థానముందిగాని సంఘ గౌరవం లేదు. తెలుగులోని భోజరాజీయం ఆ కుల వృత్తివారిని నిందించే కథలతోనే నడిచింది బహుశా ఈ నిందా దృష్టితోనే త్వాష్ట్ర శబ్దానికి మూర్ఖుడు, అప్రయోజకుడూ అనే అర్థాలు కల్పించుకొని ఉంటారు పెద్దమనిషి శబ్దాన్ని పొగడ్తకూ తెగడ్తకూ వాడినట్లు అంతటి పనివాడైన త్వష్టనూ అతడి సంతతినీ మూర్ఖత్వానికి నిదర్శనగా వాడుతున్నా రన్నమాట

**దత్తపుత్రశోకం:** పిల్లలు లేక గానీ, ఏవో కొన్ని సందర్భాల్లో వెన్నుచలవకోసంగానీ, కేవలం దయాదృష్టితోగాని తెలిసిన ఇతరుల పిల్లలనో అనాధ బాలబాలికలనో పెంచుకోవటం కద్దు కడుపున పుట్టినవాడు ఔరస పుత్రుడు. పెంచుకొన్నవాడు దత్త పుత్రుడు. దత్త శబ్దానికి 'ఇవ్వబడిన, పొందిన' అని అర్థం ఆస్తికోసమో, పోషించలేకనో, మరొకరివంశాన్ని నిలపాలన్న సత్సంకల్పంతోనో, ఇతర కారణాల వల్లనో తమ కుమారుణ్ణి ఇతరులు పెంచి పెద్దజేయటానికి అనుమతిస్తే, ఆ పిల్లవాడ్ని పెంచుకోదలిచిన వ్యక్తి 'దత్తస్వీకారం' చేస్తాడు దత్తుడి కన్నతండ్రిని 'జనకతండ్రి' అనీ, పెంచిన తండ్రిని 'దత్తతండ్రి' అనీ వ్యవహరిస్తుంటారు – మిశ్రసమాసాలు వాడి అలా 'దత్తు' వచ్చిన కొడుకు దత్తపుత్రుడు. అతడికి కన్నతండ్రిమీద ఉన్న ప్రేమానురాగాలు పెంచిన తండ్రిమీద ఉండవనేది సాధారణ విశ్వాసం మమకారం లేకపోయినా పెంచిన తండ్రి చనిపోతే లోకం నిందిస్తుందన్న భయంతో లేని దుఃఖం తెచ్చిపెట్టుకొని దత్తపుత్రుడు ఏడిస్తే దాన్ని దత్తపుత్రశోక మంటారు ఒకవిధంగా 'దొంగ ఏడుపు' అన్నమాట కన్నబిడ్డలు దుఃఖపడని, పెంపుడు బిడ్డలు నిజంగా దుఃఖించే సందర్భాలు అరుదుగానైనా లేకపోలేదు అయినాసరే, దత్తపుత్రుడికి నిజమైన విచారం ఉండదనే భావంతో ఈ మాట పుట్టింది ఎవరయినా దొంగ ఏడుపు లేదుస్తుంటే "అదంతా దత్తపుత్రశోకంలెండి లోకవంచన కోసం అలా కళ్ళొత్తుకుంటున్నాడ"ని ఆక్షేపిస్తారు

**దంపతి కలహం:** దంపతి అంటే భార్యాభర్తలు కలహం అంటే పోట్లాట పగలు పోరాడుకున్నా రాత్రికి సద్దుమణిగే తగాదా అన్నమాట అందుకే అవసరంలేనప్పుడు పోట్లాడి, అవసరమైనప్పుడు సరిపెట్టుకొనే తాత్కాలిక వైషమ్యాన్ని దంపతికలహా

మంటారు. ద్వేషంలేని, నిలకడలేని, చివరికి రాజీగా పరిణమించే పోట్లాటను ఈ పేరుతో పిలుస్తారు ఉత్తుత్తి పోట్లాట అని కూడా దీన్ని చెప్పవచ్చు

**దరిద్రనారాయణుడు:** లక్ష్మీదేవి భర్త అయిన శ్రీమన్నారాయణులవా రంతవారిని పట్టుకొని దరిద్రు డనటం మనకే తగును దరిద్రులు మరో వృత్తీ వ్యాపకం, పనీ పాటా లేనందువల్ల విశ్రాంతి అనుభవిస్తుంటారని, అందువల్ల ఎక్కువకాలం నారాయణస్మరణ చేస్తుంటారు కాబట్టి దరిద్రులకు దరిద్ర నారాయణులనే పేరు వచ్చిందని ఒకరు వివరించారు. స్వామి వివేకానంద మనదేశంలోని పేదలను దరిద్ర నారాయణులని తప్ప మరో పేరున వ్యవహరించలేదు ఇప్పటి శాస్త్రజ్ఞులు 'దారిద్ర్యరేఖ' అనేదాన్ని కనిపెట్టి, దానికి పైనా కిందా ఉన్నవాళ్లని మానవులను విభజించినట్లే – పూర్వం అసలు దరిద్రాన్నే విభజించి 'ఉన్నదరిద్రుడు, లేని దరిద్రుడు' అనే మాటలు పుట్టించారు ఎలాగయితేనేం, పేద సాదలను దరిద్ర నారాయణులని పిలవటంలో దరిద్రులయినా వాళ్లు నారాయణుడనే భగవంతుడి అంశలోని వాళ్ళేనని, వాళ్లకు ఇంత తిండిపెడ్తే విష్ణుమూర్తిని సేవించినంత పుణ్యం కలుగుతుందని విశ్వసించారని చెప్పవచ్చు

ఉన్నదరిద్రుల విషయంలో ఒకటి రెండు మాటలు. "పాలసాగరమున పవ్వళించిన హరి, గొల్లయిండ్ల పాలు కోరనేల?" అని ప్రశ్నించుకున్న వేమన – "ఎదుటివారి సొమ్ము లెల్లవారికి తీపి" అనే నిర్ధారణకు వచ్చాడు. అలాగే ఒక సంస్కృత కవి "పితా రత్నాకరో యస్య, లక్ష్మీ ర్యస్య సహోదరీ, శంఖో రోదితి భిక్షార్థీ, నాదత్త ముపతిష్ఠతి" అని తేల్చిపారేశాడు తండ్రి రత్నరాశులున్న సముద్రుడు లక్ష్మి సోదరి అయినా శంఖం (ముఖ్యంగా జంగందేవరలు వాడేది) బిచ్చం కోసం ఏడుస్తుంది ఇచ్చేదాకా కదలదు అంటే, శంఖం కాదు–శంఖంపట్టి ఊదిన బిచ్చగాడు ఇది ఉన్న దరిద్రుల తీరు

**దశమగ్రహం:** జ్యోతిషం తొమ్మిది గ్రహాలను పేర్కొంటుంది అనుభవం పదోగ్రహాన్ని కనిపెట్టింది "జామాతా దశమో గ్రహః" అంటారు సంస్కృతంలో అంటే అల్లుడు పదోగ్రహమని ఏదో గ్రహం పట్టినట్లు వేధిస్తాడన్న భావంతో అల్లుణ్ణి పదోగ్రహమన్నారు చిలకమర్తివారు ఈ గ్రహాన్ని గురించి చక్కని ప్రహసనాలు రాశారు

**దారినబోయే దానయ్య:** ఈ దానయ్య ఎవరోగాని ఇతగాడి పేరు పాత పుస్తకాల్లో కనిపించదు. దారి శబ్దంలోని 'దా'తో యతికోసం 'దానయ్య'పుట్టాడన్నా వింత లేదు తెలుగులో దానయ్య అనే పాత్ర ఉన్న కథలు అనేకం – పందొమ్మిదో శతాబ్దిలో పుట్టాయి ఇరవైలో నాటకాలు కూడా వెలిశాయి ఇతడి కొక దారి అంటూ లేదు అన్నిదారుల్లోనూ అతడే 'బాటసారి' అనే అర్థంలో 'దేశదిమ్మరి' అనే భావంతో ఈ పేరు పెట్టారు ఎవరు పెట్టారో చెప్పలేం ఫలానా అని స్పష్టంగా తెలియని వ్యక్తి దానయ్య అతడి స్వస్థలం, కుల గోత్రాలు, వృత్తి వ్యాపారాలు మనకు తెలియవు మనం తెలుసుకోం అతడు చెప్పడు. స్పష్టంగా ఫలానా అని తెలియని వ్యక్తిని దారినబోయే దానయ్య అంటాం అతడివల్ల మనకు లాభనష్టాలు రెండూ లేవు అపకారికాడు ఉపకారికూడా కాకపోవచ్చు కొత్త మనిషిని, తెలియని వ్యక్తిని ఆ పేరుతో వ్యవహరిస్తుంటాం – 'కళ్ళన్న' అన్నట్లు

**దింపుడు కళ్ళం ఆశ:** మరణించిన వ్యక్తిని శ్మశానానికి తీసుకపోయేటప్పుడు దారిలో మూడుసార్లు పాడెను కిందికి దించి, దాని చుట్టూ మూడుసార్లు 'నారాయణ, నారాయణ' అంటూ తిరిగి, తరువాత తీసుకపోవటం ఆచారం ఒకవేళ యమభటులు పొరపాటుపడి ఒకరికి బదులు మరొకరిని తీసుకవెళ్తుంటే, నారాయణ మంత్ర పఠనంవల్ల జాగ్రత్తపడి, పొరపాటయితే సవరించుకొని బతికించి పోతారన్న విశ్వాసముంది అంత్య దశలో చెవి దగ్గర నారాయణ మంత్రం జపిస్తారు కాబట్టి 'నారాయణ' శబ్దానికి చివరిమాట అనే పేరు కూడా వచ్చింది పాడెమీది శవాన్ని దించే కళ్ళం (స్థలం) కాబట్టి దింపుడు గళ్ళమన్నారు ఆ స్థితిలో అక్కడయినా మృతుడు పునరుజ్జీవితుడు కావచ్చునన్న ఆశతో ఈ పని చేస్తారు కాబట్టి ఇది దింపుడు గళ్ళమాశ నూటికి తొంభయి తొమ్మిది పాళ్ళు ఇది తీరే ఆశ కాదు తీరా దహన సమయంలో ఒక్కసారి లేచి కూర్చొని చెంబెడు నీళ్ళు తాగి మళ్లీ హరీమన్న వాళ్ళూ ఉన్నారు అయితే వాళ్ళ సంఖ్య అల్పాల్పం మానవ ప్రయత్నం విఫలమై కళ్ళు మూసిన వ్యక్తి మళ్ళీ బతికి బట్టకట్టడం దైవికమన్న విశ్వాసమున్నవాళ్ళు చరమ ప్రయత్నంగా పాడెను నేలకానించి మళ్ళీ లేవదీస్తుంటారు అందుచేత చిట్టచివరి ఆశ అనే అర్థంలో ఈ మాట వాడుతుంటారు

**దుక్కి టెద్దు:** మెడమీద కాడితో పొలం దున్నే అలవాటున్న ఎద్దు దుక్కిటెద్దు దుక్కిదున్నేది కాబట్టి దుక్కిటెద్దన్నారు మెడచూసి ఒక ఎద్దు దుక్కిటెద్దో కాదో గుర్తించవచ్చు – కాడిమోసిన గుర్తు కనిపిస్తుంది కాబట్టి ఒక దుక్కిటెద్దు యజమాని ఊపిరాడకుండా పని చేయిస్తున్నాడని అలిగి దేశాంతరం పోయిందట దాని వాలకం చూసిన రైతులకు దున్నటంలో అనుభవం ఉన్నదని తెలిసింది కాడిగట్టి చెడామడా దానిచేత పొలం దున్నించారు అప్పటికి దానికి జ్ఞానోదయ మయింది యజమాని ఏదో కొంత భూమిని దున్నిస్తే – తెరగాళ్ళు తనచేత సమస్త ప్రపంచం దున్నిస్తున్నారని బుద్ధిగా కొంప చేరిందనే కథ దుక్కిటెద్దు దేశాంతరం పోయిందంటే – రామేశ్వరం పోయినా శనేశ్వరం వదలనట్లు – చాకిరి పెరిగిందని అర్థం స్వభావరీత్యా ఎడతెగని పనిచేసే వ్యక్తిని దుక్కిటెద్దని వ్యవహరిస్తారు పూర్వం ఓ రాజుగారు పనిచేసే వాళ్లకు పని పెంచి, చెయ్యనివాళ్ళకు జీతం పెంచా డంటారు పని అలవాటున్న వ్యక్తి ఊరుకోలేదు ఏదో పని కల్పించుకొని శ్రమిస్తుంటాడు అటువంటి వ్యక్తిని దుక్కిటెద్దని పిలుస్తారు శ్రమజీవి అని దాని భావం

**దేవతావస్త్రాలు:** ఒక కట్టుకధో, పిట్టకధో ఈ మాట పుట్టడానికి కారణం అనగా అనగా ఒక రాజుగారికి ఖరీదయిన గుడ్డలంటే ఇష్టం నలుగురు తెలివిగలవాళ్ళు మీరు కోరినట్లు నేసి పెట్తామని నమ్మించి, రాజుగారి దగ్గర కావలసిన సొమ్ము పట్టుకపోయారేగాని మగ్గ మాడించటమే లేదు రాజుగారు ఎవ రెవరినో అప్పు డప్పుడు పంపినా నేతపని మొదలయిన చిహ్నాలే కనిపించలేదు చివరకో గడువు నిర్ణయించి, ఆ రోజుకు వస్త్రాలు తేకపోతే తల తీస్తామన్నాడు మొత్తానికి గడువునాటికి ఉత్త చేతులతోనే వచ్చి, స్వహస్తాలతో రాజుగారికి గుడ్డలు కట్టబెట్టినట్లు నటించారు పైపెచ్చు తాము నేసిన గుడ్డలు దేవతలు కట్టేరకమని, పతివ్రతలకూ పతివ్రతల పిల్లలకూ తప్ప తక్కిన వాళ్ళందరి మామూలు కళ్ళకు దిగంబరంగానే కనిపిస్తారన్నారు కానీ తాము పతివ్రతలము కామని చెప్పలేక స్త్రీలు, తాము పతివ్రతా సంతానం కాదనలేక

పురుషులూ ఆ గుడ్డలు అద్భుతంగా ఉన్నాయని చచ్చినట్లు ఒప్పుకున్నామన్నారుట అప్పటినుంచీ లేని వస్తువులన్నిటికీ దేవతావస్త్రాలనే పేరే స్థిరపడిపోయింది దేవతా వస్త్రాలనేవి నిజానికి లేవు కానీ ఉన్నాయని లోకం భ్రమించిందన్నమాట.

దోమాడ కరణం: కెరటాల కరణం కబుర్లుచెప్పి, ఎత్తులువేసి, లంచాలుపట్టి కార్య సాధకుడనిపించుకుంటే – దోమాడ కరణం కాళ్ళావేళ్ళాపడి వేధించి విసిగించి పని నెరవేర్చుకుంటాడు. ఇదికూడా గోదావరీ ప్రాంతంలో పుట్టిన జాతీయమే. అయన ఖచ్చితంగా ఎవరో, ఎప్పటివాడో చెప్పలేం అయనకు కార్యసాధన ప్రధానంగాని అందు కవలంబించే విధానాలు ముఖ్యం కావు ఎవరిదగ్గర ఏంచెప్పి ఎలా తన అవసరం తీర్చుకోవచ్చో తెలిసినవాడు దోమాడ కరణం. ఆ పద్ధతిని యాచన అనండి, లౌక్య మనండి, పట్టుదల అనండి, మొండితన మనండి – ఏపేరుతో పిలిచినాసరే; ఇతగాడు లంచగొండికాదు, కార్యసాధకుడు మాత్రమే పట్టువీడని విక్రమార్కుడిలాంటివా డన్నమాట

దోస తిన్న కడుపు: దోసకాయ తిన్న కడుపూ దొంగలు పడ్డ ఇల్లూ డొల్లపోతాయని సామెత ఇప్పటిలా ప్రతి చిన్న రుగ్మతకూ బజారు మందులు లేని కాలంలో తినే వస్తువుల్లో మార్పుచేసి ఆరోగ్య పరిరక్షణ చేసుకుంటుండేవాళ్ళు 'సంచి వైద్యం, కూరాకు వైద్యం' లాంటి పేర్లతో ఆయుర్వేదం దేశవ్యాప్తంగా ఉండేది లంఖణం చేస్తే (అసలు శబ్దం లంఘనం – ఒక పూట తిండి మానటం – తిండిని దాటవేయటం) అనేక రోగాలు తగ్గుతాయన్న విశ్వాసం ఉండేది అది కుదరనప్పుడు 'గృహవైద్యం'లో భాగంగా విరేచనకారిగా దోసకాయలు తినిపించేవారు అజీర్ణం సగం తగ్గిందని అనందించేవాళ్ళు. ఇలా 'గచ్చకాయ పుచ్చకాయ' వైద్యాలేగాక అయా ప్రాంతాల్లో 'అవకాయ వైద్యం' వంటివీ రకరకాల రోగాలకు నివారణోపాయాలుగా ఉండేవి

దోసతోట: తామర తంపరగా అన్నట్లే బాగా విస్తరించిన కుటుంబాన్ని గురించి చెప్తూ, ఆ యిల్లు/కుటుంబం దోసతోటలా ఉందని మెచ్చుకుంటారు. తామరలు నీటిమీద వ్యాపించినట్లు దోసపాదు నేలమీద విస్తరిస్తుంది కాపు తొడిగిన దోస విపరీతంగా కాస్తుంది సంసారంలో సభ్యుల సంఖ్య అపారంగా పెరుగుతున్నప్పుడు అది దోసతోటలా పెరుగుతున్న దంటారు.

దోసాకులు గుబురుగా పెరుగుతాయి కాబట్టి తొలిదశలో పిందెలూ కాయలూ పైకి కనిపించవు దరిమిలా అవి పెద్దవై పండే సమయానికి ఎక్కడచూసినా దోసపండ్లే అలాగే తొలి కాలంలో సంపన్నతగాని, ప్రత్యేకతగాని లోకానికి తెలియకుండా ఉండి ఒక్కసారిగా భోగభాగ్యాలతో విస్తరించిన కుటుంబాలనుగురించి చెప్పే సమయాలలో మొదట వినమ్రంగా అజ్ఞాతంగా ఉన్న యింటి యజమాని 'గాదంలో దోస' వంటి వాడంటారు 'గడ్డిగాదం' అనే జంట మాటల్లో రెండో మాటా – ఈ గాదం ఒకటే 'ఆకు, కసువు' అని ఆ పదాని కర్థం 'నివురుగప్పిన నిప్పు'లాగా అకులమధ్య అణగిమణగి ఉండి తన శక్తి లోకానికి తెలియకుండా జాగ్రత్తపడే వ్యక్తి 'గాదంలో దోస' వంటి వాడని భావం సహజశక్తివల్ల కాలక్రమాన సమర్థు డనిపించుకున్న వ్యక్తి గాదంలో దోస వంటివాడు

దోసపాదుల్లో కొన్ని కాయలు ఒక పట్టాన పండవు. అవసరంకోసం వాటిని

తంపట పెట్టాల్సి ఉంటుంది అలా పండిన దోసకాయ 'తంపటిదోస' అది సహజంగా పండినది కాదు ప్రయత్నపూర్వకంగా, క్రమవిరుద్ధంగా పండింది కాబట్టి నకిలీ వస్తువో కృత్రిమ వస్తువో అవుతుంది మానవుల్లో కూడా కొందరు సహజ పరిశ్రమా, శక్తులవల్ల కాక ఎవరి దయాదృష్టివల్లనో, సహాయసంపదవల్లనో అభివృద్ధికి రావచ్చు అలా సహజ కారణంవల్లగాక ఇతర కారణాలవల్ల పేరు ప్రతిష్ఠలుగాని, ధన ధాన్యాలుగాని సంపాదిస్తే ఆ వ్యక్తిని 'తంపటి దోసకాయ' అని వ్యవహరిస్తారు

దౌర్భాగ్యదామోదరుడు: దామం అంటె దండ ఉదరం అంటే పొట్ట వైజయంతి అనే దండ పొట్టమీద వేలాడేటట్లు అలంకరించుకొనేవాడు విష్ణుమూర్తి అయన్ను దామోదరు డంటారు త్రిమూర్తుల్లో అలంకార ప్రియుడు విష్ణువే అంతటవాణ్ణి పట్టుకొని, ఆయన మేకప్పుకయినా గౌరవమివ్వకుండా దౌర్భాగ్యుడనటం తెలుగువారికే చెల్లింది కొంద రయితే నిర్భాగ్యు డంటారు దౌర్భాగ్యుడు భాగ్యం సరిగా లేనివాడు నిర్భాగ్యుడు మొదలే లేనివాడు ఉండి దరిద్ర మనుభవించేవాణ్ణి ఇలా పిలవటం మొదలుపెట్టివుంటారు తరవాత ఘనంగానే తిట్టాలని ఇది అలవాటు చేసుకొని వుంటారు

ద్రావిడ ప్రాణాయామం: ప్రాణాయామ మనేది ముక్కు మూసుకొని చేసే జపం ముక్కు రంధ్రాలను వేళ్లతో నొక్కిపట్టి ఓంకారంతో పూజించటం పద్ధతి ద్రావిడులనే ఒక తెగ బ్రాహ్మణుల్లో ఆ ముక్కును నేరుగా పట్టుకోకుండా కుడిచేతిని తలచుట్టూ తిప్పి తరవాత పట్టుకోవటం అలవాటు అసలు ప్రాణాయామమనే మాటకున్న అర్థం, దాని ఫలితం సంగతి, అప్పుడు చదివే మంత్రం సంగతీ మరుగునపడి 'డొంక తిరుగుడుగా చెప్పటం, చేయటం' అనే అర్థాల్లో ద్రావిడ ప్రాణాయామమనే జాతీయం కుదురుకుంది సూటిగా చేయవలసిన పనినీ, చెప్పవలసిన మాటనూ సాగదీసి చేసినా, నాన్చి నాన్చి చెప్పినా ఆ పనినీ మాటనూ ద్రవిడ ప్రాణాయామ మంటారు

ద్వితీయ బాల్యం: బాల్యం అంటే చిన్నవయసు. చెప్పింది గ్రహించి గుర్తు పెట్టుకోగల వయస్సులో ఉన్నవాడు బాలుడని చెప్తారు రెండోసారి పిల్లతనం అరవయ్యేళ్లు దాటింతర్వాత వస్తుందని నమ్మకం. కొందరు ఎనభై సంవత్సరాల వయసు మీరిన తరవాత మళ్లీ పిన్నవయసు వచ్చినట్లుంటారు. అసలు విషయం – ఉన్న పళ్లూడిపోయి పసివాడికిలా పళ్లురాక ముందున్నప్పటి (పాల పళ్లు కూడా రానప్పటి) పరిస్థితికి రావటాన్ని ద్వితీయబాల్య మని వేళాకోళంగా చెప్పటం బోసినోటి తాత ద్వితీయ బాల్యంలో ఉన్నట్లు లెక్క ఇది సరదామాటే గాని ఈ స్థితి వచ్చినా కుర్రతనం చచ్చినా రాదు ఇదే పద్ధతిలో వయసుమీరిన వ్యక్తి శృంగారవ్యవహారాల్లో పడితే "ద్వితీయ యౌవనం" వచ్చిందని వెక్కిరిస్తారు

ధనియాల జాతి: ధనియాలను చెప్పు కింద నలిపితేగాని మొలకెత్తవు తక్కిన విత్తనాలన్నిటిలాగా ధనియం గింజలను నాటితే ప్రయోజనం లేదు చెప్పుల కిందనే ఎందుకు నలుపుతారంటే అవి అందుబాటులో ఉన్నాయి కాబట్టి, గుండ్రాయివంటి బండలతో అవసరం లేదు కాబట్టి అని సమర్థన చెప్తారు చెప్పు కింద తొక్కటం అవమానించటం అలా అవమానించి, కించపరిచితేనేగాని పనిచేయని వ్యక్తులు కొంద రుంటారు నయాన భయాన చెప్తే పనిచేయరు దండిస్తేగాని మాట వినరు వాళ్ళకు రోషవేషాలుండవుగాని ప్రాణభయ ముంటుంది అందువల్ల హింసిస్తేగాని పనిచేయని,

పనికిరాని మనుషులను ధనియాల జాతి అని ఈసడించి పలుకుతారు. ఈ నిందార్థక జాతీయాన్ని గిట్టని వ్యక్తులకూ కులాలకు సంఘాలకూ అన్వయించటం పరిపాటి.

ధర్మకన్నం: ఇదో మిశ్రసమాసం. కన్నం వేయటం దొంగలు చేసేపని. అందులో ధర్మముందని ఈ జాతీయం చెప్తుంది. పట్టపగలే కప్పంపేరిట, నజారానాల పేరిట, పన్నుల పేరిట ప్రజాధనం సంగ్రహించే వాళ్ళు ప్రభువులు- దొరలు. వాళ్ళు అలా వసూలు చేయటం, బహిరంగంగా సొమ్ము రాబట్టడం సమాజధర్మం. సమాజం ఏర్పాటు చేసుకున్న వ్యవస్థలో ధర్మం. దోచుకొని డబ్బు కూడబెట్టి ప్రాణావసర సమయంలో కూడా ఇతరులకు దానం కాదుకదా - వడ్డీకి అప్పయినా ఇవ్వనివాళ్ళ ఇళ్ళకు కన్నం వేసి డబ్బు కాజేయటం ధర్మకన్నం. ఉన్నవారి సొమ్ము దొంగిలించి లేనివారికి పంచి పెట్టడం కోసం కన్నం వేస్తే అది ధర్మకన్న మనిపించుకొంటుంది. ఆంగ్ల సాహిత్యంలోని రాబిన్‌హుడ్‌లాంటి వాళ్ళు వేసినవి ధర్మకన్నాలు. తెలుగు సాహిత్యంలో ఈ మాటకు బహుళప్రచారం సాధించినవారు ఉన్నవ లక్ష్మీనారాయణ రావుగారు. వారి 'మాలపల్లె' నవల్లో జగ్గడనే వీరుడు ఇలా ధర్మకన్నాలు వేసి బ్రిటిషు ప్రభుత్వాన్ని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాడు.

ఈ మాటకు శాస్త్ర సంప్రదాయంలో ప్రశస్తి తెచ్చి పెట్టామనుకున్న రచయిత తామే మరో పేరుబెట్టారీ పనికి. అది 'తిరుమంగై యాళ్వారుల కైంకర్యం' అనేది. తిరుశబ్దం శ్రీవంటిది - గౌరవవాచకం, శుభస్కారం. మంగై అనేది ఆళ్వారుల పేరు. ఆళ్వారులంటే దైవభక్తులు. విష్ణుపూజకులు. వారిలో చాలామంది బ్రాహ్మణేతరులు- హరిజనులు కూడా. వైష్ణవ గురువులకు 'శిష్యసంచారం' చేసే అలవాటుంది. ఒక్కో గురువు సముచిత పరివారంతో వేంచేసి శిష్యుల ఇళ్లలో మకాం పెట్తారు. గురువునూ అయన శిష్యులనూ పోషించవలసిన బరువు బాధ్యతలు మీద ఉంటాయి. స్వయం దరిద్రుడైన పూజారి స్వామి వారికి 'కైంకర్యం' చేస్తూ- అంటే, మాటకున్న సూటి అర్థం ప్రకారం కింకరుడులా (సేవకుడిలా) ప్రవర్తిస్తూ- దైవస్వాన్ని - అంటే దేవుడి సొమ్మును- సంగ్రహించి గురుపూజ యథావిధిగా నిర్వర్తిస్తుంటాడన్నమాట. చేసేది దైవపూజే అయినా దొంగిలించేది కూడా తగినంత ఉంటుంది కాబట్టి కైంకర్య శబ్దానికి కాజేయటమనే అర్థం కూడా వచ్చింది. దేవుడి సొమ్ముతో గురుపూజా సేవలు చేయటాన్ని తిరుమంగై ఆళ్వారుల కైంకర్య మంటారు. వారు వేసేది కూడా ధర్మకన్నమేనని ఉన్నవవారి వ్యాఖ్యానం.

ఈ కైంకర్యం వైష్ణవుల పరిభాషగా చెలామణి అవుతుందికానీ శైవుల్లో కూడా ఈ విధానముంది. శైవాచార్యులు కూడా 'శిష్యసంచారం' చేస్తుంటారు. అంటే శిష్యుల ఇళ్ళు చుట్టివస్తూ సపర్యలందుకుంటారు. దరిద్ర స్థితిలో లేని శిష్యులక్కూడా ఇలా మత గురువులనూ వారి పరివారాన్నీ పోషించటం భారమే. బాధాకరమే. ఒక పర్యాయం పీఠాధిపతి దేవతార్చన సామగ్రితో సహా శిష్యపరివేష్టితుడై ఒకానొక శిష్యుడి ఇంట్లో చాలాకాలం తిష్టవేశాట్ట. అంతమంది తిండీతిప్పలూ చూస్తున్నా శిష్యుడు సామాన్య సంసారి అయికూడా వైభవంగానే తంతు నడుపుతున్నాడు. నడిపాడు చాలాకాలం. పీఠస్వాములు మరో శిష్యుడి సేవలందుకోడానికి ఎట్టకేలకు బయలుదేరుతూ వెంటతెచ్చిన విగ్రహాలను కదిలిస్తే అవి తేలికగా గాలికి ఎగిరేట్లున్నాయిట! అప్పుడు శిష్యుణ్ణే నిలవేస్తే "ఇందరికి ఇంత ఘనంగా సపర్యలు చేశానంటే అది దైవానుగ్రహమని

నేను నిత్యమూ విన్నవించుకొంటున్నా గురుదేవులు తమరు చిత్తగించలేదు నేను మాత్రం ఇంతకాలం ఇంతమందికి ఎక్కడినుంచి తెచ్చి పెట్టేది? అందుకే విగ్రహాలకు పాదపీఠం నుంచి కన్నం వేసి తొలిచి దొరికిన వెండి బంగారాలతో వైభవంగా బండి నడిపాను అంతా దైవానుగ్రహ" మన్నాడని ఓ కథ! ఇలా పరద్రవ్యాన్ని అపహరించి కూడా సొంతానికిగాక ఇతరులకు సేవాసత్కారాలు చేస్తే అది ధర్మకన్నం వేసినట్లే లెక్క అయితే కాకులను కొట్టి గద్దలకు వేసినా, ఆవులను చంపి చర్మం వొలిచి చెప్పులు దానం చేసినా అది ధర్మకన్నం కాదు ధనవంతుల నుంచి దొంగిలించి దరిద్రులకు పంచిపెట్టినప్పుడే అది ధర్మకన్నం.

ధర్మవడ్డీ: ఇది ధర్మకన్నంవంటిది కాదు న్యాయం ప్రకారం, ధర్మం ప్రకారం వసూలుచేసే వడ్డీ కూడా కాదు ఇది బారువడ్డీ కాదు చక్రవడ్డీ కన్నా భయంకరమయింది కొందరు దయాదాక్షిణ్యాలు ఏ కోశానా లేనివాళ్ళు ఈ విధానం అవలంబిస్తుంటారు నూటికి నెలకు ఇంత వడ్డీ అని నిర్ణయించుకొని, పత్రం రాయించుకొని అసలు ఇచ్చేటప్పుడు గడువులోగా ఎంత వడ్డీ చెల్లించవలసి ఉంటుందో లెక్కగట్టి, ఆ సొమ్ము మినహాయించుకొని, మిగిలిన అసలు మాత్రం ఇవ్వటం ఈ విధానం ఇందులోని తిరకాసేమంటే – ముందుగానే తీసుకున్న వడ్డీని పత్రంలో చెల్లు రాయరు అప్పు తీసుకున్న వ్యక్తి అసలు ఫాయిదాలు గడువు ప్రకారం చెల్లించవలసిందే! మరిందులో ధర్మమెక్కడుందని ప్రశ్నించవచ్చు గడువు తీరేలోగా అసలు చెల్లించినట్లయితే వడ్డీని వదులుకొన్నా రనుకోండి అప్పుడది ధర్మవడ్డీ అవుతుంది! పరమదుర్మార్గుడైన వ్యక్తి పత్రంలో ఉన్న ప్రకారం వడ్డీ కూడా చెల్లించమని నిర్బంధించవచ్చు చెల్లించకపోతే కోర్టుకుపోయి వసూలు చేసుకోవచ్చు కానీ 'ధర్మబుద్ధి'గల వ్యక్తి అయితే ముందే చెల్లించారులెండని వడ్డీ అడక్కపోవచ్చు అడక్కపోతే సదరు వ్యక్తి 'ధర్మదాత' కింద లెక్క అడిగితే చట్టం ప్రకారం, ఏర్పాటు ప్రకారం వసూలుచేసిన 'ధర్మాత్ముడు' కావచ్చు! ఈ వ్యవహారం యావత్తూ అధర్మభూయిష్ఠమే అయినా అవసరం కలిగి అప్పుచేసిన అభాగ్యుడు అదంతా ధర్మబద్ధమని ఒప్పుకోక తప్పని పరిస్థితిలో ఉంటాడు

వడ్డీ ముందుగానే చెల్లించానంటే నమ్మేవారుండరు చెల్లిస్తే 'చెల్లుచీటీ' ఏదని కోర్టువా రడుగుతారు వ్యవహారజ్ఞులు ఇంత అమాయకత్వముంటుందని అంగీకరించరు విధిలేని పరిస్థితిలో రోట్లో తలదూర్చిన వ్యక్తి రోకలిపోటుకు ఏడ్చి ప్రయోజనం ఉండదు అసలు దుర్మార్గం ముందుగా మినహాయించుకున్న వడ్డీ సొమ్మును మరొకరికి ధర్మవడ్డీకి అప్పుగా ఇచ్చే అవకాశం ఉండటంలో ఉంది; అసలు మొత్తం బాకీదారుకు అందకపోవటంలో ఉంది తక్కువ సొమ్మిచ్చి ఎక్కువ సొమ్మిచ్చినట్లు పత్రం రాయించుకొని, ఆ సొమ్ముకు వడ్డీ రాబట్టే పుణ్యాత్ముడు ధర్మవడ్డీకి అప్పిచ్చినవాడు కావటమే వింత సాధారణంగా ఇలాంటి వ్యవహారాలు ఏ సినిమా పెట్టుబడులవంటి పెద్దయెత్తు సందర్భాల్లోనో సాగుతుంటాయి ధర్మవడ్డీ అనేమాట నేతిబీరకాయ వంటిది అందులో ఏ కోశానా అణుమాత్రం ధర్మం లేదు ధర్మం లే దనటానికి గుండెచాలక ధర్మవడ్డీ అనే పేరుబెట్టి కళ్ళు తుడుచుకోవటం, చేతులు కాల్చుకోవటం ఈ వ్యవహారంలోని ప్రధానాంశం ఏడవలేక నవ్వినట్లు అధర్మాన్ని ధర్మమని నిందాస్తుతిగా వ్యవహరించట మన్నమాట ఈ జాతీయానికి మూలార్థం ఎక్కడా ఎంత వడ్డీకీ

అప్పుపుట్టని పరమ దౌర్భాగ్య దామోదర చక్రవర్తికి ధర్మవడ్డీయే శరణ్యం మరో మార్గం లేదు ఇచ్చేవాడు పుణ్యాత్ముడు తీసుకున్నవాడు పరమ పాతకుడు ఈ పాప ఫలమే ధర్మవడ్డీ

**నకరాలు పోవటం:** కొందరీ పదబంధాన్ని నకరాలు కొట్టడమని కూడా వ్యవహరిస్తారు నకరశబ్దం ఈ అర్థంలో తెలుగులోని సాధారణ నిఘంటువుల కెక్కలేదు క్రీస్తుశకం 11-14 శతాబ్దాల మధ్యకాలంలోని తెలుగు శాసనాల్లో ఈ మాట 'నఖరు, నగరం' అనే రూపాంతరాలతో సహా విస్తృత ప్రయోగంలో ఉంది ఒక అర్థం దేవాలయమని. అది ఈ పదబంధ విషయంలో నప్పదు రెండోది వర్తక సంఘమని ఏ మహానగరంలో నయినా వ్యాపారస్థులుగాని, వ్యాపారస్థలాలు (అంగళ్ళు) గాని ఒకే ప్రాంతంలో ఉంటే - దాన్ని "నకరవీడు, నకరవాడ" అనేవాళ్ళు వర్తకులు సరకులతో ప్రయాణం చేస్తే దారిలో ఎక్కడయినా మజిలీచేసి తాత్కాలికంగా ఏ గుడారాలో వేసుకొని ఉంటే అది బిడారు అలా వస్తువులను తీసుకొని దేశపర్యటన చేస్తూ క్రయ విక్రయాలు చేసేవారిని బిడారు వర్తకు లనేవాళ్ళు వారే ఏ నగరంలోనో ఏ ప్రాంతంలోనో శాశ్వత నివాసం ఏర్పరచుకొని వ్యాపారం చేస్తుంటే ఆ స్థలం/ప్రాంతం నకరం కొన్ని శాసనాల్లో నఖరం నకరాలు పోవటం అంటే కొనుగోలు కోసం (అర్భాటంగా) బయలుదేరటం నకరానికి వెళ్ళి అక్కడ పెద్ద ఎత్తున కొంటున్నట్లు హంగామా చేయటం నకారాలు కొట్టడం ఒక విధంగా ఈనాటి మాట "పోజులు కొట్టడానికి" అది సమానార్థకం కొన్నా కొనకపోయినా బేరసారాలు చేయటం, ఒకటికి పది అంగళ్ళకు పోయి బేరమాడటం నకరాలు కొట్టడం చివరికీమాట బడాయి కొట్టడం, బడాయికి పోవటం అనే అర్థాల్లో నిలిచింది నకరశబ్దానికి తెలుగు సాహిత్యంలో ఎక్కడోగాని ప్రయోగం లేకపోయినా ప్రజా వ్యవహారంలో ఆ మాట నిలిచింది ఒకనాటి నకరాల్లో నిర్వాహకులుగా ఉన్నవాళ్ళే తరవాతి కాలంలో 'నగరాలు' అనే కులంగా పరిణమించారని కొందరి వివరణ కావచ్చు ఈ పద బంధాలు బడాయికి పోవటం, పోజులు కొట్టడం అనే అర్థాల్లో నేటి వాడుకలో మిగలటం విశేషం స్వస్థలంలో స్వగ్రామంలో దొరికే వస్తువులకోసం పరాయిచోట్లకు పోవటం సమాజంలో గౌరవానికి చిహ్నంగా నేటికీ ఉంది నాడే ఉండేదనటానికి ఈ జాతీయమే నిదర్శనం దౌర్బల్యాలకు కాల స్థల పరిమితి లేదని ఇటువంటి మాటలు నిరూపిస్తాయి

**నకార ప్రయోగం:** 'న' అనే హల్లును వాడటమనేది నకార ప్రయోగమనే మాటకు సామాన్యార్థం సంస్కృతంలో 'న, నో' అనే అవ్యయాలు వ్యతిరేకార్థ సూచకాలు ఆ లక్షణం మీద ఆధారపడి ఈ మాట పుట్టింది 'నాస్తి' అనే సంస్కృత క్రియారూపానికి 'లేదు' అని అర్థం అందువల్ల లేదని చెప్పటానికి నకార ప్రయోగం చేశారని ఘనంగా చెప్పటం పరిపాటి అయింది లేదన్నారు, కాదన్నారు అనటానికి నకార ప్రయోగం చేశారని చెప్తారు

**నక్కను తొక్కటం:** అదృష్టానికి చిహ్నంగా ఈమాటను వాడుతుంటారు జిత్తులమారి అయిన నక్క ఎదురుపడటమే విశేషం అజాగ్రత్తగా పడివుండటం అంతకన్నా విలక్షణం ఆ నక్కను తొక్కటమంటే మామూలుగా కాని పని అందరికీ సాధ్యంకానిది ఎవరో ఒక మహనీయుడు అంతపనీ చేసివుంటే అతడు మామూలు వ్యక్తికాదు అంటే అదృష్టవంతుడని, సమర్థుడని భావిస్తారు - 'నక్కను తొక్కివచ్చా'డంటే, అదృష్టదేవత

గురించి చర్చిస్తూ ఆనందగజపతిమహారాజు ఆస్థానంలోని పండితులు నక్క ఎటునుంచి ఎటుపోతే మంచిదో, కాదో తీవ్రంగా చర్చించారట సభలోని సర్వమంగళశాస్త్రి అనే సంగీత విద్వాంసుడు "మహారాజా! కరవకుండాపోతే ఎటునుంచి వచ్చినా, ఎటుపోయినా మంచిదే"నని చమత్కరించాడని చెప్తారు నక్క ఎదురుపడటం పిల్లి ఎదురయినట్లే అపశకునం కిందలెక్క అలా అపశకున ఎదురయినా అనుకొన్న పని మానకుండా చేసినవాడు అదృష్టవంతుడయినా కావాలి, అసహాయశూరుడైనా కావాలి. ఈ భావంతో నక్కను తొక్కడం శుభసూచకమని, అదృష్టలక్షణమని భావిస్తారు

నక్షత్రకుడు: తెలుగులోని హరిశ్చంద్రోపాఖ్యాన గ్రంథాల్లో ఈ పాత్ర ప్రత్యక్షమవుతుంది హరిశ్చంద్రుడి సత్యసంధతను పరీక్షించే సమయంలో రాజ్యం పోగొట్టుకొన్న అతడి నుంచి తనకు ఇవ్వవలసిన సొమ్మును వసూలు చేయడానికి విశ్వామిత్రుడు ప్రయోగించిన శిష్యరత్నం నక్షత్రకుడు నీడలా వెంటాడుతూ, తప్పదారి పట్టిస్తూ, సమయ సందర్భాలతో నిమిత్తం లేకుండా బాకీ తీర్చమని వేధిస్తూ పరమక్రూరుడుగా, అఖండ గురుభక్తుడుగా ప్రేక్షకులను ఆకట్టుకొన్న పాత్ర నక్షత్రకుడిదే సంప్రదాయ నాటకాలు జోరుగా సాగుతున్న రోజుల్లో పీడించే ప్రతి వ్యక్తినీ ఈ పేరుతో వ్యవహరించటం పరిపాటి అయింది

నంగనాచి తుంగబుర్ర: నంగనాచి అనేది తెలుగు మాటగా కనిపించే హిందీ సమానం 'నంగే నాచ్' అంటే 'దిగంబరంగా నాట్యమాడే' అని అర్థం. తుంగబుర్ర మాత్రం అచ్చం తెలుగుమాట అసలీ జాతీయంలో చివర ఇదెందుకు చేరిందో చెప్పటం కష్టం తుంగ ముస్తె/దుంపకూ దిగంబర నాట్యానికీ సంబంధం కనిపించదు ఊతం కోసమో, నాట్యకత్తెలా సున్నగా ఉందనే అర్థంలోనో, తెలుగు చేయటానికి సాధనంగానో రెండో భాగం కలిసివుంటుంది అమాయకంగా కనిపించే, అమాయకత్వం నటించే నెరజాణ అనే అర్థంలో ఈ మాటలు వాడుతుంటారు – సర్వసాధారణంగా స్త్రీల విషయంలోనే హిందీలోని 'నంగా' శబ్దం సంస్కృతంలోని 'నగ్న' శబ్దభవం 'సిగ్గుమాలిన, దిగంబరమైన' అనే అర్థంలో నంగనాచి అనేమాట తెలుగులో స్థిరపడింది ఇదొక అభిప్రాయం

నంగనాచి అనే మాట తెలుగు మాట, పచ్చిద్రవిడ శబ్దమనే వాదం మరొకటుంది నంగ శబ్దం నేటి తెలుగులో ఇతర సందర్భాల్లో వాడుకలో లేకపోయినా, దానికి సోదరభాషలన్నిట్లోనూ వాడుక ఉంది తమిళంలో నంగై శబ్దానికి 'కోడలు, వదినె, నెరజాణ' అనే అర్థాలున్నాయి మలయాళంలో 'నజ్జి' అంటే చురుకైన, తెలివిగల 'స్త్రీ' అనే అర్థాలున్నాయి 'నజ్జియార్' అంటే 'నాట్యకత్తె'. ఇక 'నాచిముత్తు'లాంటి పేర్లు తమిళ మలయాళాల్లో వినిపిస్తాయి. కన్నడలో 'నాచిగె, నాచికె, నాచ్చికె' వంటి రూపాలకు 'సిగ్గు, మర్యాద, సిగ్గరి' వగైరా అర్థాలున్నాయి ఈలాంటివాటిని చూస్తే ఒకనాటి తెలుగులోనయినా 'నాచి' శబ్దానికి 'సిగ్గరి, కన్నె' వగైరా అర్థాలుండి వుంటాయి కాబట్టి 'నంగనాచి' అచ్చం తెలుగు పిల్లేననేది రెండోవాదం

కన్యాశుల్కం హీరో గిరీశం వట్టి 'యాంటీనాచ్' అంటే వేశ్యావిరోధి ఈ సమాసంలో 'నాచ్' శబ్దాన్ని ఇంగ్లీషు పదం చేశాడన్న మాట (nautch అనే వర్ణక్రమంతో హిందీమాట ఇంగ్లీషులో చేరింది). వేశ్యలే నాట్యం చేస్తారనీ, నాట్యకత్తెలు వేశ్యలనీ, అదో కులవృత్తి అనీ పరిగణించిన కాలం లేకపోలేదు సంసారం చేసే

స్త్రీ బహిరంగస్థలాల్లో నాట్యం చేయటం ఒకప్పుడు నిషిద్ధం రాజకుమారీ మణులు నాట్యం చేసినా, నేర్చినా అది తప్పని చెప్పగల దొమ్మ లేదు దేవదాసీలకు దేవుడి ముందు నాట్యం చేయక తప్పేది కాదు సమాహారం మీద నంగనాచి శబ్దానికి 'సిగ్గుమాలిన, దిసమొల పిల్ల' అనే అర్థాలు కుదురుకొన్నాయి తుంగబుర్ర అంటే తుంగముస్తె తక్కిన దుంపలకు లాగా దానికి చర్మం లేదు అంటే దిగంబరి అన్నమాట. ఇలాంటి భావాలన్నీ కలుపుకొని ఈ జాతీయం పుట్టింది

నమ శ్శమనాయ: శమనుడంటే యమధర్మరాజు నమ శ్శమనాయ అనేది సంస్కృత వాక్యం యమధర్మరాజుకు నమస్కారమని సామాన్యార్థం అనేక దేవీ దేవతలను పూజించేవాళ్ళున్నారు గాని మృత్యుదేవతనూ, యమధర్మరాజునూ ప్రత్యేకంగా తలుచుకుని నమస్కరించే వాళ్ళుండరు భయపడనివాళ్ళూ ఉండరు ఎవరికి భయపడకపోయినా ఫర్వాలేదు గాని చావుకు భయపడక తప్పదు చచ్చిన తరువాత పుణ్యలోకాలకు చేరుకుంటామన్న ధీమా ఉన్నవాళ్ళు చాలా కొద్దిమంది సర్వసాధారణంగా నరకం తప్పదని గ్రహించినవాళ్ళు అసంఖ్యాకులు తెలివిగలవా డెవడోగాని యముణ్ణే స్మరిస్తే నరకయాతన లయినా తగ్గుతాయని గ్రహించాడు (అంతప్రాచీన కాలంలో కూడా మృత్యుదేవతను పైరవీద్వారా స్వాధీనపరచుకోదలచిన పైరవీకారులుండే వాళ్ళన్నమాట!) కాబట్టే యముడికే నమస్కార మన్నాడు ఈ మాటను పరమ యాచకుడనే భావంలో వాడుతుంటారు "అతడా నమ శ్శమనాయ రకం" అని ఈసడించుకొంటారు అంటే – ఏ విధంగానైనా సరే, బతుకుతెరువు సంపాదించుకోదలచినవా డనటానికి ఈ మాటను వాడుతుంటారు

నలభీమపాకం: వ్యాసుడు రాసిన భారతంలో ఒక చక్రవర్తి కథ ఉంది లెక్క ప్రకారం నలుడు రెండో చక్రవర్తి అందులోనే ఒక మహాబలవంతుడి కథ ఉంది అతడే భీముడు భారత కథ మొత్తం తెలియని గిరిజన భాషల్లో కూడా భీముడి సంగతి తెలియనివారు లేరు ఆయా ప్రాంతాల్లో ఉన్న పొడుగాటి చెట్టును పీకి భీముడు పళ్ళు తోముకునేవాడనే జానపద, గిరిజన కథల్లో పాటల్లో వినిపిస్తుంది తెలుగు భీముడు తాటిచెట్టుతో దంతధావనం చేసుకుంటే అస్సామీ భీముడు దేవదారు వృక్షంతో అదే పని చేస్తాడు శరీరబలానికి యావద్భారతంలోనూ భీముడు ప్రతీక అంత చక్రవర్తీ, ఇంత మహా వీరుడూ కాలకర్మవశాన వంటలు చేయవలసివచ్చింది నలుడు వంటలవాడుగా ఉన్నప్పుడు బాహుకుడనే పేరు పెట్టుకుంటే, భీముడు వలలు డనిపించుకున్నాడు వంటచేసిన పెద్దమొగాళ్ళు వీరిద్దరే కాబట్టి, వంట సర్వసాధారణంగా స్త్రీల కర్తవ్యం కాబట్టి, ఈ యిద్దరూ గొప్ప వంటవాళ్లు కాకపోతే ఆ ఉద్యోగమైనా కష్టకాలంలో వాళ్లకు దొరికిఉండేది కాదన్న నమ్మకంతో మంచి వంటను, రుచికరమైన వంటను 'నలభీమపాక'మని వర్ణించటం అలవాటయింది బహుశా మరెవ్వరూ వాళ్లతో వంటలో పోటీకి రానందువల్లనేమో ఆ మాట నిలిచిపోయింది

నలభై: ఆయనకు నిన్న నిండుసభలో నలభై అయిందంటే అవమానం జరిగిందని అర్థం మనకున్న అరవై సంవత్సరాల పేర్లలో నలభయ్యోది 'పరాభవ ' పరాభవం/అవమానం జరిగిందనటానికి నలభై అయిందంటారు ఇలా సంఖ్యావాచకాలతో చాలా జాతీయాలు పుట్టాయి

**నలుగురితో నారాయణ:** బహుశా రామానుజాచార్యులు చేసిన పనిని మనసులో పెట్టుకొని కాబోలు ఇదో సామెతలో భాగమయింది "నలుగురితో నారాయణ, కులంతో గోవింద" అనేది సామెత కష్ట సుఖాలను అందరితోనూ పంచుకోవాలనీ, స్వకులస్థుల ఆచార వ్యవహారాలను నచ్చినా నచ్చకపోయినా పాటించాలనీ చెప్పేందుకు ఇది పుట్టింది అంతేగాని, నారాయణ గోవింద శబ్దాలకు ప్రత్యేక ప్రయోజనం ఉన్నట్లు లేదు – యతిమైత్రి (న–నా, కు–గో) సరిపుచ్చడానికితప్ప ఈ రెండు శబ్దాలూ పర్యాయపదాలు కాబట్టి సమానార్థకాలుగా వాడివుంటారు

**నల్లమేక తప్పు:** నీతిచంద్రికలోని 'బ్రాహ్మణుడు – నల్లమేక' కథకూ ఈ మాటకూ ఎలాంటి సంబంధమూ లేదు. ఆ కథలో యజ్ఞం కోసం నల్లమేకను తెచ్చుకొంటుంటే దొంగలు అది మేక కాదని నమ్మించి మోసగించి తాము దక్కించుకుంటారు ఈ నల్లమేక యజ్ఞయాగాదులకు పనికి వచ్చేదీకాదు – వచ్చిందీకాదు లోకంలో జీవరాశులన్నీ చేసే తప్పే ఇదీ చేసిందట కానీ పేరు మాత్రం దీనికే దక్కింది! ఇంతకూ ఆ తప్పేమంటే 'చీకటి తప్పు'! అంటే 'వ్యభిచారం'. బలవంతులూ, ధనవంతులూ, విద్యావంతులూ ఇలాంటి తప్పే చేసి కూడా రహస్యం బయటపడకుండా కాపాడుకోగలరు చేసిన తప్పులను సమర్థించుకోనూ గలరు నోరూవాయీ లేని నల్లమేకతో పోలుస్తారు అది చాలక వ్యభిచారాన్ని నల్లమేక తప్పని కూడా వ్యవహరిస్తున్నారు

**నల్లేరుపై బండి:** మైదానాల్లో నలుపలకలుగా ఉండే నల్లేరు తీగలు అక్కడక్కడ నేలమీద పరచుకొని ఉంటాయి. బండి ఆ తీగల మీదుగా సాగేటప్పుడు మెత్తగా, కదలికలూ కుదిలింపులూ లేకుండా సాఫీగా, హాయిగా నడుస్తుంది గొడ్లకు శ్రమ తక్కువ బండి నడిపేవాడికి ఆనందం. రబ్బరు రోడ్లమీద నడిచినంత సుఖంగా ఉంటుంది ప్రయాణం అందువల్ల 'నల్లేరుపై బండి నడక' అంటే అత్యంత సులభమనే అర్థంవచ్చింది. తిరుపతి వేంకట కవులు కాబోలు "అష్టావధానమ్ము కష్టవత్కార్యమ్ము, నల్లేరుపై బండినడక మాకు" అని చెప్పుకున్నారు – ఇతరులకు ఇదెంత కష్టమో మాకంత సులభమనడానికి

**నాగవల్లి నిష్ఠురం:** నాగవల్లి అంటే తమలపాకు తీగ నిష్ఠురమంటే దెప్పు ఈ మాట ఈ కాలంలో వాడుకలో ఉందని నమ్మటం కూడా కష్టమే. ఖర్చులు భరించలేక కొందరు, సంప్రదాయ పద్ధతి సరిపడక కొందరు, తీరికలేక మరికొందరు పెళ్ళి వీలయినంత త్వరలో అయిందనిపిస్తున్న రోజుల్లో ఏడు రోజుల, అయిదు రోజుల, మూడు రోజుల పెళ్ళిళ్ళను గురించి ఊహించటం కూడా కష్టమే పాతకాలంలో పెళ్లివారిని ఆహ్వానించే ఎదురుకోలు వేడుకలకే ఒక్క రోజు చాలేది కాదు అలాగే అప్పగింతలకున్నూ నాగవల్లి అనేది ఒక పెండ్లి తంతు. పెండ్లి పూర్తయిన తరువాత జరిపే ఈ తంతులో అంతకుపూర్వం జరిగిన లోపాలను గుర్తుకు తెచ్చుకొని దెప్పటం పరిపాటిగా ఉండేది పెళ్ళికి ముందుగాని, పెళ్లి సమయంలోగాని వేళాకోళాలు సరాగాలూ మోతాదులో ఉండేవి. చెడిపోతుందన్న భయంతో చివరినాడు ముద్దర పిండి దగ్గర దెబ్బలు తగిలించటం, జరిపిన అమర్యాదలను గురించి దెప్పటం కూడా వేడుకలకిందే లెక్క

నాగవల్లీ శబ్దానికి నాగవలి అనేది రూపాంతరం. ఈ మాట 'నాగబలి' అనే సంస్కృత శబ్దం నుంచి పుట్టింది వివాహవేదిక దగ్గర పిండిముగ్గులు పెట్టి, నాలుగువైపులా చిన్న కర్రలు పెట్టి తాళ్లతో (దారాలతో, వాటిని కట్టి), పూజలు

చేయటం నాకబలి నిజానికి పూర్వం ఆ సందర్భంలో బలి యివ్వటం కూడా జరిగేది అది నాకసుఖాలను (స్వర్గసుఖాలను) కోరుకుంటూ ఇచ్చే బలి ఇప్పటికీ కొన్ని ప్రాంతాల్లో కొన్ని కులాల్లో గృహప్రవేశ సమయంలో కూడా బలులిచ్చే ఆచారముంది ఆ పద్ధతి నచ్చని తరవాతికాలంలో సున్నం పసుపూ కలిపి చేసిన పారాణితో బలి ఇచ్చినట్లు (రక్తతర్పణం చేసినట్లు) సరిపెట్టుకోవటం ఆచారమయింది అది కూడా నచ్చని వాళ్ళు తాంబూలాలు వేసుకొని ఉమ్మివేస్తే నాకబలి సమాప్తమవుతోందని, సంతోషపడటం మొదలయింది ఈ తంతంతా పెళ్లి చివరిరోజున జరిగేది.

బాల్య వివాహాలకాలంలో అప్పగింతల సమయంలో కన్నీళ్ళు కాలవళ్లై పారేవి ఇప్పుడు మహా అయితే ఆనందాశ్రువులు జారుతున్నాయేమో! అప్పట్లో నాగవల్లి పూర్తయింతరువాత పెళ్ళివారు ఒకరినొకరిని వేళాకోళం చేసుకుంటూ వరసపాటలు పాడేవాళ్ళు ఆ వేడుకను నాగవల్లి నిష్ఠురమన్నారు అనుకొన్న పని నెరవేరిన తరువాత మాటామాటా పెరిగి పోట్లాడుకోవడం కూడా దరిమిలా నాగవల్లి నిష్ఠురమనే జాతీయానికి అర్థమయిపోయింది పెళ్ళి సందర్భంలేకపోయినా ఎదురుకోలు పాటలనుంచి అప్పగింతల పాటలవరకు రకరకాల పాటలు పాడేవాళ్లు భోజనాలముందు, భోజనసమయంలో పద్యాలు చదివేవాళ్లు చివరకు తాంబూలాలు వేసుకోనేటప్పుడు 'తాంబూలాష్టక'మని ఎనిమిది శ్లోకాలు చదివేవాళ్ళు అలనాటి అలవాట్లను పురస్కరించుకొని పుట్టిన జాతీయాల్లో ఇదొకటి - అవసరం గడిచిన తరువాత చేసే ఆక్షేపణలను (పెళ్ళితో నిమిత్తం లేకుండానే) నాగవల్లి నిష్ఠురాలనటం పరిపాటి అయింది

నాగులేటి నీళ్లు: పలనాటి యుద్ధమనే పలనాటి భారతం యధార్థంగా జరిగిన ప్రచండ యుద్ధం క్రీస్తు శకం పన్నెండో శతాబ్దిలో ఏడేళ్లు జరిగిన సంకుల సమరంలో బ్రహ్మనాయుడి వంటివాళ్లు కొద్దిమంది భారత యుద్ధం అయిన తరువాత పాండవుల్లాగా మిగిలారు అది ఒక విధంగా బంధువుల మధ్య జరిగిన మారణ హోమం మరో విధంగా శైవ వైష్ణవుల మధ్య జరిగిన సంగ్రామం. యుద్ధకారణాల్లో హరిజనులకు బ్రహ్మనాయుడు సపంక్తి భోజనం పెట్టడం ప్రధానమని క్రీడాభిరామం చెప్తుంది. "ఆరువిల్లి నాయురాలి దుర్మంత్రంబు, కోడిపోరు, చాపకూటి కుడుపు, ప్రథమ కారణములు పలనాటి యేకాంగ, వీరపురుష సంప్రహారమునకు" అని 'చాపకూటి కుడుపు' అంటే పంక్తిభోజనం. ఒకే చాప మీద నానా వర్ణాల వారూ కలిసి కూర్చొని అన్నం తినటం ఆ భయంకర యుద్ధానికి మరో కారణాన్ని లోకం కనిపెట్టింది- పలనాడులో ప్రవహించే నాగులేటి నీళ్లు ఒంటపట్టినందువల్ల అంత శౌరుషం, అంత తెగింపూ పుట్టాయని నాగులేటి నీళ్లంటే రోషం పుట్టించే మందన్న మాట పుట్టింది ఈ ప్రసంగాన్ని నేదునూరి గంగాధరంగారు చెప్పారు

నాంచారమ్మ: ఈ మహాతల్లి నెవరు సృష్టించారో తెలీదు ఈమె లోభి మనిషో, అలస్యం మనిషో చెప్పలేం పొరపాటున ఏ అభాగ్యుడయినా ఆమె యింటికి పోతే తెలుస్తుంది ఆతిధ్య మెలాగుండాలో వంటలో ఆమె అందెవేసిన చెయ్యి కానీ ఆ వంటపని తెమలదు – తేలదు అందువల్లే "నాంచారమ్మ వంట – నక్షత్ర దర్శనం" అనే సామెతే పుట్టింది ఏకంగా ఆమె కావాలని ఆలస్యం చేసి అతిధులను సాగనంపుతుందో, ఆమె స్వభావమే అంతో చెప్పలేం ఆమె ఇంటిపేరు తెలీదు కులగోత్రాలు తెలీవు

వెనుకటి కోతెలుగు కవి చాటుపద్యం చెప్పాడు ఫలానా వారింట్లో జరిగే మర్యాదలుగాని, ఇచ్చే విందుగాని పరమాద్భుతమేగాని ఆ భోగం అనుభవించాలంటే సూర్యాస్తమయంలోగా వీలుపడదనీ, అందాకా మన గొంతులో ప్రాణా లుండాలనీ వర్ణించాడు నాంచారమ్మ తంతు కూడా అంతే. కాదని చెప్పకుండా, తేల్చకుండా చేసేపనికి 'నాంచారమ్మ వంట' అనే పేరు వచ్చింది ఆమె పిసినారి కాదనలేం. అవు ననలేం ఆమె స్వభావం బ్రహ్మపదార్థంలా ఎలా భావించినవారికి అలా బోధపడుతుంది

**నాపసన్నాసి:** నాగవల్లి అనే పెళ్ళి తంతు మొత్తం ఆడవాళ్ళ సందడి పెళ్ళికొడు కొక్కడే ఏకాకిగా అక్కడ సరసాలు, చమత్కారాలు, ఎత్తిపొడుపులు, ఎద్దేవలు వింటూ దిక్కుదిక్కుమంటూ కూర్చుంటాడు కొన్ని ఇళ్ళల్లో ఈ సందర్భంలో మొరటుహాస్యం పాలు ఎక్కువగా ఉంటుంది. అలాంటి సమయంలో తాను కూడా నోరుతెరచి వ్యంగ్యాలూ విసుర్లూ విసిరితే అతడి బ్రహ్మచర్యాన్ని ఆటపట్టిస్తారు నాపసానులు పెళ్ళికూతురు అనుమానించవచ్చు అతగాడి ప్రవర్తనను అందువల్ల నోరునొక్కుకుని ఏమీ ఎరగని సన్యాసిలా (ముద్దుగా సన్నాసిగా) కూర్చోవటం క్షేమప్రదం అందువల్ల నాగవల్లి పీటల మీద కూర్చున్న (కొత్తగా) సంసారి అయిన వరుడు (పాతకాలపు) సన్యాసిలాగా అమాయికంగా ప్రవర్తించక తప్పదు ఆ లక్షణాన్ని పురస్కరించుకొని నాపల ఎదుట సన్నాసిలాగా ఉన్న అమాయకుణ్ణి నాప సన్నాసి అని మొరటుగా పిలిచేవాళ్ళు కాలక్రమాన అసమర్థుడు, అశక్తుడు, అజ్ఞాని అయిన పురుషుణ్ణి నాపసన్నాసి అనటం రివాజయింది అవసరార్థం నటించిన అమాయకత్వం అప్రయోజకత్వంగా పరిణమించిం దన్నమాట!

**నాపసాని:** పెండ్లి చివరిరోజు తంతుగా జరిగే నాకబలి/నాగవల్లి తంతులో పెద్ద ముత్తయిదువుల పాత్ర చాలా ఉండేది వరసపాటలు పాడటం దగ్గరినుంచి మర్యాదలు జరపటందాకా, వధూవరులను పీటల మీద కూర్చోపెట్టడం దగ్గరినుంచి తాంబూలా లిప్పించటం దాకా నాప సానులకు చాలా పనులూ ప్రాముఖ్యమూ ఉండేవి. నాగసాని, నాగపసాని, నాగప్పసాని అనే పర్యాయ రూపాలతో ఈ నాపసానిని వ్యవహరించటం కద్దు జాణ లయిన ముత్తయిదువులు ఈ తంతు నడిపేవాళ్ళు అందువల్ల నాపసాని అనే మాటకు కాలక్రమాన జాణ, నేర్పరి, అనుభవజ్ఞురాలు అనే అర్థాలు వచ్చాయి వయసులో పెద్దదై నాపసానిగా వ్యవహరించిన ఆమెను ముదినాపసాని అనేవాళ్ళు వ్యక్తులుకాని ఆడపిల్లలు వినికిడి పాండిత్యంతో ఏవయినా సరససల్లాపాలు సాగిస్తే 'ఏమ్మో, ముదినాపసానిలా మాట్లాడుతున్నావు?' అని అధిక్షేపించటం కద్దు నాకబలి సందర్భంలో పెద్దరికం వెలిగించినామె 'నాకసాని' అయి, కాలక్రమాన నాగసాని అయిందంటారు కొందరు

**నాభిలో పురుగు:** నాభి మొక్క ఎంత చక్కటిదో, దాని పువ్వెంత ఆకర్షణకర మయిందో అంత ప్రమాదకరమైన వస్తు వది నాభి దుంప కాలకూట విషం లాంటిది కొందరు దొంగతనమే వృత్తిగా పెట్టుకొన్న మహాత్ములు పసిపిల్లలకు నాభిపువ్వు రెమ్మను తుంచి తినిపిస్తారు పిల్లలు కక్కుకొంటారు కొంతసేపు తరువాత మళ్ళీ తినిపిస్తారు. ఇలా అలవాటు చేస్తారు రెమ్మ పరిమాణం క్రమంగా పెంచి, కాస్త పెద్దపిల్లలకు చిన్న దుంపముక్కనిచ్చి తినిపిస్తారు. కరక్కాయంత దుంపను నోట్లో నానబెట్టుకొనే స్థాయికి తెస్తారు వసనాభి/విషనాభి అనే ఈ దుంపను నమిలి

బతికినవాళ్ళను తేలుకాటూ పాముకాటూ ఏమీ చెయ్యలేవు వాళ్ళ శరీరం విషమయ మయిపోతుంది వాళ్ళు కొరికినా గిల్లినా ప్రాణాంతక మవుతుంది

పైవిధంగా బాల్యంనుంచి నాభిని జీర్ణం చేసుకొని బతకగల కన్యలను పెంచి పోషించేవాళ్ళు పాతకాలంలో రాజులు ఆ పిల్లలను 'విషకన్య' లనేవాళ్ళు వాళ్ళను శత్రురాజులమీద ప్రయోగించేవాళ్ళు వారితో సంగమించిన వ్యక్తి చచ్చిపోతాడు వ్యసన ఫలితంగా చచ్చినట్లు చెప్పవచ్చు ఇదో సుఖప్రదమైన హత్యాయుద్ధ మన్నమాట ముద్రారాక్షస నాటకంలో రాక్షసమంత్రి చంద్రగుప్త మౌర్యుడి కోసం ఉద్దేశించి పంపిన విషకన్యను చాణక్యుడు మలయకేతువుకు సమకూర్చి, రాజ్యభాగ మివ్వకుండా తప్పించుకున్నట్లు రాశారు రాక్షసుడు పెంచి పంపిన విషకన్య కాబట్టి అప్రతిష్ఠ అతడికి వచ్చింది విషకన్యా ప్రయోగాన్ని దారి తప్పించి రెండు విధాలా చాణక్యుడు విజయం సాధించాడు

ఇంత విషపూరితమైన నాభి దుంపలో పెరిగే పురుగు లున్నాయి అవి చావవు చావకపోగా ఆరోగ్యంగా పెరుగుతాయి ప్రపంచానికి విషమయమైన నాభి ఆ పురుగులకు అమృతప్రాయమైన ఆహారం తనచుట్టూ ఎన్నో ప్రమాదాలు పొంచివున్నా, తాను అనుక్షణం ప్రాణాపాయంలో ఉన్నా, నిర్భయంగా నిశ్చలంగా ఉండే వ్యక్తిని నాభిలో పురుగుతో పోలుస్తారు అంటే మేరు ధైర్యవంతు డయిన వ్యక్తి నాభిలో పురుగువంటివాడు ఆ మాటకు ధీరుడని అర్థం కొందరు నాభికన్నా ప్రమాదకరమైన వ్యక్తి అనే అర్థ ముందంటారు ఈ మాటకు మరికొందరు పేడ పురుగులాగా నీచుడని వివరిస్తారు మరికొంతమంది ప్రమాద మధ్యంలో తప్ప బతకలేని, సాధారణ జీవితం గడపలేని సాహసి అని విశదీకరిస్తారు మొత్తంమీద నాభిలో పురుగు ఎంత దిట్టమయిందయినా, విషాన్నం తిని వాతాపి జీర్ణ మనుకోగలిగినా నాభిలాగా వైద్యానికి పనికిరాదు అంటే, నిరుపయోగకరమైన వస్తువన్నమాట నాభి ప్రాణం తీయటానికీ, ప్రాణం పోయటానికీ పనికివస్తుంది – గరళంలాగా అందులోని పురుగు ఎందుకూ పనికిరాదు లెక్కకుమాత్రం అదికూడా ఒక జీవి అది ఉంటే లాభం లేదు లేకపోతే నష్టం లేదు

నారాయణ జపం: 'నారాయణ' అనే శబ్దాన్ని మంత్రంగా గాక అవసరార్థం తలుచుకోవటం, పలకటం ముఖ్యంగా అవసాన సమయంలో అలవాటయింది ఏదయినా దుర్వార్త విన్నప్పుడు శైవేతరులు 'నారాయణ! నారాయణ!' అంటారు కన్ను మూసేటప్పుడు అపస్మారంలో ఉన్న వ్యక్తి చెవిలో నారాయణశబ్దం వినిపిస్తే నరకబాధలు తప్పుతాయన్న విశ్వాసముంది పురాణ కథల ప్రకారం అజామీళు డనేవాడు పరమ దుర్మార్గాలు చేసి, చివరి ఘడియలో ఉండగా, అతడిచేత నారాయణ శబ్దం పలికించాలనుకున్నారు ఎన్ని విధాల ప్రయత్నించినా ససేమిరా అతడు ఆ మాట ఉచ్చరించలేదు చివరి ప్రయత్నంగా అతడి కంటి ఎదుట ఏ గోగునారనో చూపితే అప్పుడు కూడా 'పీచు' అన్నాడేగాని 'నార' అనలేదని లోకపు వాదం భాగవత పురాణం ప్రకారం అతడి కొడుకు పేరు నారాయణ దేవుణ్ణే కాక కొడుకును పిలిస్తే ఇతగాడు మహా భక్తుడని విష్ణుదూతలు వచ్చారని, వాళ్ళు యమదూతలను తరిమికొట్టారని, మొండిగా బతికిన అజామీళుడు చివరికి మహా భక్తుడై విష్ణు సాయుజ్యం పొందాడని పురాణ కథనం ఏమయితేనేం, ఉత్తప్పుడు కాకపోయినా చివరి గడియలోనైనా తలచుకొనే మాటను నారాయణజప మంటారు

ఈ విశ్వాసంవల్ల నారాయణ శబ్దానికి 'చివరిమాట' అనే పేరు వచ్చింది చనిపోయే సమయంలో చెవిలో ఈ మాట చెప్పి, ఇన్ని తులసినీళ్ళు గొంతులో పోస్తారు – మింగనీ మింగకపోనీ అంతటితో తృప్తిలేక శ్మశానానికి తీసుకపోయే సమయంలో శవవాహకులు నారాయణ జపం చేస్తారు అదీ చాలక దారిలో ఒకటి రెండుసార్లు పాడెను దింపి నారాయణ జపం చేస్తారు – బతుకుతాడన్న ఆశతో ఇలా దారిమధ్యలో శవాన్ని దించేచోటును "దింపుడు కళ్ళం" అంటారు అప్పుడయినా ఈ జప మహత్తువల్ల చచ్చిన వ్యక్తి బతకవచ్చునన్న ఆశను 'దింపుడు కళ్ళమాశ' అంటారు ఈ ఆశలన్నీ తీరిన తరువాతనే, నెరవేరకపోతేనే చివరి పని – శవదహనం – చేస్తారు ఈ ఆచారంవల్ల ఈ చివరి ప్రయత్నానికి నారాయణ జపమన్న పేరు వచ్చింది వైష్ణవ పద్ధతి బొత్తిగా గిట్టనివాళ్ళు ఈ మాటను ఎవరయినా మాట వరసకో, భక్తిభావంతోనో ఉచ్చరిస్తే "ఏం? చివరి మాట ఇప్పుడే పలుకుతున్నావ్?" అని ఆక్షేపిస్తుంటారు

**నారాయణ మంత్రం:** వైష్ణవ దీక్ష ఇచ్చేటప్పుడు ఈ మంత్రం ఉపదేశిస్తారు దీన్ని గురువు దగ్గర ఉపదేశం పొందినా ఎవరికిబడితే వారికి చెప్పవద్దనే నిషేధ ముందంటారు రామానుజాచార్యులవారు ఈ మంత్రాన్ని అందరికీ చెప్తానంటే, ముందువెనుకలు చూడకుండా బోధిస్తే నీకు నరకం తప్పదన్నారట గురువుగారు మంత్రం నేర్చుకున్నవాళ్ళ కేమవుతుందంటే మోక్షం వస్తుందన్నాట్ట ఎందరికో మోక్షమిచ్చే మంత్రాన్ని నలుగురికీ చెప్పి నరకానికి వెళ్ళినా సరేనని ఆయన శ్రీరంగం ఆలయ గోపురమెక్కి ఈ మంత్రాన్ని పెద్దగా చెప్పా డంటారు ఎంత రహస్యమో అంత బహిరంగమయిన విషయాన్ని అప్పటినుంచీ నారాయణమంత్ర మనటం అలవాటయింది

ఇదే పద్ధతిలో రహస్యంగా ఉంచవలసిన గాయత్రీమంత్రాన్ని దరిమిలా ఆర్యసమాజం వాళ్ళు మందిరం వెలుపల రాయించడం మొదలుపెట్టారు అది సంప్రదాయరీత్యా ఎంత రహస్యమంటే – ఉపనయన సందర్భంలో తండ్రి కొడుకు నెత్తిన ముసుగు కప్పి చెవిలో రహస్యంగా చెప్తాడు అలాంటి మంత్రాన్ని ఇలా బహిరంగపరిచినా నారాయణ మంత్ర మన్నమాటకు వచ్చిన వాడుక వంటిది గాయత్రీ మంత్రానికి రాలేదు కారణం స్పష్టం నారాయణ మంత్ర విషయంలో రామానుజాచార్యుల త్యాగబుద్ధి, తెంపరితనం, ప్రదర్శన జనాకర్షక మయింది గాయత్రి విషయంలో ఇంత ఆర్భాటం జరగలేదు

**నారాయణాస్త్రం:** "ఆయన్నేం చేయలేం – ఆయన దగ్గర నారాయణాస్త్రముంది" అనే మాటలు వింటుంటాం, బ్రహ్మాస్త్రంకన్నా నారాయణాస్త్రం గొప్పదనే దృష్టితో ఎవరూ భయపడనక్కరలేదు, అతగాడు దణ్ణాలకు లొంగిపోతాడని అర్థం భారత యుద్ధంలో ద్రోణాచార్యుణ్ణి దృష్టద్యుమ్నుడు దుర్మార్గంగా వధించాడన్న కోపంతో పాండవ సేనమీదికి అశ్వత్థామ నారాయణాస్త్రం వేశాడు. శ్రీకృష్ణుడికి దానికి విరుగుడు తెలుసు వాహనాలు దిగి ఆయుధాలు కిందపడవేసి నమస్కరిస్తే అదేం చేయలేదని చెప్తాడు ఒక్క భీముడు మాత్రం అందుకు అంగీకరించడు కృష్ణార్జునులు బలవంతంగా అతడి ఆయుధాలు లాగివేసి చేతులు దగ్గరకు పెట్టించి దణ్ణం పెట్టిస్తారు అంతటితో ఆ అస్త్రం నిస్తేజమై శ్రీకృష్ణుడిలో లీనమవుతుంది నారాయణాస్త్రానికి ఎంత శక్తి ఉన్నా నమస్కారానికి లొంగిపోతుంది కాబట్టి ఎదుటివాడి దగ్గర అది ఉన్నా

తలఒగ్గి జయించవచ్చుననే అర్థంలో ఈ ప్రయోగం పుట్టింది ఈ మాట వాడకుండా మరోవిధంగా ఇటీవలి రచయిత ఒకరు అదే అర్థం సాధించారు "ఆయన నన్నేం చేస్తాడు? ఆయన కాళ్లు (జుట్టుకాదు) నా చేతిలో ఉన్నా"యని!

**నాలుగాకులు:** కొందరీ మాటకు బదులు ఏడాకులని వాడుతుంటారు "ఆయన మనకన్నా నాలుగాకులు ఎక్కువ చదివాడు" అంటే – 'మనకన్నా తెలివిగలవాడు, మనకన్నా మోసగాడు' అని అర్థం ఏడాకులన్నా అంతే కావలసిన దానికన్నా ఎక్కువనీ, అతిశయమనీ చెప్పడానికి ఈ మాటలు వాడ్తారు ఆకులంటే తాటాకులు కాగితాలు రాకముందు సమస్త శాస్త్రాలూ వ్యవహార పత్రాలూ తాటాకుల మీదనే రాసేవాళ్లు గంటాలతో ఈ జాతీయం అప్పుడు పుట్టింది

**నాలుగు కాయలు:** కాయ అనే మాటను ఈ జాతీయంలో సంతానార్థంలో వాడతారు "ఏదో నీ కడుపు చల్లగా నాలుగు కాయలు కాస్తే చూసి సంతోషిద్దా మనుకుంటున్నా"మని పూర్వం పెద్దవాళ్లు పెళ్లికూతుళ్ళను ఆశ్వీరదించేవాళ్లు నలుగురు పిల్ల లనకుండా నాలుగు కాయ లనటం పరిపాటి ఈ కరువుకాలంలో ఇప్పటి సామాజిక రాజకీయార్థిక పరిస్థితుల్లో ఇది శాపం – చీముపట్టినవాళ్లకు తప్ప కుటుంబ నియంత్రణను పాటించదలచిన పెద్దలయితే ఇంకా "అష్టపుత్ర బహుధనావాప్తి" (ఎనిమిది మంది పిల్లలూ, బోలెడు డబ్బూ) కావాలని ఆశీర్వదిస్తూనే ఉన్నారనుకోండి వాళ్ల నాపలేం

**నిక్షేపరాయుడు:** నిక్షేపమంటే దాచిపెట్టిన సొమ్ము ఏ పూర్వులో ఏ చెట్టుపాదిలోనో, ఏ మట్టిగోడ మధ్యనో, ఏ పునాదిలోనో పూడ్చిపెట్టిన సొమ్ము నిక్షేపం దానికి అధిపతి యజమాని నిక్షేపరాయుడు ఈవ్యుత్పత్తిని నమ్మి ఎవరు మరొకర్ని నిక్షేపరాయుడని వ్యవహరిస్తే బహుధనవంతు డనుకోకండి నిష్టదరిద్రుడనే నమ్మండి అతడి దగ్గర బూడిదగూడా ఉండకపోవచ్చు నిక్షేపరాయుడనేమాట దాని వ్యుత్పత్తికి కేవలం విరుద్ధమైన, వ్యతిరేకమైన అర్థంలో వాడుకలో నిలిచింది "ఆహా! ఏం మనిషండి! నిక్షేపరాయుడు!" అంటే గర్భదరిద్రుడు, వాజమ్మ, అశక్తుడు, అర్భకుడు, అసమర్థుడు వగైరా అర్థాలే స్ఫురిస్తాయి అంతేగాని అతడి కొంపలో నిక్షేపా లున్నాయనిగాని, లంకెబిందె లున్నాయనిగాని నమ్మగూడదు ఏమీ లేనివాడని, చేతగానివాడని నమ్మాలి తలకిందులుగా విపరీతార్థమిచ్చే మాటల్లో ఇదొకటి

**నిప్పులాంటి మనిషి:** నిప్పు దేన్నయినా తగలబెట్టుంది చివరికి నీళ్ళను కూడా మరగపెడ్తుంది తాకితే కాలుతుంది పైపెచ్చు మత సిద్ధాంతాలు కారణంగా అత్యంత పవిత్రమయింది ఒక మనిషిని నిప్పుతో పోల్చామంటే ఆ వ్యక్తి దగ్గరకు పోవటమే ప్రమాదకరమనే భావముం దన్నమాట కాలధర్మాన్నిబట్టి లంచాలు పట్టని, అవినీతికి దూరంగా ఉండే, అబద్ధాలు మాట్లాడని ఉత్తమ వ్యక్తిని నిప్పులాంటి మనిషని వ్యవహరిస్తున్నారు ఒక్కోసారి ఎద్దేవగా 'ఆయనాండి? నిప్పులాంటి మనిషండి దేన్నీ చెత్తో తాక' డనటం కద్దు పెద్దమనిషి అనే మాటకు పరమ దుర్మార్గుడనే వ్యతిరేకార్థం కల్పించుకొన్నట్లే నిప్పులాంటి మనిషి అనే జాతీయానిక్కూడా 'గడ్డివామిదగ్గరి కుక్క' అన్నంత నీచార్థం సృష్టించుకొన్నారు వామి దగ్గర కుక్క తాను గడ్డి మేయదు– ఏరో జంతువును మేయనీదు అలాగే తాను తినని, మరొకర్ని తిననీని నీతిపరుణ్ణే నిప్పులాంటి మనిషంటున్నారు ప్రత్యక్షంగా తాను లంచం పట్టక, ఇతరుల ద్వారా ఆ పని చేసి పబ్బం గడుపుకొనే వ్యక్తినీ అదే పేరుతో పిలుస్తున్నారు

నిమ్మకాయ వాటం: ఈ మాటనే ఘనంగా (సంస్కృత పదాల్లో చెప్తే గొప్ప కాబట్టి) చెప్తే "కరతలామలకం/హస్తామలకం" అనవచ్చు మరోకాయ పేరిట. నిమ్మకాయ చేతిలో ఇముడుతుందనీ తక్కినవి ఇమడవనీ భావించనక్కరలేదు. 'సులభసాధ్యం' అనే అర్థంలో ఈ మాటను ఉపయోగించటం పరిపాటి. చేతిలో నిమ్మకాయ వుంటే దాన్ని ఎలాబడ్తే అలా దొర్లించవచ్చనీ, అనుకొన్న పద్ధతిలో కదిలించవచ్చనీ భావించి, 'అయనకేమండీ! ఏ పని మొదలుపెట్టినా నిమ్మకాయ వాటమే'నని అదృష్టవంతులను గురించి ప్రస్తావిస్తారు. అంటే అయన ఏపనినైనా అశ్రమంగా, సులభంగా సాధించగలడని భావం.

నిమ్మకాయ వాటం కొన్ని సందర్భాల్లో ప్రమాదకర మయిందని ఓ కథ చెప్తారు: మహాజ్యోతిషుడయిన వరాహమిహిరుడి తండ్రి కూడా పెద్ద జోస్యుడు. పిల్లవాడు పుట్టే సమయంలో ప్రసూతి గృహంలో ఉన్న మంత్రసానికి అయనోమాట చెప్పాడు. శీర్షోదయంకాగానే గదితూమునుంచి నిమ్మకాయను దొర్లించమని. నిమ్మకాయ కనపడ్డ సమయాన్ని గుణించి, దానిద్వారా జాతకచక్రం తయారుచేస్తే, పుట్టినబిడ్డ తన బిడ్డ కాదని లెక్కలో తేలిందట! అయనకు విరక్తిపుట్టి ఊరువదిలి సన్యాసుల్లో కలిసికూడా పాత అలవాటుపోక ఒక రాజాస్థానంలో జ్యోతిషుడుగా ఉన్నాడు. పిల్లవాడు పెరిగి పెద్దవాడై, తండ్రిని గురించి అడిగి, వెతికి పట్టుకవస్తానని ఇల్లు వదిలిపెట్టి దేశ సంచారం మొదలుపెట్టాడు. నానాదేశాలూ తిరిగి, గ్రీసులో 'హోరాశాస్త్రం' నేర్చుకొని, స్వదేశంలో ఎట్టకేలకు జ్యోతిషంలోనే తండ్రిని జయించిన తరువాత, అయన్ను గుర్తు పట్టాడు. నిమ్మకాయ తూములో బయలుదేరిన సమయం ప్రకారం లెక్కగడితే ఈ అనుమానం కలిగేది కాదని తండ్రికి నమ్మకం కలిగించి, ఇంటికి తెచ్చుకున్నాట్ట! 'నిమ్మకాయ వాటం' అంటే 'గుడ్డిలెక్క' అనే అర్థంకూడా ఈ కథవల్ల పుట్టిందని కొందరు చెప్తారు! కొందరు 'ఉజ్జాయింపు మాట, గురికి బెత్తెడు దూరం' అనే అర్థంలో ఈ మాట వాడుతుంటారు.

నిమ్మగడ్డ భానుమూర్తి: ప్రాంతీయంగా వినిపించే మరోపేరు నిమ్మగడ్డ భానుమూర్తిది. అతగాడు ఓ (సారా) దుకాణంలో గుమాస్తాగా ఉండి, తనను పొగిడినవాళ్ళకు లేదనకుండా మందు వడ్డించేవా డంటారు. సొమ్ము తనదికాదుగాని పేరు మాత్రం సొంతం! ఎవరైనా ఇతరుల సొమ్మును చేతికి ఎముక లేకుండా దానం చేస్తే "నీదేం పోయింది నిమ్మగడ్డ భానుమూర్తీ!" అంటారు. కరెల్ల కామక్క తనకున్నదే దానం చేసింది. నిమ్మగడ్డ భానుమూర్తి ఇతరుల సొమ్ము దానం చేశాడు. అంతే భేదం. సొంతదారుకు ఊరూ పేరూ లేవుగాని ఈ మహాదాతకు ఆ రెండూ దక్కాయి. ఈ రకం మనుషులు మనలో చాలామంది వుంటారు – ముఖ్యంగా రాజకీయాల్లో. ప్రజలకు అది కావాలి, ఇది కావాలి ఇమ్మని గోల పెడ్తారు. తమదేమీ ఇవ్వరుగాని ఇతరుల నిమ్మని ప్రోత్సహిస్తారు, రాపాడ్తారు, బాధిస్తారు; ఇవ్వకపోతే నిందిస్తారు కూడా. వాళ్లందరిలోనూ భానుమూర్తి కనిపిస్తుంటాడు లోకానికి!

నిర్ధూమధామం: ధామం అంటే ఇల్లు. ధూమమంటే పొగ. నిర్ధూమం అంటే పొగచూరనిదని అర్థం. మాటలకున్న అర్థం ప్రకారం పొగచూరని యిల్లని అర్థం. ఇంట్లో కాపురముంటూ ఉంటే, వంటా వార్పూ తప్పవు. నిప్పంటే పొగ ఉండి తీరుతుంది. ఇల్లు పాడుబడ్డా, పాడుపెట్టినా అక్కడ కాపరం లేనట్లే. ఉన్న కాపరం ధ్వంసమయినా ఆ యిల్లు నిర్ధూమధామ మవుతుంది. ఈ జాతీయం రానురాను

'పూర్తిగా' అనే అర్థంలో స్థిరపడింది ఒకప్పుడు 'నిర్ధూమ ధామంగా ధ్వంసం చేశాడు' వగైరా వాక్యాలు మాట్లాడారు ఇప్పుడు 'నిర్ధూమ ధామంగా ఉపన్యసించాడు,' (అంటే ఘనంగా మాట్లాడాడు), 'నిర్ధూమ ధామంగా ఎన్నికల్లో గెలిచాడు' (అంటే చాలా పెద్ద మెజారిటీతో గెలిచాడు) వగైరా ప్రయోగాలు వినిపిస్తున్నాయి ఈ జాతీయాని కిప్పటి అర్థం 'పూర్తిగా, గొప్పగా' వగైరాలు

**నీటిమీది రాత:** అసలు నీళ్ళమీద రాసే వీలే లేదు ఆత్మవంచనకో లోకవంచనకో నీటి ఉపరితలంమీద ప్రయత్న పూర్వకంగా రాసే ప్రయత్నం చేసినా రాస్తున్నప్పుడే అక్షరాలు కలిసిపోతాయి - నీళ్ళ పాలవుతాయి కాగితంమీద, గోడమీద, (రాగి) రేకులమీద, ఆకులమీద రాసిన అక్షరాలు నిలుస్తాయి నీటిమీద నిలువవు నిలిచే అక్షరాలే చెల్లుతాయని, చెల్లవని, కాలదోషం పట్టాయని, తప్పుడు రాతలని, ఫోర్జరీలని రకరకాలుగా వివాదగ్రస్తం కావచ్చు అటువంటప్పుడు నీటిమీది రాతలు నిలుస్తాయని కలలో కూడా నమ్మలేం చెల్లుతాయని చెప్పలేం అంటే - నిలవని, చెల్లని విషయాలన్నీ నీటిమీది రాతల్లాంటివే కొందరు ఉత్తుత్తి వాగ్దానాలు చేస్తారు ఒక్కోసారి లిఖితపూర్వకంగా కూడా మభ్యపెట్టడానికి ఏవో రాసి, రాసిన ప్రకారం చేస్తామంటారు అప్పులవాళ్ళ బాధలు పడలేక ఒకానొక మహాత్ముడు తెలిసిన ఊర్లలో, ఏదో ఊహించిన ఇంటి నెంబర్లతో, వాటికి ఖచ్చితమైన సరిహద్దులతోసహా ఆయా ఇళ్ళలోని వస్తువుల వివరాలు పేర్కొంటూ దస్తావేజు రాసి, చుట్టుపక్కలవాళ్ళకు తాను ఆస్తిపరుణ్ణన్న నమ్మకం పుట్టించాడు ఇంత సొమ్మున్నవాణ్ణి ఈ సమయంలో బాకీ తీర్చమనటం బాగుండదని, పైపెచ్చు వడ్డీ నష్టమని, వచ్చినదారినే అప్పులవాళ్లు తిరిగిపోయిన సందర్భాలు లేకపోలేదు ఆ రాతలు నీటిమీద రాసినవి కాదుగాని అలా రాసిన వాటితో సమానమైనవే చెల్లనివీ, నమ్మరానివీ ఈ నీటిమీది రాతలు

**నీటిమూట:** గాలినయినా మూటగట్టవచ్చునోమోగాని (నీటిబెలూన్లలోలాగా) నీటిని మూటగట్టే మార్గంలేదు ఇప్పటిలా నీరు కారకుండా బంధించగల వస్తువులూ పద్ధతులూ తెలియని కాలంలో ఈ మాట పుట్టింది నీటిని మూటగట్టడానికి శ్రమించినంతసేపు పట్టదు అది కారిపోవడానికి నీళ్ళ మూటలో నిలవవు నిలిపే మార్గం అప్పటికి తెలీదు అందువల్ల చేసిన ప్రయత్నమంతా వృధా ఆ భావంతో నిష్ఫల ప్రయత్నాన్నీ, అసాధ్య కార్యాన్నీ, అమలుగాని వాగ్దానాన్నీ నీటిమూటకిందే లెక్కించేవాళ్లు పూర్వులు ఇప్పుడిది కేవలం పాతకాలపు జాతీయమేగాని పరిపూర్ణార్థవంతమయిన మాట కాదు ఇప్పుడు ద్రవ వాయు పదార్థా లన్నిటినీ మూటగట్టే మార్గాలు, విధానాలు అందుబాటులో ఉన్నాయి

**నీలిబేరం:** రెండో ప్రపంచ యుద్ధం తరవాత జర్మనీ పునర్నిర్మాణ మవుతున్న రోజుల్లో కృత్రిమంగా తయారుచేసిన రంగులు అమ్మకానికి వచ్చాయి అందాకా మన దేశంలో అత్యంత ప్రాచీన కాలంనుంచి భూమిలో ఉండే, నేలపై పండే వస్తువులనుంచే రంగులు తయారయ్యేవి అవే రంగు లద్దటానికి ఉపయోగపడుతుండేవి వాటిలో నీలిమందు ముఖ్యం అది విదేశాలకుక్కూడా ఎగుమతి అయ్యేది అందువల్ల దానికి ఇంగ్లీషులో "ఇండిగో" అనే పేరు వచ్చింది - భారతీయ ద్రవ్యమనే పేరున నీలి ఆకును మెట్టపంటగా, మాగాణీల్లో రెండో పంటగా పండిస్తుండేవాళ్ళు నీలి ఆకు మొలకెత్తిన తరవాత పొలానికి కాపలా అనవసరం పశువులు ఆ మొక్కల జోలికి పోయేవి కావు

పెద్ద పెద్ద తొట్లు కట్టించి దూసిన ఆకును వాటిలో వేసి, పైన బండరాళ్ళను బరువుకు పెట్టేవాళ్ళు తొట్టికింద తూములుండేవి కొద్దిగా నీరు పట్టించిన తరవాత క్రమంగా చిక్కని ద్రవం బయటికి వచ్చేది దాన్ని వండి, ఎండబెట్టి ముద్దలుగా చేసి వర్ణద్రవ్యంగా అమ్మేవాళ్ళు అది బాగా లభించిన సంవత్సరం బంగారు పండినట్లే రైతులకు మంచి ధర పలికేది

చేనేత రంగం మంచి దశలో ఉండగా, అద్దకం పరిశ్రమ వ్యాప్తిలో ఉండగా నీలిబేరం బ్రహ్మాండంగా సాగింది అకాలవృష్టివల్ల కోతకు వచ్చిన ఆకు తడిస్తే పెద్ద నష్టమే వచ్చేది అయితే నీలాకు రసం చేలో ఇంకినంత లెక్క రెండింతల పంట చేతికి వచ్చేది నీలిమొక్కలతో సహా దున్ని పంటవేస్తే అది అద్భుతమైన పచ్చి ఎరువుగా పనికి వచ్చేది నీలిమందు బిళ్ళల తయారీకోసం అలివిమాలిన రాగికాగులు చేల దగ్గర ఉంచేవాళ్ళు అందులో మెత్తపడ్డ ఆకునూ తొట్టి తూము నుంచి వచ్చిన ద్రవాన్నీ ఉడకబెట్టి, చల్లారిన తరవాత ఆరుబయట ఎండబెట్టి అచ్చులు తయారుచేసే వాళ్ళు

కృత్రిమంగా తయారయిన రంగులు చౌకగా లభించటం మొదలైన తరవాత నీలి (మందు) బేరం లాభసాటిగా ఉంటుందో, నష్టదాయక మవుతుందో తేలేదీ కాదు, తెలిసేదీ కాదు విదేశీ వాణిజ్య పరిస్థితుల మీద ఆధారపడి కొంత, చేనేత అద్దకం రంగాల సుస్థితి దుస్థితులమీద ఆధారపడి కొంత, నీలి బేరం అనుకోకుండా మునుగుతుండేది – తేలుతుండేది ఫలితంలో ఏ విధంగా పర్యవసిస్తుందో తెలియని ఏ బేరాన్నీ, ఏ వ్యాపారాన్నయినా సరే – నీలిబేర మనేవాళ్ళు వానమీద ఆధారపడి పంటే చేతికి వస్తుందో రాదో తెలియదు తరవాత జర్మన్ రంగులు దొరకటం దొరక్కపోవటం అనేదాని మీద బేరం తీరు ఆధారపడింది అందువల్ల పరమ దౌర్భాగ్యకరమైన, తాడూ పేడూ లేని, అవ్యవస్థిత వ్యాపారాన్ని నీలిబేర మనటం వాడుకలోకి వచ్చింది

**నూజివీడు జమీందారీ:** కృష్ణా జిల్లాలోని నూజివీడు జమీందారీ చాలా సంపన్నమైన సంస్థానం కొన్ని తరాల కిందట రానురాను సంస్థానాధిపతుల సంసారాలు విస్తరించాయి పంచుకొనే వాళ్ళ సంఖ్య పెరిగింది మంది ఎక్కువయితే మజ్జిగ పలచబడింది ఫలితంలో జమీందారీ కుటుంబమని పేరేగాని ఆదాయం తగ్గింది "మానాటి అగ్రహారము, మీనాటికి కండ్రికాయె మీ పని తీరన్, మానాట మాన్యమాయెను, నానాటికి తీసికట్టు నాగంభట్టూ" అనే చాటు పద్యంలో చెప్పినట్లు ఆస్తులు క్రమంగా హరించినా, ఆదాయం సన్నగిల్లినా వైభవం తగ్గలేదు అందువల్ల బాధలు పెరుగుతుంటాయి ఒకప్పుడు అష్టవిధైశ్వర్యాలతో తులతూగి, కాలధర్మం వల్ల చితికిపోయిన పెద్ద సంసారాల వాళ్ళు "ఏం చెప్పమంటావు నాయనా! నూజివీడు జమీందారీ అయిపోయిం"దని విచారపడటం కద్దు ఇలాంటి పరిస్థితే బ్రిటన్లో కొంతకాలంగా ఉందని చెప్తారు "కేపిటల్ గెయిన్స్" అని ఇప్పుడు మనం వ్యవహరించే విధానం మనకన్నా చాలాకాలం ముందే బ్రిటన్లో తల చూపింది 'లార్డ్స్' కుటుంబాలకు చెందిన ఆస్తులను వారసులు పంచుకొనేముందు ప్రభుత్వానికి వారికి వచ్చిన ఆదాయం దామాషా మీద ఆధారపడి పెద్ద మొత్తాల్లో పన్నులు చెల్లించవలసి వచ్చింది అందువల్ల తరువాతి తరాల వాళ్ళు పన్నులు కారణంగా పేదలైపోయారు చాలామంది సామ్రాజ్యవాద వ్యవస్థతో బాటు పారిశ్రామిక వ్యవస్థ కూడా వేళ్ళు తన్నటం మొదలుపెట్టిన తరువాత 'మృత మూలధనం' (డెడ్ కేపిటల్)గా ఉన్న భూములను పన్నులు రాబట్టి తగ్గించినందువల్ల భూస్వామ్య వ్యవస్థ అక్కడ చాలా

దెబ్బ తిన్నది అదే విధానం వల్ల ఆదాయం క్షీణించినా ఆచారాలూ దర్పాలూ తగ్గనందువల్ల వంశపారంపర్యంగా సంక్రమించిన ఆస్తులు క్షీణించి, ఒకనాటి 'లార్డ్స్' (ప్రభువులు) తరువాతి కాలంలో 'కామనర్స్' (సాధారణ పౌరులు)గా పరిణమించటం పరిపాటయింది చితికిన సంసారం, పోయిన ఆస్తులు అనే వాటికి నిదర్శనగా నూజివీడు జమీందారీ అనే పేరు మాత్రం నిలిచింది తెలుగువారి వాడుకలో

**నూటికి సర్దారు:** ఈ మాట బహుశా కాకతీయ సామ్రాజ్యం పతనమైన తరవాత పుట్టింది సర్దార్ అనేది ఉర్దూపదం నాయకుడు, వీరుడు అనే అర్థాల్లో తెలుగువాడుక ఒకానొక కట్టుకథ ప్రకారం ఒక సామాన్యుడు ఒక కత్తిని సంపాదించాడు ఈగలు ముసురుతుంటే కత్తి విసిరాడు ఏడు ఈగలు చచ్చాయి గొప్పవీరు ణ్ణనుకొని మరి నాలుగుసార్లు తిప్పి చచ్చినవాటిని లెక్కిస్తే నూరయినాయి వెంటనే కత్తిమీద నూటికి సర్దారని చెక్కించి ఉద్యోగాన్వేషణకు బయలుదేరాడు తెలియనివాళ్ళు నూరు గ్రామాలకు అధికారి అనుకొని సమస్త మర్యాదలూ చేసేవాళ్ళు దారిపొడుగునా అద్దెగుడ్డల్తో, 'దెబ్బకు ఏడు' అనే బడాయి మాటతో చివరికాతడు ఒక రాజ్యానికి సేనాపతియై చేసిన సాహసకార్యా లనేకం 'నూటికి' అనేమాట సందిగ్ధంగా ఉందికాబట్టి ఏ నూరో తెలియక జనం తికమకపడ్డారు చేసిందేమీ లేకపోయినా చెప్పే బడాయి మాటలతో లోకం మోసపోయింది కాళ్ళు గడప దాటకపోయినా మాటలు కోటలు దాటేట్లు వ్యవహరించేవాళ్ళను వెక్కిరింతగా ఈ మాటతో ప్రస్తావిస్తారు

**నూతిలోపడ్డ గొర్రె:** అసలు గొర్రె కంఠస్వరమే కఠోరం దానికి తోడు అది నూతిలో పడి బాధపడుతున్నది కాబట్టి మరింత కఠోరంగా అరుస్తుంది చూడక నూతిలో పడ్డా బయటకు వచ్చేమార్గంలేక, ఉన్నా బయటపడలేని గొర్రె అరుస్తూనే ఉంటుంది సాయ మందేదాకా ఆకంఠ మాధుర్యాన్ని భరించటం కష్టం వినేవాడి బాధ గొర్రెబాధలాంటిదే దాన్ని బయటికి తీసేదాకా ఆ బాధ భరించక తప్పదు గొంతు బాగా లేని మనిషి బిగ్గరగా మాట్లాడుతున్నా 'ఎందుకలా అరుస్తావ్, నూతిలోబడ్డ గొర్రెలాగా?' అని మందలించటం పరిపాటి

**నెల్లూరి నెరజాణ:** జాణ/శాణా అనే మాటకు నేర్పరి అని అర్థం ఈ మాట జ్ఞానశబ్ద భవం కావచ్చు నెల్లూరి మూలపేటలోని మూలస్థానేశ్వరాలయం దగ్గర 'వేమాల నుయ్యి' అనే బావి వుండేది దాని నీళ్ళు వంటబడితే ఎక్కడలేని మాట నేర్పు, తెలివి తేటలూ పుడ్తాయని నమ్మకం 'నెర' అనే విశేషణానికి పూర్తి/నిండు అనే అర్థం నెరజాణ లంటే మంచి నేర్పరులు, చమత్కారులు చాలా వరకు శృంగార ప్రశ్నలుగా ఉండే ప్రసంగాలూ వాటికి సమాధానాలు నెల్లూరి నెరజాణల పేరిట వాడుకలో ఉన్నాయి జాణ అనే మాటను సాధారణంగా స్త్రీపరంగానే వాడ్తారు మొగవాళ్లను 'శాణామంతు' లంటారు నెల్లూరి నెరజాణ అయితే తిరుగులేనిదనే భావంతో లోకంలో చాల కథలు వినిపిస్తాయి

**నేతి బీరకాయ:** బీరజాతికి చెందిన కాయ ఇది వైద్యంలో దీనికి వాడుక పేరులోనయితే నెయి ఉందిగాని కాయలో లేదు కానీ 'నేతి' అనే విశేషణాన్ని ఎందుకు చేర్చారో చెప్పలేం 'ఏమీ లేనిది, హుళక్కి' అనే అర్థంలో ఈ మాట వాడ్తారు "ఆయన వాగ్దానాలన్నీ నేతి బీరకాయలే"నంటే – "అన్నీ అబద్ధాలే, ఉత్తుత్తి మాటలే, శుష్కవాగ్దానాలే"నని అర్థం

పంచాగ్ని మధ్యం: అయిదురకాల నిప్పుల మధ్య అని ఈ మాట కర్థం అగ్నిపంచకమని కూడా అంటారు ఆత్మలో జ్ఞానాగ్ని, పాదాల్లో కాలాగ్ని, బొడ్డుదగ్గర క్షుధాగ్ని, గుండెలో శీతాగ్ని, కళ్ళలో కోపాగ్ని ఉంటాయంటారు యజ్ఞయాగాదుల్లో మరి అయిదురకాల అగ్నులను పేర్కొంటారు కడుపులో ఉండే జఠరాగ్ని, అడవుల్లో ఉండే దావాగ్ని, సముద్రంలో ఉండే బడబాగ్ని, వంటచేసుకునే గృహాగ్ని, పూజకువాడే వైదికాగ్ని అనేవి పంచాగ్నులంటారు కొందరు నాలుగు దిక్కుల పేరిటా నాలుగగ్నులున్నాయనీ నెత్తిమీద సూర్యుడనే అగ్నిఉందనీ మరికొందరు చెప్తారు ఇన్ని రకాల అగ్నుల్లో ఏ అయిదింటిని ఎన్నుకొని ఈమాట పుట్టించారో నిరూపించే నిదర్శనలు లేవు కానీ రకరకాల బాధల్లో ఉన్నాననడానికి 'పంచాగ్నిమధ్యంలో ఉన్నా'ననటం పరిపాటి ఒక్కో సందర్భంలో కుటుంబంలోని వాళ్లు బాధిస్తుంటే పంచాగ్ని మధ్యంలో బతుకుతున్నా నంటారు లేదా ఇరుగు పొరుగులతో సత్సంబంధాలు లేనప్పుడు, ఒంటరిగా ఉన్న గృహస్థులు కూడా ఇదేమాటను తమ బాధలు సూచిస్తూ ప్రయోగిస్తుంటారు

పయోముఖ విషకుంభం: విషం నింపిన కుండ (కుంభం) విషకుంభం దాని ముఖంలో (పై భాగాన) పయస్సు (పాలు) పోసి ఉంచితే అది పయోముఖ మవుతుంది మనసులో విషం పెట్టుకొని పైకి తియ్యని మాటలు మాట్లాడేవాళ్ళను పయోముఖ విషకుంభ మంటారు విషంమీద పాలుపోస్తే అవి ఎందుకు విరిగిపోవో తెలీదు పాలల్లో విషం కలిపినా పాలు విరిగిపోవాలి కానీ అలాంటి మార్పులేనట్లు, ఇవి పాలేనన్న భ్రమ గలిగించగలిగి విషం తాగించగల నేర్పరిని మాత్రమే ఈ మాటతో వర్ణించవచ్చు అతగాడు మేనమామ పోలికగల మనిషి, నరరూప రాక్షసుడు (మనిషిలా కనిపించే రాక్షసుడు)

పరంధామయ్య: తెలుగు సాహిత్యంలో ఇటీవల వెలసిన మూసకట్టు పాత్రల్లో పరంధామయ్య మరొకడు సుబ్బారావు పాత్రలాగానే ఇది కూడా మెత్తనివాడైన ఒక గుమస్తా పాత్ర భేదం లేకపోలేదు సుబ్బారావు యువకుడు పరంధామయ్య నడివయసు దాటి, నేడో రేపో పదవీ విరమణ చేయబోతున్నవాడు సుబ్బారావుది కొత్త సంసారం పిల్లాపీచూ ఏర్పడిందని చెప్పలేం పరంధామయ్యకు ఆడసం తెక్కువ అందులోనూ పెళ్ళీడు పిల్లలు గుండెమీద కుంపటిలా వేధిస్తుంటారు మూడు దశాబ్దాలు ఉద్యోగం వెలగబెట్టినా వెనుకేసుకున్నది అతడికేమీ ఉండదు అప్పుల బాధ తక్కువగాని ఖర్చు లెక్కువ కట్నాల తాకిడికీ అల్లుళ్ల ధాటికీ అతలాకుతలమై పోతుంటాడు

వ్యక్తిగా పరంధామయ్య సజ్జనుడు కుట్రలూ కూహకాలూ తెలియనివాడు ఏ ఎండ కాగొడుగు పట్టగలవాడూ కాదు ఉన్నంతలో గంభీరంగా బండి నడుపుతూనే ఉంటాడుగాని వివాహ సమస్య వచ్చినప్పుడు అప్పుడప్పుడు పెడమొహం పెట్టి చీదేస్తుంటాడు ఆయన వేషం మూసకట్టుదే పంచె కడ్తాడు పైచొక్కా చిల్లులు కనబడకుండా తాతలనాటి కోటు తగిలించుకుంటాడు కళ్లజోడూ అంతకన్నా ముఖ్యం పాతగొడుగూ తప్పవు అకుచెప్పులు సరేసరి దీనస్థితిలోని చిరుద్యోగిని పరంధామయ్య అంటారు

పరమానందయ్య శిష్యులు: ఘనకార్యాలు చేసినవాళ్లకే పేరు వస్తుందని చెప్పలేం ఒక్కోసారి ఏ పాపమూ ఎరుగని, ఏ పనీ సరిగ్గా చేయలేని వాళ్లక్కూడా ప్రఖ్యాతి వస్తుంది ఎంత చదివినా ఇంగితజ్ఞానం సంపాదించక తెలివితక్కువ పనులు చేసి

పేరుమోసినవాళ్ళు- అందులోనూ తెలుగువాళ్ళు - పరమానందయ్య శిష్యులు ఇటీవలి కాలంలో దూరదర్శన్‌లో పాత కథలకు మార్పులూ చేర్పులూ చేసి వీరిని గురించి మన కళ్లు తెరిపించారు పరమానందయ్య శిష్యుల పేర్లు పూర్వం ఎవరికీ తెలీదు వాళ్లను అగ్రస్త్య(భ్రాతలుగానే భావించారు ఇప్పుడు వాళ్ళకి నక్షత్రనామాలు కల్పించారు భవిష్యత్తులో కథ మరెన్ని విధాలుగా మారుతుందో చెప్పలేం

**పరశురామక్షేత్రం:** పరశురాముడు రాజవంశాలను ధ్వంసంచేసి వారి రక్తంతో కురుక్షేత్రంలో తవ్వించిన అయిదు చెరువులనూ నింపాడట వాటిని 'శ్యమంత పంచకం' అంటారు కోపంతో ఇంత పాపం చేసినందుకు పశ్చాత్తాపపడి మహేంద్రగిరిమీద తపస్సు మొదలెట్టాడు మునులు కొంద రప్పుడు అశ్వమేధయాగం చేయమన్నారు అది మొదలవుతుండగానే గోకర్ణక్షేత్రం సముద్రంలో మునిగిపోయిందని, దాన్ని పైకి తీయమనీ వాళ్లు కోరుకుంటారు వెంటనే పరశురాముడు సముద్రతీరానికి పోయి వరుణున్ని వెనక్కు పొమ్మన్నాడు! అతడు పోలేదు అతడి మీద ఆగ్నేయాస్త్రం వేశాడు అప్పుడు గజగజలాడుతూ వచ్చిన వరుణుడు ఎంత దూరం వెనక్కు వెళ్లమంటే అంత దూరం పోతాననీ కాపాడమనీ కోరాడు చేతిలో ఉన్న స్రువాన్ని శక్తికొద్దీ విసరివేస్తే అదిపడ్డ చోటుదాకా సముద్రం తొలగిపోయిందని బ్రహ్మాండపురాణ కథనం అలా కలసివచ్చిన భూమిని పరశురామక్షేత్ర మన్నారు పడమట కొండలకూ సముద్రానికీ మధ్యనున్న భూమిని - ఇప్పటి కేరళ, గోవా, మహారాష్ట్ర ప్రాంతాలను - పరశురామక్షేత్రమని వ్యవహరిస్తారు

భారతం మరో కారణం కూడా చెప్తుంది ఇరవయ్యొక్కసారులు రాజులను చంపి తాను జయించిన భూమినంతా కశ్యప మహర్షికి దాన మిచ్చాడట పరశురాముడు ఎప్పటికయినా ఇతడితో పేచీరావచ్చుగనుక తనకు దానమిచ్చిన దేశం వదిలి దక్షిణ సముద్రందాటి పొమ్మన్నాడట కశ్యపుడు మొత్తం భూమి కశ్యపుడిదయిందికాబట్టి భూమికి 'కాశ్యపి' అనే పేరు వచ్చిందనీ, పరశురాముడికి జడిసి సముద్రం పారిపోయిన చోటు పరశురామక్షేత్ర మయిందనీ భారతం చెప్తుంది ఏమయితేనేం కోపదారి కచ్చమనిషిని పరశురాము డనటం పరిపాటి అయింది దక్షిణ భారతదేశంలో జ్ఞానపీఠ విజేత శివరామ కారంత్ అనే కన్నడ రచయితకు అయన కోపదారితనాన్ని పురస్కరించుకొని 'ఠీర పరశురామ' అనే బిరుదిచ్చారు ప్రజలు! పరశురామక్షేత్రంలో పంటలు పండవుగాని ప్రజలకు కోపతాపా లెక్కువ అనే అక్షేపముంది విధ్వంసాని కాయన చిహ్నం

**పరశురామప్రీతి:** విష్ణుమూర్తి దశావతారాల్లో పరశురాముడిది ఆరో అవతారం "రామో రామశ్చ రామశ్చ" అనే ఖండంలోని మొదటి రాముడు పరశురాముడు, రెండో రాముడు ప్రస్తుతం పరోక్షంగా ఎన్నికల్లో నిల్చిన శ్రీరాముడు, మూడో రాముడు కృష్ణుడి అన్న అయిన బలరాముడు (కృష్ణుడు అవతార పురుషుడు కాదని ఈ శ్లోకపాదం సూచిస్తుంది!) రేణుకా జమదగ్నుల కుమారుడైన పరశురాముడు తండ్రి మాటకు తలఒగ్గి కన్నతల్లినే చంపాడు మళ్లీ తండ్రిని ఒప్పించి తల్లిని బతికించుకున్నాడు రేణుకమ్మను మధ్యయుగాలనుంచీ తెలుగువాళ్లు దేవతగా పూజిస్తున్నారు ఆ విషయం వినుకొండ వల్లభరాయుడి క్రీడాభిరామం నిరూపిస్తుంది శివుని మెప్పించి పరశువును (గండ్రగొడ్డలిని) అయుధంగా సంపాదించాడు కర్ణ భీష్ములకు విద్యాగురువైనాడు

శ్రీరాముడితోనే తలపడి సరిపెట్టుకున్నాడు వినాయకుడ దంతం ఊడగొట్టాడు

హైహయవంశానికి చెందిన కార్తవీర్యార్జునుడు జమదగ్ని దగ్గర ఆతిథ్యం పొందికూడా అతణ్ణి చంపాడు అడవికి వెళ్ళిన పరశురాముడు, ఇరవై ఒక్కసార్లు గుండెబాదుకుంటూ తన తల్లి ఏడ్చింది కాబట్టి, అన్నిసార్లు క్షత్రియులందర్నీ చంపుతానని ప్రతిజ్ఞ చేశాడు భృగుమహర్షి బతికించిన జమదగ్ని బతిమలాడినా వినకుండా శివుడి దగ్గరకు పోయి, రౌద్రాస్త్రంవంటి ఆయుధాలు సంపాదించాడు అగస్త్యాశ్రమానికిపోయి కృష్ణామృతస్తోత్రం విని, శక్తిమంతుడై కార్తవీర్యుణ్ణి చంపి, తపస్సు చేసుకోవడానికి వెళ్ళాడు కొంత కాలం తరువాత ఆరాజు కొడుకు తన తండ్రిని చంపాడని విని దొరికిన రాజులందరినీ చంపి, కార్తవీర్యుడి రాజధానీ నగరాన్ని ఆగ్నేయాస్త్రంతో భస్మం చేశాడు ఊరంతా తగలబెట్టాడు కాబట్టి, అప్పటికిగాని అతడి కోపం శాంతించలేదు కాబట్టి, తగలబెట్టడాన్ని 'పరశురామప్రీతి' అన్నారు ప్రీతి అంటే ఇష్టం కొంపలు ముట్టించడం ఆయనకు ఇష్టమని జన మనుకున్నారు అందువల్ల కాల్చడానికి ఆ పేరు పెట్టారు కక్షతో కొంపలు ముట్టించడాన్ని పరశురామప్రీతి అని చెప్పటం అలవాటయింది

**పాకాల దున్న:** ఇది తెలంగాణా దున్న దీనికి అన్నదమ్ముల్లాంటివి కోస్తాలోని 'కారంచేడు దున్న', కళింగ ప్రాంతంలోని 'బొబ్బిలిదున్న' బలిష్ఠంగా, మూర్ఖంగా, నిర్లక్ష్యంగా ఉండటం వీటి ప్రత్యేకత అసలు 'దున్న (పోతు)' అనే మాటే మూర్ఖత్వానికీ అజ్ఞానానికీ లక్షణంగా వాడేది ఆ జాతిలో ఒడ్డూ పొడుగూ, ఆకారపుష్టి మొదలయిన వాటివల్ల ఈ దున్నలు విశిష్టమైనవి వీటిని మానవజాతిపరంగా వాడినప్పుడు తమ వాచకా లవుతాయి, పరమ మూర్ఖుడు అన్నట్లు జంతువులుగా ఇవి ప్రశస్తాలేగాని మానవులకు వీటి లక్షణాలను ఆపాదించినప్పుడు పెద్ద తిట్లుగా పరిణమిస్తాయి ప్రధానంగా మూర్ఖత్వానికే ఇవి ప్రతీకలు ఎంత వేటగాడయినా అడవిదున్నలంటే భయపడతాడు అవి మందలుగట్టి తిరుగుతాయి ఏ తుపాకీ దెబ్బో వాటిలో దేనికి తగిలినా అవి సూటిగా – గుండు వచ్చిన దిశకే తండాలుతండాలుగా కొమ్ములువంచి ముందుకు నడుస్తాయిగాని పారిపోవు తమ చావు తాము గుర్తించకపోవటమే వాటి మూర్ఖతకు పరమ నిదర్శనం

**పాదూరి సంత:** పాదూ రనేది ఊరి పేరు అక్కడి సంతలో వెంటపడి వేధించే వేశ్య లుంటారనే అపప్రథ పుట్టింది 'పరమ నిర్భాగ్యురాలు, వాడ వదిన' మొదలైన అర్థాల్లో విసుగుతో, అసహ్యంతో, ఈసడింపుతో వాడే మాట ఇది దీన్ని సమూహవాచిగా వాడుతుంటారు ఏనాటి మాటో చెప్పలేంగాని ఈనాటికీ వ్యవహారంలో నిలిచిన జాతీయ మిది 'రోత మనిషి, అసభ్యవ్యక్తి' అనే అర్థంలో కూడా ఈ మాటకు వాడుకపుట్టింది ఏ వ్యక్తినోగాక మొత్తం గుంపును తిట్టడానికి ఈ ప్రయోగం చేస్తుంటారు

**పాండవబీడు:** పాండవులు కౌరవ సామ్రాజ్యంతో బాటు అన్నదమ్ములకు తద్దినాలు పెట్టడం కూడా మహా భారత యుద్ధ ఫలితంగా సంపాదించారు శక్తిమంతులై ఆయుధం పట్టగలిగినవాళ్ళు అంతరించారు 'ధర్మరాజుల వారి సంపాదన కౌరవుల శ్రాద్ధాలకు సరిపోయిం'దనే మాట పుట్టింది రాజ్యం చేస్తున్నాడు కాబట్టే పన్నులూ ఎన్నులూ ఎంతో కొంత ధన ధాన్యాలు తెచ్చి పోస్తున్నా విధవాజన పోషణకు, బాల వృద్ధుల సంరక్షణకూ బోలెడు కర్చవుతుండేది రాబడికన్నా కర్చులు పెరిగాయన్న

నమ్మకం లోకానికి కలిగింది. పాత జమీందారులూ, పూర్వపు రాజవంశాలవాళ్ళూ పాతదర్పాలు మరిచిపోలేదు. లోకం ఏమనుకుంటుందోనన్న భయంతో ఆదాయం తగ్గినా హంగామా తగ్గించుకోలేదు. మింగ మెతుకు లేకపోయినా మీసాలకు సంపెంగ నూనె రాసుకొంటారు. అటువంటివారి పరిస్థితిని పాండవుల సంపాదనతో పోలుస్తారు. తాత ముత్తాతలు ధన ధాన్య సమృద్ధితో విర్రవీగిన రోజుల్లో దాన ధర్మాలకూ వార్షికాలకూ వాగ్దానాలు చేసివుంటే వాటిని ఆపాటి శక్తిలేకపోయినా పాటించటం కుటుంబ గౌరవ నిమిత్తం తప్పదనుకొనేవాళ్ళను గురించి చెప్పేటప్పుడు "అబ్బో, వాళ్ళ పోకడ చాలా పెద్దదిలెండి! పాండవుల సంపాదన వంటి"దని ఆక్షేపిస్తుంటారు. ఏమీ మిగలలేదనీ, రాబడికన్నా పోబడి ఎక్కువనీ చెప్పదలచినప్పుడు ఈ మాటను వాడుతుంటారు.

**పాతాళప్రశ్న:** మన పూర్వుల లెక్కప్రకారం భూమి పైన ఏడు ఊర్ధ్వలోకాలూ కింద మరో ఏడు అధోలోకాలూ ఉన్నాయి. వెరశి ఇవన్నీ చతుర్దశ భువనాలు (అంటే పధ్నాలుగు లోకాలు). వీటిలో అట్టడుగున ఉన్నది పాతాళలోకం. వామనావతారంలో విష్ణుమూర్తి బలి చక్రవర్తిని పాతాళానికి పంపి, ఆ లోకానికి చక్రవర్తిని చేశాడు. అంతకు ముందు వాసుకి వంటి పాముల రాజులు దాన్ని పాలించేవాళ్ళు. వేసిన ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే పాతాళమంత లోతుగా ఆలోచించవలసి వస్తే – ఎంతో దీర్ఘంగా గంభీరంగా ఆలోచించి చెప్పవలసివస్తే–సదరుప్రశ్నను పాతాళ ప్రశ్న అంటారు. చాలా గట్టి ప్రశ్న అని తాత్పర్యం. అలాగే కడుపులోని రహస్యం బయటకు లాగటానికి ఒక పట్టాన లొంగని వ్యక్తిని 'పాతాళభేది' అంటారు. అంటే చాలా గొప్ప దాపరికం గల వ్యక్తి అని అర్థం.

**పానకాలరాయుడు:** గుంటూరు జిల్లా మంగళగిరిలో కొండమీద లక్ష్మీనృసింహస్వామి దేవాలయముంది. ఆయనకు పానకమంటే చాలా ఇష్టమనే విశ్వాసంతో భక్తులు బిందెలకొద్దీ పానకం పోస్తారు. కానీ ఎక్కడా చీమ అన్నది కూడా కనిపించదు. ఎంత పానకం పోసినా స్వామివారి కడుపు నిండదు. అదే స్వామి మహత్తని భక్తు లంటారు. ఆ కొండ కడుపులో గంధకముందని, అదే పానకాన్ని హరిస్తుంటుందనీ అవిశ్వాసు లంటారు. కారణం సంగతి అటుంచండి. ఎంత పానకం పోసినా జీర్ణించుకోవటమన్నది వాస్తవం, ప్రత్యక్ష సత్యం. ఈ లక్షణానికి అతి వ్యాప్తి కలిగించి లంచగొండి మనిషిని పానకాలరాయు డనటం చిత్రం!

"ఆయన మహానుభావుడు, పానకాలరాయుడంటే నమ్మండి!" అని లంచాలు తినే దుర్మార్గుడికి దైవాంశను ఆరోపించి చెప్పటం పరిపాటి. తెగతినేవాణ్ణి వృకోదరుడంటారు – భీముడి పేరది. లేదా అతడి బిరు దనవచ్చు. తెగతాగేవాణ్ణి కూడా పానకాల రాయుడని వర్ణిస్తారు. నృసింహస్వామి అనే పేరు పోయి నిత్య వ్యవహారంలో పానకాల రాయుడనే బిరుదు నిలిచింది! అది కాస్తా తాగుబోతులకూ లంచగొండులకూ అన్వయించటం మొదలయింది. మరీ నమ్మకం కలిగించడానికి మంగళగిరి పానకాల రాయుడని పూర్తి వివరాలతో పిలిస్తేగాని తృప్తిపడనివాళ్ళున్నారు.

**పాముకాళ్ళు:** పాముకు కాళ్ళు లేవు. ఉన్నట్లు కనిపించవు. పొలుసుల మీద పాకుతుందేగాని కాళ్ళతో నడవదు. అయినా పాముకాళ్ళనేమాట వాడుకలో ఉంది – కనిపించని వస్తువనే భావంతో. ఉన్నా లేనట్లు, లేకపోయినా ఉన్నట్లు భాసించే ఏ విషయాన్నయినా పాముకాళ్ళని వ్యవహరిస్తుంటారు. "ఆయనదంతా ఉన్న దరిద్రంలేండి.

నటిస్తా డలాగ. అంతా పాముకాళ్ళ వ్యవహారం"లాంటి వాక్యాలు వినిపిస్తుంటాయి ఈ మాట విన్నప్పుడు పాల్కుర్కి సోమనాథుడి ప్రయోగం గుర్తుకువస్తుంది "వడిబారు సెలయేటి కొడలెల్ల కాళ్ళు" అన్నా డాయన. గబగబా ప్రవహించే కొండవాగుకు ఒంటినిండా కాళ్ళేనంటాడా కవి! అలాగే చరచరా పాకే పాముక్కూడా శరీరమంతా కాళ్ళున్నాయని సామాన్యజన మనుకున్నా రన్నమాట, కాళ్ళు లేనిదే అంతత్వరగా పాకలేదనే నమ్మకంతో అయితే, ఆ కాళ్ళు కనిపించవు కాబట్టి ఉండికూడా లేనట్లు ప్రవర్తించే వ్యక్తులకు పాముకాళ్ళున్నట్లు భావిస్తున్నారని చెప్పాలి

**పాము పొట్ట:** కొందరు సన్నగా బక్కపలచగా ఎండుకపోయి ఉంటారు కానీ తిండి దగ్గరకు వచ్చేసరికి వారి భోజన పరాక్రమం ముందు భీమ బకాసురులు బలాదూ రనిపిస్తారు కొందరు అతికాయులుగా ఉంటారు కానీ తినలేరు తిన్నా తినకపోయినా శరీరతత్వం ప్రకారం శరీరం కాస్తయినా తగ్గదు పాములు గాలి తింటాయని మన కవులు వర్ణిస్తారు కప్పల్నీ ఎలకల్నీ తింటాయని వారికి తెలీదో, భయంవల్ల పాముల దగ్గరికి పోనందువల్ల వాటి ఆహారపు టలవాట్లు తెలియకే రాస్తారో చెప్పలేం కొండచిలువవంటి చాలా పెద్ద పాములయితే దూడలను, మేకలను, చివరికి కోతులనుకూడా పట్టి తింటాయి అదిన్నీ కొరికీ, నమిలీ కాదు ఒక్క ముద్దగా మింగి మాత్రమే గొంతు దగ్గర నుంచి తోకదాకా మింగిన జంతువు శరీర ప్రమాణాన్నిబట్టి కొంతసేపు ఉబ్బు కనిపించినా తరవాత ఉన్నది ఉన్నట్లే మత్తుగా పడివుంటుందిగాని బలిసినట్లయినా కనిపించదు అదేవిధంగా కొందరు దుర్బలంగా కనిపించినా పిచ్చితిండి తినగలరు తిన్నది ఒంటబట్టనందువల్ల తిననప్పు డున్నట్లే కనిపిస్తారు వారిది పాము పొట్ట అంటారు ఈ స్వభావాన్ని పురస్కరించుకొని పైకి మామూలు వ్యక్తులుగా చిల్లర పనులు చేసుకుంటూ బతుకు భారంగా ఈడుస్తున్నట్లు కనిపిస్తూ - వాస్తవంలో మూటలు దాచుకొన్నవారిని గురించి ప్రస్తావించేటప్పుడు వారిది పాముపొట్ట అంటారు అంటే దరిద్రం నటిస్తున్నాడేగాని నిజానికి ఉన్నవాడేనని చెప్పటానికి 'ఆయన అంతేనండి కావిగుడ్డలు కట్టుకొని పేదరుపులు అరుస్తుంటారు పాముపొట్ట నమ్మకండి' అని హెచ్చరిస్తారు

**పాలి భారతం - ఆలి రామాయణం:** భారతంలో అన్నదమ్ములు రాజ్యంలో 'పాలు' (భాగం)కానాలనే విషయం మీద పోరాడుకున్నారు. రామాయణంలో శ్రీరాముడి 'ఆలి'ని (భార్యను) రావణుడు అపహరించినందువల్ల యుద్ధం జరిగింది ఈ రెండు మహా పురాణాల కథలకూ తెలుగువాళ్ళు సూక్ష్మంలో మోక్షంగా ఇంత క్లుప్తమయిన సారాంశం చెప్పకొన్నారు ఆస్తికోసం కొట్లాడుకోవటం పాలి భారతం; స్త్రీలకోసం దెబ్బలాడటం ఆలి రామాయణం ఎవరయినా ఇలా పేచీలు పడుతుంటే, ఆ తగాదా ఏమని మరెవరైనా ప్రశ్నిస్తే "ఆఁ - ఏముంది? పాలి భారతం - ఆలి రామాయణం తప్ప!" అని చప్పరించటం అలవాటయింది

**పాలెపు వెంకన్న పెంపకం:** ఇంటిపేరూ సొంతపేరూ ఉన్న ఈ వెంకన్న అభాగ్యుల్లో అభాగ్యుడు పాపం, ఆయనకు పిల్లల్లేరు పిల్లల్ని కనాలనీ పెంచాలనీ తెగ వ్యసనపడిపోతుండేవాడు తనకు సంతానయోగం లేదని తెలిసిన తరవాత దత్తు చేసుకొని ఒక పిల్లవాణ్ణి పెంచాడు కానీ దురదృష్టవశాత్తూ ఆ పిల్లవాడు దక్కలేదు మరో పసివాణ్ణి పెంచాడు ఫలితం అదే అలా ఎందరిని చేరదీసి పెంచినా ఏ ఒక్కరూ దక్కలేదట అందువల్ల దక్కని సంతానాన్ని పాలెపు వెంకన్న

పెంపక మనటం పరిపాటయిందని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు 'కథలు-గాథలూ' అనే పుస్తకంలో రాశారు ఎంత శ్రమపడ్డా ఫలితం దక్కని దురదృష్టవంతుడనే భావంతో ఆయన పేరు నిలిచిపోయింది చేసిన శ్రమ నిష్ఫలమైనప్పుడు 'ఏం చేస్తామండి! అంతా పాలెపు వెంకన్న పెంపక మయిపోయిం'దని నిట్టూర్చటం అలవాటయింది

**పింగళాజపం:** బహుశా మానవ జాతిలో వివాహ వ్యవస్థ ఏర్పడ్డప్పుడే వ్యభిచారం కూడా మొదలయివుంటుంది అందుకే కొందరు దాన్ని అనాది వృత్తి అని కూడా పిలుస్తారు వేల సంవత్సరాల చరిత్రవున్న సంస్కృత సాహిత్యంలో వేశ్యలు నాయికలుగా ఉన్న చారుదత్తం, మృచ్ఛకటికవంటి మహానాటకాలు కూడా వచ్చాయి సందర్భం వచ్చినప్పుడల్లా వేశ్యాదూషణ చేయని కవి లేదు తెలుగులో కన్యాశుల్కం, విప్రనారాయణ చరిత్రవంటి అనేక గ్రంథాల్లో వేశ్యల గురించి చదివాం పోతన రాసిన భోగినీ దండకంలో కూడా వేశ్యామాతను తిట్టిన ఘట్టాలున్నాయి ఇంత సాహిత్యం లోని 'పింగళ' అనే ఏకైక వేశ్య పేరిట పింగళాజపమనే మాట పుట్టడం విచిత్రమే మరి మాచల్దేవివంటి వాళ్ళు కూడా కాలగర్భంలో కలిసిపోయినా ఇలాంటి పేరు సంపాదించలేదు

పింగళ ఒక వేశ్య వృత్తి ధర్మంగా ఆమె విటుల కోసం వాకిలిదగ్గర కాపలా కాస్తుండేది కొంగ చేపలకోసం జపం చేసినట్లు ఆమె విటులకోసం తపస్సు చేసేదట ఆ ఒక్క విషయాన్నిబట్టే ఆమె ఆకర్షణశక్తి తక్కువ అని తేలిపోతున్నదిగదా! కంట్లో వత్తులు పెట్టుకొని సదా విటులనే స్మరిస్తూ ఉండే ఆమె పేరిట పింగళా జపమనే మాట పుట్టింది ఎవరయినా ఎవరికోసమయినా పడిగాపులు గాస్తూ నిట్టూరుస్తూ ఉంటే - ముఖ్యంగా ప్రియులకోసం ఎదురు తెన్నులు చూస్తుంటే - పింగళాజపం చేస్తున్నారంటారు ఈ జపం కాలనేమి జపంలా నిష్ఫలమయిందో, ఆషాఢభూతి ప్రయత్నంలా ఫలవంతమయిందో చెప్పలేం తెలీదు

**పిడిగంట (భీమ) లింగయ్య:** ఈయనో జంగందేవర ఏ భీమేశ్వర భక్తుడో తన పుత్రుడి కీపేరు పెట్టుకొన్నాడు చేతిలో గంట ఉండక తప్పదు దాని పిడిని గట్టిగా పట్టుకొన్నట్లే అనుకొన్న పని సాధించటానికి అంత పట్టూ పట్టేవా డంటారు పట్టి ఏం సాధించాడో ఎవరూ చెప్పటంలేదుగాని గట్టి పట్టే పట్టేవా డంటారు బహుశా ఆ గంట ఎక్కడన్నా జారిపడితే తన రాకను ప్రకటించే మరో సాధనం లేదు కాబట్టి గట్టిగా పట్టుకొని ఉంటాడు కొందరాయన్ను భీమ లింగయ్య అంటే మరికొందరు రామ లింగయ్య అన్నారు ఆ పేరిట పట్టుదల గల వ్యక్తిని సూచించటం అలవాటయింది 'పట్టు వదలని విక్రమార్కుడి' లాంటి వాడన్నమాట నిజంగా ఆ వ్యక్తి ఉండేవాడో లేనే లేడోగాని, ఈ పేరు పట్టుదలకు చిహ్నంగా నిలిచిపోయింది భాషలో

**పిపీలికామార్గం:** పిపీలిక అనే మాట పెద్దదేగాని అర్థం చిన్నది చీమను సంస్కృతంలో ఈ పేరుతో పిలుస్తారు అదిపోయేదారి పిపీలికా మార్గం చీమ తిన్నగా పోదు పోతూ వంకరటింకరలు తిరుగుతుంది దారిలో తటస్థపడ్డ మరో చీమతో మూతి ఆనించి ముచ్చట్లో పడుతుంది ఆ తరువాతనైనా ఒకేదారిన పోతుందని చెప్పలేం ఎందుకు దారి మారుస్తుందో, ఎందుకు వెనక్కు తిరిగి పోతుందో కాశీమజిలీల్లోని పాత్రలకులాగా చీమభాష తెలిస్తేగానీ చెప్పలేం కారణమేదైనా చీమలదారి స్థిరంగా ఉండదు క్షణంలో

మారుతుంది అలా అడుగడుగునా బుద్ధిమార్చుకునే పద్ధతిని పిపీలికామార్గ మంటారు బుద్ధిస్థిమితం లేని వ్యక్తిని, నిష్కారణంగా మరోదారిపట్టే మనిషిని పిపీలికా మార్గంలో పోతున్నాడంటారు లక్ష్యశుద్ధి లేని ప్రవర్తన పిపీలికా మార్గం

*పిల్లినడక:* పిల్లి చప్పుడు చేయకుండా నడవగలదు పొంచి ఉండి ఉండి ఒక్కసారి పరుగులు తీసినా అది పరిగెత్తిన ధ్వని వినిపించదు పరుగులు తీసేప్పుడే వినిపించని అడుగుల సవ్వడి నడిచేప్పు డసలే వినిపించదు పొంచి గుట్టుచప్పుడు కాకుండా నడిచే నడకను పిల్లి నడక అన్నారు ఈ లక్షణాన్ని మానవ జాతికి అన్వయించి దొంగలా నడిచినా, చాటుమాటుగా నడిచినా ఫలానా వ్యక్తి పిల్లినడకలు నడుస్తున్నా డంటారు నిజానికి నడకకన్నా ఆ వ్యక్తి ప్రవర్తనకే ప్రాధాన్యముంది పిల్లినడక నడిచే వ్యక్తి అంటే తన స్వభావం, కదలికలు ఇతరులకు తెలియకుండా ప్రవర్తించే గుంభన అయిన మనిషి అని భావం దాపరిక మున్నవ్యక్తి అని తాత్పర్యం. ఏదో దూరాలోచనగల మనిషి అని అర్థం పిల్లినడక దొంగనడకవంటిదేగాని వేరుకాదు

*పిల్లిశీలం:* తెనాలి రామకృష్ణుడి పాండురంగ మాహాత్మ్యంలో 'నిగమశర్మ' విషయం ప్రస్తావిస్తూ అతగాడిది పిల్లిశీల మన్నాడు పిల్లులు సంయోగ సమయంలో చేసే ఆర్భాటం ఇంతా అంతా కాదు ఇష్టపడనట్లు హంగామా చేస్తాయేగాని పారిపొయ్యే ప్రయత్నం కూడా చేయవు పైకి అనిష్టత నటిస్తూ – అందులోనూ తీవ్రంగా నిరోధిస్తున్నట్లు అరుస్తూ – సరిపెట్టుకొని సంసారం చేయటాన్ని పిల్లిశీల మంటారు

*పిష్టపేషణం:* పిష్టం అంటే పిండి పేషణం అంటే నూరటం పిష్టపేషణం అంటే పిండిగొట్టడం చెప్పిన మాటనే మళ్ళీ మళ్ళీ చెప్పి విసిగిస్తే పిష్టపేషణం చేస్తున్నా డంటారు మొదట పిష్టంగా పిండిగా మారిన పదార్థాన్ని మళ్ళీ పిండి చేయటం అనవసరం వృథాశ్రమ సాధించేదేమీ లేదు అయినా కొందరు స్వభావరీత్యా చెప్పిన విషయాన్నే తిరగేసి బోర్లేసి మళ్ళీ చెప్తుంటారు. ఈ పనికి పిష్ట పేషణమని మనవాళ్ళు పేరు బెట్టారు ఇది చర్వితచర్వణం లాంటిది అనవసర శ్రమ విసిగించే పని

*పీనుగమీది పీతిరిగద్ద:* పీనుగ మనిషిదే కానక్కరలేదు మృత శరీరం ఏది కనిపించినా దానిమీద గద్ద వాలుతుంది రాబందయితే మరో పక్షిని దగ్గరకు రానీయదు పైగా అవి గుంపులుగా వచ్చి వాలుతాయి అవి చేరినచోటికి నక్కలు, తోడేళ్ళు, దుమ్ములగొండులు కూడా పోవటానికి భయపడతాయి వాటితో పోలిస్తే గద్ద చిన్న పక్షి వాటిలోనూ పీతిరిగద్ద దుర్బలమయింది అది త్వరగా శవ భోజనం చేయలేదు అలాగని వదిలిపోనూ లేదు మోసుకపోనూ లేదు పైన గిరికీలు కొడ్తూ వీలయినప్పుడు కిందికి దిగి నంజినంత నంజి గజిబిజి చేసిపోతుంది మరో పక్షిగాని, జంతువుగాని చుట్టుపక్కలకు వస్తే పొడుస్తుందిగాని తోలిపారవేయలేదు అందువల్ల చూసేవారికి విసుగు శవానికి సంస్కారం సరిగా జరగదు దానికీ తృప్తి లేదు నసపీకుడుగా ఒక వ్యవహారాన్ని ఎటూ తెమల్చక, మరొకరికి అవకాశమివ్వక వేధించేవాళ్ళను పీనుగమీది పీతిగద్దలతో పోలుస్తారు విషయం తెగదు తాను తేల్చడు. కసిరి వెళ్ళగొట్టే మరుక్షణం మళ్ళీ వచ్చి పడతాడు వాదనలో బేరంలో కొత్త లేదు అదే పాత సంగతి అదే నస ఇలా వేధించేవాళ్ళను ఈ పేరుతో పిలుస్తారు– అసహ్యభావంతో

పుక్కిటి పురాణం: ఆలోచించకుండా, నిజానిజాలు తెలుసుకోకుండా, మనస్ఫూర్తిగా కాకుండా, తోచినట్లు మాట్లాడే విషయాన్ని పుక్కిటిపురాణ మంటారు పుక్కిలించి ఉమ్మేసినట్లు పునరాలోచన లేకుండా ఎడాపెడా వడవడా మాట్లాడింది పుక్కిటి పురాణం పురాణం అంటే పూర్వకాలపు విషయం ప్రత్యక్ష నిదర్శనం చూపటానికి అసాధ్యమయిన పాత కథ మాట్లాడే మాటలకు పూర్వాపరాలు లేకుండా ఒప్పచెప్పినట్లు గడగడా మాట్లాడితే దాన్ని పుక్కిటి పురాణ మంటారు

పుంగనూరు సంస్థానం: ఇది నూజివీడు జమీందారీ లాంటి మాట-రాయలసీమ జాతీయం చిత్తూరు జిల్లాలోని పుంగనూరు ఒకప్పుడు పెద్ద జాగీరు అది ఇంచుమించు ఆ జిల్లా మొత్తం విస్తరించి వుండేది ఆర్కాట్ నవాబుల కాలంలో, బ్రిటిష్ రాజ్యాధికారం తొలికాలంలో ఆ సంస్థానం చాలా పేరు మోసిన బలవత్తర ప్రాంతం రాజకీయాధికారంలో వచ్చిన పరివర్తనలవల్ల, సమాజ లక్షణాల్లో వచ్చిన మార్పులవల్ల, ఆ సంస్థాన విస్తృతి క్షీణించింది ఓడలు బండ్లయినాయి కాలప్రభావం వల్ల చితికిపోయిన మహర్దశకు చిహ్నంగా, ప్రతీకగా "అయ్యో, మా సంసారం పుంగనూరు సంస్థానమయి పోయిం"దని బాధపడటం కద్దు సామాజిక వ్యవస్థలో మార్పులు వచ్చినా ఇటువంటి జాతీయాలే పురాతన వైభవాలను గుర్తుకు తెస్తుంటాయి ఒకనాటి దేశచరిత్ర పునర్నిర్మాణానికి ఇలాంటి మాటలే సాయపడతాయి

పుట్టిమునగటం: ఏ వెదురు తడికలతోనో బద్దలతోనో అల్లిన గుండ్రటి దోనె/పడవను పుట్టి అంటారు నీళ్ళు లోపలికి చేరకుండా బయటివైపు తోలు వేసి కుట్టేవాళ్ళు కుట్ల దగ్గరి రంధ్రాల్లోనుంచి నీళ్లు రావటం సహజం. దాని పరిమాణం చిన్నది రూపం గుండ్రంగా సుళ్ళు తిరుగుతుంది తెడ్లు లేవు కాబట్టి చేతులతో నడుపుకోవాలి వేగంగా పారే వాగుల్లో అలాంటి పుట్టిలో ప్రయాణం చేయటం అనుక్షణ ప్రమాదకరం కర్మం చాలక పుట్టి మునిగిందంటే నీళ్ళలో పడ్డ వ్యక్తుల నెత్తిన టోపీలాగా పడి ఊపిరాడనివ్వదు చూపు దెబ్బ తింటుంది కాబట్టి ఈత కూడా కష్టమే ఇన్ని కారణాలవల్ల పుట్టి మునిగితే బయటపడి బట్ట కట్టడం అనుమానమే అందుచేత పుట్టి మునగటం అంటే బతుకుతామన్న ఆశ లేకపోవటం, తిరుగులేని ప్రమాదం అనే అర్థం వాడుకలోకి వచ్చింది పుట్టి మునగటమంటే కొంప మునగటమంత ప్రమాదంలో పడటం

పురాణవైరాగ్యం: అభావ విరక్తేగాక ఇంకా కొన్ని వైరాగ్య భేదా లున్నాయి. అందులో పురాణవైరాగ్య మొకటి ఇది కేవలం తాత్కాలికం పురాణ కాలక్షేపానికి వెళ్ళి ఆ కథల్లో మహారాజులు, రాణులు, మహర్షులు పడ్డ బాధలు విని, కన్నీళ్లు పెట్టుకొని 'ఛీ! పాడు బతుకు! మనకీ నలమహారాజు వైభవమూ వద్దు, అతడికి పట్టిన దుర్గతీ వద్దు' అని అభావ విరక్తిలో పడి, చీదేసినంత త్వరగానూ తన మనోభావాలను మరిచిపోయి యధాప్రకారం సంసార యాత్ర దొర్లించటానికి కారణం పురాణవైరాగ్యమే అంతేగాని 'పురాణ' మంటే 'పాత(కాలం)' అని, గడిచిన కాలంలో తాను పొందిన బాధల వల్ల జీవితం మీద విరక్తి పుట్టి, ఏ సన్యాసమో పుచ్చుకోవటం పురాణవైరాగ్యం కాదు తన పూర్వజీవితంతోగాని, భావిజీవితంతోగాని సంబంధంలేని తాత్కాలిక, వర్తమానకాలిక విరక్తిని మాత్రమే పురాణవైరాగ్యం అంటారు అదికూడా శ్రీరామాది పురాణ పురుషుల దుఃఖగాధలు విని పురాణ శ్రవణ కాలంలో పొందిన విరక్తి మాత్రమే

**పులికాపు:** పుల్లని వస్తువుతో పరిశుద్ధం చేయటం పులికాపు వైష్ణవ పరిభాషలో తమిళభాషలో 'పులిక్కాపు' దేవతా విగ్రహాలను అప్పుడప్పుడు చింతపండుతో తోమి శుభ్రం చేసి పునరావాహన చేసి ప్రతిష్ఠించి పూజిస్తారు ఈ దేవకార్యానికి కాలక్రమాన 'దేహశుద్ధి' అనే అర్థం వచ్చింది 'ఒళ్ళు కడగటం' అనే అసలర్థమున్న దేహశుద్ధికి లాగానే పులికాపు అనేమాటకు్కూడా తోమటం, కొట్టడం అనే అర్థాలు వాడుకలో నిలిచాయి మంత్రపూతంగా విగ్రహాలను శుద్ధి చేయటమనే శాస్త్రార్థం స్థానంలో చావగొట్టడమనే అర్థం వాడుకలో నిలిచింది పులికాపు పెట్టడం అంటే తన్నటం వైష్ణవ విద్యార్థుల వాడుకలో ఈ అర్థం బలీయం తప్పు చేసినందుకు ఆచారికి వాళ్ళ నాయన పులికాపు పెట్టాడు (తన్నాడు) అనే వాడుక ఉంది

**పులి నాకినవాడు:** పులి చంపకుండా నాకి వదిలివెయ్యటమనేది ఊహకు అందే విషయమేగాని వాస్తవంగా జరిగే పని కాదు నాకటం ప్రేమ చిహ్నం పులివంటి క్రూరమృగం కూడా అనురాగం ప్రదర్శించి వదిలిపెట్టిందంటే అది అసామాన్య విషయం అతగాడి అదృష్టానికి చరమ నిదర్శనం 'అదృష్టవంతుడు, అసాధ్యుడు, గుండెలు తీసినబంటు' అనే అర్థ విశేషాల్లో ఈ జాతీయం వాడుతుంటారు

**పులినోటి కండ:** పరమ క్రూరజంతువైన పులి నోట్లోని మాంసంముక్క అనేది సాధారణార్థం ఎంత సాహసి అయినా దాని జోలికి పోడు – బతకదలిస్తే దాన్ని లాగేసుకోవటం, కాజేయటం సాధ్యం కాదు – ఎక్కడో ఏమహావీరుడికో తప్ప సర్వసాధారణంగా 'అందుబాటులో లేనిది, అసాధ్యమైనది' అనే అర్థాల్లో ఈ మాట వాడుతుంటారు ప్రమాదకరమైనది అనే అర్థంలోకూడా ఈ మాటను ప్రయోగిస్తుంటారు

**పూచిన తంగేడు:** తంగేడు మొక్క విపరీతంగా పూస్తుంది ఆకులు కనిపించనంతగా విరగబడి పూస్తుంది ఒంటినిండా ఏడు వారాల నగలుబెట్టి భోగభాగ్యాలను ప్రదర్శిస్తున్న వ్యక్తిని పూచిన తంగేడుతో పోల్చిచెప్పటం అలవాటయింది దోస తోటా, తామర తంపరా విస్తరణకూ వ్యాప్తికీ చిహ్నాలయితే పూచిన తంగేడు సమృద్ధికి గుర్తు అందువల్ల ధన ధాన్యాదులతో తులతూగుతున్న వ్యక్తిని పూచిన తంగేడుతో పోలుస్తారు మొదటివి వంశాభివృద్ధినీ ఇది ఐశ్వర్యాన్నీ ప్రకటిస్తాయి తంగేటి పూలను జున్నంటారు బాటసారులకూ పరమ దరిద్రులకూ తంగేటి జున్నే కరువుకాలంలో ప్రాణ రక్షకం అందుకే గృహస్థుణ్ణి అలసాని పెద్దన "కెలంకుల నున్న తంగెటి జున్ను యజమాని" అని ప్రాణదాతగా భోజనదాతగా వర్ణించాడు విపరీతంగా అలంకరించుకొనే వ్యక్తులను గూడా పూచిన తంగేడుతో పోల్చిచెప్పటం కద్దు

**పూల రంగడు:** విలాస పురుషుడనే భావంతో ఈ మాటను ప్రయోగిస్తుంటారు రంగడనే మాట రంగనాయక/రంగనాథ నామం గల విష్ణుమూర్తికి ప్రతి కల్పన 'అలంకార ప్రియో విష్ణు రభిషేకప్రియ శ్శివః' అనే మాట ఉంది విష్ణుమూర్తి అలంకార ప్రియుడు కాబట్టి పూలూ మంచిగంధం నగలూ నగ్రా కిరీటం వగైరా భోగ వస్తువులతో నిత్యైశ్వర్యంతో తులతూగుతుంటాడు అలాగని భక్తుల విశ్వాసం ఆయన్ని పూజించే పద్ధతుల్లో కూడా 'సారూప్యం' అనే విధానముంది అంటే విష్ణుమూర్తి ఇలా అలంకరించుకొంటాడని ఊహించి తాను కూడా అలాగే తన్నుతాను

అలంకరించుకోవడం ఒక పద్ధతి అందువల్ల విలాసంగా అలంకరించుకొని తిరిగే వ్యక్తిని పూల రంగడని వ్యవహరించటం మొదలయింది పూర్వం పిలకలో కూడా పూలు ముడిచేవాళ్ళుండేవారు చేతికి పూలదండలు చుట్టుకోవటం, మెడలో దండలు వేసుకోవడం, చెవుల్లో పూవులు గుచ్చుకోవటం బాహిరమైన అలంకార పద్ధతులు మొగవాళ్ళు కూడా కొప్పులు పెట్టి పూలు ముడిచే సంప్రదాయం లేకపోలేదు పుష్టిమార్గానికి చెందిన వైష్ణవ భక్తులు ఉత్తర హిందూస్థానంలో అలంకారంలోనే గాక వస్త్రధారణలోకూడా అచ్చంగా స్త్రీలలా వ్యవహరిస్తారు వారి లెక్కన కృష్ణు డొక్కడే పురుషుడు భక్తులు స్త్రీ మాత్రులు. మొదట మొదట అలంకరణకు మాత్రం పరిమితంగా పుట్టిన ఈ జాతీయం సాలంకారంగా వేశ్యాగృహాలను పావనంచేసే రసిక పురుషులక్కూడా విస్తరించింది కాలక్రమాన. ఫలితంలో శృంగార పురుషులను పూల రంగళ్ళని ప్రస్తావించటం మొదలయింది. ఇప్పటి సమాజంలో పూల రంగడనే మాటకు తిరుగుబోతనే అర్థం స్థిరపడిపోతున్నది

పెట్టుశాస్త్రి, పుట్టుశాస్త్రి: శాస్త్రం చదివిన పండిత వంశంలో పుట్టినవాడు పుట్టుశాస్త్రి అతడు పండిత పుత్రుడయినా కావచ్చు కాకపోనూ వచ్చు శాస్త్రిగారి కుటుంబంలో పుట్టాడు కాబట్టి పుట్టినప్పటి నుంచీ అతగాడికి శాస్త్రి అనే బిరుదు లభిస్తుందన్నమాట శాస్త్రం చదివినవాడు శాస్త్రి. తాను శాస్త్రి వంశంలో పుట్టకపోయినా కష్టపడి శాస్త్రజ్ఞానం సంపాదించి పదిమందిచేతా శాస్త్రిగారూ అనిపించుకొన్న వ్యక్తి 'పెట్టుశాస్త్రి'. అంటే శాస్త్రి అని బిరుదు సంపాదించి తన పేరుచివర పెట్టుకోగలిగిన వ్యక్తి అన్నమాట కొన్ని విశ్వవిద్యాలయాల్లో ఈనాటికీ 'శాస్త్రి' అనే పరీక్ష ఉంది అందులో ఉత్తీర్ణులయినవాళ్ళు తన పేరు చివర దాన్ని తగిలించుకోవచ్చు. ఒకప్పటి భారత ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రి పేరు చివరిమాట అయన ఉత్తీర్ణుడయిన పరీక్ష పేరేగాని కులంపేరు కాదు అయన ఇంటి పేరు వాత్సవ్ అయన కాయస్థుడు ఈ బిరుదమున్న లాల్ బహదూర్ 'పెట్టుశాస్త్రి' అని చెప్పాలి

పెదఅలవలపాటి బేరం: ప్రస్తుతపు ప్రకాశం జిల్లాలో ఉంది ఈ ఊరు దీనికి సమీపంలోనే ఖడ్గ తిక్కన కత్తి గడిగిన చోటుంది వీరగల్లు లున్నాయి సాధారణంగా ఎవరినయినా కూలికి కుదుర్చుకుంటే పని పూర్తయిన తరవాత డబ్బు చెల్లించటం పరిపాటి పనిచేసేవాడు తక్కువ, పని ఇచ్చేవాడు ఎక్కువ అనేది తాత్పర్యం పని తీసుకున్నవాడు చెల్లించగల శక్తి వున్నవాడనేది నమ్మకం అయితే మొత్తం మీద అందరూ ఇంచుమించు ఒకే స్థితిలో ఉంటే దరిద్రంలో ఎక్కువ తక్కువలు అంత ముఖ్యం కాదు బహుశా మనమసిద్ధి, కాటమరాజుల నాటి 'పుల్లరి' తగాదా ఇంకా మనసుల్లో అట్టడుగున దాగి వుందేమో చెప్పలేం గాని, పెద అలవలపాడులో బేరం కుదిరిన తరవాత ముందుగా డబ్బు చెల్లిస్తే తప్ప పనికి దిగరు అందువల్ల పెదఅలవలపాటి బేరమంటే డబ్బిచ్చి పని చేయించుకోవటం, డబ్బిచ్చి వస్తువు కొనటమేగాని పని చేయించుకొనిగాని, వస్తువు కొనిగాని తరవాత సొమ్మిస్తానంటే ఒప్పకపోవట మన్నమాట ఇది సామాన్య దృష్టికి విరుద్ధ మనిపించవచ్చుగాని కార్యాలయాల్లో జరిగే దీపద్ధతిలోనే కదా?

పెదగంగ ఉదకం: గంగలు రెండు రకాలు ఒకటి ఆకాశగంగ, రెండోది భూమిమీద ప్రవహిస్తున్న గంగానది ఆకాశంలో కనిపించే నక్షత్ర సముదాయాలతో కూడిన 'పాలపుంత'ను పెదగంగ, ఆకాశగంగ అంటారు అందులో రాజహంసలు విహరిస్తుంటా

యని, బంగారు తామరపూలు వికసిస్తుంటాయని, కావ్యాల్లో పూర్వకవులు రాస్తుండే వాళ్ళు చచ్చి స్వర్గానికి వెళ్ళినవాళ్లు ఆకాశ గంగానదిలో స్నానం చేస్తుంటా రనేది విశ్వాసం ఈ నమ్మకాన్ని వెక్కిరిస్తూ గురజాడ కన్యాశుల్కంలో గిరీశం ద్వారా ఈ ప్రస్తావన తెస్తాడు. బుచ్చమ్మ మొదటి భర్త ఆకాశగంగానది ఒడ్డున కనిపిస్తా డతనికి ఆమెకోసం బాధపడి, విరహంతో చచ్చి స్వర్గానికి పోయిన గిరీశాన్ని రంభాదులు తాకితే, ఆ మైల పోవడానికి పియర్సు సబ్బును వాడ్తానంటాడు ఈ కథలో ఏమున్నా పెదగంగలో నీళ్ళున్నాయని చెప్పకోవటమేగాని వాటిలో స్నానంచేసినవాళ్ళూ ఆ నీరు తాగినవాళ్ళూ ఎవరూ తిరిగివచ్చి (భూలోకంలో) తమ అనుభవాలను విన్నవించినట్లు లేదు అంటే పెదగంగ ఉదకం (నీళ్లు) ఎవరికీ అందుబాటులోగాని అనుభవంలోగాని ఉన్నవి కాదన్నమాట. అక్కరకు రాని, అనుభవానికి రాని, అలభ్య వస్తువులను పెదగంగ ఉదకమంటారు

ఇదీ ఆకాశ కుసుమంలాంటిదే. దేవతావస్త్రం లాంటిదే కాకపోతే పేరులోమాత్రం మార్పు పైది పెదగంగ. నేలమీద ప్రవహించేది గంగ నేలకిందినుంచి మనం తోడి తెచ్చుకోవలసింది 'పాతాళగంగ' అని గంగను (నీటిని) మూడు అంచెల్లో, మూడు దశల్లో మనవా ళ్లూహించి వర్ణించి పేర్లు పెట్టుకున్నారు

పెదబావగారి లెక్క: ఆడపిల్ల లెక్కువమంది ఉన్న సంసారాల్లో, పిల్లల మధ్య ఎడం ఎక్కువగా ఉన్న పాత రోజుల్లో పెద్దపిల్ల భర్తకు చిన్నపిల్ల తన పిల్లలంత చిన్నదిగా ఉండటం అబ్బురం కాదు అలాగే మగపిల్ల లెక్కువగా ఉన్న ఉమ్మడి కుటుంబాల్లో పెద్దకోడలు మరుదులను తన బిడ్డలతోబాటే సాకి పెంచిన సందర్భా లనేకం చిన్నవాడి భార్య పెద్దవాడి చిన్నకూతురికన్నా చిన్నది కావచ్చు. అటువంటి సందర్భాల్లో ఇంటి చిన్నకోడలి దృష్టిలో పెదబావగారు తన తండ్రి అంత పెద్దవాడు చిన్న మరదలికి పెదబావగారు పెత్తండ్రి వయసులో కనిపించవచ్చు. అందువల్ల పెదబావగారు వయసులో, వ్యవహారజ్ఞానంలో పెద్దవాడయి ఉండటంలో ఆశ్చర్యం లేదు వయసు కారణంగా ఆయన ఇంట్లో అత్త మినహా తక్కిన ఆడవాళ్ళందరికీ పెద్ద దిక్కుగా ఉండి వాళ్ళతో కలిసిపోయి వ్యవహరించవచ్చు. వంట యింట్లో పెత్తనం కూడా చెలాయిస్తూ ఉండవచ్చు

ఆడ పిల్లల మంచి చెడ్డలు, పెళ్ళి వ్యవహారాలూ ఆయన పెత్తనంలో నిర్వాకం కావచ్చు ఎన్నో పెళ్ళిళ్ళు చేసినవాడూ చేయించినవాడూ కాబట్టి ఆడవాళ్ళ కష్టసుఖాలూ ఆచార వ్యవహారాలూ మర్యాదలూ మన్ననలూ తనకు తెలిసి అమలు జరుపుతుండవచ్చు. బయటి వ్యవహారాల్లో ఎంతగా తల దూరుస్తాడో అంత సులభంగానూ ఆడవాళ్ళ మధ్య తిరుగుతూ వంటింటి సంగతులు కూడా పట్టించుకోవచ్చు ఈ కారణాల వల్ల అతగాడి లోకజ్ఞాన వ్యవహారజ్ఞానాల సంగతి ఎలా ఉన్నా వంటింటి పరిజ్ఞానం, ఆడంగులతో చేసే ముచ్చట్లు, ఆడే పరాచికాలూ, ఇంట్లోని ఆడపిల్లలకు నదురూ బెదురూ లేకుండా చెప్పకోగల సామంతమిచ్చిన అప్యాయతా వగైరా లన్నిటినీ కుప్పబోసి పెదబావగారిని తమలో కలుపుకొంటారట అందువల్ల పెదబావగారి లెక్కన అంటే ఆడంగిరేకులాగా అనే అర్థం వ్యాపించి వ్యవహారంలో నిలిచింది ఆడవాళ్ల వ్యవహారాలు పట్టించుకొనే పెదబావగారు వాళ్లతో సమానమని భావించి ఈ మాటను వాడుకలో నిలిపారు. ఈ ప్రయోగం గోదావరి జిల్లాల్లో ఎక్కువ వ్యాప్తిలో ఉందంటారు.

పెదరావుగారు ఖాతా: ఖాతా అన్న ఉర్దూ పదంవల్ల ఈ మాట ముస్లిం రాజ్యం వచ్చిన దరిమిలా పుట్టిందని చెప్పవచ్చు. కొందరు ఆ మాటకు బదులు "పద్దు" అనే పదము నుపయోగిస్తారు. అప్పిస్తే తిరిగి రానప్పుడు ఇచ్చిన సొమ్ము పెదరావుగారు ఖాతాలో జమ అయిందని అంటారు. ఆ వూరి జమాకర్చుల్లో చిట్టా అవర్జాల్లో తీసుకోవటమేగాని తిరిగి యివ్వటమనే మాట లేదట. ఇప్పటి ప్రకాశం జిల్లాలోని ఈ వూరి పేరిట ఈ జాతీయం వెలిసింది. తిరిగి యివ్వని వాళ్లకి అప్పులిచ్చే అజ్ఞాను లుంటారేమో తెలీదుగాని, మొత్తం ఊరంతటికీ ఈ పేరు వచ్చిందంటే ఎప్పుడో ఏదో పెద్ద తకరారు వచ్చిందనుకోవాలి. ఈ జాతీయాని కర్థం 'తీరని అప్పు, తీర్చని అప్పు' అని మిగిలింది.

పెద్దపులి చూపు: పెద్దపులి చాలా దూరం చీకటిలో కూడా చూడగలదు. పిల్లిజాతి జంతువులన్నిటికీ ఈ శక్తి ఉంది. అయితే పెద్దపులి చూపులో మరో ప్రత్యేకత ఉందిట. అది మనవైపు చూస్తున్నప్పుడు దాన్ని చూడటం కష్టం. బోనులో ఉన్న పులి కంట్లో కళ్ళు పెట్టి చూడటం కూడా దుర్భరమైన విషయం. చూపుల్లో తీవ్రతేగాక అందులో ఏదో వశీకరణశక్తి ఉందని జిమ్ కార్బెట్, ధనగోపాల్ ముఖర్జీ వంటి గొప్ప వేటగాళ్ళు వర్ణించారు. పులి కంట్లోకి చూడగానే చూపు మళ్ళించుకోవటం చాలా కష్టమవుతుందని వాళ్ళంటారు. అది ఆకర్షణ వల్లనే గాదు. ఆ చూపును ఏ మాత్రం వీక్షణకాలమయినా మార్చుకోబోయామో ఆ స్వల్ప వ్యవధిలోనే అది కదలి మీదపడుతుంది. ఏపాటి ఏమరుపాటయినా దానికి చాలు. అందువల్ల పులి వేటకు పోయేవాళ్ళు దానికి ఎదురు నిలిచి చంపాలని ప్రయత్నం చేసేకన్నా దానిమీద పక్కదెబ్బ తీయటమే క్షేమకరమని అనుభవజ్ఞులు చెప్తారు.

కొందరి చూపుల్లో పులిచూపులోని తీవ్రత, జాగరూకత కనిపిస్తాయి. ఎదటి వ్యక్తిని అంచనా వేయటంలో వాళ్ళ చూపు నిశ్చలంగా ఉంటుంది. ఎదుటి వ్యక్తి చూపు మరలిస్తే అతడి లోపాలోపాలను బలహీనతలను గమనించగలుగుతారు. తప్పుచేసిన వ్యక్తిగాని, తప్పుకపోదలచిన మనిషికాని ఎదుటివాడి ముఖంలోకి చూడలేడు. చూస్తూ అబద్ధం చెప్పలేడు. అందుచేతనే అవతలి మనిషి అబద్ధమాడుతున్నా డనుకొన్నప్పుడు, మోసగిస్తున్నా డనిపించినప్పుడు "ఏదీ, నా కళ్ళలోకి చూస్తూ మాట్లాడు/చెప్పు" అని హెచ్చరించటం పరిపాటి. మామూలు మనిషి కళ్ళలోకే చూడలేనివాడు పెద్దపులి కళ్ళలోకి చూడగల ధైర్యం ప్రదర్శించలేడు. అందుకే పెద్దపులి చూపు భయంకరం. ఆ చూపున్నవాడు మహా ధైర్యవంతుడు. ఆలోచనాపరుడు. పరిశోధకుడు. జాగ్రత్త కలవాడు. క్షణంలో దెబ్బతీయగల సమర్థుడు. పెద్దపులి లక్షణాలన్నిటినీ వ్యక్తికి ఆపాదించి, అతడి చూపు పెద్దపులి చూపంటే – ఆ వ్యక్తి భయంకరుడు, ప్రమాదకరుడూ అని అర్థం చెప్తారు.

పెద్దపులి పాలు: పాలిచ్చే పెద్దపులి ఆడది– బాలింతరాలు. ఈనిన కుక్క, పిల్లి, పందివంటి సామాన్య జంతువులే ఆ సమయంలో ప్రచండ పరాక్రమం చూపుతాయి. పెద్దపులి సంగతి చెప్పనక్కరలేదు. పిల్లలున్న ఆడపులి మగపులిని కూడా దగ్గరికి రానీదు. ప్రాణం తీస్తుంది. పాతకాలపు కథల్లో రాజులు పెద్దపులి పాలు వైద్యానికి అవసరమని అది తెచ్చినవాడికి అర్ధరాజ్యమో రాజకుమారినో కట్టపెడతామని ప్రకటించినట్లు, లేదా సవతితల్లి రాజుకుమారుణ్ణి పెద్దపులి పాలు తెమ్మని

నిర్బంధించినట్లు కనిపిస్తాయి. పెద్ద పులిని ఎదుర్కొని చంపగలవా ళ్ళుండవచ్చుగాని, దాని పాలు తీరిగ్గా పితికి తేగలవా ళ్ళుండరు అందుచేత అసాధ్యమయిన పని చేయటాన్ని పెద్దపులి పాలు తేవటంతో పోలుస్తారు అది కుందేటి కొమ్ములా లేని వస్తువు కాదు. ఉన్నదేగాని బలపరాక్రమాలవల్లగాని, ఉపాయంద్వారాగాని సాధించగలది మాత్రం కాదు పెద్దపులులను పెంచుకోగలిగిన వాళ్ళు, వాటిని జంతు ప్రదర్శనశాలల్లో ఉంచి పోషిస్తున్నవాళ్ళు గూడా ఈ భయంకర సాహసం చేసిన దాఖలాలు లేవు అది నిజంగా ఉన్నదేగాని అలభ్యం, అప్రాప్యం

పెన్నేరు గడ్డ: పెన్నేరుకు పెన్నెరు అనే రూపాంతరముంది దీన్ని సంస్కృతంలో అశ్వగంధం, వారాహావల్లి మొదలైన పేర్లతో పిలుస్తారు. ఆయుర్వేదంలో శక్తినిచ్చే మందుల్లో అశ్వగంధ చూర్ణం, అరిష్ట, ఘృతం మొదలైన వున్నాయి అది తిరుగులేని మందనే విశ్వాసముంది అపస్మారం వంటి రోగాల్లో కూడా దీన్ని వాడుతారు అలాగే వీర్యశక్తిని పెంచే వాజీకరణంలోనూ వాడుతారు అందువల్ల దీనికి సర్వరోగనివారిణి అనే ప్రఖ్యాతి వచ్చింది. 'ఇది దివ్యౌషధం' అని చెప్పటానికి పెన్నేరుగడ్డ అని వ్యవహరిస్తుంటారు రానురాను మందుల విషయంలోనే గాక ఇతర వస్తువుల విషయంలో గూడా ఈ మాటకు వాడుక పెరిగింది 'ఈ పొలంలో బంగారు పండుతుంది' అనే అతిశయోక్తికి బదులుగా 'ఇది పెన్నేరు గడ్డండీ!' అని చెప్పటం అలవాటయింది అస లర్థంలో గడ్డ శబ్దానికి దుంప అని అర్థం గడ్డను భూమికి, నేలకు పర్యాయంగా వ్యవహరిస్తుంటాం కళింగప్రాంతంలో గడ్డ అంటే వాగు అని అర్థం ఆ అర్థంతో ఆ మాట సవరభాషనుంచి తెలుగులోకి ఎరువుగా వచ్చింది ఈ అరకు (ద్రావకం) మందు బ్రహ్మాండంగా పనిచేస్తుందనటానికి 'అనుమానం వద్దండి ఇది పెన్నేరు గడ్డ' అనే వాడుక కూడా వచ్చింది ఇలా శబ్దసాదృశ్యంవల్ల, అర్థవిస్తృతివల్ల ఈ మాటకు మంచి వ్యాప్తి వచ్చింది

పెళ్లి నడకలు: అడుగులో అడుగువేస్తూ తాపీగా నడిచే నడకలు పెళ్ళి నడకలు సాధారణంగా ఇవి పురుషులకు అన్వయించవు – ఎంత మెల్లగా నడిచినాసరే వివాహ సమయంలో వరపూజకు వెళ్ళేటప్పుడు, మగపెళ్ళివారు వివాహవేదిక దగ్గరకు వచ్చేటప్పుడు, ఆడపెళ్లివాళ్ళు ఎదురునడకలు నడిచేటప్పుడు ఆర్భాటం, హంగామా, సరదాలూ అన్నీ స్త్రీలవే కబుర్లు చెప్పుకుంటూ, సరసాలాడుకుంటూ సవిలాసంగా ఒయ్యారంగా మెల్లగా నడిచే నడకలు పెళ్ళి నడకలు ఎవరెన్ని విధాల తొందర పెడుతున్నాసరే ఈ మందగమనంలో తొందర కనిపించదు ఇవి శుభస్కరమైనవి ప్రమాద సమయంలోనూ, అత్యవసరంగా పరుగులు తీయవలసిన సమయంలోనూ కొందరు తాబేలులాగా, నత్తలాగా మెల్లగా నడుస్తారు. అది స్వభావం, అలవాటు అలాంటి సందర్భాల్లో 'ఏమిటా పెళ్ళి నడకలు?' అని పెద్దవాళ్లు గదమాయిస్తుంటారు అవసరం గమనించలేని మందకొడి మనుషుల నడకను పెళ్ళి నడకలని ఎద్దేవా చేయటం కద్దు

పేగుమెలిక: ఇది ఇటీవలి కాలంలో వాడుకలోకి వచ్చిన జాతీయం పేగు శరీరావయవాల్లో ఒకటి అయినా ఏనాటినుంచో పేగు అనే మాటకు సంతతి, బిడ్డ, సంతానం అనే భావార్థాలు వాడుకలోకి వచ్చాయి కడుపు చెరువయింది, దుఃఖం కలిగింది అనే అర్థాల్లో పేగు కదిలిందనే వ్యవహారముంది తమ పిల్లల మీది వాత్సల్యాన్ని

ప్రస్తావించేటప్పుడు "పేగమ్మా పేగు- బాధపడక తప్పుతుందా?" అనే ప్రసంగం వినిపిస్తుంది కుటుంబ నియంత్రణకు ప్రాచీనకాలంనుంచీ అనేకోపాయాలు తెలుసు మందులూ మాకులూ జాగ్రత్తలూ ఎన్ని ఉన్నా శస్త్రచికిత్స – ముఖ్యంగా పురుషులకు చేసే వేసెక్టమీ- అమల్లోకి వచ్చినప్పుడు ఈ మాట పుట్టింది 'ఆయన పేగు మెలిక వేయించుకున్నాట్ట' అంటే వేసక్టమీ చేయించుకున్నాడని అర్థం 'మెలిక' అనే మాటనే వాడటానికి కారణం లేకపోలేదు ఈ శస్త్రచికిత్స అమల్లోకి వచ్చిన తొలిదశలో వీర్య వాహికలను ఇప్పటిలాగా ఖండించేవాళ్ళు కాదు- లాగి గట్టిగా ముడివేసేవారు అందువల్ల కొందరికి ముడి ఊడిపోయి సంతానప్రాప్తి కలిగి, అనుమానాలకు దారితీసి, సంసారాలు నరకప్రాయా లయినాయి. తరవాతి దశలో ఖండన అమలుకు వచ్చింది- ఈ ప్రమాద నివారణకు చిన్న చిన్న తెలుగు మాటల్లో, సామాన్య వ్యక్తులు శస్త్ర విషయాలను కూడా ఎంత సులభంగా స్పష్టంగా తెలియబరచగలుగుతారో ఈ మాట నిరూపిస్తుంది

**పేదరాశి పెద్దమ్మ:** జానపద కథలు చదివిన, విన్న వాళ్లకు ఆమె రూపురేఖలు ఇంచుమించు కళ్లకుకట్టిన ట్లుంటాయి రూపాయి బిళ్లంత బొట్టు, మాసిన తల, అంతకన్నా మాసిన పాత చీరె ఉన్న ఉత్తమాయిల్లా లామె ఆమె భర్త ఎవరో ఏం చేసేవాడో విన్న గుర్తయినా లేదు ప్రతి ఊళ్లో, అడవి మధ్యలో కూడా ఆమె ఉంటుంది ఏం తిని బతికేదో చెప్పలేంగాని ఆమె బాటసారుల పాలిటి పెన్నిధి ఎక్కడ తెచ్చేదో ఎలా తెచ్చేదోగాని ఎవరు వచ్చినా ఇంత ఉడకేసి పెట్టేది దొంగల నుంచి రాజకుమారులదాకా ఆమె ఇంట్లో మకాం పెట్టేవాళ్లు ఇబ్బందుల్లో ఉన్నవాళ్లకు ఆమె మాటసాయం చేసేది రాజకుమారీమణులను సాధించే ఉపాయాలు చెప్పేది, ముఖ్యంగా బ్రహ్మచారి రాజకుమారులకు దొంగసొమ్మును కూడా ఆమె దాచి ఉంచేది ఒకవిధంగా ఆమె ఇల్లు ఇప్పటి గ్రామీణ బ్యాంకులాగా, పూటకూళ్లిల్లు (అంటే హోటలు) లాగా, స్త్రీపురుషులకు సంధాన స్థలం, కాకపోతే సంకేత స్థలంగా ఉండేది

పేదరాశి పెద్దమ్మ పేరులోనే దరిద్ర దేవతా తాండవం వినిపిస్తుంది కానీ ఆమె దరిద్రం అనుభవించినట్లు దాఖాలాలు చూపటం కష్టం ఆమెకు అంతఃపురాల్లో పనిచేసే వాళ్లతో లావాదేవీ లుండేవి ప్రేమికుల మధ్య రాయబారాలు నిర్వహించే దాసీజనమిత్రు లుండేవారు ఎవరికెన్ని సేవలూ సహాయాలూ చేసినా ఆమె భోగభాగ్యా లనుభవించినట్లు నిదర్శనం చూపలేం మంచి మనస్సు మంచి మనిషే పేదరాలు పెద్ద వయసామె తక్కిన లక్షణాలన్నీగాని కొన్నిగాని ఉన్నా లేకపోయినా లోకోపకారం చేసే నిస్స్వార్థపరురాలయిన పెద్దవయసు పేదరాలిని పేదరాశి పెద్దమ్మ అంటారు ఆమె యువతీ యువకులకు సంధానకర్త్రిగా పనిచేసిందా లేదా అన్న ప్రశ్నతో నిమిత్తం లేకుండా 'జాలిగుండెగల పేదరాలు' అనే అర్థంలో పేదరాశి పెద్దమ్మ పేరు నిలదొక్కుకుంది మంచి మనుషులకు మాత్రమే ఈ పేరు వాడటం ఆచారం ఎవర్నయినా పెద్దామెను పేదరాశి పెద్దమ్మగా రంటే ఉత్తమురాలని మెచ్చుకున్నట్లే లెక్క

**పేరిగాడిరాజ్యం:** బాదరాయణ సంబంధం పెట్టుకొనేవాడు ఎంత తెలివిగలవాడో అలాంటి సుదూర లక్షణంవల్ల మహారాజైన తెలివితక్కువవాడు పేరిగాడు వేదంవేంకటరాయ శాస్త్రిగారు ఈ శతాబ్దారంభంలో 'ప్రతాపరుద్రీయ నాటకం' లో సృష్టించిన పాత్ర

ఇతడు వృత్తిరీత్యా ఇతడు చాకలి. ఓరుగల్లులో ఉంటూ రాజుగారి ఇంటిచాకలిగా ఉన్నవాడు ఇతడికీ అప్పటి కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుడికీ రూపంలో చాలా దగ్గరి పోలిక లున్నాయి అది గ్రహించిన మంత్రి యుగంధరుడు, చక్రవర్తిని ఢిల్లీనవాబు సేనలు పట్టుకుపోతే, వాళ్లు బంధించి తీసుకుపోయింది ఇంటిచాకలినేగాని అసలురాజును కాదని దబాయించి, ఈ పేరిగాడికి రాజవేషం వేసి, అసలురాజును తెచ్చేదాకా గద్దెమీదనిలిపి లోకాన్నీ ఢిల్లీనవాబునూ మోసగించగలిగా డనేది కథ ఇది చరిత్ర కానేకాదు

పేరిగాడు అజ్ఞాని నానా కష్టాలు పడి అతడికి మంత్రులు సింహాసనం మీద ఎలా కూర్చోవాలో, నిండుసభలో ఎలా హుందాగా వ్యవహరించాలో నేర్పుతారు అసలు రాజున్నట్లే ఇతడిద్వారా రాజకార్యాలు నెరవేరుస్తారు కానీ ఈ కథ సమాప్తమయిన తరువాత వెర్రిబాగులవాడి రాజ్యం అనే అర్థంలో "పేరిగాడి రాజ్యం" అనే మాట పుట్టింది నాటకంలో అప్పటికి అరునూరు సంవత్సరాల తరవాత అలా పనికి మాలినవాళ్ల రాజ్యం వస్తుందనే మాట లనిపించాడు రచయిత! కాకతీయ సామ్రాజ్యం పద్నాలుగో శతాబ్ది మొదటి పాదంలో అంతరించింది ఇరవయ్యో శతాబ్ది తొలి పాదంలో పేరిగాడి రాజ్యం మనకు తప్పదన్నాడు కవి కొంచెమించుమించుగా ఆ కాలానికి మనకు స్వతంత్ర ప్రభుత్వం వచ్చింది – నల్లదొరలది! అది రామరాజ్యమని నాయకులు చెప్తుంటే పేరగాడి రాజ్యమని కవి ఊహించా డన్నమాట! పేరిగాడిపేరిట రాజ్యం నడవలేదు ప్రతాపరుద్రుడికి బదులుగా గద్దె మీద వేషం కట్టి కూర్చున్నాడేగాని – అదీ బలవంతంగా కూర్చోపెట్టే తప్పక కుదబడ్డాడేగాని – పేరిగాడి తప్పేమీలేదు కథలో తెలిసి చేసిందేమీలే దతడు అయినా లోకం 'అవకతవకల పరిపాలన' అనే అర్థంలో పేరగాడి రాజ్యమని వ్యవహరించటం మొదలేసింది!

*పేరిగాడి సంగీతం:* ప్రతాపరుద్రీయ నాటకంలో వీణాదిసంగీతసాధనాలతో ఆస్థాన విద్వాంసులు కచేరీ చేస్తుంటే మధ్య మధ్య మొచ్చుకుంటుండాలని పేరిగాడికి మంత్రులు నూరిపోస్తారు అతడికి మాత్రం అశాస్త్రీయ సంగీతం పరమ దుర్భరంగా ఉంటుంది తాగి తందనాలాడేటప్పటి జానపద వాస్తవ సంగీతమే అతడికి నచ్చింది పేరిగాడికి నచ్చిన లల్లాయిపదాలకు 'పేరిగాడి సంగీత'మనే పేరు వచ్చింది అతడు జన్మాంతం పాడి ఆనందించింది ఆ జానపద గేయాలే పండిత ప్రకాండుడైన వేంకటరాయశాస్త్రికి జానపదజీవనం మీద ఉన్న నిరసనభావం ఇతరుల కక్కరలేదు కానీ తెలుగులో మొదటి గొప్ప నాటకంగా ప్రశస్తి సంపాదించిన ఆ గ్రంథం ప్రభావంవల్ల, దాన్ని ప్రదర్శించిన నటుల శక్తివల్ల జనం పూర్వాపరాలాలోచించకుండా ఆ అశాస్త్రీయ సంగీతాన్ని పేరిగాడి సంగీత మనటం మొదలుపెట్టారు

*పైన పటారం:* పైన పటారం లోన లొటారమనేది ఒక నానుడి పటార శబ్దాన్ని మన నిఘంటువులు వివరించలేదు కానీ లొటారమంటే 'బొక్క, రంధ్రం, నొక్కు, సొట్ట' వగైరా అర్థా లిచ్చాయి పటం అంటే వస్త్రం, గుడ్డ అరం అంటే కప్పి ఉండటం పటారమంటే వేషం పైని వేషం ఎంత డాబుగా, దర్పంగా ఉన్నా లోపలమాత్రం అంతా లోపమే, డొల్లేనే అర్థంలో ఈ మాటలు వాడ్తారు హిందీ/ఉర్దూలో సరిగా ఇలాంటి మాటలే ఉన్నాయి – "ఊపర్ షేర్వాణీ, అందర్ పరేశానీ" అని అంటే, పైకి ఆర్భాటపు వేషం, లోపలంతా అయోమయం, అజ్ఞానం అని అర్థం బయటి డాబేగాని అసల్లో అంతా లోపమే ననటానికి ఈ మాటలు వాడ్తారు

పైలా పచ్చీస్: ఇది ఉర్దూ నుంచి వచ్చి తెలుగులో స్థిరపడ్డ జాతీయం. 'పైలా' అనేది 'పెహ్లా' (మొదటి) అనే మాటనుంచీ, పచ్చీస్ (ఇరవై అయిదు) యథాతథంగానూ తెలుగులో చేరాయి పాతికేళ్ళ నిండు యవ్వనంలో ఉన్నట్లు మంచి హుషారులో ఉన్నా డనడానికి ఈ మాట వాడ్తారు అయితే ఏ వయసులో వారి నయినా ఈ మాటతో వర్ణించటం కద్దు

పొయ్యిలో పిల్లి: పెంపుడు పిల్లి, లేదా ఇంట్లో కాసిని పాలయినా దొరక్కపోవన్న భ్రాంతిలో వచ్చిన పిల్లి ఏమీ దొరక్క శోషవచ్చి కాస్త వెచ్చదనమయినా ఉంటుందని పొయ్యిలో పడుకుంది పొయ్యి తప్ప వంట సామగ్రి లేని ఇంట్లో అది చేయగల పని మరేమీ లేదు ఇల్లంతా కలియదిరిగి కడుపుమాడిన పిల్లి మూడురాళ్ళ పొయ్యిలో కళ్ళు మూసుకు పడుకుంటుంది ఇంటివాళ్ళు వంటపని తలపెడ్తే దానికి లేవక తప్పదు. లేవకపోతే వాళ్ళు తోలకా తప్పదు పిల్లి కదల్లేదంటే వంటా పెట్టా లేని పరమ దరిద్రంలో అ కాపుర ముందని అర్థం గర్భదరిద్రాన్ని సూచింటానికి పొయ్యిలో పిల్లి లేవలేదనటం వాడుకలో నిలిచినమాట

పొరుగూరి సేద్యం: సొంత పొలాలు పొరుగూరి హద్దులో ఉండటంవల్లగాని, పొరుగూర్లో తప్ప కౌలుకు పొలం దొరక్కగాని తానున్న చోటకాక మరో ఊళ్ళో వ్యవసాయం చేయటం పొరుగూరి సేద్యం 'ఏడవగలిగితేనే వ్యవసాయ'మనే సామెతొకటి ఉండగా ఆ పని పొరుగూళ్ళో చేయవలసి రావటంకన్నా బాధాకరం మరొకటి లేదు 'పొరుగూరి సేద్యం తనను తినేదేగాని తాను తినేది కా'దనే సామెత అందువల్లనే పుట్టింది ఎవరయినా రాత్రింబగళ్ళు శ్రమపడుతూ కూడా ఫలితం లేక బాధపడుతుంటే 'పాపం, పొరుగూరి సేద్యం చేస్తున్నా'డని జాలిపడటం అలవాటయింది సేద్యమే చేయకపోయినా, ఉన్నవూరు వదిలి ఎక్కడో పనిచేసి, ఏ రాత్రివేళో కొంపకు చేరే అదృష్టవంతు లందరూ పొరుగూరి సేద్యం చేస్తున్నవాళ్ళకిందే లెక్క

ప్రసూతి వైరాగ్యం: వెనకటి కెవరో ప్రేమ తీవ్రత ప్రసవ సమయంలో తెలుస్తుం దన్నారు అలాగే ప్రసవ బాధ పడలేక "బతికుంటే ఇక నెప్పుడూ సంసారం చేయన"ని ప్రతిజ్ఞ పట్టి, పిల్లో పిల్లాడో పుట్టిన తరవాత అంతకుముం దనుకున్న విషయం మరిచి, ఎప్పటిలాగే సంసార సముద్రంలో మునుగుతూ తేలుతూ ఉండటాన్ని ప్రసూతి వైరాగ్యం అంటారు ఆపద వచ్చినప్పుడు తాత్కాలికంగా విరక్తిమార్గంలో పడ్డా, దరిమిలా తెప్పరిల్లి యథాపూర్వ పద్ధతిలో పడటమే ప్రసూతి వైరాగ్యం ఇది పురుషులకు కలిగే వీలు లేనందువల్ల వాళ్ళకా సమయంలో అభావ విరక్తి కలుగుతుందేమో చెప్పలేం

బకబంధనం: బకం అంటే కొంగ బంధనమంటే కట్టిపడెయ్యటం వెనకటికి ఒక మూర్ఖుడు కొంగను పట్టుకొందా మనుకొన్నాట్ట వల విసిరి పట్టుకోవచ్చు ఏ ఉండేలు దెబ్బతోనో, బాణంతోనో గాయపరచి పట్టుకోవచ్చు కానీ ఇలాంటి పనులు ముక్కుకు సూటిగా చేసేవికాబట్టి అతగాడికి నచ్చలేదు కొంగ జపం చేసేప్పుడయినా కళ్ళు మూసుకొంటుందో లేదో అతడికి తేలలేదు అది గుడ్డి కొంగేమోనన్న అనుమానం కూడా పుట్టలేదు అందుకని ఆ మేధావి పొంచుండి వీలుచూసుకొని కొంగ తలమీద వెన్నముద్ద పెట్టేడట – అదో దండగమారి పనైనాసరే ఎండ వేడికి వెన్న కరిగి కొంగ కళ్ళలో పడినప్పుడు, కొంగ కళ్ళుమూసుకున్నప్పుడు పరుగెత్తుకొని పోయి దాన్ని

పట్టుకున్నాడట! గోటితోపోయేదాన్ని గొడ్డలితో నరికినంతపని చేసి ఘనకార్యం చేసినట్లు సంతోషించాడన్నమాట ఈ కట్టుకథనూ పిట్టకథనూ పురస్కరించుకొని ఈ మాట పుట్టింది సులభసాధ్యమయిన కార్యం నెరవేర్చడానికి అనవసర ప్రయాసపడే వ్యక్తిని, దండగమారి పనులు చేస్తేగాని సంతృప్తిపడని వ్యక్తిని బకబంధనం చేశాడని ఆక్షేపిస్తారు

బంగనపల్లి నవాబు: ఇది రాయలసీమ వ్యవహారంలో నిలిచిన మాట. బ్రిటిష్‌వారి రాజ్యాధిపత్యం దత్త మండలాలక్కూడా విస్తరించిన తరువాత బంగనపల్లి (బనగానపల్లి)లో నవాబు రాజ్యం ఉండేది అవిభక్త మదరాసు రాష్ట్రంలో విజయనగరం, పిఠాపురం, వెంకటగిరి, చల్లపల్లి వంటి సంస్థానాలున్నా రాజులూ నవాబులూ లేరు బిరుదులు పెట్టుకున్నా బ్రిటిషు ప్రభుత్వం వారిని నైజాం, మైసూర్, బరోడా వగైరా సంస్థానాధీశ్వరులతో సమానంగా మహారాజులుగా గుర్తించలేదు అందువల్లనే భారతదేశం స్వతంత్ర రాజ్యమైన తరువాత కొంతకాలానికి సంస్థానాలు రద్దు చేసినప్పుడు ఈ రాజులకూ మహారాజులకూ 'రాజభరణాలు' లభించలేదు గుడ్డిలో మెల్లగా ఆ కారణంచేతనే "రాజభరణాల రద్దు" వల్ల ఈ జమీందారు లెవ్వరూ నష్టపోనూ లేదు వాళ్ళు దెబ్బ తిన్నది 'జమీందారీ ఈనాందారీ రద్దు' శాసనాల వల్ల మాత్రమే మొత్తం ఆంధ్ర ప్రాంతంలో భారత ప్రభుత్వం నుంచి రాజభరణాలు పొంది, అవి రద్దయిన తరవాత ఆ వెసులుబాటు కూడా పోగొట్టుకున్న ఏకైక 'రాజు' బంగనపల్లి నవాబు ఒక్కడే! ఈ జమీందారీలతో పోలిస్తే బంగనపల్లి నవాబు రాజ్యం చిన్నది. ఆదాయం తక్కువ. అయినా హోదా చాలా పెద్దది (రాజకీయ పరిభాషలో). హిమాలయ పర్వతపాదాల్లో ఉన్న కొందరు "సంస్థానాధీశ్వరులకు" పట్టున పాతిక ఎకరాల నేలగాని, సాలుకు పదివేల రూపాయల ఆదాయంగాని లేవు వాళ్ళతో పోలిస్తే మాత్రం బంగనపల్లి నవాబు చాలా పెద్దవాడు ఈ లక్షణాలను పురస్కరించుకొని, ఎవరయినా అతిశయాలకు పోయినా, ఆడంబరంగా ప్రవర్తించినా, పెద్ద పెద్ద వాగ్దానాలు చేసినా, చివరకు లేత సొరకాయలు తెగ్గోసినా, "ఏంటా! బంగనపల్లి నవాబులాగా మాట్లాడుతున్నావే!" అని ఆక్షేపించటం కద్దు ఇది అర్థవంతమయిన ఆక్షేపణ ఒక చారిత్రక సత్యాన్ని చాటిచెప్తున్న జాతీయ మిది "నీవేం జమీందారువా?" అన్నంత తక్కువ మాట కాదు రాజ్యాలు పోయినా లక్షణాలు పోవనటానికి ఈ మాట ఒక ప్రచండ నిదర్శనం సమర్థుడు, శక్తిమంతుడు, మహారాజు అనటానికి ప్రతిగా ఈ జాతీయం వాడుతుంటారు

బంగారక్క: కేతిగాడిని స్మరించి బంగారక్కను తలుచుకోకపోతే లోకం క్షమించదు ఇప్పటి తెలుగు సినిమాల్లో హాస్య పాత్రల జంటలాగా అప్పటి తోలుబొమ్మలాటల్లో బంగారక్క జతలేని కేతిగాడూ రాణించడు- కేతిగాడు లేని బంగారక్కకూ స్థానం లేదు వగలు, నయగారితనం ఈ పాత్ర లక్షణాలు ఈ గుణాలను పురస్కరించుకొని ఏ స్త్రీ అయినా బహిరంగ శృంగార ప్రదర్శనకు దిగినా, హొయలు చూపినా, వగలు కురిపించినా 'బంగారక్క లాగుందే!' అనటం అలవాటయింది గ్రామీణ విలాసినీ లక్షణాలకు బంగారక్క ప్రతీక ఈ ప్రదర్శనలు మూలబడ్డందువల్ల ఈ మాట వాడుక తగ్గిపోతున్నది

బంగారు కాళ్ళయ్య: ఒంటికంటి రామలింగాని కితడు బద్ధశత్రువు. ఆయన కాళ్ళే బంగారపువి అతడి కాలిదుమ్ము సోకినా సరే కలిసివస్తుంది పట్టింది బంగార మవుతుంది గొప్ప అదృష్టవంతుడు అందుకనే రామలింగాని కితడు గర్భశత్రువు చాలా గొప్ప అదృష్టవంతుడనీ ఐశ్వర్యవంతుడనీ చెప్పడానికి బంగారు కాళ్ళయ్య అంటారు.

**బంతిలో వలపక్షం:** బంతి అనేది పంక్తి శబ్దం నుంచి వచ్చిన మాట వరస అ అర్థం కలది వలపక్షం అంటే పక్షపాతం వల(ను) అంటే కుడివైపు వలపల గిల' వలపబెద్దువంటి సమాసాల్లో ఈ 'వల' అనేది 'కుడి' అనే విశేషణార్థంలో వాడుకలో ఉంది దేవాసురులకు అమృతం పంచవలసినప్పుడు పక్షపాత బుద్ధితో కుడి పంక్తి/వరసలో కూర్చున్న దేవతలకే అమృతమిచ్చి, ఎడమ పంక్తిలోని రాక్షసులకు ఉత్త చేతులు చూపి సాక్షాత్తు విష్ణువే జగన్మోహనంగా మోసగించా డనేది పురాణగాథ ఒకవైపు ఉన్నవారి మీద చూపిన న్యాయవిరుద్ధమైన అభిమానాన్ని వలపక్ష మన్నారు. దాపలి(ఎడమ)వైపున ఉన్నవారికి అన్యాయం జరిగిం దన్నమాట. పదిమంది కలిసి భోజనం చేసేటప్పుడు గాని, ఏదో ఒక పని తలపెట్టి కలిసికట్టుగా పనిచేస్తున్నప్పుడుగాని వారిలో కొందరి మీద అభిమానం చూపి తక్కినవారికి అన్యాయం చేయటం పక్షపాతబుద్ధికి నిదర్శన ఆ పద్ధతినే వలపక్ష మంటారు ఎక్కడో దూరాన ఉన్నవారి విషయంలో అన్యాయం జరిగితే ఆ సంగతి బయటపడటానికి సమయం పడుతుంది ఏక పంక్తిలో ఉన్నవారికే అలా జరిగితే వెంటనే తెలిసిపోతుంది 'ఎంత తెలివితక్కువవాడి నయితేమటుకు బంతిలో వలపక్షం చేస్తానా?' అనేవాళ్ళు భయస్థులు

**బాదరబందీ:** బాధ్యతల బరువు, చిక్కులు, విసిగించే విషయాలు మొదలైనవాటిని గురించి చెప్పేటప్పుడు 'ఈ బాదరబందీ భరించలేకుండా ఉన్నా'నని బాధపడటం కద్దు మాటచివరి బందీశబ్దంవల్ల బంధితుడ నైనానని, ఇరుక్కుపోయానని, తప్పించుకోలేకున్నానని భావించుకొంటారుగాని ఈ సమాసంలోని బందీ అనే భాగానికి 'ముడి, కట్టు' అని మాత్రమే అర్థం అంతవరకూ అది హిందీ/ఉరుదూ పదం బాదర అన్న భాగానికి అర్థం లేదు అది 'బారహ్' అని రాసి, 'బారా' అని ఉచ్చరించే సంఖ్యావాచక శబ్దానికి వికృతరూపం ముస్లిముల పరిపాలన కాలంలో రాజకీయోద్యోగాల్లో ఉన్న వ్యక్తులు నిర్దిష్ట పద్ధతిలో వస్త్రధారణ చేయవలసి ఉండేది పొడుగాటి అంగరఖా ధరించక తప్పదు అప్పటికింకా గుండీలు/బొత్తాములు వాడుకలోకి రాలేదు అందువల్ల కుడి ఎడమ అంచులను చిన్న దారాలతో కలిపి కట్టుకునేవాళ్ళు అవి పన్నెండు (బారా) ముళ్ళు మూడు నాలుగు గుండీలు పెట్టుకోడానికే బద్ధకించే వ్యక్తులు పన్నెండు ముడులు వేసుకోవాలంటే విసుక్కోక తప్పదు పైగా తొందరలో ఎలాగో ముడి వేసుకుంటే ముడి జారిపోవచ్చు పీటముడి పడవచ్చు దారాల తాళ్ళు చివర కుచ్చు లుంచేవాళ్లు అందంకోసం ఇప్పుడు నెక్ టై కట్టుకోటానికే ఇబ్బందిపడే వాళ్ళున్నారు పన్నెండు ముళ్ళు కుచ్చులు చెక్కుచెరదకుండా బిగించుకొని వేషధారణ చేయటం అప్పటివాళ్ళ కెంత బాధాకరంగా ఉండేదో మరి 'బారా'ను 'బాధ'ను మేళవించి 'బాదర'ను సృష్టించుకున్నారు చివరకీమాట 'బాధ పుట్టించే చిక్కువ్యవహారం' అనే అర్థంలో జాతీయంగా వెలిసింది సురవరం ప్రతాపరెడ్డిగారు ఈ బారాబందీ అంగీబొమ్మనుగూడా గీయించి ప్రచురించారు, ఆంధ్రుల సాంఘిక చరిత్రలో. వేషధారణలో అలంకరణలో మొదలైన ఈ మాట అన్నిరకాల చికాకులకూ అన్వయించి వాడుక కెక్కింది

**బాదరాయణసంబంధం:** బాదరాయణుడైన వేదవ్యాసుడితో ఎలాంటి సంబంధ మూలేని బాదరాయణ సంబంధమనే దొకటుంది కొందరు దీన్ని సాగదీసి 'బదరీబాదరాయణసంబంధ' మంటారు బదరి అంటే రేగు (చెట్టు, పండు)

బాదరాయణమంటే బదరికి సంబంధించినదని అర్థం. ఎటువంటి సరైన సంబంధమూ లేనప్పుడు బాదరాయణ సంబంధం ఉండవచ్చు అందు కోకథ ముక్కూమొహం తెలియని ఒక వ్యక్తి బండిమీదపోతూ అంతకు ముందెన్నడూ ఎరగని మరోవ్యక్తి ఇంట్లో మకాంపెట్టాడట 'ఘనకేం సంబంధమయ్యా' అంటే – "మీ యింట్లో రేగుచెట్టుంది. నా బండిచక్రాలను రేగుకర్రతో చేశారు ఒకటి బదరి (రేగు) ఆ రేగునుంచి వచ్చిన నా బండిచక్రం బాదరాయణం కాబట్టి మనం చుట్టాల"మని దబాయించాట్ట రెండోవాడు! ఇలా అవసరార్థం లేని ఎంధుత్వం కల్పించుకొనటం చావుతెలివి ఉన్నవాళ్లకే సాధ్యం. ఒక్కోసారి చాలా దూరపు చుట్టరికాన్ని చెప్పదలచినా 'మాది బాదరాయణ సంబంధంలెండి' అనటం కద్దు.

*బాదరాయణుడు:* వెర్రిబాగులవాణ్ణి, అసమర్థుణ్ణి బాదరాయణుడని పిలుస్తారు. 'వాడుత్త బాదరాయణు'డంటే పనికిమాలినవా డని అర్థం. ఇది వాడుకలో నిలిచి నిఘంటువుల కెక్కిన విచిత్ర శబ్దార్థం మరి బాదరాయణుడు, బాదరాయణి అంటే వేదవ్యాసుడనిగూడా అర్థముంది! వేదాలు విభజించి, పంచమవేదమనే మహాభారతం రాసి, అందులో భగవద్గీత నుంచి, పద్దెనిమిది పురాణాలు రాసిన మహామనీషిని, ధృతరాష్ట్ర పాండు విదురులను దేవరన్యాయంలో కన్న పరమరసికుణ్ణి, వినాయకుణ్ణే గుమాస్తాగా పెట్టుకొన్న నేర్పరిని వెర్రివెంగళప్పగా భావించటంకన్నా విడ్డూరమైన విషయ మేముంటుంది?

వేదవ్యాసు డొకమారు కాశీ నగరాన్ని శపించబోయి శివుడి కోపానికి గురయి బహిష్కారశిక్ష అనుభవించాడు. అదితప్ప ఆయన 'తెలివితక్కువ'గా చేసినపని మరొకటి కనిపించదు – వినిపించదు శ్రీనాధుడికి ఈ కథ అంటే ముచ్చట కాశీఖండ, భీమఖండాలు రెంటిలోనూ వ్యాసుణ్ణి శివుడు ఊరినుండి వెళ్ళగొట్టడాన్ని వర్ణించాడు శివుడు వ్యాసుణ్ణి పట్టుకొని "ఎట్టు పురాణముల్ పదియునెన్మిది చేసితి, వెట్టు వేదముల్ గట్టితి వేర్పరించి, సుడికారపు సొంపెసలార భారతం, బెట్టు రచించి తీవు ముని వెట్టయి, తొక్క దినంబులోపలన్ పొట్టకు లేక దిట్టితివి పుణ్యగుణంబుల రాశి కాశికన్" అని రెట్టిస్తాడు. ఒక్క తప్పువల్ల వేద వ్యాసుడు వెర్రి బాగులవాడూ అసమర్థుడు అయినాడంటే నమ్మటం కష్టం. అయినాసరే ఎంత చదివినా లోకజ్ఞానం లేనివాణ్ణి బాదరాయణుడని వెక్కిరించటం వాడుకలోకి వచ్చింది

*బిభీషికలు:* బెదిరింపులనే అర్థంతో వాడే మాటల్లో ఇదొకటి సంస్కృతంనుంచి దిగుమతి అయింది సంస్కృత భాషలో కొన్ని ధాతువుల ప్రథమాక్షరాలను ద్విరుక్తం చేసి భూతకాలిక రూపాలను నిర్మిస్తారు 'భీ' అనే ధాతువుకు 'బిభీషః'మొదలైన రూపాలు వస్తాయి ఇలాగ. ఆ ధాతువుకు 'భయపెట్టు' అని అర్థం. బిభీషిక, విభీషిక అనేవి పర్యాయ రూపాలు వాటికి అర్థాలు 'భయపెట్టడం, భయం, భయపెట్టే పని/సాధనం' వగైరాలు ఎవరయినా బెదిరించినప్పుడు 'ఇకచాలు నీ బెదిరింపులు' అనే అర్థంలో 'నీ బిభీషికలు చాలు' అనటం కద్దు ఎవడో ఒక వ్యాకరణ పండితుడు మొదట ఈ మాట వాడి వుంటాడు. అది నచ్చి తరువాతి వాళ్ళు కూడా ప్రయోగించి వుంటారు శషభిషల్లో బెదిరింపు మాత్రమే గాక 'చంపుతా, నరుకుతా' అనే స్పష్టమయిన హెచ్చరిక ఉంటే, బిభీషికల్లోని బెదిరింపు అంత స్పష్టంగా ఉండదన్నమాట ఏమో చేస్తానని సందిగ్ధంగా ఉండే హెచ్చరిక/బెదిరింపు బిభీషిక. అసందిగ్ధమైనవి శషభిషలు.

బీరకాయ పీచు: లోపల పీచున్న కాయ లెన్నివున్నా బీరకాయ పీచుకే పేరు వచ్చింది. కాయ ముదిరేకొద్దీ ఈ పీచు చిక్కబడి గట్టిపడ్తుంది. పీచులోని దారాలు గట్టిగా పెనవేసుకుంటాయి ఈ సహజ లక్షణం గుర్తించి సంబంధ బాంధవ్యాలను వదిలిపెట్టకుండా గట్టిగా పట్టుకొని, రాకపోకలేగాక వివాహాదులు కూడా దగ్గరివాళ్ళలోనే చేసుకొనేవాళ్ళ విషయంలో ఈ మాట వాడ్తారు మేనరికాలూ ఎదురు మేనరికాలూ జోరుగా సాగే మన జాతిలో సామాజిక సంబంధాలు చాలా ఎక్కువ ప్రేమాభిమానాలు మెండు దగ్గరి చుట్టాలనూ మరీ స్నేహంగా ఉండే దూర బంధువులనూ కలిపి "వాళ్ళదంతా బీరకాయ పీచులెండి" అని మెప్పుగానో దెప్పుగానో వ్యవహరించటం కద్దు ఈ మాటలను తెలుగువాళ్ళకూ, ఇతర దక్షిణాది వాళ్ళకూ అన్వయించవచ్చుగాని, ఉత్తర హిందూస్థానం వాళ్ళకి అనువర్తించటం తగదు ఉత్తరాదివాళ్ళు బీరపాదులు పెంచరు; బీరకాయలు తినరు; మేనరికంలో వివాహ సంబంధాలు పెట్టుకోరు; ఎదురు మేనరికం ససేమిరా పనికిరాదు కాబట్టి వాళ్ళలో బీరకాయ పీచుండదు ఇది తెలుగు పీచు. అచ్చం మనదే ఉమ్మడి కుటుంబాలూ దగ్గరి చుట్టరికాలూ సమీప బంధువుల్తోనే వివాహాదిసంబంధాలూ ఉన్న కుటుంబాలను బీరకాయపీ చంటారు

బూచి (గాడు): ఇది చాలా పాతకాలపు మాట బూజు వంటి ఇతర శబ్దాలతో దీనికి వ్యుత్పత్తిపరంగా సంబంధముంది. 'పూచు' అనే క్రియా పదం దీనికి మూలం. భయం కలిగించేది అనే అర్థంలో ఈ మాటకు ప్రాచీన ప్రయోగాలున్నాయి కొందరు నిఘంటుకారులు దీన్ని భూతశబ్దంతో ముడిపెట్టి నిర్వచించారు. పసిపిల్లలను భయపెట్టడంలో ఈ మాటకు వాడుక ఎక్కువ "పులియడు, బూచిగా డడవిపోతు" వగైరా వేటకుక్కలకు పేర్లని అల్లసాని పెద్దన వర్ణించాడు కానీ ఇటీవలికాలంలో దీనికి సరికొత్త వ్యాఖ్యానాలు పుట్టాయి విజయనగరం, బొబ్బిలి సంస్థానాల మధ్య యుద్ధం జరిగినప్పుడు అప్పటి ఫ్రెంచి సేనాని 'బుస్సీ' విజయనగరం వారికి తోడ్పడి, బొబ్బిలి కోట విధ్వంసంలో ప్రధాన పాత్ర వహించాడు అతడు చాలా భయంకరుడని, దయాదాక్షిణ్యాలు లేనివాడని, అతడి పేరు చెప్తే జనం గడగడలాడేవారని ఒక ప్రవాదముంది బొబ్బిలి యుద్ధాన్ని వర్ణించే పద్యాలూ, పాటలూ అతిశయోక్తులతో బుస్సీ దుర్మార్గాలను వివరించాయి ధ్వని సాదృశ్యంవల్ల బూచి శబ్దం బుస్సీ నుంచి పుట్టిందనే జానపద వ్యుత్పత్తిని ఎవరో కల్పించారు బుస్సీకి కొన్ని వందల సంవత్సరాల ముందు కాలంనుంచీ బూచి శబ్దానికి కావ్య ప్రయోగాలున్నవన్న సంగతి మరపు వచ్చిందన్నమాట ఫలితంలో బూచి అంటే భయంకరమైన దేదైనా కావచ్చునన్న నమ్మకం కుదిరింది

బెల్లం కొట్టిన రాయి: రాత్తో దేన్ని కొట్టినా అంతో ఇంతో చప్పడవుతుంది బెల్లపచ్చును కొడితే చప్పుడు తక్కువ కొట్టిన తరవాత బెల్లం అతుక్కుంటుంది. కాబట్టి తరవాత మరే వస్తువును ఆ రాత్తో కొట్టినా చప్పుడు రాదు. ఖంగుమని మోగదు. నిప్పురవ్వలు రావు పైగా రాయి నునుపుదేరుతుంది – కడిగేదాకా తెలివితక్కువవాళ్ళనూ, మందకొడి మనుషులనూ (బండ) రాత్తో పోల్చటం పరిపాటి అలాంటి వాళ్ళుకూడా ఎప్పుడో ఒకప్పుడు ఏదో మాటకు చలిస్తారు తిరగబడతారు ఎంతో కొంత కదలిక వాళ్ళకు వస్తుంది రాయిలాంటి సదరు వ్యక్తులు బెల్లంకొట్టిన రాయిలాంటి వాళ్ళయితే కదిలే పని లేదు మాటకుమాట బదులు చెప్పరు మరింత బండ బారటమేగాక

మరింత మెత్తపడతారు అందుకని ఏమన్నా ఏంచేసినా పట్టించుకొని, మారుపలకని, ఎదురుతిరగని వాళ్ళను బెల్లంకొట్టిన రాయిలా పడివున్నారంటారు మిగిలిన రాళ్ళను కదిలిస్తే దొర్లిస్తే కొంత చప్పుడవుతుంది బెల్లంకొట్టిన రాయి ఒక పట్టాన దొర్లదు జిగటవల్ల దొర్లలేదు దొర్లినా చప్పుడు చేయదు శుద్ధబుద్ధావతారంలాంటి వ్యక్తిని బెల్లంకొట్టిన రాయి అంటారు

**బేగీరావు టపా:** టపా అన్న ఉర్దూ పదాన్నిబట్టి, బేగీరావు అనే మరాఠీ పేరునుబట్టి ఈమాట మహారాష్ట్ర పాలనకాలంలో, ఇంగ్లీషువాళ్ల సామ్రాజ్యం ఏర్పడకముందు పుట్టిందని కొండగుర్తు పెట్టుకోవచ్చు పోస్టాఫీసులూ, టపాచబూత్రాలు రానికాలంలో రెండే రెండు మార్గాలుండేవి – వార్తలు పంపడానికి ఒకటి పావురాల కాళ్లకు చుట్టి పంపే వార్త ఇది రాజులకూ ధనవంతులకూ మాత్రం అందుబాటులో ఉండేది పావురాలకు శిక్షణ ఇవ్వటం ఓ పెద్ద పని రెండోది 'వార్తాహరుల' ద్వారా – అంటే మనిషి ద్వారా – కబురు పంపటమనేది వార్తాహరుడంటే కబురు తీసుకపొయ్యేవాడని అర్థం పావురాల టపా త్వరగా పోయేదేగాని వాటికి డేగల బాధ ఉండేది మనిషి ద్వారా కబురు పంపటం ఆలస్యప్పని అతడికి దొంగభయం, శత్రుభయం ఉండేవి మనిషి ద్వారా వార్త పంపటాన్ని త్వరితం చేసేందుకు మహారాజులు గుర్రపురౌతులను వాడేవారు అందువల్ల పని తొందరగా జరిగేది దూరప్రాంతాలకు ఒకే రౌతునూ ఒకే గుర్రాన్నీ పంపితే అలసటవల్ల పని చెడుతుందని బాలాజీబాజీరావు కాలంలో "అంచెటపా" పద్ధతిని ప్రవేశపెట్టారు ఒక రౌతు కొంతదూరం ఉత్తరం తీసుకపోయి మరో రౌతుకు అందించి తాను విశ్రమిస్తాడు అలా అంచెలంచెలుగా వార్తలు పంపటానికి "బేగీరావు టపా" అనే పేరు వచ్చింది ఉత్తరాలను గుడ్డలమీద రాయవలసి వచ్చేది తాటాకులమీద రాసి పంపటంకన్నా ఇది క్షేమం అప్పుడు కూడా అన్ని ఉత్తరాలూ నేరుగా, మధ్యలో ఆగకుండా చేరవలసినచోటికి గుర్రం రౌతులు మోసుకుపోతే బేగీరావు టపా అనేవాళ్లు పాదచారి వ్యక్తి తీసుకపోతే అంచెటపా అనేవాళ్లు

పీచుకాగితమనేది వాడుకలోకి వచ్చిన తరువాత కొన్ని చిక్కులు వచ్చాయి గుడ్డపేలికలతో మొరటుగా చేసిన పీచుకాగితానికి గోలకొండ ముస్లిం రాజ్యం ప్రసిద్ధంగా ఉండేది నేటి కాగితాల్లాగా అవి ఒకపట్టాన చినిగేవి కాదు కత్తితో కోస్తే వంకరటింకరలుగా చినిగేవి కత్తెరతో జాగ్రత్తగా కత్తిరించాలంటే చాలా సమయం ఓర్పూ కావాలి అయినాసరే అవస్థపడి గోల్కొండ పీచుకాగితంమీద కరక్కాయ సీరాతో కబురు రాసి పంపేవారు ఎవరైనా బద్ధకించి కాగితాన్ని జాగ్రత్తగా సమంగా కత్తిరించి పంపకపోతే అది 'టెలిగ్రాం'తో సమానమని భావించేవారు అంతేకాదు అలా పంపిన వార్త ఏదో అశుభవార్త కిందే పరిగణించి ఉత్తరం తెచ్చిన వ్యక్తి చేతిలోనే అది ఉన్నప్పుడే ఏడ్పులు మొదలేసేవారు! (ఇప్పటికీ టెలిగ్రాం అంటే మంచి వార్త కాదని గాభరా పడేవాళ్లున్నారుకదా!) ఈ ప్రమాదం తప్పించడానికి ఉత్తరాన్ని మడిచి దానిమీద పెద్దక్షరాల్తో "సమయానికి కత్తెర హాజరులో లేనందువల్ల కత్తిరించలేదు" అని రాసేవాళ్లు! ఆ మాటలు కనిపిస్తే వస్తున్న ఏడుపు మింగి, విషయం ఏమని చదివి తెలుసుకొనేవాళ్లు అంతో ఇంతో ఉండి చదువుసంధ్యలున్నవాళ్లు పొరుగూరు పోయే ఏ గుర్రబ్బండివాడికో ఇచ్చి పంపిన ఉత్తరాన్ని కూడా బేగీరావు టపా అని పిలిచేవాళ్లు

అల్లూరి సీతారామరాజు బ్రిటిష్ పోలీసు స్టేషన్లమీదకు వదలిన బాణం చివర ఒక ఉత్తరం, ఒక మిరపకాయ కట్టి పంపేవాడు దాన్ని 'మిరపకాయ టపా' అన్నారు

**బేవార్సు:** ఇది హిందీ/ఉర్దూభాష నుంచి తెలుగువాళ్ళు దిగుమతి చేసుకొని, అర్థం మార్చి వాడుతున్న ఒకానొక జాతీయం. 'బే-వారిస్' అంటే 'వారసులు లేని' అని మూలార్థం సంతానం లేని, గొడ్డు మోతయిన/గొడ్రాలయిన-అనే విశేషణార్థాలున్న మాట ఇది. జందూటొందూ లేని వ్యక్తి నిరాఘాటంగా, నిరంకుశంగా, నిర్లక్ష్యంగా ప్రవర్తించగలడనేది ఒక దృఢవిశ్వాసం ఆ మాట చాలావరకు నిజం పెద్ద రౌడీలమని బోరవిరుచుకొని విహరించే పరమ కిరాతకులు కూడా తమ పిల్లల విషయం, పెళ్ళాం విషయంలో మెత్తబడిపోతారు వాళ్ళ సంరక్షణకోసం పాకులాడుతారు వాళ్ళకు చిన్నమంత కష్టం వస్తే బెంబేలుపడతారు వాళ్ళమీద ఎవరయినా చేయి చేసుకుంటే నిస్తేజు లవుతారు. ఇలాంటి జంజాటంలేని వ్యక్తి తాడు తెగిన గాలిపటంలాగా యధేచ్ఛగా విహరించగలడు ఈ చివరి లక్షణాన్ని పురస్కరించుకొని 'బేవార్సు' అనే విశేషణాన్ని విశేష్యంగా (నామవాచకంగా) కూడా వాడుతున్నారు- 'వాడో బేవార్సు' అని మూలార్థానికీ, వ్యావహారికార్థానికీ దూరాన్వయం ఉండే మాటల్లో ఇదొకటి కొందరీమాటకు ముందు 'ఉత్త, పరమ' వంటి విశేషణాలనుకూడా చేర్చి వ్యవహరిస్తారు

**బొబ్బిలి చిల్లపెంకులు:** మహాపౌరుషవంతు లయిన పిల్లలను ఈ మాటతో నిర్దేశిస్తారని నేదునూరి గంగాధరంగారు పేర్కొన్నారు. బొబ్బిలి యుద్ధం జరిగిన తరువాత ఈ మాట పుట్టి వుండవచ్చు విజయనగరం - బొబ్బిలి రాజులమధ్య యుద్ధం జరిగి, మొదటివారికి ఫ్రెంచి సేనాని బూసీ అండదండలు లభించి, చివరికి బొబ్బిలి సర్వనాశనమయింది. బొబ్బిలి బెబ్బులిగా అక్కడి సేనాని తాండ్ర పాపారాయుడు పేరు సంపాదిస్తే, బూసీ దొర 'బూచి'గా మరి పసిపిల్లలను భయపెట్టడానికి పిశాచమైనా డంటారు మనుచరిత్రలో అల్లసాని పెద్దన నగర వర్ణన చేస్తూ "అచట బుట్టిన చిగురు కొమ్మైన చేవ" అంటాడు. ఎంతో దుర్బలమైన చిగురుచెట్టు కొమ్మకూడా చేవగలదంటే తక్కిన వాటి విషయం చెప్పనక్కరలేదు అదేవిధంగా బొబ్బిలినగరంలోని చిల్ల పెంకులక్కూడా పౌరుషముందంటే మనుషుల విషయంలో అనుమాన మక్కరలేదు. ఆ దృష్టితో ఈ జాతీయం వీరకుమారులని చెప్పడానికి వాడుకలోకి వచ్చిందన్న మాట

**బొమ్మలాట రామాయణం:** ఇప్పటిలా నాటకాలూ, సినిమాలూ, టీవీ కథలూ వగైరా లేని రోజుల్లో తోలుబొమ్మలాటలే గ్రామీణులకు వినోదప్రదర్శన పలచని తోలుబొమ్మలు చేసి వాటిని ఈతముళ్ళతో దుప్పటికి కుట్టి దాని వెనక కాగడాలు వెలిగించి దృశ్యాదృశ్యంగా బొమ్మలను ప్రదర్శిస్తూ రామాయణ కథను గానం చేస్తుండేవాళ్ళు మానవులు తోలుబొమ్మలని సూచించే తత్వార్థం అందులో ఉందంటారు పాటలు మాత్రం రంగనాధ రామాయణంలోనివే అంటే ఈ విధానం పదమూడో శతాబ్దినుంచీ అమల్లో ఉందనుకోవాలి ఆ రామాయణంలో వాల్మీకి రామాయణంలో లేని సులోచనా వృత్తాంతం వంటి అనేక కథ లున్నాయి. తోలుబొమ్మలాటలవాళ్ళు పాడుతున్నారు కాబట్టి గ్రంధానికే బొమ్మలాట రామాయణ మనే పేరు వచ్చింది ఆ మాటను రెండు రకాలుగా ప్రయోగిస్తున్నారు మూలంలో లేని నిరాధార విషయాలను ప్రస్తావిస్తే 'ఏం? బొమ్మలాట రామాయణమా తమరు చర్చిస్తున్నది?' అని

ఆక్షేపిస్తారు. మరెవరయినా 'నాటక మాడుతున్నట్లు' అనుమానిస్తేకూడా 'బొమ్మలాట రామాయణం ప్రదర్శిస్తున్నారా? నిజమా?' అని రెట్టిస్తుంటారు ఈరెండూ అంతో ఇంతో చదువుకున్నవాళ్ళు జానపద సాహిత్యాన్నీ, పద్ధతులనూ వెక్కిరిస్తున్నట్లు మాట్లాడే సమయంలో వాడేవి.

భోళాశంకరుడు: సంస్కృత పురాణ కథలనుబట్టి ముఖ్యంగా ఉత్తర హిందూస్థానంలో మన సుబ్బారావులాంటి దేవుడే కనిపిస్తాడు – వినిపిస్తాడు అలాగని తెలుగువాళ్లు 'భోళాశంకరు'డనే మాటను వాడరని కాదు. 'భోళా భాలీ' అనే హిందీ జాతీయానికి 'కేవలం అమాయకుడైన' అని అర్థం. నిజానికి ఏ రాక్షసుడు తపస్సు చేసి ఏవరమడిగినా వెనుకముందులు చూసుకోకుండా అనుగ్రహించే దేవుడు శివుడే గదా! ఎన్నిరకాల చేదు అనుభవాలు కలిగినా ఆయన ప్రవర్తనలో మార్పు లేదు. బాణాసురుడి వాకిలికి కాపలా కాసి చివరికి విష్ణుమూర్తి అవతారమయిన శ్రీకృష్ణుడితోనే యుద్ధం తెచ్చుకొన్నాడు భస్మాసురుడికి వరమిచ్చి తనను తాను కాపాడుకోటానికి నానా అవస్థలూ పడి, విష్ణుమూర్తి ధర్మమా అని బయటపడ్డాడు మరో రాక్షసుడి పొట్టలో కాపురముండి, విష్ణువు నందిచేత వాడి పొట్ట చీల్పించేదాకా అక్కడే కునికిపాట్లు పడ్డాడు ఇలా ఎన్నో కథలు

అయితే మన సుబ్బారావుకూ భోళాశంకరుడికీ చాలా దగ్గరి పోలికలున్నట్లే భేదాలూ ఉన్నాయి సుబ్బారావు అస్వతంత్రుడు. అసమర్థుడు శివు డలాకాదే. "సాదు రేగెనేనిన్ విను తలపోలముననగాని నిలువదు సుమ్మీ" అన్నట్లు, "అలుగుటయే యెఱుంగని మహామహితాత్ము డజాతశత్రుడే యలిగిననాడు" అన్నట్లు కోపం వచ్చినప్పుడు నిర్ధూమధామం చేయగలడు. చేసిన సందర్భా లెన్నో వున్నాయి చివరికి మామగారైన దక్షుడు యజ్ఞం చేస్తే దాన్ని ధ్వంసం చేశాడు త్రిమూర్తుల్లో లయకర్తగా సృష్టిని విధ్వంసం చేస్తాడు. అంటే అతడెంతో సాధువో అంత క్రోధనుడు అసమర్థుడూ కాదు – అస్వతంత్రుడూ కాదు సుబ్బారావు ఇటీవలివాడు, తెలుగువాడు శివుడు త్రిమూర్తి భావానికే ముందున్నాడనీ, మొదట – అంటే ఆర్యులకు – అతడు దేవుడు కాదనీ, ఏ హరప్పా నాగరకతనుంచో లేదా భారతదేశంలోని అనార్యజాతుల ఆరాధనల నుంచో శివుడు తరవాత ఆర్యులక్కూడా దేవుడయినాడనీ ఎడాపెడా వాదించేవా ళ్లున్నారు! ఎక్కడివా డయితేనేం? ఎప్పటివా డయితేనేం? శివుడు వేలసంవత్సరాలుగానయినా భారతీయుల త్రిమూర్తుల్లో ఒకడు సుబ్బారావు మాత్రం అచ్చం తెలుగువాడు

బ్రహ్మకాయ: బ్రహ్మదేవుడు ఎటయినా బయలుదేరితే నాలుగు మొహాల్తో నాలుగు వేదాలూ చదువుతూ గాని నడవడని ఒక విశ్వాసం "నాలుగు మోముల న్నిగమనాదము లుప్పతిలన్" కదులుతాడని కవులు వర్ణిస్తారు. రావణాసురుడు ముల్లోకాలూ జయించిన తర్వాత బ్రహ్మదేవుడిక్కూడా ఓ పని పెట్టాడు – ముత్తాతగారనే గౌరవం కూడా లేకుండా తెల్లవారుజామునే లంకానగరానికి వచ్చి వేదపారాయణం చేయటం రావణుడు బ్రహ్మకు నిర్ణయించిన రోజువారీ విధి. ఒకరోజు సీతాదేవి సౌందర్యం తలుచుకుంటూ విరహబాధలో ఉండి ఏ తెల్లవారుజామునో కాస్త కోడికునుకు తీస్తున్న రావణుడి ఇంటికి వచ్చి నిత్యకృత్యంగా బ్రహ్మ వేదఘోష మొదలుపెడితే అంతఃపురం వాకిలి కావలిగా ఉన్న ప్రహస్తుడు "బ్రహ్మన్! అధ్యయనస్య నైష సమయః తూష్ణీం బహిస్థీయతామ్" అని కోప్పడ్డాడని భట్ట మురారి అనర్ఘ రాఘవ నాటకంలో వర్ణిస్తాడు

"ఇది వేదాధ్యయనానికి సమయం కాదు పో బయటకు" అని కూకలేశాడని కవి చెప్పాడు బ్రహ్మ వాచాలతకు ఇదో కవితా దర్శనం

ఇలాంటి సందర్భాలనుబట్టి బ్రహ్మదేవుడి నోరెప్పుడూ వేదాలు వల్లిస్తూ మూత పడకుండా ఉంటుందనే నమ్మకం ప్రబలింది ఎడతెరిపి లేకుండా మాట్లాడే వ్యక్తిని తెలుగులో 'వాగుడుకాయ' అంటారు. ఈ తెలుగు కాయను బ్రహ్మకు తగిలించి తెగవాగే వ్యక్తిని 'బ్రహ్మకాయ' అని పిలవడం కద్దు అర్థంపర్థం లేకుండా ఊపిరాడకుండా వాగే వ్యక్తిని ఈ పేరుతో ఆక్షేపిస్తారు బ్రహ్మరాత అర్థం కానట్లే బ్రహ్మకాయ మాటలు కూడా ఒక పట్టాన బోధపడవని అంటారు నిఘంటువుల్లో బ్రహ్మకాయకు "వాచాటు"డనే అర్థమిస్తారు

**బ్రహ్మచెవుడు:** తాను సృష్టించిన జీవరాశి కష్టాలు పడుతూ మొర పెట్టుకొన్నా వినిపించుకొని బాధలనుంచి విడిపించడనేమో బ్రహ్మ దేవుడుకి చెవుడనే మాట పుట్టింది ఫిరంగులు పేల్చినా వినిపించని మహాత్ములకు బ్రహ్మచెవు డుందంటారు. 'పుట్టచెవు' డనే మాట కూడా ఉంది తెలుగులో. బహుశా అది 'పుట్టుచెవుడు'కు రూపాంతరం కావచ్చు. పుట్టినప్పటినుంచీ చెవిటివాడని చెప్పడానికి వచ్చినమాట ఏ సంబంధమూ లేని పుట్టతో ముడిపడిపోయింది తిరుగులేని చెవుడు, ఏ మందులకూ మంత్రాలకూ లొంగని, ఏ యంత్రాలూ వినేటట్లు చేయలేని చెవుడు బ్రహ్మచెవుడు చెప్పినా వినని, విన్నా వినిపించని బండ చెవుడును బ్రహ్మచెవు డంటారు అంత చెవుడున్నవాళ్ళు సాధారణంగా మూగవాళ్ళూ నంగివాళ్ళూ అవుతుంటారు

**బ్రహ్మబంధువు:** వాడుత్త 'బ్రహ్మబంధు'వనే మాట సాధారణంగా బ్రాహ్మణ వ్యవహారంలో వినిపిస్తుంది విడిగా ఆ సమాసానికి బ్రహ్మ దేవుడికి చుట్టమనే అర్థమున్నా మొత్తంమీద దానికి "నిందితుడు, నింద్యుడు, నిందనీయుడు, అసహ్యించుకోవలసినవాడు" వగైరా అర్థాలున్నాయి 'వాడు నీచుడు' అనడానికి బదులు 'వాడు బ్రహ్మబంధు' వంటారు పాపం బ్రహ్మ! అయన విషయంకన్నా ఆయన బంధువుల విషయం హీనమయింది

**బ్రహ్మముడి:** బ్రహ్మముడి అనేమాట మిశ్ర సమాసం బ్రహ్మ సంస్కృతం ముడి తెలుగు అందుకని కొందరు ముడి కట్టుకున్నవాళ్ళు దీన్ని "బ్రహ్మగ్రంధి" అని పిలుస్తారు వివాహ సమయంలో వధూవరుల పైగుడ్డ చివర్లకు వేసే ముడిని బ్రహ్మముడి అంటారు పెళ్ళిచేయిస్తున్న పురోహిత బ్రాహ్మణుడు వేసిన ముడికాబట్టే బ్రహ్మముడి అని కొందరు వివరిస్తారు. సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడే సంకల్పించినందువల్ల వివాహం జరుగుతుంది కాబట్టి వివాహబంధాన్నే ఏకంగా బ్రహ్మముడి అనాలని మరికొందరు వ్యాఖ్యానిస్తారు సప్తపది పేరిట ఈ ముడివేసిన తరువాత వధూవరులచేత అగ్నిచుట్టూ ఏడడుగులు వేయించి ప్రదక్షిణ చేయిస్తారు. సప్తపది అన్నదే వివాహానికి న్యాయపరమైన ముఖ్య నిదర్శన - మంగళ సూత్రధారణకన్నా కూడా. (అసలు సూత్రధారణ అనేది ఉత్తరభారతంలో ప్రధానం కానేకాదు ).

ఈ ముడి విషయంలో చైనావాళ్ళలో ఒక విశ్వాసముంది స్వర్గంలో పచ్చ దారాలనూ, ఎర్ర దారాలనూ కలిపి దేవుడు ముడి వేస్తాడనీ, అక్కడాయన అలా ముడి వేస్తేనే భూలోకంలో పెళ్ళిళ్ళు జరుగుతాయనీ వాళ్ళ నమ్మకం ఇలాంటి నమ్మకాలే దక్షిణ అమెరికాలోని రెడ్ ఇండియన్ తెగల్లో కూడా ఉన్నాయని చెప్తారు. ఏ కాలంలో ఈ ముడి ఏ దేశంలో ఏ జాతిలో మొదట పుట్టి విశ్వవ్యాప్తమయిందో

ఆక్షేపిస్తారు. మరెవరయినా 'నాటక మాడుతున్నట్లు' అనుమానిస్తేకూడా 'బొమ్మలాట రామాయణం ప్రదర్శిస్తున్నారా? నిజమా?' అని రెట్టిస్తుంటారు. ఈరెండూ అంతో ఇంతో చదువుకున్నవాళ్ళు జానపద సాహిత్యాన్నీ, పద్ధతులనూ వెక్కిరిస్తున్నట్లు మాట్లాడే సమయంలో వాడేవి.

భోళాశంకరుడు: సంస్కృత పురాణ కథలనుబట్టి ముఖ్యంగా ఉత్తర హిందూస్థానంలో మన సుబ్బారావులాంటి దేవుడే కనిపిస్తాడు – వినిపిస్తాడు. అలాగని తెలుగువాళ్లు 'భోళాశంకరు'డనే మాటను వాడరని కాదు 'భోళా భాలీ' అనే హిందీ జాతీయానికి 'కేవలం అమాయకుడైన' అని అర్థం. నిజానికి ఏ రాక్షసుడు తపస్సు చేసి ఏవరమడిగినా వెనుకముందులు చూసుకోకుండా అనుగ్రహించే దేవుడు శివుడే గదా! ఎన్నిరకాల చేదు అనుభవాలు కలిగినా ఆయన ప్రవర్తనలో మార్పు లేదు. బాణాసురుడి వాకిలికి కాపలా కాసి చివరికి విష్ణుమూర్తి అవతారమయిన శ్రీకృష్ణుడితోనే యుద్ధం తెచ్చుకొన్నాడు. భస్మాసురుడికి వరమిచ్చి తనను తాను కాపాడుకోటానికి నానా అవస్థలూ పడి, విష్ణుమూర్తి ధర్మమా అని బయటపడ్డాడు మరో రాక్షసుడి పొట్టలో కాపురముండి, విష్ణువు నందిచేత వాడి పొట్ట చీల్పించేదాకా అక్కడే కునికిపాట్లు పడ్డాడు. ఇలా ఎన్నో కథలు.

అయితే మన సుబ్బారావుకూ భోళాశంకరుడికీ చాలా దగ్గరి పోలికలున్నట్లే భేదాలూ ఉన్నాయి. సుబ్బారావు అస్వతంత్రుడు అసమర్థుడు శివు డలాకాదే. "సాదు రేగనేనిన్ విను తలపోలమునననగాని నిలువదు సుమ్మీ" అన్నట్లు, "అలుగుటయే యెఱుంగని మహామహితాత్ము డజాతశత్రుడే యలిగిననాడు" అన్నట్లు కోపం వచ్చినప్పుడు నిర్ధూమధామం చేయగలడు చేసిన సందర్భా లెన్నో వున్నాయి. చివరికి మామగారైన దక్షుడు యజ్ఞం చేస్తే దాన్ని ధ్వంసం చేశాడు త్రిమూర్తుల్లో లయకర్తగా సృష్టిని విధ్వంసం చేస్తాడు. అంటే అతడెంతో సాధువో అంత క్రోధనుడు అసమర్థుడూ కాదు – అస్వతంత్రుడూ కాదు సుబ్బారావు ఇటీవలివాడు, తెలుగువాడు. శివుడు త్రిమూర్తి భావానికే ముందున్నాడనీ, మొదట – అంటే ఆర్యులకు – అతడు దేవుడు కాదనీ, ఏ హరప్పా నాగరకతనుంచో లేదా భారతదేశంలోని అనార్యజాతుల ఆరాధనల నుంచో శివుడు తరవాత ఆర్యులక్కూడా దేవుడయినాడనీ ఎడాపెడా వాదించేవా ళ్లున్నారు! ఎక్కడివా డయితేనేం? ఎప్పటివా డయితేనేం? శివుడు వేలసంవత్సరాలుగానయినా భారతీయుల త్రిమూర్తుల్లో ఒకడు. సుబ్బారావు మాత్రం అచ్చం తెలుగువాడు.

బ్రహ్మకాయ: బ్రహ్మదేవుడు ఎటయినా బయలుదేరితే నాలుగు మొహాల్తో నాలుగు వేదాలూ చదువుతూ గాని నడవడని ఒక విశ్వాసం "నాలుగు మోములన్ నిగమనాదము లుప్పతిలన్" కదులుతాడని కవులు వర్ణిస్తారు రావణాసురుడు ముల్లోకాలూ జయించిన తర్వాత బ్రహ్మదేవుడిక్కూడా ఓ పని పెట్టాడు – ముత్తాతగారనే గౌరవం కూడా లేకుండా. తెల్లవారుజామునే లంకానగరానికి వచ్చి వేదపారాయణం చేయటం రావణుడు బ్రహ్మకు నిర్ణయించిన రోజువారీ విధి. ఒకరోజు సీతాదేవి సౌందర్యం తలుచుకుంటూ విరహబాధలో ఉండి ఏ తెల్లవారుజామునో కాస్త కోడికునుకు తీస్తున్న రావణుడి ఇంటికి వచ్చి నిత్యకృత్యంగా బ్రహ్మ వేదఘోష మొదలుపెడితే అంతఃపురం వాకిలి కావలిగా ఉన్న ప్రహస్తుడు "బ్రహ్మన్! అధ్యయనస్య నైష సమయః తూష్ణీం బహిస్థీయతామ్" అని కోప్పడ్డాడని భట్ట మురారి అనర్ఘ రాఘవ నాటకంలో వర్ణిస్తాడు

"ఇది వేదాధ్యయనానికి సమయం కాదు. పో బయటకు" అని కూకలేశాడని కవి చెప్పాడు బ్రహ్మ వాచాలతకు ఇదో కవితా దర్శనం

ఇలాంటి సందర్భాలనుబట్టి బ్రహ్మదేవుడి నోరెప్పుడూ వేదాలు వల్లిస్తూ మూత పడకుండా ఉంటుందనే నమ్మకం ప్రబలింది ఎడతెరిపి లేకుండా మాట్లాడే వ్యక్తిని తెలుగులో 'వాగుడుకాయ' అంటారు ఈ తెలుగు కాయను బ్రహ్మకు తగిలించి తెగవాగే వ్యక్తిని 'బ్రహ్మకాయ' అని పిలవడం కద్దు. అర్థంపర్థం లేకుండా ఊపిరాడకుండా వాగే వ్యక్తిని ఈ పేరుతో ఆక్షేపిస్తారు బ్రహ్మరాత అర్థం కానట్టే బ్రహ్మకాయ మాటలు కూడా ఒక పట్టాన బోధపడవని అంటారు నిఘంటువుల్లో బ్రహ్మకాయకు "వాచాటు"డనే అర్థమిస్తారు

బ్రహ్మచెవుడు: తాను సృష్టించిన జీవరాశి కష్టాలు పడుతూ మొర పెట్టుకొన్నా వినిపించుకొని బాధలనుంచి విడిపించడనేమో బ్రహ్మ దేవుడుకి చెవుడనే మాట పుట్టింది ఫిరంగులు పేల్చినా వినిపించని మహాత్ములకు బ్రహ్మచెవు దుందంటారు. 'పుట్టచెవు' డనే మాట కూడా ఉంది తెలుగులో బహుశా అది 'పుట్టుచెవుడు'కు రూపాంతరం కావచ్చు పుట్టినప్పటినుంచీ చెవిటివాడని చెప్పడానికి వచ్చినమాట ఏ సంబంధమూ లేని పుట్టతో ముడిపడిపోయింది తిరుగులేని చెవుడు, ఏ మందులకూ మంత్రాలకూ లొంగని, ఏ యంత్రాలూ వినేటట్లు చేయలేని చెవుడు బ్రహ్మచెవుడు. చెప్పినా వినని, విన్నా వినిపించని బండ చెవుడును బ్రహ్మచెవు డంటారు అంత చెవుడున్నవాళ్ళు సాధారణంగా మూగవాళ్ళూ నంగివాళ్ళూ అవుతుంటారు.

బ్రహ్మబంధువు: వాడుత్త 'బ్రహ్మబంధు'వనే మాట సాధారణంగా బ్రాహ్మణ వ్యవహారంలో వినిపిస్తుంది విడిగా ఆ సమాసానికి బ్రహ్మ దేవుడికి చుట్టమనే అర్థమున్నా మొత్తంమీద దానికి "నిందితుడు, నింద్యుడు, నిందనీయుడు, అసహ్యించుకోవలసినవాడు" వగైరా అర్థాలున్నాయి. 'వాడు నీచుడు' అనడానికి బదులు 'వాడు బ్రహ్మబంధు' వంటారు. పాపం బ్రహ్మ! ఆయన విషయంకన్నా ఆయన బంధువుల విషయం హీనమయింది

బ్రహ్మముడి: బ్రహ్మముడి అనేమాట మిశ్ర సమాసం బ్రహ్మ సంస్కృతం ముడి తెలుగు అందుకని కొందరు మడి కట్టుకున్నవాళ్ళు దీన్ని "బ్రహ్మగ్రంధి" అని పిలుస్తారు వివాహ సమయంలో వధూవరుల పైగుడ్డ చివర్లకు వేసే ముడిని బ్రహ్మముడి అంటారు పెళ్ళిచేయిస్తున్న పురోహిత బ్రాహ్మణుడు వేసిన ముడికాబట్టి బ్రహ్మముడి అని కొందరు వివరిస్తారు సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడే సంకల్పించినందువల్ల వివాహం జరుగుతుంది కాబట్టి వివాహబంధాన్నే ఏకంగా బ్రహ్మముడి అనాలని మరికొందరు వ్యాఖ్యానిస్తారు సప్తపది పేరిట ఈ ముడివేసిన తరువాత వధూవరులచేత అగ్నిచుట్టూ ఏడడుగులు వేయించి ప్రదక్షిణ చేయిస్తారు. సప్తపది అన్నదే వివాహానికి న్యాయపరమైన ముఖ్య నిదర్శన – మంగళ సూత్రధారణకన్నా కూడా (అసలు సూత్రధారణ అనేది ఉత్తరభారతంలో ప్రధానం కానేకాదు).

ఈ ముడి విషయంలో చైనావాళ్ళలో ఒక విశ్వాసముంది స్వర్గంలో పచ్చ దారాలనూ, ఎర్ర దారాలనూ కలిపి దేవుడు ముడి వేస్తాడనీ, అక్కడాయన అలా ముడి వేస్తేనే భూలోకంలో పెళ్ళిళ్ళు జరుగుతాయనీ వాళ్ళ నమ్మకం. ఇలాంటి నమ్మకాలే దక్షిణ అమెరికాలోని రెడ్ ఇండియన్ తెగల్లో కూడా ఉన్నాయని చెప్తారు ఏ కాలంలో ఈ ముడి ఏ దేశంలో ఏ జాతిలో మొదట పుట్టి విశ్వవ్యాప్తమయిందో

తేల్చిచెప్పటం కష్టం ఇంగ్లీషులో కూడా "వెడ్ లాక్" అనేమాట ఉంది మొత్తంమీద వివాహమనేది ఒక చిక్కుముడి అని ప్రపంచంలో చాలా జాతులు నమ్ముతాయి ఇప్పుడు కూడా ఏ యిద్దరయినా అత్యంత సన్నిహితంగా కలిసిమెలిసి తిరుగుతుంటే వాళ్ళిద్దరూ బ్రహ్మముడి వేసుకున్నారని చెప్పటం కద్దు అది వివాహమే కానక్కరలేదు కూడా ఇటీవల అమెరికా రష్యాదేశాల అధ్యక్షులు బ్రహ్మముడి వేసుకొని ప్రపంచ రాజకీయాలను అతలాకుతలం చేస్తున్నారు

బ్రహ్మరథం: కవుల వర్ణనల్లో బ్రహ్మదేవుడి వాహనం హంస అయన్ను హంసవాహను డంటారు హంస శబ్దానికి శబ్దరత్నాకరంలో ఎనిమిది అర్థాలున్నాయి "1 అంచ, 2 యోగివిశేషము, 3 పరమాత్మ, 4 తెల్ల గుఱ్ఱము, 5 మంత్ర విశేషము, 6 శరీర వాయువిశేషము, 7 మాత్సర్యము, 8 ఉత్తరపదమైనచో శ్రేష్ఠము" వీటిలో రెండోదానిమీద ఆధారపడి యోగులు మోసే వాహనంమీద ఊరేగుతాడు కాబట్టి బ్రహ్మ హంసవాహను డనిపించుకున్నా డని చెప్తారు కొందరు మఠాధిపతులు 'పరమహంసలు' అంటే మహాయోగులు వారెక్కే పల్లకీ వంటిదాన్ని ఈ హంసలు మోస్తాయి ఉదాహరణకు శంకరాచార్యులవంటి పీఠాధిపతులు ఊరేగినప్పుడు దాన్ని మోసేది బ్రాహ్మణులు మాత్రం వాళ్ళు మోసేది కాబట్టి బ్రహ్మరథమనే పేరువచ్చింది అలాగని సూర్యరాయాంధ్ర నిఘంటువు చెప్తుంది హంసలచేత మోయించటంకన్నా ఇది సులభతరమైన పద్ధతి

శబ్ద రత్నాకరం మరో చిత్రమయిన వివరణ ఇస్తుంది "మృతినొందిన సన్యాసులను తీసికొని పోయెడు వాహనము" అని! ఇదే నిజమయితే బ్రహ్మరథమనేది 'పాడె'తో సమాన మన్నమాట స్వర్గంలో ఇంద్రుడు మహర్షులు మోసే పల్లకిలో ప్రయాణించేవా డంటారు భారతం చెప్పేకథ ప్రకారం నహుషుడనే రాజు నూరుపైగా యాగాలు చేసి ఇంద్ర పదవిని సంపాదించాడు అధికార మదంతో శచీదేవిని తన దగ్గరకు పంపమన్నాడు అప్పుడు బృహస్పతి సలహామీద ఆమె మునులు మోసే వాహనంమీద తన దగ్గరికు వస్తే సుఖపెడ్తానని కబురుపెట్టింది అయన అగస్త్యాది మహర్షులను పల్లకీ బోయీలుగా పెట్టుకున్నాడు తనతో వాదించిన అగస్త్యుణ్ణి తన్నాడు శాపం పొంది కొండచిలువగా మారి భూమ్మీద పడ్డాడు చివరికి అతడి ప్రశ్నలకు ధర్మరాజు సరయిన సమాధానాలు చెప్పినప్పుడు శాప విమోచనం పొందాడు ఆ నహుషుడెక్కింది బ్రహ్మరథమే అలా మళ్ళీ ఎవరూ బ్రహ్మరథమెక్కి అమరావతిలో ఊరేగినట్లు లేదు!

మొత్తానికి సిద్ధిపొందిన సన్యాసుల స్థానంలో బతికివున్న పీఠాధిపతులూ నహుషుడిలా ఇంద్ర పదవి సంపాదించిన మహనీయులూ బ్రహ్మరథమెక్కటం పోయి, రానురాను ఎవరు గొప్ప మర్యాదలు పొందినా బ్రహ్మరథ మెక్కినట్లే భావించటం వాడుకలోకి వచ్చింది ఎవర్ని ఘనంగా సన్మానించినా బ్రహ్మరథం పట్టినట్లే ఇప్పుడు భావించి రాస్తున్నాం

బ్రహ్మరాత: బ్రహ్మదేవుడి పేరిట వచ్చిన పద బంధాల్లో బాగా నలిగినమాట 'బ్రహ్మరాత' అనేది చదువుకోనివాళ్ళు దాన్నే 'బెమ్మరాత' అంటారు. మనిషి తలపుర్రెను పరీక్షిస్తే గజిబిజిగా ఉన్న రెండు భాగాలను గట్టిగా అతికినట్లు కనిపిస్తుంది. ఆ అతుకు బ్రహ్మరాత అని కొందరి విశ్వాసం బ్రహ్మరాత అనేది మిశ్ర సమానం కాబట్టి శుద్ధ సంస్కృతంలోనే చెప్పదలచినవాళ్ళు "బ్రహ్మ లిఖితం, విధి లిఖితం" వంటి మాటలు వాడ్తుంటారు "నీ

యిష్టం వచ్చినట్లు రాసుకో, భరించగలనుగాని అరసికులకు కవిత్వం వినిపించాలని మాత్రం రాయవద్ద"ని ఓ అపూర్వకవి మొత్తుకున్నాడు పండితులూ పామరులూ బ్రహ్మ కపాలం మీదనో మొహంమీదనో రాస్తాడని, రాసినట్లే జరుగుతుందనీ విశ్వసిస్తున్నారు

"నొసట రాసిన రాలు మసిబొట్టా తుడవడానికి?" అనే సామెత పుట్టింది అలాగే "తోలుకిందున్నాయి దొంగరాత" లనే సామెత కూడా పుట్టింది పుర్రెలో పైభాగనాక ముఖంమీదనే తోలుకింద రాస్తాడనేది మరో నమ్మకం ఆ రాత ఎవరికీ (ఎవరో గొప్ప జోస్యులకు తప్ప) అర్థం కాదంటారు చదవడం సాధ్యపడని గొలుసు కట్టురాతను బ్రహ్మరాత అనటం అందువల్లనే వాడుకలోకి వచ్చింది ఏదయినా అనూహ్యంగా జరిగితే అది బ్రహ్మ అలా రాసినందువల్లనే జరిగిం దనుకుంటాం అలా ఒక జీవికి జరిగిన మేలు కీళ్లన్నీ బ్రహ్మరాత ప్రకారం జరిగినవే అలా ఎందుకు జరిగాయో అర్థం కాకుండా జరిగినవే అర్థంకాని రాతలన్నీ బ్రహ్మరాతలే బ్రహ్మరాతను మార్చలేం చదవనూలేం చదవటమే సాధ్యం కానప్పుడు అర్థం చేసుకోవడం అనే ప్రశ్నే లేదు

అంత పవిత్రుడయిన బ్రహ్మదేవుడు కూడా కొందరిమీద పగబట్టినట్లు అన్నికష్టాలే అనుభవించమని రాస్తాట్ట అటువంటి రాతలు రాయటానికి అయనవాడే వస్తువులుకూడా పాడునే "మొహాన పెంటతో రాశాడు, పెంటలో వేపపుల్ల అద్ది రాశాడు" లాంటి ప్రయోగాలు కూడా తెలుగులో వచ్చాయి "మొహాన బంగారంతో రాస్తే" నిత్యకల్యాణం పచ్చతోరణంగా బతుకుతారని విశ్వాసం "అయన రాసింది బ్రహ్మరాతలే!" అంటే అయన దస్తూరీ బాగుండదని తాత్పర్యం అంతకుముందు తామే రాసిన వాక్యాలను తామే చదవలేని గొప్పరాయసగాళ్ళు కొంద రుంటారు వాళ్ళు రాసింది బ్రహ్మరాతకింద లెక్క అర్థంకాని, అస్పష్టమైన, చదవటానికి వీలుపడని కాక్కిరిబిక్కిరి అక్షరాలను బ్రహ్మరాతంటారు

బ్రహ్మవిద్య: 'అదేం బ్రహ్మవిద్యా, నాకు తెలియకపోవటానికి?' వగైరా మాటలు వింటుంటాం బ్రహ్మ నేర్పిన మొదటి విద్య సృష్టించటం, పుట్టించటం సమస్త జీవరాసులకూ ఆ విద్య తెలుసు తమ జాతిని పెంచుకోవడానికి చేసే లైంగిక కార్యాన్ని 'సృష్టికార్య' మని కూడా పిలుస్తారు ఇది జన్మసిద్ధం ప్రకృతి సిద్ధం ఆ దృష్టిలో బ్రహ్మ విద్య అనేది అత్యంత సులభమయిన సహజమైన చదువు బ్రహ్మ శబ్దానికి భగవంతుడనే అర్థముంది ఆ దేవుడికి తనవంటి తన జాతికి చెందినవాళ్లనే కాక నానాజాతుల జీవరాసులనేగాక నిర్జీవ వస్తువులను కూడా తయారుచేసే – పుట్టించే శక్తి ఉందని నమ్మినవాళ్లు తత్త్వశాస్త్రాన్నీ వేదాంత సారాన్నీ 'బ్రహ్మవిద్య'గా పరిగణిస్తారు 'అథాఽతో బ్రహ్మజిజ్ఞాసా' (ఇకనుంచి బ్రహ్మ అంటే ఏమో తెలుసుకోవటం మొదలు) అనే మహా వాక్యంతో తత్త్వశాస్త్ర పరిజ్ఞానం మొదలయ్యేది సంప్రదాయ పద్ధతిలో బ్రహ్మదేవుడనిగాక ఇక్కడ బ్రహ్మ పదార్థమనే వ్యవహారముంది అంటే – బ్రహ్మ అనే పదానికున్న అర్థమన్నమాట చరాచర ప్రపంచం ఎలా ఎందుకు పుట్టిందో ఊహించే వివరించే శాస్త్ర మది ఆ శాస్త్రజ్ఞానం సంపాదించటం బ్రహ్మవిద్యను సాధించటం అదొక్కటే మనకు పట్టుబడకపోవచ్చుగాని తక్కిన సమస్త విద్యలూ చాలా సులభమైనవేనన్న ఉద్దేశంతో తెలీనిది బ్రహ్మవిద్య అంటారు ఒకవేళ తెలిసిం దనుకున్నా తలకోరకంగా అర్థమయ్యే సృష్టి రహస్యం అందరికీ ఒకే విధంగా అర్థం కాదు కనుకనే అనేక మతాలు, విశ్వాసాలు పుట్టాయి ఫలితంలో పట్టుపడని, రాని విద్యను బ్రహ్మవిద్య అనటం పరిపాటయింది

బ్రహ్మహత్య: ఒకప్పుడు బ్రహ్మదేవుడికి అయిదు తలకాయ లుండేవని అనుకొన్నాం ఆయన సరస్వతీ దేవిని సృష్టించి ఆమెను పెళ్లాడాడు పెద్దవాళ్లేం చేసినా తప్పులేదు కదా మరి! అయిదో తల గాడిదతలలాగా ఉండేదిట ఆ తలతో శివుణ్ణి దూషిస్తే ఆయనకు కోపం వచ్చి ఆ తలను భైరవుడిచేత నరికించాడు అయితేనేం? ఆ తల తాలూకు పుర్రె శివుడి చేతికి 'శ్రీరంగం రోకలి'లా తగులుకుంది. బ్రహ్మ కోరిక మీద శివుడు ఆ పుర్రెతోనే అడుక్కుతిన్నాడు చాలా కాలం ఈ సంగతి శివపురాణంలో, స్కాందపురాణంలో ఉంది. 'ఆ గాడిద తలతో నేను దేవతలను మింగి మిమ్మల్ని కాపాడతా'నని బ్రహ్మ ప్రగల్భాలు పలికినందుకు కోపించి శివు డాతలను ఎగరవేశాడని బ్రహ్మాండ పురాణం చెప్తుంది. ఈ విషయా లెలా ఉన్నా బ్రహ్మను (పూర్తిగా కాకపోయినా) కొంచెం చంపినా ఆ పీడ విరగడ కావడానికి యుగాలు పట్టాయనే విశ్వాసం ప్రబలింది సృష్టికర్తమీద చేయి చేసుకుంటే కష్టాలు వచ్చాయనో, వస్తాయనో సరిపెట్టుకోవచ్చునేమో గాని బ్రహ్మహత్యకు సంబంధించి మరి రెండు విచిత్రమయిన కథలు పుట్టాయి. అవే విపరీతం.

ఒకానొక రాజు చుట్టుపక్కల వారందరిమీదికి కయ్యానికి కాలు దువ్వుతుండేవాడట నలుగురూ కలసి అయన మీదకు దండెత్తి వచ్చారు రాజుగారి కోగొప్ప ఉపాయం తట్టింది బ్రాహ్మణులను అవులమీద కెక్కించి యుద్ధరంగంలోకి తోలేడుట ఝూరీ చెంబులను అంగవస్త్రాలకు కట్టి బాణసంచాలాగా గిరగిర తిప్పుకొంటూ వస్తుంటే వాళ్లనేం చేయాలో శత్రురాజులకు అర్థం కాలేదు పైనున్న బ్రాహ్మణులను బాణాలు వేసి చంపితే బ్రహ్మహత్యా పాతకం చుట్టుకొంటుంది పోనీ వాళ్ల వాహనాలను చావగొట్టి పారదోలుదామా అంటే అవి ఆవులు! అవి చస్తే గోహత్యా పాతకం వస్తుంది. అందుకని ఏమీచేయలేక వెనక్కు తిరిగిపోయారట, పాపం ఆ కారణంచేత 'ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య' అనే సామెత పుట్టిందంటారు బ్రహ్మను చంపితే వచ్చే పాపం బ్రాహ్మణులను చంపినా వస్తుందనే భయం పాతకాలంలో ఉండేది

మరోటి ఇంకా విచిత్రమయింది. పిల్లివంటి క్షుద్ర జంతువును చంపితే కూడా బ్రహ్మ హత్యా పాపం వస్తుందంటారు పిల్లికీ బ్రహ్మకీ ఉన్న ప్రత్యేక సంబంధ మేమిటో స్పష్టంగా తెలీదు. శివుడికి అడుక్కుంటే ఆ పాపం క్షయమయిపోయింది అంతకన్నా సులభోపాయాన్ని మరో వ్యాపారి కనిపెట్టా డంటారు అంగట్లో ఎలుకల్ని తోలడానికి విసిరిన తూకం రాయి ఆ ఎలుకల్ని పట్టడానికి మాటువేసిన పిల్లికి తగిలి అది చచ్చింది వ్యాపారికి బ్రహ్మహత్యా భయం పుట్టి కొట్టు కట్టేసి వీధి అరుగుమీద తలపట్టుకు కూర్చున్నాడు దారినబొయ్యే పురోహితుడికి దండం పెట్టి 'మా వాడెవడో పిల్లిని చంపాట్ట స్వామీ! వాడి పాపానికి నిష్కృతి యే'మని అడిగాడు. నూరు శివాలయాలు కట్టిస్తేగాని పోదన్నాడట అంత డబ్బెక్కడ తెస్తామంటే ఒక్క గుడి అయినా కట్టించాలన్నాడు. ఇలా బేరం చేయగా చేయగా, ఎవరైనా ఒక మహాత్ముడికి దణ్ణంపెట్టినా పోతుందని తేలింది. "నీకన్నా మహాత్ముడెవడు స్వామీ!" అని ఆయనకే నమస్కరించి పిల్లి చావువల్ల వచ్చిన బ్రహ్మహత్యా పాపంనుంచి సెట్టిగారు బయటపడ్డా రనేది కథ ప్రతిదానికీ ప్రత్యామ్నాయం (బదులు) చెప్పి సరిపెట్టుకునే ప్రవృత్తికి ఇదో నివృత్తి మార్గంగా పుట్టి ఉండాలి

పిల్లినుంచి బ్రహ్మదేవుడిదాకా ఎవర్ని చంపినా పాపమేనన్న భయం పుట్టించడానికి ఈ కథలు పుట్టి ఉండవచ్చు

బ్రహ్మాండం: బ్రహ్మ సృష్టికర్తగా ఈ భూగోళాన్ని కుండలాగా తయారు చేశాట్ట. ఆ కుండ కూడా గుండ్రంగా ఉండని గుడ్డులా (అండంలా) తయారుచేశాట్ట. అందువల్ల భూమివంటి ఇతర గోళాలను కలిపి ' బ్రహ్మాండ మన్నారు బ్రహ్మాండ భాండం (బ్రహ్మాండమనే కుండ) దానికో కప్పెర (కర్పరం) ఉంటాయనేది విశ్వాసం. పెద్దరాక్షసులు గర్జించినా, పెను యుద్ధాలు వచ్చినా, గొప్ప అస్త్రాలను సంధించి వదిలినా బ్రహ్మాండ భాండం బద్దలయిపోతున్నట్లు, భూమీ ఇతర గ్రహాలు కుమ్మరి సారెలాగా గిరగిరా తిరిగినట్లు కవులు వర్ణిస్తుంటారు.

ఈ బ్రహ్మాండం చాలా పెద్దది భూమి అంటేనే చాలా పెద్దదని అర్థం. అందువల్ల చాలా పెద్ద పనులనూ వస్తువులనూ బ్రహ్మాండంగా ఉన్నాయని చెప్పటం అలవాటయింది అండమనే శబ్దభాగానికున్న ప్రత్యేకార్థం కాలక్రమాన మరుగుపడి పోయి మొత్తంమీద ఏదో అద్భుతమైన, అతి విశాలమైన, అసాధ్యమైన పని జరిగితే అది బ్రహ్మాండంగా ఉందనటం పరిపాటి అయింది. 'ఆయన బ్రహ్మాండంగా మాట్లాడాడు; అది బ్రహ్మాండమైన పరిశ్రమ; అది బ్రహ్మాండమైన కార్యక్రమం' లాంటి ప్రయోగాలు వచ్చాయి.

భగీరథ ప్రయత్నం: ఎన్ని కష్టాలకయినా ఓర్చి, పట్టిన పట్టు వదలకుండా కార్యసాధన చేయటాన్ని భగీరథ ప్రయత్నం అంటారు "హారిశ్చంద్రో నలో రాజా పురుకుత్సః పురూరవః, సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః" అని చెప్తారు ఈ లెక్కన సగరు డనేవాడు అయిదో చక్రవర్తి ఆరోవాడు పరశురాముడి చేతిలో చచ్చిన కార్తవీర్యార్జునుడు ఈ సగరుడు శ్రీరామచంద్రుడికి పూర్వుడు చాలా కాలం సంతానం లేక బాధపడి ఔర్వమహర్షిని ఆశ్రయిస్తే, ఒక భార్యకు పరమధార్మికుడు పుట్టాడని, రెండో ఆమెకు అరవైవేలమంది పుట్టారనీ వరమిచ్చాడట ఆయన అశ్వమేధం చేస్తూ గుర్రంవెంట ఈ అతిసంతానాన్ని పంపాడు. సముద్రతీరంలో గుర్రం అదృశ్యమయింది దాన్ని తిరిగి తేకపోతే ఊళ్లోకి రానీయనన్నాడు సగరుడు. వాళ్లు భూమిని తవ్వి అక్కడ కపిలమహర్షి కోపాగ్నికి భస్మమైపోయారు. ఆ సంగతి నారదుడి ద్వారా విన్న రాజు తన మనుమడైన అంశుమంతుణ్ణే పంపాడు గుర్రాన్ని తెమ్మని అతడు మహర్షిని బతిమాలి గుర్రాన్ని తెచ్చాడు సగరుడి సంతానం సాగరులు. వాళ్లు తవ్వినగుంట సాగరం (సముద్రం) అయిందని బ్రహ్మాండ పురాణం చెప్తుంది.

అరవైవేల మంది కొడుకులూ చచ్చిన రాజు నారాయణున్ని సేవిస్తే తదనుగ్రహంవల్ల పుట్టినవాడు భగీరథుడు మొదట్లో చాలా బలహీనంగా ఉండేవాడు. అష్టావక్రుడికి ఒకసారి ఈ కుర్రవాడు కనిపిస్తే తనను వెక్కిరించడానికి పడుతూ లేస్తూన్నట్లు నటిస్తున్నాడనే అనుమానం వచ్చింది నిజంగా వెక్కిరిస్తే బూడిదైపొమ్మన్నాడు లేకపోతే సుందరుడూ బలవంతుడూ కావాలన్నాడు వెక్కిరించని భగీరథుడు సుందరు డైనాడని విచిత్ర రామాయణం చెప్తుంది ఆ భగీరథుడు తన పెదతండ్రులను బతికించాలని బ్రహ్మను, గంగను, చివరికి శివుణ్ణే మెప్పించి, ఆకాశగంగను శివుడితలమీదినుంచి, హిమాలయాలమీదినుంచి కిందికి దించి పాతాళం చేర్చి పెదతండ్రుల బూడిదమీది నుంచి పారించి వాళ్లని బతికించుకున్నాడని భాగవతం, బ్రహ్మపురాణం చెప్తాయి

దారిలో ఎన్నో అడ్డంకులు వచ్చాయి గంగా ప్రవాహం జహ్నుమహర్షి ఆశ్రమాన్ని ముంచబోతే ఆయన, అగస్త్యుడు సముద్రాన్ని పుక్కిలించినట్లు గంగను తాగి ప్రవాహాన్ని ఆపాడు అయన కాళ్లమీదపడి భగీరథుడు గంగను విడిపించుకున్నాడు ఇలా ఎన్ని కష్టాలయినా పడి కార్యసాఫల్యం సాధించటాన్ని భగీరథప్రయత్న మంటారు 'ఈ పని నెరవేరడానికి భగీరథ ప్రయత్నం చేయవలసి వచ్చిం'దని తాముపడ్డ ప్రయాసను చెప్పుకోవటం కద్దు చాలా కష్టసాధ్యమయిన పనిచేయటం భగీరథ ప్రయత్నం

**భరతం పట్టటం:** 'నీ భరతం పడ్తా చూడు' అని బెదిరిస్తుంటారు భరతుడనే మహర్షి దేవలోకంలో రంభా ద్యప్సరలకు నాట్యం నేర్పాడట అయన్ను 'వృద్ధ భరతు'డని కూడా వ్యవహరిస్తారు. భూలోకంలో అదే పేరుగల ముని 'నాట్యశాస్త్ర' మనే ఉద్గ్రంథాన్ని సంస్కృతంలో రాశాడు. అయనపేరిట భారతీయ సంప్రదాయ నాట్యానికి భరతనాట్యం అనే పేరు వచ్చింది అది కాలక్రమాన కథాకళి, కూచిపూడి, మణిపురీ, ఒడిస్సీ, కథక్ వగైరాలుగా మారి విభేదించింది. అయినా ఈ నాట్యపద్ధతు లన్నిటిలోనూ ఒక సమాన లక్షణముంది అది హస్త పాద విన్యాసం. లయబద్ధంగా తాళానుగుణంగా చేసే అవయవ విన్యాసం ఆ సమయంలో సంగీతంలో వినిపించే సంగతులు వగైరాలు చూసిన విన్న సామాన్యుడికి ఈ మొత్తం వ్యవహారం చాలా ప్రయాసతో కూడినదన్న విషయం అనిపించింది 'తకధిమి' వంటి ధ్వనులూ, సరిగమలూ గుక్కతిప్పుకోకుండా ఎవరో పాడుతుంటే నర్తకులు మెలికలు తిరిగిపోతూ ఆయాసపడటం తమాషాగా ఉంది పాడేవాళ్ల పని భరతం 'పట్టడం' – ఆడేవాళ్ల పని నాట్యం చేయటం, అంటే ఆడటం అవతలి వ్యక్తిచేత ఆట లాడించాలంటే భరతుడి నాట్యంలో వాడే సంగీత భాగాన్ని – అంటే భరతాన్ని – పట్టాలనుకున్నారు రానురాను అవతలివ్యక్తిని వేధించడం, బాధించటం, ఏడిపించటం, కష్టపెట్టడం అనే అర్థాల్లో భరతం పట్టడమనే జాతీయానికి అర్థవిశేషాలు వచ్చిపడ్డాయి నాట్యానికి కావలసిన హంగులూ హంగామాలూ లేకుండానే, అవతలి వ్యక్తి నిజంగా నాట్యం చేయకుండానే, ఒకరిని ఏడిపించడం భరతం పట్టడం. అందులో గాత్రసంగీతంలేదు భరతం పట్టడంలో వాద్యానికన్నా సంగీతానికి ప్రాధాన్యమిస్తే తాళం పట్టడంలో సంగీతానికన్నా సాధనానికీ, వాద్యానికీ ప్రధానత్వ మిచ్చారు. అంతే భావంలో అర్థంలో పెద్ద మార్పు లేదు

**భరతవాక్యం:** దేవలోకంలో ఇంద్రాది దిక్పాలకుల ముందు మహర్షుల సమక్షాన భరత మహర్షి నాట్య ప్రదర్శన చేయించేవాడని చెప్పారు అయన ప్రతిపాదించి అభివృద్ధికి తెచ్చింది కాబట్టి నాట్యవిద్యకు భరతనాట్యమనే పేరు వచ్చింది నాటకం/నాట్యం మొదట నాందీవాచకం చివర భరతవాక్యం రాయటం సంస్కృత రూపకరచయితలు ఆచారంగా పాటించారు నాందీ శ్లోకం రాయకుండానే నాంది చివర సూత్రధారుణ్ణే ప్రవేశపెడుతూ రచనారంభం చేసినవాళ్ళున్నారు తెర దించేముందు భరతవాక్యం చెప్పని వాళ్ళు లేరనే చెప్పాలి సాధారణంగా అది మంగళాచరణంలా సాగేది. ప్రత్యేక శ్లోకం/పదం రాయకుండా భరతవాక్యం చెప్పామనిపించిన వారూ లేకపోలేదు భాస మహాకవి 'ఊరు భంగం' చివర దుర్యోధనుడు స్వర్గం చేరుకున్నాడని, తెర 'దించుతూ' ఉన్నారని రాసి కూడా భరతవాక్యంగా ఓ శ్లోకం రాశాడు దాని నాలుగు పాదాల్లో రెంటిని ధృతరాష్ట్రుడు, మూడోదాన్ని అశ్వత్థామా వాడారు చివరిపాదాన్ని బలరాముడు వాడుతూ గెలిచిన రాజు మనల్నీ ఈ భూమినీ కాపాడుగాక అంటాడు

ఇలా విరగదిస మొక్కుబడిగా రాసినా రాసింది మాత్రం భరతవాక్యం కిందే లెక్క ఒక పనిగాని, విషయంగాని పూర్తి అయిందనటానికి భరతవాక్యం చెప్పారనటం పరిపాటి అంతమాత్రాన ఆ పని మరి కొనసాగదనిగాని, ఆ విషయం అంతటితో సమాప్తమయింది కాబట్టి మరి దాని ప్రసక్తి రాదనిగాని చెప్పలేం అప్పటికి ముగిసినట్లు లెక్క ఆ ముగింపు కూడా మంగళప్రదంగా శుభస్కరంగా పూర్తి అయిందని భావం. ఎవరు చెప్పినా అది భరతవాక్యమేనంటారు చెప్పిన వ్యక్తి పేరుకు ప్రాధాన్యం లేదు విషయమేదైనా అది ముగిసిందని సూచిస్తే భరతవాక్యం చెప్పినట్లే లెక్క అది తప్పకుండా నాట్యమో, నాటకమో కానక్కరలేదు స్థూలంగా దాని భావం సుఖసంతోషాలతో విషయం ముగిసిందని మాత్రమే

భల్లూకప్పట్టు: భల్లూకం అంటే ఎలుగు (గొడ్డు/బంటు) అది నిలువునా నిలిచి ధృతరాష్ట్రుడిలా కౌగిలించుకొని చంపుతుందని, లేదా చంపటానికి ప్రయత్నిస్తుందని, అది పట్టిన పట్టును ఒక పట్టాన విడవదనీ లోకశ్రుతి. తాననుకొన్న ప్రకారమే నడుస్తూ ఎవరెన్ని చెప్పినా తన పట్టువదలని వ్యక్తిది భల్లూకప్పట్టు అంటారు. 'పట్టువదలని విక్రమార్కుడు' వదలటం, మళ్ళీ వెంటపడి పట్టుకోవటం చాలాసార్లు చేశాడు. కానీ భల్లూకం పట్టుకొంటే వదలదనే నమ్మకంతో ఈ మాట పుట్టింది అయన పట్టుబడితే విడవడనే అర్థంతో అతడిది భల్లూకప్పట్టు అంటారు

భ్రమరకీటం: భ్రమరం అంటే తుమ్మెద కీటం అంటే పురుగు ఈ పేరిట ఒక న్యాయం పుట్టింది సంస్కృతంలో మనమూ వాడుతుంటాం తెలుగులో పురుగుచుట్టూ ఝుంకారంచేస్తూ తుమ్మెద పరిభ్రమిస్తుంది కొంతకాలానికి ఆ పురుగే మరో తుమ్మెద అవుతుంది ఈ రహస్యం కనిపెట్టిన పెద్దలు భ్రమరకీట న్యాయ మనేదాన్ని సృష్టించారు ప్రయత్నపూర్వకంగా ఒక సామాన్యుణ్ణి తనంతవాణ్ణి చేయడం ఈ న్యాయాని కర్థం నిజానికి ఆ పురుగు తుమ్మెద పూర్వరూపమే కనపడ్డ పురుగల్లా తుమ్మెదగా మారదు అంటే - తనకు కావలసిన వ్యక్తికి తుమ్మెద ఝుంకరించినట్లు అనుక్షణం చెప్పి విద్యావంతుణ్ణో తనంతవాణ్ణో చేయటం లోకవృత్తంలో ఉన్న విషయమే గురు శిష్య సంబంధం, పితా పుత్ర సంబంధం లాంటివి ఈ కోవకు చెందినవి అలా అభివృద్ధికి తెచ్చినవాడు భ్రమరం అభివృద్ధికి వచ్చినవాడు కీటం. వారిద్దరిమధ్య ఉన్న సంబంధం భ్రమర కీట సంబంధం ఇలా చేయటం భ్రమర కీట న్యాయం

మకార పంచకం: పంచకం అంటే అయిదు మకారంతో మొదలయ్యే అయిదు మాటలకున్న అర్థాన్ని పురస్కరించుకొని ఈ మాట తెలుగుదేశంలోనేగాక భారతదేశ మంతటా వ్యాప్తిలోకి వచ్చింది 'మత్స్యం (చేప), మాంసం, మధువు (సారా), ముద్ర (అభినయం, చేతి వేళ్లని మెలికలు వేయటం), మైథునం (సంభోగం)' అనేవి మకార పంచకం ఉత్తర హిందూస్థానంలో వీటిని 'పంచ మకార్' అని వ్యవహరిస్తుంటారు తిండిపోతూ, తాగుబోతూ, తిరుగుబోతూ అయిన వ్యక్తి పంచ మకార సాధన చేస్తున్నాడని వ్యవహరించటం మామూలు ధోరణి మన దేశంలో వామాచారమనే పూజా విధాన మొకటుంది ఆ పూజలు చేసేవాళ్లు క్షుద్రదేవతారాధన చేస్తుంటారు బలు లిస్తుంటారు అందువల్ల తమకు అతీత శక్తులు లభిస్తాయని వారి విశ్వాసం వాళ్ళ దృష్టిలో మత్స్యమాంసాలు తినటం తప్పకాదు - అత్యవసరం. తాగటం నేరం కాదు అది పూజలో భాగం వేళ్ళు పెనవేసి జపం చేయటం తంత్రాల్లో ప్రధానం

నగ్న స్త్రీ పూజ వంటివి నిగ్రహం సాధించటానికి పాటించె కర్మకాండలు. అందువల్ల సాధారణ సామాజికులు దురాచారాలనీ పాప కృత్యాలనీ భావించేవాటిని వాళ్ళు దేవీ పూజలో భాగంగా, మహత్తర శక్తులు సంపాదించిపెట్టే దీక్షా విధానాల్లో తప్పక పాటించవలసిన ధర్మాలుగా పరిగణిస్తారు. వాళ్ళు చేసే పనులు తంత్రా లంటారు. శాక్తేయుల్లో కొందరు పట్టుదలతో ఈ పనులు చేస్తారు. దేశం మొత్తంలో అస్సాం రాష్ట్రంలో ఈ విధానాలకు పది శతాబ్దాల చరిత్ర ఉంది మంత్రశాస్త్రానికి అక్కడ గౌరవ మెక్కువ ఈ పంచ మకారపూజా పరాయణులను చూసి మామూలు జనం భయపడతారు. సాధారణ పౌరుల దృష్టిలో పంచ మకారాలు దుష్ప్రవర్తనలో భాగాలు.

మచ్చ నాలుక: ఇది సాముద్రిక శాస్త్రం నుంచి వచ్చిన మాట నాలిక మీద మచ్చ ఉన్న వ్యక్తి నోట్లో నువ్వు గింజలు నాన వంటారు. ప్రపంచంలో ఇన్ని గింజ లుండగా నువ్వు లెందుకు నోట్లో వేసుకుంటారంటే అవి చాలా చిన్నవి కాబట్టి అవి తడిసేలోగా ఉమ్మి వేస్తారంటే వాటిని క్షణకాలం కూడా నోట్లో నిలుపుకోలేరని అర్థమన్నారు పెద్దలు ఎంత చిన్న విషయాన్నయినా సరే – నువ్వు గింజంత చిన్నదాన్నయినా సరే – కాస్సేపయినా (నానేవరకు/తడిసేవరకు) నోట్లో దాచలేని మనిషంటే – కడుపులో ఎంత చిన్న రహస్యాన్నీ దాచుకోలేని వ్యక్తి అని భావం. అటువంటివారి నాలికకు మచ్చ ఉంటుం దంటారు. తెలిసిన విషయాలను మంచీ చెడ్డలతో నిమిత్తం లేకుండా వెంటనే బయటకు కక్కే వ్యక్తిని మచ్చనాలుక మనిషి అంటారు

మధ్యవైష్ణవం: మొదట శైవుడుగానో స్మార్తుడుగానో ఉండి తరువాతికాలంలో వైష్ణవమతం స్వీకరించిన వ్యక్తి మధ్యవైష్ణవుడు తల్లిదండ్రుల మతం, కులం, తనకు ప్రాప్తించటం సహజం అయా మతాల వారింట్లో పుట్టడం అనుకొని చేసిన పనికాదు ఊహ వచ్చిన తరువాత, కోరి తానుగా మత స్వీకారం చేసిన వ్యక్తి తెలిసి తెలిసి ఆ పని చేశాడు కాబట్టి అతగాడి మతాభిమానం నిజమయింది తీవ్రమయింది (జీవిత) మధ్యకాలంలో వైష్ణవ మతం పుచ్చుకున్నాడంటే ఆ వ్యక్తి ఆ మతంమీద గౌరవాభిమానాలూ అభినివేశమూ ఉన్నవాడన్న మాట అంటే తీవ్రవాది అనుకున్నారు. అందువల్ల మధ్యవైష్ణవం అంటే తీవ్రవాదం అనే అర్థం వాడుకలోకి వచ్చింది ఎవరయినా ఏ విషయం గురించయినా పట్టుదలగా వాదించినా, తన భావాలను పట్టుబట్టి వదులుకోకపోయినా అతగాడు మధ్యవైష్ణవంలో ఉన్నాడంటారు

మరు మరీచిక: మరువంటే ఎడారి మరీచిక అంటే ఎండమావి ఎడారుల్లో సూర్యకిరణాలు వక్రీకరించినందువల్ల అక్కడక్కడ నీటి మడుగులున్నట్లు భ్రమ కలుగుతుంది ఎంతదూరం వెతుక్కుంటూ పోయినా ఆ నీటిమడుగు దూరదూరంగా ఉన్నట్లనిపిస్తుంది అవి ఉన్నాయన్న భ్రమే మిగులుతుందిగాని తాగడానికి నీళ్ళు దొరకవు. దొరుకుతాయని విశేష పరిశ్రమ చేసి మరింత అలసిపోయి గొంతు ఎండి ప్రాణాంతక పరిస్థితిలో పడిపోతారేగాని దప్పిక తీరదు ఎవరి వల్లనో తమకు ఏదో ప్రయోజనం నెరవేరుతుందని ఆశపడి, ప్రయోజన సాధనకు అష్టకష్టాలు పడి, అఖండ సేవలు చేసి ఉత్తచేతులతో తిరిగివచ్చిన అభాగ్యుడు ఎండమావిని వెంటాడిన దురదృష్టవంతుడితో సమానం అందని దానం, ప్రయోజనం వగైరాలను అందుకే మరుమరీచిక లంటారు సంస్కృత సమాసం వాడి. అంత దేవభాష నేర్వనివాళ్ళు 'అదంతా ఎండమావిలే' అని తెలుగుతో సరిపుచ్చుకుంటారు

మర్కటముష్టి: మర్కటమంటే కోతి. ముష్టి అంటే పిడికిలి, గుప్పిలి. కోతి ఏ వస్తువునయినా పట్టుకుందంటే చచ్చినా వదిలిపెట్టరు. ఎంతమంది ఎన్నివిధాల ప్రయత్నించినా పట్టు వదలదు. అందుకు ఒకటే మార్గం. మన చేతిలో గుప్పిట్లో ఉన్న వస్తువును మనం పారవేస్తే పోటీకి తన గుప్పిట్లో ఉన్నదాన్ని అదీ పారదీస్తుంది. అంతేగాని తనంతతానుగా తాను సంగ్రహించిన వస్తువును కోతి వదిలిపెట్టదు దొరికిన సొమ్మును భద్రంగా పదిలపరుచుకొని, ప్రాణం పోతున్నా బయటపెట్టని వ్యక్తిని మర్కటముష్టివా డంటారు. ఇందులోనూ ఓ తిరకాసుంది. ఏ దైవకార్యం కోసమో మేం పది రూపాయ లిస్తాం, మీరూ ఇవ్వండన్నా కోతిలాగా పోటీపడి ఈ బాపతు మనుషులు చేయి విదల్చరు కోతి కూడా పారేస్తుందికాని ఎటు పారేస్తుందో చెప్పలేం. విసిరివేసిన వస్తువును మళ్లీ లంకించుకోలేదని చెప్పలేం అందుకే డబ్బు విషయంలోగాని, దాన ధర్మాల విషయంలోగాని గట్టి పట్టుపట్టే వ్యక్తిని మర్కటముష్టి అంటారు. రెండో అంతస్తును నా కర్చుతో కట్టమని, మీరందరూ తలా పది చందా వేసి వ్యవహారం నడపండి, నేను అకుపూజ చేయిస్తాననే త్యాగపురుషుడిలాంటివాళ్లను, పిల్లికి బిచ్చం పెట్టనివాళ్లని ఈ పేరుతో పిలుస్తారు తన అనుభవంలో లేని వస్తువును కూడా వదిలిపెట్టని, మరొకరి కివ్వని మహాత్ములందరూ మర్కటముష్టులే. కోతికి కొబ్బరికాయ దొరికితే దానితో అది రకరకాల బంతాట లాడుతుంది తాను పగలగొట్టి తినలేదు అయినాసరే వదిలిపెట్టదు ఆ స్వభావ మన్నమాట మర్కటముష్టి అంటే

మర్యాదరామన్న: ఆకాశ రామన్న ఎంత పిరికివాడో మర్యాద రామన్న అంత నిర్భయుడు. ఇంతాచేసి కుర్రవాడు కూడా. ఒకప్పుడు మర్యాద రామన్న కథలు ప్రాథమిక పాఠశాలల్లో నిర్బంధ విద్యలో భాగంగా ఉండేవి సూక్ష్మబుద్ధితో ఎటువంటి చిక్కుసమస్య నయినా పరిష్కరించే నేర్పు, ఉభయ పక్షాలకూ సంతృప్తికరంగా న్యాయం చెప్పగల శక్తీ ఆ పసివాడి కున్నాయి. గొడ్లుకాచుకొనే కుర్రవాడు ఏదో బండమీద కూర్చుని తిరుగులేని న్యాయనిర్ణయం చేసేవాడు అతడికి స్వార్థంలేదు; స్వప్రయోజనదృష్టి లేదు అందువల్లనే అతడి తీర్పులకు తిరుగులేదు అతడి నిజాయితీని శంకించినవాళ్లు లేరు.

మర్యాద రామన్న కొలువు తీర్చే బండరాయి విక్రమార్కుడి సింహాసనంలాంటిది ధర్మస్వరూపులైన (యమ) ధర్మరాజాదుల తీర్పులయినా అసంతృప్తి కలిగించవచ్చునేమో గాని మర్యాద రామన్న తీర్పుకు తిరుగులేదు అతడి బుద్ధికుశలతకు సాటిలేదు ఒకవిధంగా బడిపిల్లలకు వినోదం, విజ్ఞానం, విలువలూ అందించే విషయాలెన్నో అతడి పరిశీలనలో ఉండేవి మర్యాదా శబ్దానికి ఇప్పటి అర్థం గౌరవంగా చిన్నాపెద్దా భేదం పాటించటం పూర్వపు అర్థం 'కట్టుబాటు, హద్దు' సంఘ మర్యాదలనూ సామాజిక నీతినీ పరిరక్షించే నిర్ణయా లతడెన్నో చెప్పాడు. అందుకే ఎవరైనా "ఇదే సత్యం, ఇదే ధర్మం" అంటే, "ఏం? నీవు మర్యాదరామన్నవా?" అని ఎదురు ప్రశ్నిస్తారు అంతటి గౌరవాన్ని బాల్యంలో సంపాదించిన అదృష్టవంతుడు మర్యాద రామన్న.

మర్రిచెట్టు: ఊడలు తన్ని, సువిశాలంగా విస్తరించే మహావృక్షం (ఊడల) మర్రి బావిలో నీరులా, తాంబూలంలా, స్త్రీ స్తనాల్లా ఎండాకాలంలో చల్లగా, చలికాలంలో వెచ్చగా ఉండేది మర్రినీడేనని ఓ పెద్దకవి వర్ణించాడు. మర్రిచెట్టున్నచోటుకు ఒక మైలువలయంతో తియ్యని నీళ్లు దొరికితీర్తాయనీ, జమ్మిచెట్టులా ఇది సమీపంలో మంచినీటి వసతి ఉందనడానికి నిదర్శమనీ బృహత్సంహిత వర్ణించింది ఈ మహావృక్షం బాటసారులకు

వరప్రసాదంలాంటి దంటారు ఎంత పెద్ద వర్షంలోనయినా తల తడికాకుండా కాపాడే టంత గుబురయిన చెట్టిది అయితే ఆ చెట్టునీడన మరో మొక్క మొలవదు. మొలిస్తే బతకదు. బతికితే పెరగదు. పెరిగితే విస్తరించదు. ఈ లక్షణాన్ని పురస్కరించుకొని మహా వ్యక్తుల అనుయాయులు మర్రిచెట్టు నీడనున్న మొక్కల్లాంటివారనీ, గొప్ప వాళ్ళంతా మర్రిచెట్టులాంటివారనీ అనుభవరీత్యా అర్థాలు పుట్టాయి ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారినిగురించి చెప్తూ ఆయన ప్రథమశిష్యు డనిపించుకున్న తెన్నేటి విశ్వనాథంగారే ఓసారి "మా పంతులుగారు మర్రిచెట్టులాంటి వాడ"ని వాపోయారు!

మాఘమాసపు వాన: మాఘమాసం చలికాలంలో వస్తుంది. తులలో మొదలైన చలి, వృశ్చికంలో పెరిగి, ధనుస్సులో మనుషులు విల్లులాగా వంగిపోయేట్లు చేసి, మకరంలో ఉండచుట్టుకపోయేట్లు చేస్తుందని లోకోక్తి చలి ఎక్కువగానో తక్కువగానో ఉండవచ్చుగాని వాన పడడం రుతులక్షణం కాదు మాఘమాసంలో వాన విచ్చలవిడిగా పడుతుంది దానికో నియమం లేదు కట్టుబాటు లేదు ఇలాగని అనుభవపూర్వకంగా తెలుసుకొన్న పెద్ద లెవరో మరో సామెత సృష్టించారు – 'మాఘమాసపు వాన, మొగుడులేని చాన' అని. భర్తలేని స్త్రీ ఎంత విశృంఖలంగా, నిర్బంధ రహితంగా ఉంటుందో మాఘమాసంలో పడే వర్షం కూడా అంతేనని తాత్పర్యం ఏ సమయంలో ఎవరితో ఎలా ప్రవర్తిస్తారో చెప్పలేం – కొందరు ఖయాలీమనుషుల విషయంలో. అలా అస్పష్టంగా, సందిగ్ధంగా, ఒకసారి తీవ్రంగా మరోసారి జల్లుగా పడే వర్షాన్ని మాఘమాసపు వాన అంటారు మాటల్లో ప్రవర్తనలో ఒక కట్టడి లేనప్పుడు మాఘమాసపు వానతో పోలుస్తారు

మాధవ కబళం: 'మాదాకవళమమ్మా!' అని చదువురాని బిచ్చగాడు దేబిరిస్తే దాన్ని 'మాధవకబళ' మని పండితులు సంస్కరించారు. మా అంటే లక్ష్మి ఆమె ధవుడంటే భర్త అయిన విష్ణువు ఆయన (మారురూపంలోనయినా) అడుగుతున్న అన్నం ముద్ద మాధవకబళం పాతకాలపు బిచ్చగాళ్లు తాము తీసుకొన్నతరువాత 'కృష్ణార్పణ'మనో 'రామార్పణ'మనో అంటుండేవాళ్ళు అంటే – సదరు విష్ణుమూర్తి అవతారాల్లో దేనికోదానికి ఈ అన్నంముద్ద అందినట్లే చెప్పేవాళ్లు ఇది ఈ విధంగా వాడుకలోవున్నా అసలు సంగతి అది కాదనీ, విష్ణుమూర్తి అడుక్కోలేదని కొందరు వివరిస్తారు

అసలు కది 'మాధుకర' మట మధువంటే తేనె మధువును తయారుచేయటం 'మాధుకరం' అలా తేనెను తయారుచేసే ఈగలను (తేనెటీగలను) మధుకరా లంటారు ఎన్నో పూలనుంచి మకరందం (పూదేనె) సేకరించి దాన్ని తేనెగా అవి మార్చినట్లే ఎన్నో ఇళ్లనుంచి తలా పిడికెడు బియ్యమో, తలా ఒక ముద్ద అన్నమో పెడ్తే అలా సేకరించిన ఆహారం తిని బతికేవాళ్లు మాధుకరులనీ, వాళ్ళు చేసేపని 'మాధుకరవృత్తి' అనీ చెప్తారు మాధు–అన్నంతవరకు మాధవుడికీ, కరమన్నభాగం కబళానికి దగ్గరగా వున్నందున మాధుకరం కాస్తా మాధవకబళం/మాదాకబళం అయిపోయిందని వివరిస్తారు

ఇలా బిచ్చ మెత్తడం ఓ 'వృత్తి'కింద పరిగణించేది ఒక్క మన దేశంలోనేమో! వడ్లు దంచినప్పుడు రోటిపక్కన పడిపోయిన గింజలను ఏరుకొని తిని బతకటం

'ఉంఛవృత్తి'ట. పాశ్చాత్య దేశాల్లో – ఒక్క టర్కీలోనే – ఈ 'వృత్తి' జోరుగా ఉండే దంటారు. అక్కడివాళ్లు తలమీది టోపీని తిరగదిప్పి చేతులు చాచారంటే మాదాకబళమమ్మా అని కేక పెట్టకపోయినా అడుక్కుంటున్నట్లే లెక్క. రానురాను టర్కీ టోపీ (Turkish hat) అంటే అడుక్కునే బొచ్చె అనే అప్రతిష్ఠ వచ్చింది దాన్ని పోగొట్టడానికి ఈ శతాబ్దారంభంలో కమాల్‌పాషా తనదేశంలో ఎవరూ పాతకాలపు టర్కీటోపీని ధరించరాదనీ అది శిక్షార్హమనీ శాసించాడు టోపీ తిప్పినా అడుక్కోవటమేనన్న భావన యూరప్‌దేశాలన్నిటిలోనూ ఉంది మనవాళ్ళకు టోపీలు కాదుకదా–తలగుడ్డక్కూడా దరిద్రమే కాబట్టి, బిచ్చమెత్తడం సవాలక్షవృత్తుల్లో ఒకటనే విశ్వాసముంది కాబట్టి, చాటూమరుగూ అనవసరమనిపించి నోరారా అడుక్కోవటం అలవాటయింది – అదిన్నీ విష్ణుమూర్తి పేరిట!

**మాంధాతకాలం:** మాంధాత కృతయుగంనాటివాడు మూడో చక్రవర్తి అయిన పురుకుత్సుడి తండ్రి అయన పుట్టుకే విచిత్రం యవనాశ్వుడనే రాజు సంతానం కోసం యజ్ఞం చేసి భార్యలు తాగవలసిన పాయసాన్ని పొరబాటున తానే తాగి గర్భం ధరించాడట అయన కడుపు చీల్చుకొని పుట్టిన ఉద్దండ పిండం మాంధాత ఈయనకూడా ఇక్ష్వాకు వంశంవాడే. మాంధాత పన్నెండేళ్ళ వయస్సులోనే రాజైనాడు కనపడ్డవారందరితో యుద్ధం చేసేవాడు చివరకు రావణాసురుడితో గూడా పోరాడి, అతణ్ణి బంధిస్తే బ్రహ్మ వచ్చి బతిమిలాడి విడిపించాడు చంద్రవంశంవాడైన అర్జునుడు అష్టకష్టాలుపడి సంపాదించిన పాశుపతాస్త్రం కూడా ఈయన దగ్గర ఉండేదట. బాల రామాయణ నాటకంలో మాంధాత రావణుడితో చేసిన యుద్ధం సంగతి కనిపిస్తుంది ఇక్ష్వాకుల బారసాల అన్నట్లే "ఏమో! ఎప్పుడో! మాంధాతకాలంలో జరిగింది" అని చెప్తుంటారు

**మామిడికింది సోమరి:** మామిడిలాంటి చెట్లెన్నో ఉన్నాయి సోమరిపోతు లెందరో ఉన్నారు అయినా తిరుగులేని సోమరిని మామిడికింది సోమరి అని మాత్రమే అంటారు ఒకవిధంగా నీడ, విశ్రాంతి, ఆహార సమస్య అన్నీ తీరుతాయి కాబట్టి మామిడిచెట్టు కింది సోమరి తన లక్షణం పోగొట్టుకోడనీ, స్వభావం మార్చుకోడనీ జనంలో విశ్వాసం కుదిరింది మామిడిచెట్టుకింద శయనించిన సోమరిపోతుకీ తంజావూరు సత్రంలో మేసిన పనికిమాలినవాళ్లకీ భేదంలే దనేది నమ్మకం

**మార్జాల దాంపత్యం:** పోరాడుకుంటూ కూడా గుట్టుమట్టూలేని సంసారం చేయటాన్ని మార్జాల దాంపత్య మంటారు దంపతులు ఎడమొహం పెడమొహంగా ఉంటూకూడా ఒక గూటిలో ఉండటం ఒక ఎత్తు ఊరూనాడూ పోగయ్యేదాకా అరుచుకుంటూ దెబ్బలాడుకుంటూ కూడా కాపరం చేయటం మరో ఎత్తు ఈ రెండోరకం సంసారాన్ని మార్జాలాల దాంపత్య మంటారు దీనికి కేవలం వ్యతిరేకంగా – గుట్టుగా అన్యోన్యంగా ప్రవర్తించే దంపతులను చిలకాగోరింకల్లాగా ఉన్నా రంటారు నిజానికి చిలకా, గోరువంకా ఒకేజాతి పక్షులు కావు వాటి మధ్య శారీరక సంబంధమూ ఉండదు. అయినా వాటిని ఒకే పంజరంలో బంధిస్తే ఎంతో అన్యోన్యంగా ఉన్నట్లు కనిపిస్తాయి ప్రవృత్తులూ స్వభావాలూ భిన్నమయినా సర్దుకొనిపోతూ సరిపెట్టుకుంటూ పరస్పరానురాగం ప్రదర్శిస్తూ ఉండే జంట చిలకా గోరింకలు అన్ని విధాల ఒకే జాతికీ

భిన్నలింగాలకు చెంది సంపర్కం పెట్టుకోవలసిన పిల్లులు మాత్రం పోరాడుకుంటాయి. అందువల్ల అనుకూల దంపతులను చిలకాగోరువంకలనీ, ప్రతికూల దంపతులను మార్జాల దంపతులనీ వర్ణించటం వాడుకలోకి వచ్చింది

**మిట్ట పెత్తనం:** తాను శ్రమపడకుండా, పని చేయకుండా, చేస్తున్నవాళ్లను అదమాయిస్తూ గదమాయిస్తూ అర్భాటం చేయటాన్ని మిట్టపెత్తన మంటారు. మిట్ట అంటే ఎత్తయిన చోటు, గట్టు. పెత్తనం నిజానికి 'పెద్దతనం' – వయసులోగాని, అధికారంలోగాని పెద్దరికం. అటువంటి ఆధిక్యం లేకపోయినా హంగామా చేయటం, పెత్తనం 'చెలాయించటం'. తన ఒళ్ళు అలవకుండా, కట్టుకున్న గుడ్డ మడతలయినా చెదిరిపోకుండా పైనుంచి పెత్తనం వెలగబెడ్తే అది మిట్టపెత్తనం. అది తెచ్చిపెట్టుకున్నదీ కావచ్చు. పారంపర్యంగా సంక్రమించిందీ కావచ్చు. ఇప్పటి ఇంగ్లీషులోని 'backseat driving' అనే పద బంధానికి సమానమైన అభివ్యక్తి. తమ చేతగాదు చేయనూ లేదు తాను కానీ చేసేవారికి సూచన లివ్వటం, తప్పు లెన్నటం, ఆదేశించటం వగైరాలను మిట్ట పెత్తన మంటారు.

**మిడతంభొట్లు:** ఇది పేరుమోసిన పిచ్చిపేరు. భొట్లు అనేది భట్టు శబ్దం నుంచి పుట్టిన తెలుగు మాట పెట్టుశాస్త్రి, పుట్టుశాస్త్రి అన్నట్లు కొందరికి పుట్టుకతో ఈ భట్ట శబ్దం పౌరుష నామంగా వస్తే, చాలా కొద్దిమందికిది పెట్టుపేరుగా వస్తుంది తెలుగు సాహిత్యంలో నన్నయభట్టు, శ్రీనాధభట్టు అని ఇద్దరే నిలిచారు – ఈ బిరుదుగల వాళ్లు. పధ్నాలుగు శాస్త్రాల్లో ప్రావీణ్యం సంపాదిస్తేగాని ఈ బిరుదు దొరికేది కాదు (అప్పట్లో గౌరవ బిరుదులు ప్రసాదించే సంస్థలు లేకపోవటంవల్ల తక్కుంగల కవులకిది దక్కలేదని విచారించాలి ). మన మిడతం భొట్లు పుట్టు భట్టేగాని పెట్టు భట్టు కాదు అసలు మిడత అనే పేరు ఎవరూ పెట్టుకోరు దాన్ని మాత్రం ఈయన 'విద్య'ను గుర్తించి ఎవరో పెట్టి వుంటారనిపిస్తుంది మిడతం భొట్లు శకున మనేది పూర్తి మాట

ఈ గుప్పిట్లో ఉన్నదేమని అడిగితే 'మిడత' అని చెప్పాడట ఓ జోస్యుడు నిజంగా మిడతే ఉండటంతో అయన చాలా గొప్ప జోస్యుడని ఊహించుకున్నారు దరిమిలా అలాగే ఊహించి చెప్తుంటే ఎన్నోసార్లు అయన చెప్పిన మాటలు అన్నీ సరి అయినాయి అతడి జాతకం భంగపడకుండా, జాతక చక్రాలు వగైరా వేయకుండా, సాముద్రికం పుట్టుమచ్చల శాస్త్రం వగైరాలేవీ చదవకుండా, పరీక్షించకుండా చెప్పింది నిజమయితే దాన్ని మిడతంభొట్లుశకున మంటారు. చెప్పింది సరిపోతుందిగాని తెలిసిచెప్పింది కాదన్నమాట

**మింటి దీపం:** మిన్నంటే ఆకాశం కొందరు ఆకాశదీపమని ఏకంగా సంస్కృత సమాసాన్నే వాడ్తారు. దేవాలయాల్లో – ముఖ్యంగా శివాలయాల్లో – కార్తీక పౌర్ణమినాడు ధ్వజస్తంభం మీద ఈ దీపాలను వెలిగిస్తారు. దాన్ని కార్తీక దీపమని కూడా పిలుస్తారు. వెన్నెల రాత్రి, స్వచ్ఛమైన దీపం మినుకు మినుకు మంటూ చల్లగా వెలుగుతుంటుంది – చాలా ఎత్తున ఎంత ప్రయత్నించి ఎంత జాగ్రత్తగా గుమ్మటంలో పెట్టి ఎత్తున వెలిగేట్లు ఏర్పాటు చేసినా గాలి తాకిడికి అది త్వరలో ఆరిపోతుంది. అంత ఎత్తున ఉన్న దీపం 'కొండెక్క'కుండా కాపాడే ఉపాయం లేదు. ఆరేముందు ఆ దీపం మరింత ప్రకాశవంతంగా వెలుగుతుంది – అంతే. అంత త్వరగానూ ఆరిపోతుంది. ఒక్క వెలుగు వెలిగి అంతలోనే ఆరిపోయే దీపమది కొద్దికాలంలో ఐశ్వర్యం గడించి,

అంతలోనే దరిద్ర స్థితికి వచ్చిన వ్యక్తుల గురించి చెప్పేటప్పుడు 'ఆ భోగమెంత సేపండి? ఆకాశదీపం!' అంటారు తాత్కాలిక వైభవాన్ని, సుఖ భోగాలను ఆకాశ దీపంతో పోలుస్తారు

ముకుర దీక్ష: ముకురం అంటే అద్దం. దీక్ష అంటే పట్టుదల. ఈ మాటను విద్యార్థినుల గురించి నిర్దయగా ప్రయోగించేవాళ్ళు పూర్వం. ఇప్పుడయితే 'అమ్మాయి చదువుకున్నదా?' అంటే – 'ఏదోలెండి పెళ్ళి చదువులు' అని చప్పరిస్తారు విషయం తెలుస్తుంది ఇలా కాకుండా ఏ మధ్యవర్తులో 'ఆ అమ్మాయి ముకుర దీక్షలో ఉంటుందండి' అని ఆక్షేపణగా చెప్తారు. అంటే – ఎప్పుడూ అద్దం ముందు కూర్చుని అలంకారం సరిచూసుకుంటుందని, అలంకరణప్రియ అని మాత్రమే కాదు అర్ధం మధ్యయుగాల్లో ఒక దురాచారం ఉండేది. ఒక వేశ్యకు ఒక కుమార్తె పుట్టి యుక్తవయస్కురా లయిందనుకోండి. అప్పు డామెకు కన్నెరికం ఏర్పాటుచేసి వృత్తిలో ప్రవేశపెట్టేవాళ్లు– అధికారపూర్వకంగా ఆ సమయంలో ఆ పిల్ల జన్మకు కారకుడని వేశ్య నమ్మిన వ్యక్తిని పిలిపించి, సదరు తండ్రి ఒడిలో పిల్లను కూర్చోపెట్టి, తండ్రి చేత పిల్లకు అద్దం చూపించటమనే తంతు నడిపేవారు. దానికి 'ముకుర దీక్ష' అని పేరు శ్రీనాథుడో, వినుకొండ వల్లభరాయుడో తెలుగు చేసిన క్రీడాభిరామంలో ఈ దీక్షా విధాన వర్ణన కనిపిస్తుంది ఈ మాటను ప్రయోగించిన వ్యక్తి ఒక ఆడపిల్ల అలంకార ప్రియత్వాన్ని కాక ఆమె శీలాన్ని అధిక్షేపిస్తూ పెళ్ళి చెడగొట్టే ప్రయత్నంలో ఉన్న పండితంమన్యుడని గ్రహించాలి అద్దంలో సౌందర్యం చూసుకోవటమనే బలహీనత స్త్రీజన సాధారణం. పురుషుల్లోనూ కొందరు అలాంటివాళ్ళున్నారు – ఉంటారు ముకుర దీక్ష అనే దుష్ప్రయోగం ఆధారంగా సదరు బలహీనతను శీలరాహిత్యంగా చిత్రించటమే దుర్మార్గం. అయితేనేం? ఈ విశాల ప్రపంచంలో అన్ని లక్షణాలూ ఉంటాయి

ముగ్గులోకి దింపటం: తాళం సరిగ్గా పట్టినప్పుడుగాని భరతం పట్టినప్పుడుగాని అవతలివ్యక్తి ముగ్గులోకి దిగుతాడు. నాట్యం చేసే ప్రదేశాన్ని శుభ్రపరచి అక్కడ ముగ్గులు వేస్తారు దాన్ని సంస్కృతంలో 'రంగవల్లి' అంటారు అంటే రంగస్థలంలో వేసిన తీగ (వల్లి) లాంటి గీతలు పూజ చేసేటప్పుడు ముఖ్యంగా పూజా స్థలాన్ని ముగ్గులతో అలంకరించినట్లే నాట్యం, నాటకం ప్రదర్శించేటప్పుడు కూడా రంగస్థలాన్ని అలంకరించి 'రంగపూజ' చేసిగాని కార్యక్రమం మొదలుపెట్టరు అది మన సంప్రదాయం. ముగ్గు వేసినచోట దీపారాధన చేసి, రంగదేవతకు నమస్కరించి, భరతుణ్ణో నందకేశ్వరుణ్ణో స్మరించి, వాద్యాలకు దణ్ణంపెట్టి 'ముగ్గులోకి దిగుతారు' – అంటే నాట్యమో నాటకమో మొదలుపెడ్తారు. ఈ ఆచారాల్లో చాలా మార్పులు వచ్చినా సంప్రదాయ నటులు 'పరాబ్రహ్మపరమేశ్వర' అనే నాందీవాచకం పాడిగాని తెర యెత్తరు. అలా ముగ్గులోకి దిగిన తరువాత వాళ్ల బాధలు వారివి ప్రదర్శన బాగుంటే మెప్పులు, లేకుంటే దెప్పులు తప్పవు. అందువల్ల ముగ్గులోకి దింపటం అంటే – కష్టాల్లో పడెయ్యటం అనే అర్థం, పనిలో ప్రవేశపెట్టడం అనే అర్థవిశేషం వచ్చాయి

చివరకు కుస్తీ పోటీల్లో కూడా రంగంలోకి దిగే ముందు గురుపూజ చేయటం, నేలతల్లికి మొక్కి మట్టి నెత్తిన పోసుకోవటం ఆచారమయింది ఆ పోటీ జరిగే

రంగస్థలం 'బరి'. బరిలోకి దిగటమంటే పోటీకి సిద్ధపడటమనీ, బరిలోకి దింపటమంటే పనిలో ప్రవేశపెట్టడం, బాధల్లోకి దింపటమనీ అర్థాలు వచ్చాయి. ముగ్గు వేసినా వేయకపోయినా ఈ సందర్భాన్నికూడా ముగ్గులోకి దింపటంగా భావించేవాళ్లున్నారు పాత అలవాట్లు మారినా మాటలు మారలేదన్నమాట మాటలు మారకపోయినా కొత్త అర్థాలు వచ్చాయన్నమాట భాష ఇలాగే వికసిస్తుంటుంది

మునిపల్లె వినాయకుడు: గుంటూరు జిల్లాలో పొన్నూరు–గుంటూరు రహదారి మధ్యలో మునిపల్లె గ్రామముంది ఆ ఊరి దారి మధ్యలో పెద్ద వినాయక విగ్రహముంది వినాయకుడు కూర్చుని ఉంటాడు రోడ్డు పక్కన చిన్న దేవాలయం కట్టారు రాతివిగ్రహం కాబట్టి కదలదు, మెదలదు మాటా పలుకూ లేకుండా, పనీ పాటా చేయకుండా, ఎవరయినా కూర్చొని ఉంటే ఆ ప్రాంతంలో 'మునిపల్లె వినాయకు'డని వెక్కిరిస్తుంటారు ఎవరి విషయమూ పట్టించుకోని, ఎందులోనూ కల్పించుకోని మందకొడి మనిషిని మునిపల్లె వినాయకు డనటం పరిపాటి అయింది.

మూడు–ఆరు: పూలు మూడే ఉంటే మూడే కాయలు కాసే అవకాశముంది కానీ మూడు పూలకు ఆరు కాయలు వచ్చాయంటే మామూలుకు రెండింతలు ఫలితం వచ్చిందన్నమాట. అభివృద్ధి అనుకొన్న దానికన్నా ఎక్కువ వచ్చినట్లు. ఈ పద ప్రయోగాన్ని ఇటీవలి రచయితలు తెగ సాగ తీసి 'మూడు సీసాలు – ఆరు గ్లాసులు' వగైరా ప్రయోగాలు సాధిస్తున్నారు 'ఆయన పని మూడు ఆర్లుగా' ఉందని చెప్పటం కూడా కద్దు అంటే దశ తిరిగి కానీ పెట్టుబడితో అణా సంపాదిస్తున్నాడని మెచ్చుకొన్నట్లు. కొందరీసంఖ్యలనే తిరగవేసి దురదృష్టవంతుడిని చెప్పడానికి "పాపం! ఆయనకు ఆరు మూడయిందట" అని సానుభూతి వాక్యాలు పలుకుతుంటారు మూడారు కావటం పురోభివృద్ధి; ఆరు మూడవటం అనర్థం. ఈ అంకెలనే ఈ విధంగా ఎందుకు వాడటం మొదలయిందో, రెట్టింపుగా సగంగా విలువలున్న ఇతర సంఖ్యలను ఈ విధంగా ఎందుకు వాడటం లేదో కారణం చెప్పలేం ఉన్న వాడుక ఇది లేని వాడుకను సృష్టించినా లోకం మెచ్చి ప్రయోగిస్తుందని చెప్పనూలేం. కొన్ని మాటలే నిలుస్తాయి అది భాషా లక్షణం.

మూడోకన్ను: శివుడికీ శిశుపాలుడికీ మూడు కళ్లున్నాయి శిశుపాలుడి మూడో కన్ను శ్రీకృష్ణుడు ఎత్తుకోగానే రాలిపోయింది భృగు మహర్షి అరికాలుకు మరో కన్నుంటే అయన కాళ్ళు పిసుకుతూ సేవలు చేసిన విష్ణుమూర్తి దాన్ని కాస్తా పొడిచి పారేశాడు. శివుడి మూడో కన్ను నిప్పులు కురుస్తుంది. అందుకే దాన్ని అయన మూసే వుంచుతాడు ఏ మన్మధుణ్ణో తగలేయడానికో, ప్రళయం సృష్టించడానికో తప్ప ఆ కన్ను తెరవడు అయన కళ్ళల్లో ఒకటి సూర్యుడు, రెండోది చంద్రుడు, మూడోది మాత్రం అగ్ని విపరీతమైన కోపం వస్తే తప్ప లయ కారకుడైన రుద్రుడు మూడో కన్ను తెరవడు తెరిస్తే కోపం వచ్చినట్లు. అందుకని ఎవరైనా మండిపడుతుంటే 'అయన మూడో కన్ను తెరుస్తున్నా' డంటారు కొందరు మూడో కన్నంటే జ్ఞాన నేత్రమని వివరిస్తారు అది తక్కిన రెంటిలా బయటికి కనిపించదని, విజ్ఞానులకు మాత్రమే ఉంటుందనీ చెప్తారు కానీ సామాన్యజన దృష్టిలో మూడో కన్నంటే పిచ్చి కోపమే.

**మూడో కాలు:** వయసు మళ్ళి నడుం వంగి సరిగా నడవలేనివాళ్ళ అధారంగా పట్టుకొనే కఱ్ఱ/బెత్తం మూడో కాలికింద లెక్క. కఱ్ఱపోటు వేసుకుంటూ తడుముకుంటూ నడిచే వయసు మళ్ళిన వ్యక్తిని 'మూడు కాళ్ళ ముసలి' అంటారు అంతేగాని, కొయ్యకాలుతో నడిచే అభాగ్యులందరినీ మూడు కాళ్ళ ముసలి అని చెప్పరు వయసు ముఖ్యంగాని ఈ ప్రయోగంలో అంగవైకల్యం ప్రధానం కాదు

**మేకపోతు గాంభీర్యం:** పోతుమేక మెడ చన్నులతో కొమ్ములతో గంభీరంగా కనిపిస్తుందేగాని, అట్టహాసంగా తలవంచి కుమ్మబోతుందేకాని దానికి ధైర్యం, బలం, సామర్థ్యం లేనేలేవు ఎవరైనా తాను 'లేస్తే మనిషిని కా' నన్నట్లు ఆర్భాటం చేస్తున్నా, తిన తిండిలేకపోయినా మీసాలకు సంపెంగనూనె రాసుకొని హంగామా చేసినా, లోపల మధనపడుతూ బయటికి హుందాగా నటించినా 'అదంతా మేకపోతు గాంభీర్య'మని కొట్టిపారేస్తుంటాం లేని ఘనత ఉన్నట్లు కనిపిస్తే అది మేకపోతు గాంభీర్యం పైన పటారంగా, లోన లొటారంగా, తెలంగాణా భాషలో 'ఊపర్ శేర్వాణీ, అందర్ పరేశానీ' అన్నట్లుండటం మేకపోతు గాంభీర్యం

**మేడికాయ బోనం:** బోనం అనే మాట భోజన శబ్దం నుంచి పుట్టింది ఆహారం, తిండి అని అర్థం 'మేడి పండు చూడ మేలిమై యుండును, పొట్ట విచ్చి చూడ పురుగులుండు'నన్న వేమన్న వివరణను నమ్మి, దాన్ని చూడనివాళ్ళు కూడా దాని సంగతి 'పైన పటారం, లోన లొటారం' అని గుర్తించవచ్చు పైకి మెరమెచ్చులు మాట్లాడుతూ లోపల విషం పెట్టుకొని వ్యవహరించే వ్యక్తులను గురించీ, వారు చేసే మర్యాద మన్ననల గురించీ ప్రస్తావించేటప్పుడు "అదంతా మేడికాయ బోనంలెండి" అంటారు – నమ్మనక్కరలేదనే భావంతో చిలకమర్తివారు గయోపాఖ్యానంలో ధర్మరాజును కృష్ణుడు ఆక్షేపించిన సందర్భంలోని 'మాట తీపిగాని మనసు విషము' అనే వాక్యం సరిగ్గా సరిపోతుంది – దీనికి తాత్పర్యార్థంలో ఈ జాతీయానికి 'మోసం, దగా, కుళ్ళు, కుట్ర' వగైరా అర్థాలున్నాయి

కొంతమంది 'ఈ ప్రపంచం తీరే ఇంత' అని ఉసూరుమనే వాళ్ళున్నారు వాళ్ళ వాడుకలో 'మేడికాయ లోకం' అనే పర్యాయరూపం వినిపిస్తుంది 'ఉన్న దొకటీ, పైకి కనిపించే దొకటీ' అనే భావంతో ఈ మాట పుట్టింది. దీనికి వేదాంతార్థం చెప్పేవాళ్ళు లేకపోలేదు ఈ మాయామేయ జగమంతా మేడికాయలోకం కాబట్టి లేనిది ఉన్నట్లు కనిపిస్తుందని, మిథ్యాసంసారం సుఖంగా కనిపించినా అంతా దుఃఖమయమేనని, ఈ లోక వ్యవహారమంతా మేడిపండులాంటిదనీ ఈ నిస్పృహావాదులు వాదిస్తారు

**మేనమామ పోలిక:** మేనత్త, మేనమామల పోలికలు పిల్లలకు రావటంలో ఆశ్చర్యం లేదు రక్తసంబంధం కారణంగా అయినా, మేనత్త పోలిక అనేది జాతీయం కాలేదు మేనమామ అంటే మన్మథుడికి మేనమామ అయిన చంద్రుణ్ణే దృష్టిలో పెట్టుకొని మేనమామ పోలిక అన్నమాట పుట్టింది అయితే చక్కదనం సంగతి కాదు ఇక్కడ అన్వయించేది చంద్రుడు చల్లగా ఉంటాడు అది పైపై చల్లదనం మాత్రమే విరహ జ్వరంలో వెచ్చనూర్పేవాళ్ళ శరీరాలకు అతగా డెంత చల్లగా స్పర్శసుఖమిచ్చినా మనసులు కాల్చి చంపుతాడు వాళ్ళని 'చందమామ' అని మనం పిలిచే చంద్రుడు ప్రేమలో పడ్డవాళ్ళకు ప్రాణాంతకుడు కొందరు దీన్ని న్యూనోపమగా

కంసుడికి అన్వయిస్తారు. శ్రీకృష్ణబలరాముల మేనమామ మధురా నగరానికి ఆహ్వానించి ఊరికి వచ్చిన మేనల్లుళ్ళను చంపటానికి ప్రయత్నించాడని అందరికీ తెలుసు పోలిక ఇక్కడితో ఆగిపోతుంది ఆహ్వానంలో ఉన్న శాంతం, చల్లదనం, ఆప్యాయతా ఆచరణలో, ఆతిథ్యంలో లేవు. పైకి తియ్యగా మాట్లాడుతూ లోపల కుళ్ళు పెట్టుకొన్న వ్యక్తులగురించి ప్రస్తావించేటప్పుడు "ఆయనది మేనమామ పోలిక లెండి!" అని ఓ విసురు విసురుతారు అంటే మేనమామ పోలికగల వ్యక్తి పయోముఖ విషకుంభం లాంటివాడని భావం దొంగ ప్రేమ నటించేవాడని, వీలు చూసుకొని కాటేసేవాడనీ తాత్పర్యం

మేషపుచ్ఛం: 'మేషం మేక' అని వినాడూ ఎవరు తప్పుగా అర్థం చేసుకొని చెప్పారో, చెప్పటం మొదలుపెట్టారోగాని, 'గొర్రె'కు బదులు 'మేక' అనే అర్థం వచ్చింది మేష శబ్దానికి మేష పుచ్ఛం అంటే గొర్రెతోక. 'నిష్ఫలం, నిరుపయోగ' మనే అర్థంలో ఈ మాటను వాడుతుంటారు మిగతా జంతువుల్లాగా తన తోకతో విసురుకోవటం కుదరదు పురుగుల్ని తోలటానికి పనికిరాదు అయినాసరే, గొర్రెతోక అవిరామంగా కప్పగొంతులాగా విశ్రాంతి లేకుండా ఉంటుంది పనికిరాని ఉత్తుత్తి అరుపుల్లాగా పనికిమాలిన కదలికతప్ప మరేమీ లేనప్పుడు, 'అతగాడా! మేషపుచ్ఛ మనుకోండి' అని వెటకారం చేస్తుంటారు

మొగలి పొద: మొగలిచెట్టు పొదగా పెరుగుతుంది సాధారణంగా మంచినీటి వసతి ఉన్న చోటనే గుబురుగా పెరుగుతుంది. ఇసుకపర్రల్లో బాగా విస్తరిస్తుంది గాని వీలయినంత భాగం చెమ్మ తగిలేట్లు వ్యాపిస్తుంది. చల్లదనంకోసం పాములు చేరుతాయన్నది కొంత నిజం – ఎక్కువ భాగం ఊహ. మిణ్ణాగులవంటివి ఆ పొదల్లో ఉంటాయని, అవి ప్రాణాంతకమైనవనీ చాలామంది నమ్ముతారు. మొగలి పువ్వు వాసనకే పాములు చేరుతాయనేది మరో విశ్వాసం మొగలి రేకులూ పువ్వులూ అలంకార వస్తువులు – ముఖ్యంగా పెళ్ళినాటి పూల జడలకు ప్రశస్తం. వాటి వాసన ఎంత ఆహ్లాదకరంగా ఉంటుందో అవి దొరికే పొదలు అంత ప్రమాదకరమైనవన్న భావనతో పైకి సరసంగా, సుకుమారంగా ప్రవర్తిస్తూ గుండెల్లో విషంలాంటి ద్వేషం దాచుకొనే వ్యక్తులను మొగలిపొదల్తో పోల్చి చెప్తారు కట్టుకునే గుడ్డలు సువాసనతో గుబాళించాలంటే మొగలి రేకులను మడతలమధ్య పెట్టుకొంటారు కొందరికి అలా చేస్తే పాములు వెంటబడతాయన్న భయముంటుంది మన్మథ బాణమని మొగలి రేకుల్ని అభిమానించే సరసులున్నారు. వారికి నాగ భయం, ప్రాణ భయం లేదు అతగాడు మొగలి పొదలాంటివాడంటే పైకి సరసంగా ప్రవర్తించినా ప్రమాదకర వ్యక్తేనని భావం

మొసలి కన్నీళ్ళు: అందిన ప్రాణిని నమిలి మింగే మొసలి కన్నీళ్ళు పెట్టి జీవుల మరణ యాతనకు స్పందించదు–ద్రవించదు. దాని మనసు కరిగిపోతుందని కూడా ఎవరూ ఊహించలేరు. అనేక జలచరాలున్న మడుగులో ఉంటుంది కాబట్టి, అది కాటికాపరిలాగా తిండి దొరకలేదని ఏడ్చే అవసరమూ లేదు కడుపునిండా సంతృప్తికరంగా తిండి దొరికినప్పుడు అది ఆనంద బాష్పాలు కారిస్తే కార్చవచ్చు. అది జంతువు కాబట్టి మానవ సహజంగా ఇతరుల బాధలకు విచారపడవలసిన సామాజికావసరాలు కూడా దీనికి లేవు అందుకని దొంగఏడుపు ఏడవ్వలసిన పనికూడా లేదు. ఒకవేళ

కారణాంతరం వల్ల కన్నీళ్ళు కార్చినా అది దుఃఖంతో చేసిన పనికాదు ఈ లక్షణాన్ని ఆంగ్లేయులు కూడా గ్రహించారు వాళ్ళ భాషలో కూడా సమానార్థకమైన ప్రయోగముంది లోకభావనలో మొసలికన్నీళ్ళంటే లోలోపల సంతోషిస్తూ బయటికి ఏడుస్తున్నట్లు నటించటం మాత్రమే అందువల్ల కల్లబొల్లి ఏడుపు, దొంగ ఏడుపు, లోకవంచన మొదలయిన అర్థాల్లో ఈ మాట స్థిరపడిపోయింది

మోచేతిబెల్లం: కొంగుబంగారంలా ఇది అందుబాటులో ఉండేదికాదు అలాగని లేని వస్తువూ కాదు బెల్లపచ్చులను మోచేత్తో పగలకొట్టి ముక్కలు చేసేవాళ్ళు. ఆ సమయంలో ఏ కొంచెం బెల్లమయినా అక్కడ అతుక్కుంటుంది చేతిలో కాకపోయినా చేతికి అంటుకొని అయినా ఉందిగదా అని తినాలన్నా నాకాలన్నా వీలుకాదు. ఏ మహా యోగికో, ఏ పెద్ద సర్కసు పనివాడికో సాధ్యం కావచ్చుగాని మామూలు వ్యక్తి నోటికి మోచేయి అందదు మరో చేత్తో గోకి తీసుకోవలసిందేగాని తక్షణం నోటికి అందేదికాదు అందుబాటులో ఉన్నట్లుండి లేని వస్తువు మోచేతి బెల్లం అలాగని అసలు దొరకనిదీకాదు భూమిలో పాతిన సొమ్ముకన్నా త్వరగా లభిస్తుంది గాని, గోకి తీసుకోవటంలో, కడిగి మోచేతిని శుభ్రపరచటంలో ఎంతో కొంత వృధాకాక తప్పని వస్తువది ఉన్నా వెంటనే దొరకనిదీ, మరో విధంగా అనుభవంలోకి వచ్చేదీ, తీసుకునే ప్రయత్నంలో కొంత పోగొట్టుకోక తప్పనిదీ మోచేతి బెల్లమన్న మాట

యంబ్రహ్మ అంత బ్రహ్మాండమైన పేరు తెచ్చుకొన్న బ్రహ్మను తేలికచేసి 'యంబ్రహ్మ, యంబ్రమ్మ (గాడు)' అనే మాటలు పుట్టాయి "యం బ్రహ్మ వేదాంతవిదో వదన్తి" అనే శ్లోకపాదానికి, "వేదాంతం తెలిసినవాళ్ళు, యం=ఎవరిని/దేన్ని, బ్రహ్మ అని పిలుస్తారో (వదన్తి)" అని అర్థం బ్రహ్మశబ్దానికి "పరమాత్మ, వేదం" అనే అర్థాలున్నాయి బ్రహ్మ పదార్థమని కూడా భగవంతుణ్ణి ప్రస్తావిస్తారు ఆమాటేగాని, ఆ శ్లోకభాగమేగాని, తరువాత ఏముందో తెలియని, చదవని వ్యక్తిని 'యంబ్రహ్మ/యంబ్రమ్మ' అంటారు ఆదిలోనే హంసపాదులా మొదటి శ్లోకం మొదటి చరణంతోనో చదువు మానివేసిన అసమర్థుణ్ణి, బద్ధకస్థుణ్ణి ఈ పేరుతో పిలుస్తారు రానురాను ఈ మాట 'ఎంబెన్న'గా మారింది – వాడుకలో తెలివి తక్కువవాడు, అసమర్థుడు, అజ్ఞాని అనే అర్థాల్లో ఈ మాట వ్యవహారంలో నిలిచింది

యాతాం తర్పణం: చచ్చిపోయిన వాళ్ళ తృప్తికోసం వదిలే నీళ్ళు తర్పణం ఆ నీళ్ళను కొద్దిగా వదిలిపెట్టారుగాని ఎవరూ కుండపోతగా పోయరు అయితే విసుగు వల్లనో, కోపద్వేషాలతోనో, లోకనిందకు వెరిచి తన కిష్టంలేకపోయినా తర్పణం వదిలిపెట్టాల్సివచ్చిన ఓ మహానుభావుడు తన పెద్దల తృప్తికోసం ఏకంగా ఏతామెత్తి నీళ్లతోడి తర్పణ చేశాను పొమ్మన్నాడని ఒక కట్టుకథ అది శ్రద్ధతో విడిచిన తర్పణం కాదు ఒళ్లుమండి అఘాయిత్యంగా చేసిన పని అన్నమాట ఇలాంటి ఘనకార్యం ఇంత ప్రపంచంలో ఇంతకాలంలో ఏ ఒక్క మహాత్ముడయినా చేసివుండవచ్చు ఎక్కడయినా. ఇలా ఎందుకు చేశావంటే – 'అశ్రద్ధ పితాళ్ళకు' ఇంతకన్నా ఏం చేయాలని ఎదురు చెప్పాడట పితాళ్ళు అంటే చనిపోయిన పెద్దలు; తండ్రులు తాతలూ ముత్తాతలూ వాళ్లు తనను అశ్రద్ధగా పెంచారు కాబట్టి, వాళ్ళ రుణం పదింతలుగా తీర్చుకుందామని ఏతామెత్తి నీళ్ల వదులుతున్నా నన్నాడట ఆ పెద్దమనిషి తక్కువ మేలుచేసిన

వాళ్ళకు ఎక్కువ మేలు చేయటాన్ని యాతాంతర్పణ మన్నారు అప్పటినుంచీ యాతాం అన్నది 'ఏతాం/ఏతం' అనే మాటకు వ్యవహారంలోని రూపాంతరం

యుగంధరుడు: ప్రతాపరుద్రీయ నాటకం తెలుగులో మౌలికంగా వచ్చి.. తొలితరం రచనల్లో ప్రసిద్ధమయింది అందులో చిట్టచివరి కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుడు రాజు ఆయన మంత్రి యుగంధరుడు ప్రతాపరుద్రుడనే రాజు, అతణ్ణి ముస్లిం సేనలు జయించి బంధించటం, ఢిల్లీకి పోతూ దారిలో ఆ రాజు ఆత్మహత్య చేసుకోవటం చరిత్రకు తెలిసిన వాస్తవాలు ఆయనకు యుగంధరుడనే మంత్రి ఉన్నాడని, అతడు పిచ్చివాడిలా ప్రవర్తించి, మొగలాయీ చక్రవర్తిని మోసగించి ఢిల్లీ నుంచి రాజును స్వదేశం చేర్చాడనేవి చరిత్ర ఎరుగని కల్పనలు చారిత్రకాంశాన్ని ఆధారంగా తీసుకొని చరిత్రనే మార్చి రాసిన ఈ నాటకం ఒకప్పుడు స్టేజీ నాటకంగా పేరుమోసింది యుగంధర వేషంలో ఏకపాత్రాభినయం చేయటం నటుడి సమర్థతకు చిహ్నంగా ఉండేది

యుగంధరుడనే చారిత్రక వ్యక్తి లేడన్నమాట నిజం ప్రతాపరుద్రుడు నర్మదానదిలో దూకి ఆత్మహత్య చేసుకున్నాడని సాక్ష్యం చెప్పే శాసనం కూడా దొరికింది వేదంవారు సృష్టించిన ఈ పాత్రకు మూలం లేకపోయినా ఆధారం లేకపోలేదు సంస్కృతంలో భాస మహాకవి 'ప్రతిజ్ఞాయౌగంధరాయణం, స్వప్నవాసవదత్త' అనే నాటకాల్లో మహామంత్రిగా ఉండి, రాజునూ రాజ్యాన్నీ రాజకుటుంబాన్నీ అనేకవిధాల కాపాడిన యౌగంధరాయణుడనే ప్రసిద్ధ పాత్ర ఉంది ఆ పేరుకూ వేదంవారి పాత్ర పేరుకూ చాలా దగ్గరి సంబంధముంది యుగంధరశబ్దం మీదినుంచి యౌగంధర అనే తద్ధితరూప మేర్పడుతుంది అతగాడికి సంబంధించిన కథే యౌగంధరాయణం అంటే భాస పాత్రకు తండ్రిలాంటి పాత్రను కల్పిస్తున్నానని వేదంవారు మనసులోనయినా భావించి వుండవచ్చు

భాసుడి పాత్ర పిచ్చివేషాలు వేయలేదు పిచ్చివాడిలా నటించలేదు చాలావరకు అదృశ్యపాత్రలా తెరచాటునుంచి వ్యవహారం నడిపాడు మన యుగంధరుడికిక్కాడా విద్యానాథుడు, చెకుముకి శాస్త్రి, జనార్దనమంత్రివంటి సహాయకులున్నారు వారిలో మొదటివాడు చరిత్రకు తెలిసినవాడు తక్కినవాళ్ళు కల్పిత పాత్రలు ఈ విషయా లెలా ఉన్నా యౌగంధరాయణుడు ప్రతిజ్ఞ చేసి దాన్ని నెరవేర్చుకున్నట్లు మన యుగంధరుడు కూడా తాను చేసిన బాసను నిల్పుకొంటాడు బ్రహ్మాండమైన తెలివితేటలుండి, పరమ రాజభక్తుడై రాజనీతి ధురంధరుడైన అదర్శమహామంత్రిగా వేదంవారు యుగంధరుణ్ణి దిద్దితీర్చారు ఆయన ప్రజ్ఞ జనాన్ని ఆకర్షించింది అందుకే సునిశితమై ఉపాయశీలమైన బుద్ధిగల వాళ్లను 'యుగంధరుడే' అని మెచ్చుకుంటున్నారు నాటకంలో యుగంధరుడు వేసిన పిచ్చివాడి వేషం, ప్రదర్శించిన భుజబలం వగైరాలు తాత్కాలికంగా ఆకర్షిస్తే, అతడి ప్రజ్ఞాపాటవాలు శాశ్వతముద్ర వేశాయి జనమనస్సుల్లో పరమమేధావిని యుగంధరుడని మెచ్చుకుంటున్నారు

రామదండు: 'రామదండు' అనే మిశ్రసమాసాన్ని పండితులు హర్షించరు కానీ జనవ్యవహారం ఆమోదించింది లంకాయుద్ధంలో రాముడికి తోడ్పడ్డ దండు (సేన) రామదండు అంటే 'కోతిమూక' సంఖ్యాధిక్యంవల్ల కోతిమూకేగాని అందులో జాంబవంతుడివంటి ఎలుగుబంట్లు కూడా ఉన్నాయి రామకార్యమనే పవిత్ర కర్తవ్యం నెరవేర్చటానికి పనికివచ్చిన సేన కాబట్టి రామదండుకు మంచిపేరే వచ్చింది ఆ

దండు పరమాద్భుతంగా పోరాడింది తమకన్నా శక్తియుక్తులూ మాయలూ మంత్రాలూ నేర్చినవాళ్ళూ అయిన రాక్షసులతో పోరాడింది

రామదండు చేసిన యుద్ధం తీవ్రాతితీవ్రం దాన్ని 'రామదాడి' అంటారు ఆ మాట కాలక్రమాన 'రాందాళి, రవంధాళి' వగైరా రూపాంతరాలు పొందింది అకస్మికంగా తీవ్రంగా పోట్లాట జరిగినా అది 'రవంధాళి'గా జరిగిందంటారు జాతీయోద్యమం అంత తీవ్రంగానూ జరపాలనే కోరికతో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య తాను కలికాలపు 'రామదండు'ను నిర్మించాడు అంతకు ముందూ ఆయన తరవాతా "కాంగ్రెసు సేవాదళం" అనే వాలంటీర్ల బృందం ఉండగా ఆయన మాత్రం మొదట చీరాలలో రామదండును పునస్సృష్టించి విస్తరించాడు ఆయన రామదండు కాషాయరంగు లంగోటీలు బిగించి, చేతికర్రలే ఆయుధాలుగా వాడింది ఈ దండు గూడా కుప్పిగంతులు పెట్టాలని హాస్యప్రియుడైన గోపాలకృష్ణయ్య ఆచరణలో పెట్టించారని అప్పటివాళ్ళు చెప్తుంటారు! ఇప్పుడు రామరాజ్య ప్రసక్తేగాని రామదండు ప్రస్తావన వినిపించటమే లేదు

రామబాణం: రాముడి బాణం వేస్తే అది అనుకున్న లక్ష్యాన్ని భేదించక తప్పదుట అది ఒక్క దెబ్బతో ఏడు తాటిచెట్లను పడగొట్టి పాతాళం దాకా కిందికి పోయి తిరిగివచ్చి ఆయన అమ్ములపొదికి చేరేదనేది వర్ణన అందువల్ల ఒక్క బాణంతోనే ఆయన ఎన్ని యుద్ధాలైనా చేయవచ్చు! కానీ రావణుడి మీద చాలా బాణాలు వేయవలసివచ్చింది అందుకే ఇది వర్ణన, అతిశయోక్తి అని చెప్పాలి అయితేనేం, దానికి తిరుగులేదనే విశ్వాసం కుదిరింది. "ఆయనోమాట చెప్పాడంటే చాలు, అది రాంబాణం" అనే వాడుక వచ్చింది. ఆయన మాటకు తిరుగులేదని, చెప్పినట్లు జరిగితీరుతుందనీ నమ్మకం

రామరాజ్యం: శ్రీరామచంద్రుడు రావణవధానంతరం అయోధ్యా సింహాసనమెక్కి వేల సంవత్సరాలు పరిపాలించాడట ఆయన రాజ్యంలో ధర్మం నాలుగుపాదాలా నడిచిందంటారు ధర్మదేవత గోరూపంలో తిరుగుతుంది కాబట్టి ధర్మానిక్కూడా నాలుగుపాదా లుండేవిట కృతయుగంలో నాలుగుపాదాలతోనూ నడిచే ధర్మదేవత కలికాలంలో ఒంటికాలితో నడుస్తుందంటారు పురాణవేత్తలు మరి "త్రేతాయాం రఘునందనః" అన్న మాట ప్రకారం ఆయన (రాముడు) రెండోయుగం నాటివాడు కాబట్టి ధర్మం అనాటికే ఒక కాలు కుంటి వుండాలి ఆ కుంటే శంబుకవధలాంటిదని కొంద రాక్షేపిస్తే, మరికొందరు ఆ యుగంలో రాజ్యమేలిన ఇతర రాజుల కాలంలోనేగాని రాముడేలే రోజుల్లో అంతా సవ్యంగానే ఉండేదని వాదిస్తారు

రామరాజ్యంలో వర్ణాశ్రమధర్మాచారాలు సజావుగా సక్రమంగా నడిచేవనేది విశ్వాసం వర్ణభేద మనేది అపసవ్య వ్యవహారమనుకొనే నేటి హేతువాదులు రామరాజ్యం ఏ లోటూ ఏ పాటూ లేకుండా నడిచిందని నమ్మరు–నమ్మలేరు కానీ గాంధీజీ స్వతంత్ర భారతదేశంలో రామరాజ్య పునర్నిర్మాణం జరగాలని వాంఛించాడు ఇప్పుడు భారతీయ జనతాపార్టీ వంటివి రామరాజ్య పునఃస్థాపన చేసి తీరాలంటున్నాయి కాంగ్రెస్‌వాళ్లు రామరాజ్యం స్థాపించటానికే జాతీయ సంగ్రామం తెచ్చామన్నారు–అంటున్నారు నలభై ఏళ్లు పాలించారు ఈ కాలంలో వారన్నట్లు రామరాజ్యమే మళ్లీ వచ్చివుంటే అదెలాటిదో మనకు అనుభవపూర్వకంగా తెలుసు ఈ కాలంలో రామరాజ్యమంటే ధర్మపాలనమని అందరూ నమ్మటంలేదు మొత్తంమీద ఈ మాటకు పూర్వగౌరవంలేదు

పరుషంగా, ఆక్షేపణగా, నిందారూపంలో మాట్లాడేవారిని గురించీ ఈ జాతీయాన్ని వాడుతారు

రేచుక్క పగటిచుక్క: రేచుక్క అనే దొంగ రాత్రులే (రే/రేయి = రాత్రి) దొంగతనం చేసేవాడు పగటిచుక్క పట్టపగలే దొంగిలించేవాడు ఈ ఇద్దరు దొంగలూ చేసిన ఘన కార్యాలను వర్ణిస్తూ కథలు పుట్టాయి ఒకర్నొకర్ని మించిన దొంగలనడానికి "వాడు రేచుక్క అయితే వీడు పగటి చుక్క"లాంటి వాక్యాలతో మెచ్చుకుంటారు 'చుక్క' అన్న మాట 'శుక్ర' శబ్ద భావం బుద్ధికి బృహస్పతి అన్నట్లు రాక్షస గురువైన శుక్రుడు నీతికీ తెలివితేటలకూ పేరుమోసినవాడు అంత వాడి పేరును ఘరానా దొంగలకు తగిలించి ఆనందించే ఘనత మన తెలుగువాళ్లదే

రేవతి వర్షం: రేవతి కార్తెలో వానలు పడితే అన్ని పంటలకూ మేలే కలుగుతుందని రైతుల నమ్మకం పదిమందికి పెట్టే దాతనూ నలుగురితోనూ అన్యోన్యంగా స్నేహంగా ప్రవర్తించే వ్యక్తినీ రేవతి వర్షంతో పోల్చటం కద్దు 'జనముద్దుబిడ్డ' అన్నట్లు జనరంజకుడయిన వ్యక్తి రేవతి వర్షంతో పోల్చదగ్గవా డన్నమాట

రోకటిపాట: గ్రైండర్లు వచ్చిన ఈ కాలంలో వాటిని వాడే సుకుమారులకు ఈ మాటకున్న అర్థం పట్టుపడదు రోకళ్ళూ రోళ్ళూ అలవాటులోనుంచి వాడుకలోనుంచి మరుగైపోతున్నా మాటమాత్రం నిలిచింది రోకలితో దంచేటప్పటి శ్రమను మరిచి పోడానికి పాటలు పాడుతుండేవాళ్ళు రోకటిపాటలనే జానపదగేయా లనేకమున్నాయి అయితే వాటన్నిటి 'బాణీ' ఒకే మోస్తరు చేసే శ్రమకూ వాడే భాషకూ ఒక తీరు సమన్వయముంటుంది ఆ పాటల్లో అయినాగానీ బాణీలో మార్పుండదు పని పూర్తయ్యేదాకా ఆ పాట సాగుతూనే ఉంటుంది రోకలి పరిమాణం, దంచే వ్యక్తి శరీర సౌష్ఠవం, దంచే వస్తువుల కాఠిన్య మృదుత్వాలూ వగైరా కారణాలవల్ల కూడా ధోరణిలో మార్పుండదు లయబద్ధత ఉంటుందిగాని అది సణుగుడుగా, ఆయాసంతో సాగుతుంది అందుకని చెప్పిందే చెప్తున్నా, ధోరణి మారకపోయినా 'ఏమిటీ రోకటిపాట' అనటం అలవాటయింది ఈ పాట స్త్రీలకు మాత్రమే పరిమితం - దంపుడు పని వారిదే కాబట్టి

లకోటా ప్రశ్న: ఇది జ్యోతిషంలో నిత్య వ్యవహారంలోకి మెట్టిన జాతీయం కాగితం మీద ప్రశ్న రాసి దాన్ని కవరులో పెట్టి మూసివేసినా అందులో ఉన్న ప్రశ్నను తెలుసుకొని దానికి సమాధానం చెప్పటమనే పద్ధతి ఒకటుంది వేసే ప్రశ్నను బహిరంగంగా కాక రహస్యంగా ఉంచటం, లిఖిత రూపంలో పెట్టడం ఇందులోని విశేషం దాన్ని చూడకుండా చదవకుండా దానికి సమాధానం చెప్పటం జ్యోతిషుల శక్తికి నిదర్శనం ఈ పద్ధతి శాస్త్రీయతనూ సమాధానం చెప్పేవారి నేర్పునూ అలా ఉంచి లకోటా ప్రశ్న అంటే చాలా ముఖ్యమైన ప్రశ్న అనే అర్థం వచ్చింది లకోటా శబ్దం హిందీ నుంచి ఎరువుగా వచ్చిన మాట ఉత్తరం దాచివుంచే కాగితపు సంచి అనేది దాని సాధారణార్థం

లక్కగేదె: ప్రపంచంలో ఎవరూ లక్కతో గేదె బొమ్మలు చేయరు - చేసినా ఇది బొమ్మ అనే అర్థంలో పుట్టిన మాటా కాదు అది గేదెలా పాలివ్వదు - గడ్డి తినదు అన్నివిధాలా పనికిమాలిన వస్తువే వట్టిపోయిన గేదెను కొందరు లక్కగేదె

అంటారు దానివల్ల ఉపయోగం శూన్యమయిందని చెప్పటానికి అది లక్క గేదె అని వాడుతుంటారు ఇన్ని వస్తువులుండగా దాని స్వభావ లక్షణాలను వివరించడానికి లక్క శబ్దాన్నే ఎందుకు వాడేరో తెలీదు

**లంక మేత:** 'లంక మేతకూ ఏటి ఈతకూ సరిపోయిం'దనేది సామెత నది మధ్యన ఉండి, వరదలు వచ్చినప్పుడు ఒండ్రు పేరుకొని సారవంతమైన భూమి లంక భూమి అక్కడ కావలసినంత దుబ్బు గడ్డి లభిస్తుంది అడ్డుపెట్టేవాళ్ళు లేనందువల్ల కడుపు పట్టినంత తినవచ్చు తిండికి కొరత లేదు నీటికి లోటు లేదు ఎటొచ్చీ నది మధ్య నుండే లంకను చేరటానికి ఈదక తప్పదు నది ఎంత వెడల్పుగా ఉంటే ఈత అంత కష్టసాధ్యం ఇంత శ్రమపడి తిండి సంపాదించుకొన్న తరవాత సాయంకాలానికి కొట్టం చేరక తప్పదు అంటే మళ్ళీ అంత శ్రమాపడి ఈదులాడక తప్పదు తిన్నతిండి మొత్తం ఈ పరిశ్రమవల్ల హారాయించుకుపోతుంది ఒంటపట్టే దేమీ ఉండదు ఎంత పుష్కలంగా గడ్డి దొరికినా, ఎంత విశ్రాంతిగా ఎంత తిన్నా, తిన్నదంతా ప్రయాసకిందనే వృథా అయిపోతుంది కాబట్టి లంక మేత అంటే 'నిష్ఫల ప్రయాస, అనవసర శ్రమ' అనే అర్థం వాడుకలోకి వచ్చింది

**లంకెబిందెలు:** ఇనప్పెట్టెలూ, లాకర్లూ, బ్యాంకు వ్యవస్థాలేని రోజుల్లో (సాధారణంగా) రాగిబిందెల్లో విలువైన వస్తువులను దాచి పాతిపెట్టేవాళ్ళు దొంగలకు సులభంగా దొరకకుండేందుకు బరువైన బిందెలను ఒకటికి రెండు కలిపి బిగించి అమూల్య వస్తువులను మధ్యలో ఉంచి పైనా కిందా అనవసర వస్తువులను నింపి పాతిపెట్టేవాళ్ళు వాటి పైనా పక్కలా పాము తేలు వంటి వాటి బొమ్మలనూ దేవతా విగ్రహాలనూ ఉంచేవాళ్ళు – అవి కాపాడతాయని, ఇతరులను భయపెడ్తాయనీ వారసులు తీసుకోకపోయినా, ఏ ప్రమాదం వల్లనయినా కుటుంబం అంతరించినా, దేశాంతరం పోయినా ఆ లంకెబిందెలు మరెవరికయినా దొరకవచ్చు దొరికిన వాళ్ళు అకస్మాత్తుగా ఐశ్వర్యవంతులు కావచ్చు అందువల్ల ఎవరయినా ఒక్క సారిగా ధనవంతులయినా రనిపిస్తే వారికి లంకెబిందెలు దొరికాయనటం పరిపాటి అయింది

**లంగూడీ:** ఇది వ్యాకరణ పండితుల, విద్యార్థుల వాడుకలో ఉన్న జాతీయం చిన్నయసూరి బాలవ్యాకరణంలో "ఇఈ ఎఏలం గూడిన చజలు తాలవ్యంబులు" అని రాస్తే మాటలను ఎక్కడికి విరిచి చదవాలో తెలియని వాడొకడు 'లంగూడి' అన్న భాగాన్ని విడదీసి, ఆ మాటకు అర్థమేమని గురువుగారి నడిగాడని ఒక కథ ఆ భాగానికి ఏ అర్థమూ లేదు "రామునితో కపివరుండిట్లనియె" అన్న వాక్యాన్ని ఇలాగే చదివిన వ్యక్తి 'రామునితోక' అని విడదీసి అర్థం కుదరక బాధపడ్డా రంటారు లంగూడి అలాంటిదే అర్థం జ్ఞానం లేకుండా చదివేవాణ్ణి 'లంగూడినాడు!' అని ఆక్షేపించటం ఇందువల్ల ఇటీవలికాలంలో ఈ శబ్దంతో మొదలయింది

**లింగపోటు:** ఊహించని ప్రమాదాన్ని లింగపోటని వర్ణిస్తుంటారు వీరశైవులు మెడలో లింగకాయ కట్టుకుంటారు; రుద్రాక్షలమాల వేసుకుంటారు వారి వారి తాహతునుబట్టి మెడలో ధరించే లింగం ప్రమాణం, దాన్ని చేసిన లోహం మారుతుంటాయి ఒకానొక వీరశైవ భక్తుడు బాగా గడించాడు మెడలో వెండి లింగకాయ కట్టుకున్నాడు – తన ఐశ్వర్యానికి చిహ్నంగా ఇప్పటికీ బంగారుగొలుసులూ పులిగోర్లూ ధరించే మొగవాళ్లు చాలామంది ఉన్నారు అలాగా ఆయన లింగకాయ కట్టుకున్నాడు ప్రయాణం

చేసి వస్తుండగా దారిలో ఈ మెడలోని లింగం ఒక దొంగ కంటపడింది దాన్ని కాజేద్దామని దొంగ వెంబడిస్తే, భక్తుడు దాన్ని కాపాడుకోవటానికి పరుగుతీశాడు పరుగు వేగం పెరిగేకొద్దీ శివలింగం ఊపందుకొని రొమ్మంతా పుండుచేస్తూ బాధించటం మొదలుపెట్టింది. చచ్చీచెడీ సొమ్ము పోకుండా కొంప చేరుకున్నప్పుడు 'దొంగపోటు కన్నా లింగపోటే ఎక్కువ బాధించింద'ని వాపోయా డనేది కథ మెడలో ధరించిన లింగం ఇంత బాధ పెడ్తుందని అత డూహించలేదు. అది అలంకార మనుకున్నాడు రక్షరేకులాంటి దనుకున్నాడు అదే ఎక్కువ బాధించింది. అలా అనుకోని బాధ, ప్రమాదం, కష్టం వచ్చిపడితే అది లింగపోటు లాంటిదనటం పరిపాటి అయింది.

*లింగంమీది ఎలుక:* ఎలుక విడిగా కనిపిస్తే అదిరిస్తాం చంపటానికి ప్రయత్నిస్తాం అది శివలింగంమీదికెక్కితే దానిమీదకు కఱ్ఱ విసరటానికి వీల్లేదు. దేవుడికి అపచారం చేసినట్లవుతుంది దెబ్బ ఎలుకకు తాకకపోవచ్చు – శివలింగానికి తగలవచ్చు కాబట్టి, లింగంమీది ఎలుకను చంపే వీలులేదు అలాగని దాన్ని వదిలిపెట్టడానికీ వీలుపడదు శివుడికని పెట్టిన నైవేద్యాన్ని అది ఎంగిలి చేస్తుంది తింటుంది కాబట్టి తోలిపారేయకా తప్పదు 'ఈగవాలితే చెప్పుతో కొట్టి' గౌరవభావం ప్రదర్శించినట్లవుతుంది ఈగ ఎగిరిపోతుంది చెప్పు దెబ్బ అభిమానించి గౌరవించే వ్యక్తికి తగులుతుంది అటువంటి సందిగ్ధస్థితిని వర్ణిస్తూ, ఏమీ చేయటానికి వీల్లేని అశక్తతను వివరిస్తూ 'లింగంమీది ఎలుక' అంటారు. ఇది 'ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య' అన్నట్లు పరిణమించే సందిగ్ధావస్థకు చిహ్నం.

*లుబ్ధావధానులు:* గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కం చదివిన వాళ్ళందరకూ లుబ్ధావధానులు చిరపరిచితులే ఆయన స్వభావం పేరులోనే ఉంది. లుబ్ధుడంటే లోభి, పిసినారి, పిసినిగొట్టు. డబ్బుకు గడ్డితిని కన్నకూతురు జీవితం ధ్వంసం చేశాడు తాను తినక, ఇతరులకు పెట్టక, జీవితకాలంలో ముప్పాతిక భాగం వెళ్ళదీసినవాడు చివరిదశలో పెళ్ళిచేసుకొని కొడుకును కంటే ఆస్తి నిలుస్తుందనుకున్నాడు! చౌకగా దొరుకుతుందనుకొని అగ్నిహోత్రావధానులు కూతురును చేసుకుందామనుకొన్నాడు కరటకశాస్త్రి, రామప్పంతులు వగైరాలు మోసం చేసి మగసన్యాసికి ఆడవేషం వేయించి ఇతడికి కట్టబెట్టారు! కోపంతో వ్యాజ్యాలకు దిగాడు 'లోభికి మూటనష్ట' మన్న సామెతను రుజువు చేశాడు. చిట్టచివరికి జ్ఞానోదయమయిందిగాని ఏం ప్రయోజనం? కాటికి కాలు చాచిన స్థితిలో వచ్చిన జ్ఞానం ముందే వస్తే ఎంత బాగుండేది?

లోభిని గురించి ఓ పూర్వ కవి ఓ శ్లోకం చెప్పాడు – "కృపణో ధనలోభేన స్వభార్యాం నాభిగచ్ఛతి, అస్యాం యో జాయతే పుత్రః, స మే విత్తం హారే దితి" అని. లోభివాడు స్వభార్యతో సంసారం చేయడు కర్మంచాలక ఆవిడ కడుపు పండి కొడుకు పుడ్తే, వాడు నా ఆస్తిని కాజేస్తాడని అతడికి భయమన్నాడు కవి! ఆ మాట శుద్ధాబద్ధమని నిరూపించడానికి లుబ్ధావధానులు పెళ్ళాడి, కొడుకును గని, వాడికి సమస్తం కట్టబెట్టి పోదామనుకున్నాడు! ఎప్పుడు? ఎనభైయేళ్ళ వయసులో స్వరూప స్వభావాలను పూర్తిగా తెలుసుకోవాలంటే కన్యాశుల్కం చదవాలి ఫలానావాడు 'పరమలోభి' అనడానికి లుబ్ధావధాను లంటారు!

**లొట్టాభట్టీయం:** మిడతం భొట్లులాంటివాడే లొట్టాభట్టు కూడా. పెట్టుభట్టు. పచ్చి తెలుగువాడు అందులోనూ గోదావరివాడు. అయనెవరో తక్కిన వివరాలు తెలియవుగాని బడబడా వాగుతుంటాడని, లేలేత సొరకాయలు కోస్తుంటాడని ప్రతీతి. ఇలాంటి వ్యక్తులను 'కోతలరాయు'ని కూడా పిలుస్తారు భట్టీయం అంటే ఇక్కడ భట్టుగారి పట్టు, పద్ధతి అని అర్థం. 'అదంతా లొట్టాభట్టీయం' అంటే 'అవన్నీ కోతలే'నని అర్థం బడాయి మాటలను లొట్టాభట్టీయ మంటారు.

**వంటింటి కుందేలు:** "తప్పించుకోలేనిది" అనే అర్థంలో ఈ మాట వాడ్తారు కుందేలు పిరికి జంతువేగాని దాన్ని ఉచ్చువేసి పట్టాల్సిందే చాలా వేగంగా ఎగురుతూ గెంతుతూ దూకుతూ పరిగెత్తుతుంది. దొరికిన కుందేలును చెవులు పట్టుకొని లేవదీస్తారు. పొట్టనొక్కితే చచ్చిపోతుంది ఆ భాగం పరమసుకుమార మయింది కుందేలును పట్టుకున్న వేటగాడు దాన్ని నేలమీద పెట్టి చుట్టూ అరంగుళమెత్తున మట్టికుప్పవేసినా సరే – ఆ 'కోటగోడ'ను దాటి అది పారిపోదు! చిన్నపుల్లతో ఆ మట్టికుప్పలో కాస్త దారిపెడ్తే చాలు, చెంగున ఎగిరి దూకిపారిపోతుంది! అది దాని స్వభావం–బలహీనత కూడా. దొరికిన తరవాత ఏ కాస్త అడ్డున్నాసరే అది పారిపోదు–పోలేదు. కుందేలును వంటింట్లో బంధిస్తే అది తప్పించుకోవటమనే ప్రశ్నేలేదు. అందువల్ల మనకు దొరికిపోయి తప్పించుకోలేని ఏ వ్యక్తిని గురించయినా వంటింటి కుందేలని వ్యవహరిస్తారు భారతీయ కుటుంబంలోని స్త్రీని గురించి కూడా ఇలాగే వ్యవహరించేవాళ్లు. ఉద్యోగం, సంపాదన, విడాకులను గురించిన ఆలోచనవంటి వేమీ లేకుండా కేవలం వంటమనిషిగా మాత్రమే బతికే ఆడవాళ్లను కూడా వంటింటి కుందేళ్లతో పోలుస్తారు

**వకార పంచకం:** ఒక ఆదర్శ పురుషుడికి ఉండవలసిన లక్షణాలు అయిదని, వాటిని వకారంతో మొదలయ్యే మాటల్తో చెప్పారు వంశం, వపుస్సు (శరీరం), వాక్కు (మాటకారితనం), వస్త్రం, విభావం అనేవి వకారపంచక మన్నారు మంచి కుటుంబంలో పుట్టి, ఆకర్షణకరమైన శరీరం ఉండి, మాటకారి అయి, మంచి గుడ్డలు ధరించగలిగి, భోగ భాగ్యా లనుభవించగలగటం ఉత్తమ పురుష లక్షణమని పూర్వులు చెప్పారు. ఇటీవలి కాలంలో మరో వకార పంచకం వెలిసింది. వకీలు, వేశ్య, వర్తకుడు, విద్వాంసుడు, వైద్యుడు అనే అయిదు రకాల వృత్తుల వాళ్ళని ఇందులో చేర్చారు అయితే ఇవి ఉత్తమ మానవ చిహ్నాలయిన వృత్తులని కాదు చెప్పింది. వీరికి జీవిత కాలంలో ఎప్పుడో ఒకసారి మహర్దశ వస్తుందని. మరో లక్షణం – ఉన్న ఊళ్లోగాక తమ వృత్తి నైపుణ్యాలవల్ల పర ప్రదేశాల్లో వీళ్లు రాణించగల రనేది. 'అతిపరిచయా దవజ్ఞా, సంగతగమనా దనాదరో భవతి' అన్నారు వ్యక్తి బాగా తెలిసివుంటే గౌరవం తగ్గిపోతుంది రాకపోకలు ఎక్కువయితే మర్యాదలు తగ్గిపోతాయి. అందువల్లనే వేశ్య ఊళ్లు మారుస్తుంటే వృత్తి బాగా సాగుతుంది. వర్తకుడు నానా దేశాలు తిరుగుతుంటేనే ఎక్కువ సంపాదించగలడు. వైద్యుడు పర స్థలాలకు పోయి వస్తుంటే అతడి భేషజం బయటపడకపోగా పెద్ద వైద్యుడనే పేరు తెచ్చుకుంటాడు వకీలు ఉన్నచోటనే ఉంటే ఎదగడు. పండితుడు దేశ సంచారంవల్లనే ప్రసిద్ధుడవుతాడు ఈ అయిదు వృత్తుల వారికీ జీవితం అన్ని కాలాల్లోనూ సాఫీగా జరగదు ప్రచారం అవసరం. ప్రజాభిమానం సంపాదించటానికి సమయం పడ్తుంది

వేశ్యకు వయసు పెరిగే కొద్దీ వాసి తగ్గుతుంది. తక్కిన వాళ్ళకు వయస్సుతోనే అనుభవం పెరుగుతుంది. ఈ భేదమున్నా మొత్తంమీద అందరికీ ప్రజలను ఆకట్టుకోవలసిన అవసరముంది. స్వశక్తి ఎంత అవసరమో పరుల అభిమాన గౌరవాలు అంతే అవసరం. వృత్తి సర్వకాల సర్వావస్థల్లోనూ ఒకేవిధంగా సాగదు వకీలనే ఉర్దూ పదాన్ని ఈ పంచకంలో చేర్చారు కాబట్టి ఇది ముస్లిం దండయాత్రల తరవాత – క్రీస్తుశకం 14 వ శతాబ్ది మధ్యకాలం తరవాత పుట్టిన మాట అని చెప్పవచ్చు హెచ్చు తగ్గులూ, దారిద్ర్య భోగాలూ ఈ అయిదు వృత్తులవారికీ చక్రనేమిక్రమంలో ఉంటాయి. వీరికి ఐశ్వర్యం పట్టిందన్నా, దరిద్రం వచ్చిందన్నా 'వకార పంచకం కదా మరి' అని చప్పరించటం కద్దు.

వట్టిగొడ్డు తాకట్టు: ఒకరి వస్తువును మన దగ్గర ఉంచుకొని దాని విలువకు తగ్గ నగదును అప్పుగా ఇస్తే అది తాకట్టు అరువు – ఎరువు అనే రెండు మాటలు తాకట్టు శబ్దానికి కోస్తాలో పర్యాయ పదాలుగా ఉన్నాయి రాయలసీమలో అడుమానం అంటారు దాన్నే డబ్బుగా నగదు రూపంలో ఇచ్చిన అప్పును అరువంటారు. వస్తురూపంలో ఇస్తే అది ఎరువు అవుతుంది. ఒకానొకవ్యక్తి ఏనాడో తన దగ్గర ఉన్న గొడ్డును తాకట్టుగా పెడ్తానంటే ఓ అమాయకుడు సరేనని సొమ్ము బదులిచ్చాడు అప్పు తీర్చటం లేదు పోనీ ఆ గొడ్డుదగ్గర పాలు పిండి ఎంతో కొంత చెల్లు వేసుకుందామంటే అది వట్టిపోయింది అంటే ఎండిపోయింది పాలివ్వదు. చెల్లుసొమ్ము రాకపోగా అది చావకుండా బతకడానికి దానికింత గడ్డి వెయ్యక తప్పదు – నీళ్లు పట్టకా తప్పదు – కుడితి పొయ్యకపోయినా. ఇచ్చిన నగదు తిరిగి రాకపోగా తాకట్టు పెట్టుకున్న గొడ్డుకు తిండిపెట్టే కర్చు నెత్తినపడి, ఇచ్చినవాడు ఇబ్బడి ముబ్బడిగా నష్టపోవలసి వచ్చింది అందువల్ల వట్టిగొడ్డు తాకట్టంటే సర్వాంగక్షౌరంలాంటి దన్నమాట అన్నివిధాలా నష్టపోయే వ్యవహారం. అదాయం లేకపోగా పెట్టుబడి తప్పదు. ప్రభుత్వరంగ సంస్థల స్థాపన ఈ కాలంలో వట్టిగొడ్డు తాకట్టుకిందనే లెక్క. పూర్వమో పెద్దమనిషి మీసం తాకట్టు పెట్టేడని "తనదు మీసము తీసి, తాకట్టుగా బెట్టి, కొట్ల డెగ్రం డర్థి కొర్కెదీర్చె" నని ఓ పద్యపాదముంది. పెట్టిన వాడికింత పేరువచ్చిందిగాని తాకట్టు పెట్టుకున్న దౌర్భాగ్యుడి నామరూపాలుకూడా వినిపించటంలేదు – కనిపించటంలేదు

వల్లకాట్లో రామనాథయ్య: ఆకాశ రామన్న చిన్నవాడో పెద్దవాడో మొగో ఆడో తెలియదు కాబట్టి మహా అయితే రామన్నగాడని వ్యవహరిస్తారేమోగాని చాలావరకు మర్యాదగానే తలుచుకుంటారు ఎవరో తెలియకపోయినా విసుగ్గా తక్కువచేసి మాట్లాడేది వల్లకాట్లో రామనాథయ్యను గురించే ఈయన కూడా రామశబ్దవాచ్యుడే అయితే ఆయన నివాసస్థలం శివుడుండేచోట–వల్లకాడు–అంటే శ్మశానం. ఈయన ఫక్తు తెలుగువాడు కావచ్చు కావచ్చేమిటి? ఇంటి పేరువల్ల తెలుగువాడే రామయ్య కన్నడ దేశంలో కూడా ఉండవచ్చుగాని ఈ ఇంటి పేరు అతడికి దక్కదు

పుకార్లు పుట్టించడం, లోకం ఇలా కోడై కూస్తున్నదని ఏ అబద్ధమో, అభాండమో చెప్పి పనులు చెరచటం, తా నెవరో చెప్పకుండానే మన 'శ్రేయోభిలాషి'లాగా వ్యవహరించటం రామనాథయ్య లక్షణాలు "ఫలానావాళ్ళు ఇలాంటి పాడుపని చేశారు కదా?" అని ఎవరో అంటారు "చేశారన్నది ఎవరు?" అంటే మటుకు, "ఎవడైతేనేం?

వల్లకాట్లో రామనాధయ్య అనుకో" అని మొండికిపడటం ఆనవాయితీ అత డెవరో తెలీదు తెలిసినా చెప్పటం ఇష్టంలేకపోతే ఈ ప్రయోగం చేస్తారు

క్లుప్తంగా ఇలాంటి ప్రసంగం వచ్చినప్పుడు పాతకాలంవాళ్లు మరోమాట వాడ్తారు "ఎవడో కశ్మన్న ఎవడయితేనేం? విషయం నిజమా కాదా అన్నది ప్రశ్న" అని దబాయించటం కద్దు కశ్మన్న అనేది వ్యక్తి పేరు కాదు కానీ అలాగనిపిస్తుంది "కశ్చన" అనే సర్వనామశబ్దానికి "ఎవడో ఒక"డని అర్థం సంస్కృతం వాడకపోయినా దాని ప్రభావం ఇంతో అంతో వున్నకుటుంబాల్లో ఈ కశ్మన్న వినిపిస్తాడు-కనిపించడుగాని కశ్మన్నకు మర్యాదా మన్ననలూ లేవు – ఈసడింపులూ లేవు

రామనాధయ్య ఇంటిపేరే విశేషం శివుడు వల్లకాట్లో తిరుగుతుంటాడని విన్నాం గాని ఎవరూ చూసినట్లు లేదు అక్కడ మానవ మాత్రులెవరైనా ఉంటే – తాత్కాలికంగానయినాసరే – కొన్ని రకాల వాళ్ళుమాత్ర ముంటారు కాటికాపరులు, శవ దహనానికో ఖననానికో వచ్చి దరిమిలా వెళ్ళేవారు శవ సంస్కారం చేయడానికి వచ్చినవాళ్లు ఆ జీవి బతికుండగా చేసిన పనులు – మంచీవీ చెడ్డవీ – తలుచుకోవటం, అవి బాధాకరమైతే చీదివేయటం, చెడ్డవయితే విమర్శించటం అసంభావ్యంకాదు అందువల్లనే ఒక వ్యక్తి మంచిచెడ్డలు తెలుసుకోవాలంటే శ్మశానం దాకా పోయిరావాలంటారు ఒకవేళ పరమదుర్మార్గుడే పోయాడనుకొండి "ఇన్నిచేసి ఏం పాముకున్నా"డని అతడి కిరాతకాలను ఏకరువు పెట్టడంలో అతడి జీవితరహస్యాలను కొన్ని బయటపెట్టవచ్చు అటువంటి సమయాల్లో ఎవరీమాట అన్నదని పట్టించుకోరు అలాగ వల్లకాట్లో జీవిత విశేషాలు కొన్ని బహిరంగ మవుతుంటాయి విషయానికే ప్రాముఖ్యంగాని వక్తకు ప్రధానత్వం లేదు బహుశా ఈ కారణంతో రామనాధయ్యకు ఇంటిపేరుగా వల్లకాడే శాశ్వతత్వం సంపాదించి ఉండవచ్చు ఇలాంటి మాటలు పుట్టడానికి ఇదే కారణమని ఎవరూ కరాఖండిగా చెప్పలేరు వీటి వివరణలు చాలామటుకు ఊహామీదనే ఆధారపడి వుంటాయి ఆకాశరామన్న విషయంలోలాగే ఇందులోకూడా రామశబ్దం సత్యస్వరూపుడైన భగవంతుడని వక్తనుద్దేశించి పెట్టివుంటారు ఏనాడో ఎవరో

**వశిష్ఠవాక్యం:** సప్తర్షుల్లో ఒకడుగా, సూర్యవంశపు రాజులకు కులగురువుగా పురాణ ప్రసిద్ధుడైన వ్యక్తి వశిష్ఠుడు ఆ మహర్షి చెప్పినమాట అనే సాధారణార్థంలో ఈ మాట పుట్టింది వివాహాది క్రతువుల్లో పెద్దరికం వహించే పురోహితులను కూడా వశిష్ఠులవారని చెప్పటం కద్దు వేదాంతాది విషయాల్లో పురాణ మహర్షి మాట కెలా తిరుగులేదో పెళ్ళిళ్ల వంటి శుభకార్యాలను నిర్వహించేటప్పుడు ఈ వశిష్ఠులవారి మాటకు తిరుగులేదు ఆయన చెప్పింది శాస్త్రం ఆయన అంగీకరించింది ఆచారం ఈ దృష్టితో వశిష్ఠవాక్యం అంటే తిరుగులేని నిర్ణయమనే అర్థం

**విడుపు శృంగారం, ముడుపు శృంగారం:** తెలుగులో ఒక సామెత ఉంది – 'ఇల్లు వెళ్లగొడ్తే విడుపు శృంగారం, మొగుడు వెళ్ళగొడ్తే ముడుపు శృంగారం' అని విడుపు అంటే విడుదల, విముక్తి, స్వేచ్ఛ ముడుపు అంటే సొమ్ము, అలంకారం తనంతట తాను భర్తనూ ఇంటినీ వదిలిపెట్టి బజారున పడితే అప్పుడు స్వతంత్రంగా శృంగారమయ జీవితం గడపవచ్చు పెళ్లాడిన భర్త ఇంట్లోంచి వెళ్లగొడితే అప్పుడు భుక్తి కోసం కూడా డబ్బు తీసుకొని, అలంకరించు కొని వ్యభిచరించవచ్చు ఇలాగని ఓ ఇల్లాలు భావించిందని సామెత వెక్కిరింపు భర్త చాటున తిరిగితే విడుపు శృంగారం,

బహిరంగంగా తిరిగితే ముదుపు శృంగారం. ఇది చాటుమాటు వ్యవహారమయితే విడుపనీ (తాత్కాలికంగా కొంత సమయం లభించిన స్వేచ్ఛ అనీ), నిర్భయంగా బహిరంగంగా సాగిస్తే ముదుపనీ (డబ్బు కోసమనీ) తాత్పర్యం ఈ సామెతలోని మాటలను విడిగా తీసి, డబ్బు కోసమా? కాదా? అనే వివరం కోసం 'విడుపా? ముదుపా' అని గూఢంగా ప్రస్తావిస్తుంటారు

విద్దికంచి రామాయణం: ఇదో రామాయణం వాల్మీకి రామాయణం ప్రజామోదం పొందిన తరవాత అందులోని కథాంశాలను స్వీకరించి ఎందరో రామాయణాలు రాశారు భిన్న భాషల్లో అయా ప్రాంతాల్లో అప్పటిప్పటివారు అయా భాషల్లో రాసిన రామాయణ కావ్యాలు, గేయాలు వగైరా వాడుకలో ఉన్నాయి విశ్వనాథ సత్యనారాయణగారు మరల నిదేల రామాయణమనే ప్రశ్న వేసుకుని, తిన్న అన్నమే తింటున్నట్లు రామాయణ రచనా పరనాలు నిత్యకృత్యాలతో సమానమన్నారు ఇలాంటి అనేకానేక రామాయణ రచనల్లో విద్దికంచి రామాయణ మొకటి. కర్త పేరు తెలీదు రచనా కాలం కూడా కచ్చితంగా తెలీదు అయితే వినుకొండ వల్లభరాయడో శ్రీనాథుడో రాసిన క్రీడాభిరామంలో దీని ప్రస్తావన ఉంది 'విద్దికంచి రామాయణ మూరుకాండములు నచ్యుత జాగరవేళ బాడుచున్' అన్న మాటనుబట్టి అది గీతరచనో గేయరచనో అయి ఉండాలి. అది దొరకటం లేదు. అనేక రామాయణాల్లో వాల్మీకి రామాయణంలోని అంశాలూ అవాంతర కథలూ ఉన్నాయి ఈ గ్రంథాన్ని ప్రత్యేకంగా పేర్కొన్నందువల్ల అది జానపద రచనో నూతనాంశాలున్నదో కాదో తెలియదు అందువల్ల రామాయణ కథాంశమని ఎవరయినా పేర్కొన్నదానికి ఆధారం తెలియకపోతే 'బహుశా విద్దికంచి రామాయణంలోదేమో'నని ఆక్షేపించటం, అనుమానించటం అనవాయితీ స్పష్టంగా తెలియని విషయాలను ఆ రామాయణానికి అంటగట్టి దబాయించేవాళ్ళూ లేకపోలేదు అస్పష్టం, నిరాధారం, అబద్ధం అనే అర్థాల్లో ఈ జాతీయాన్ని వాడుతుంటారు

విస్సన్న: ఏిలేశ్వరోపాధ్యాయుడు ఎంతటివాడో లెక్కించడానికి ఆపాటి చదువుసంధ్యలు కావాలి అది సాధ్యమయిన విషయం కాదు. కనీసం ఆయన విద్వత్తును గురించి లోకంలో కొందరు విద్వాంసులకయినా తెలుసు. ఎవడో ఎక్కడివాడో ఎందుకలా అతడి పేరు నిలిచిందో చెప్పటానికి వీలుకానివాడు విస్సన్న ఈయన గురించిన చాలా వివరాల విషయంలో వాదోపవాదాలున్నాయి. కాని ఏకాభిప్రాయమున్న విశేషమేమంటే – "విస్సన్న చెప్పిందే వేద"మనేమాటకు ఈ వాక్యాన్ని వెక్కిరింతకూ వాడ్తారు – గౌరవపూర్వకంగానూ వాడ్తారు

ఎవరైనా తాను చెప్పిందే సరైందని మొండిగా వాదించారనుకోండి – "విస్సన్న చెప్పింది వేదమా?" అని ప్రశ్నించవచ్చు ఇది మర్యాద రామన్న తీర్పులాంటిదనో, ఏిలేశ్వరోపాధ్యాయుడి నిర్ణయంవంటిదనో చెప్పదలిచినప్పుడు కూడా "అంతేనండీ! విస్సన్న చెప్పింది వేదమన్నట్లు ఈయన మాటకూ తిరుగులే"దనీ చెప్పవచ్చు ఉభయతారకమైన పదప్రయోగమిది

వృద్ధ వైద్యం: బాల జోస్యం: సాధారణంగా ఈ రెండు మాటలనూ కలిపి వాడుతుంటారు ఈ రెండూ ఉపయోగకరమైనవీ, నమ్మదగ్గవీ అన్న భావంతో వైద్య శాస్త్రంతో పెద్ద పరిచయం లేకపోయినా, ఆ శాస్త్ర రహస్యాలు తనకు

ఒంటబట్టకపోయినా, బహుకాల జీవన క్రమంలో ఎందరో రోగుల గురించి, వారు సేవించిన ఔషధాల గురించీ విన్న అనుభవజ్ఞాన మాతడికి ఉంటుంది వయసు పెరిగినందువల్ల మంచి చెడ్డలు, లాభ నష్టాలు, అవతలివాడి కష్టసుఖాలూ గమనించి సాయపడగలడు. కాబట్టి బాల వైద్యం కన్నా వృద్ధ వైద్య ముత్తమం.

జోస్యం చెప్పటం వృత్తిగా పెట్టుకొని, ఆ విద్య మీదనే పొట్టపోసుకోవలసిన వృద్ధుడు తనకు తెలిసిన శాస్త్రజ్ఞాన రహస్యాలనుబట్టిగాక తనకబ్బిన లోకజ్ఞానాన్ని వినియోగించి జోస్యం చెప్పగలడు. బాలుడాపని కావాలన్నా చేయలేడు అప్పటికి తనకు తెలిసి శాస్త్రాన్ని అన్వయించి, దూరాలోచన దురాలోచనలు లేకుండా ఉన్నది ఉన్నట్లు మాత్రమే చెప్పగలడు కాబట్టి, అతడు వక్రీకరించడు అందువల్ల బాల జోస్యం ఉత్తమ మన్నారు

వెన్ను చలవ: పిల్లల్ని కనే వయస్సులో ఉన్న దంపతులకు సంతానప్రాప్తి లేకపోతే మరెవరి పిల్లవాణ్ణో పిల్లదాన్నో తెచ్చి పెంచుకుంటారు. అలా పెంచుకోవటం 'వెన్ను చలవ' అంటారు అమ్మకడుపు చల్లన, అయ్యకడుపు చల్లన అన్నట్లు పెంచుతున్న బిడ్డ వెన్ను చల్లదనం వల్ల తమకు సంతానయోగం కలుగుతుందనేది విశ్వాసం కొందరయితే పక్కింటి పిల్లనో పిల్లవాణ్ణో ఎత్తుకొని ఆ పసిబిడ్డ తమ గుడ్డలు తడిపితే తమకు సంతానం కలుగుతుందని నమ్మేవాళ్లున్నా రిప్పటికీ సాకే బిడ్డను తమ వెన్నుమీద మోస్తే, 'ఉప్పప్పగోనె' అని ఉప్పుమూటలాగా మోస్తే, తమ వెన్ను చల్లబడి తమకు పిల్లలు పుడ్తారని నమ్మకం. సంతానం కనే వయస్సులో ఉన్నవాళ్లు పరాయి పిల్లల్ని పెంచుకుంటుంటే ఎంతో కొంత ఆక్షేపణ – ముఖ్యంగా స్త్రీ సమాజం నుంచి వస్తుంటుంది ఎదుటి వాళ్ళు ప్రశ్నించకముందే సమాధానం ఊహించి సిద్ధంగా పెట్టుకున్న వాళ్లు వెన్నుచలవ కోసం ఈ బిడ్డను పెంచుకుంటున్నామని ముందుగానే చెప్తుంటారు కన్న బిడ్డలకన్నా ఎక్కువ మురిపెంగా పెంచుకుంటారు వెన్నుచలవ బిడ్డల్ని ఔరసులు కారన్న దొక్కటే భేదంగాని అన్ని విధాలా వెన్నుచలవ బిడ్డలను సొంతబిడ్డలకన్నా ఎక్కువగానే చూసుకుంటారు. పిల్లల్లో ఎవరిమీదనయినా తలితండ్రులు ఎక్కువ అపేక్ష చూపితే "వెన్నుచలవ బిడ్డా యేం? అంత ఇదవుతున్నా"రని పెద్దలు మందలిస్తుంటారు

వెంబడిలేని సేద్యం: వెంబడి అంటే వెనక సాయంగా ఎవరూ లేని సేద్యం బాధాకరం 'బడిలేని చదువు'తో దీన్ని కలిపి సామెతగా వ్యవహరిస్తుంటారు. గురుముఖతః చదవని చదువు అంత ఉపయోగకారి కాదు ఏకలవ్యుడిలా నేర్చిన విద్య అతడికిలాగా నేర్చినవారికి కూడా పెద్దగా ఉపయోగపడదు ఒక క్రమంలేని చదువు, ఒక పద్ధతి ప్రకారం చదవని విద్య ఎంతో గొప్ప జ్ఞానం ప్రసాదించదు "శాస్త్రమాచార్యు సన్నిధిఁ జదువఁడేని" వాని విద్య వ్యర్థమన్నారు పెద్దలు గురువు దగ్గర శుశ్రూషించి నేర్చినా నిత్యజీవితంలో అది ఉపయోగపడకపోవచ్చు ఇప్పటి వయోజన విద్యలా, అనియత విద్యలా కంటితుడుపు చదువుగా మాత్రమే ఒంటరి చదువు పనికి వస్తుంది భట్ట మురారి అనే విద్వత్కవి గురుకుల క్లేశా లనుభవించకుండా నేర్చిన విద్యను కోతులు సముద్రం దూకి రాముడికి తోడ్పడటంతో పోల్చాడు. గురువు దగ్గర నేర్చిన విద్యను పాతాళం దాకా సముద్రంలో మునిగి, దాని లోతుపాతులు గ్రహించిన మంథరపర్వత సామర్థ్యంతో పోల్చాడు

గురువు లేని విద్యలాగానే తోడు లేని సేద్యం రాణించదు వ్యవసాయం చేసేవాడు ఎవరి సాయమూ లేకుండా ఒంటిగా అన్ని పనులూ చేసుకోవటం అసాధ్యం ఏకాంగ వీరుడిలాగా మరొకరి తోడ్పాటు లేకుండా సేద్యం చేయాలంటే ఓ చిన్న మడి దున్నుకొని, లేదా పారతో తిరగేసి, నేనూ సాగు చేస్తున్నానని మీసం మెలివేయవచ్చు గాని ఎకరాల విస్తీర్ణమున్న పొలంలో పండించలేడు దేని తరవాత ఏది చదవాలో, ఏది ఎంతవరకు ఏ విధంగా సులభంగా నేర్చుకోవాలో చెప్పే గురువులేని విద్యార్థి స్వయం కృషివల్ల పరస్పర సంబంధంలేని, అన్యోన్య విరుద్ధ విషయాలు తెలుసుకోవచ్చు అలాగే ఎవరి తోడూ లేకుండా సేద్యం చేస్తా నన్నవాడు చేశానంటే చేశా ననుకోవలసిందే గాని చేసి సాధించగలిగింది ఏమీ ఉండదు ఈ దృష్టితో నిష్ఫల ప్రయాస, వృధా శ్రమ, అర్థరహితాహంకారం అనే అర్థాల్లో ఈ జాతీయాన్ని వాడుతుంటారు

వేలంవెర్రి: కొందరీ మాటను వేలాంవెర్రి అని కూడా పిలుస్తారు వేలం/వేలాం అనే పదానికి 'ఏలం/ఏలాం' అనే రూపాంతరాలున్నాయి చాటింపు వేసి, పోటీదారుల సమక్షంలో ఎక్కువ మొత్తమిచ్చి కొనగలిగిన వ్యక్తికి ఒక వస్తువును అమ్మటం వేలం. తాము ఎంత ఖరీదుకు కొనదలిచారో పోటీదారులు చెప్పే అంకెను, ఒకటికి రెండుసార్లు పెద్దగా చదివి వినిపించటం వేలాంపాట ఈ పద్ధతి అమ్మకం భారతీయం కాదు 'ఏలాన్' అనే హిందీమాటకు 'చాటింపు, ప్రకటన' అనే అర్థాలున్నాయి కాబట్టి తెలుగు మాట హిందీ పదం 'ఏలమ్' నుంచి పుట్టిందని తెలుగు నిఘంటువులు చెప్తాయిగాని హిందీకి కూడా అది సహజపదం కాదు పోర్చుగీసువారి పుణ్యమా అని 'ఏలియో/లేలియో' అనే వారి భాషాపదం, విక్రయ పద్ధతితోసహా భారతీయ భాషల్లోకి దిగుమతి అయింది సంస్కృతంలోగాని ద్రవిడ భాషల్లోగాని ఇందుకు పర్యాయవాచకమైన మాట ఒక్కటీ లేదు అందువల్ల కొంచెం మార్చి దాన్నే వాడుకుంటున్నాం వేలం పాట పాడేటప్పుడు పాటదారులకు ఆవేశం, ఆవేగం, అహంకారం వగైరాలు క్షణక్షణం పెరిగిపోతాయి మంచిచెడ్డలు, శక్తియుక్తులూ గమనించకుండా పోటీపడి ధరపెంచి వస్తువును తన తలకు కట్టుకొని, తరవాత విచారించేవాళ్లు అనేకులున్నారు వేలంపాట పాడేటప్పుడు పిచ్చెక్కినట్లు ప్రవర్తిస్తారనే భావంతో ఈ జాతీయం ఇటీవల పుట్టింది ఆలోచనలేని ఆవేశాన్ని వేలంవెర్రి అంటారు

వ్యాసఘట్టం: వేదాలను నాలుగు భాగాలుగా విభజించి, పద్దెనిమిది పురాణాలు రాసిన వేదవ్యాసుణ్ణి గురించి తెలియనివాళ్లు లేరు ప్రపంచ సాహిత్యంలోనే భారతం సుదీర్ఘ రచన అంటారు అంత గ్రంథాన్ని ఆయన మూడేళ్లలో రాశాడని, ఎప్పుడూ ఎక్కడికో ఒకచోటుకు తిరుగుతూనే అంతపనీ చేశాడనీ చెప్తారు భారతంలో తలబద్దలు కొట్టుకొంటేగాని అర్థంకాని శ్లోకాలు కొన్ని ఉన్నాయి అవి ఎనిమిదివేల ఎనిమిది వందలున్నాయంటారు (అష్టౌ శ్లోక సహస్రాణి అష్టౌ శ్లోకశతానిచ) వాటికి అర్థం నాకు తెలుసు, శుక మహర్షికి తెలుసు; సంజయుడికి తెలుసో తెలియదో చెప్పలేనని వ్యాసుడే చెప్పినట్లు భారతంలో ఒక శ్లోకముంది మాటలను కూర్చేటప్పుడు అక్కడక్కడ వినోదం కోసమో, క్లుప్తి కోసమో ఆయన ఈ ఫీట్సు చేశాడని సరిపెట్టుకోవాలి ఉదాహరణకు "నదీజలంకేశవనారికేతుః" అనే పాదముంది అందులోని "నది, జలం, కేశవ, నారి, కేతు" అనే మాటలకు అర్థాలు చెప్పటానికి పాండిత్య మక్కరలేదు కానీ ఆ వరసలో ఆ మాటలను అలా విరగదీస్తే అర్థం పొసగదు "నదీజ! (అంటే

గంగానది కుమారుడవైన ఓ భీష్ముడా! లంకేశ) (లంకా – ఈశ = లంకకు రాజైన రావణాసురుడి), వన (తోటకు), అరి (శత్రువైన) – అంటే అశోకవనాన్ని ధ్వంసం చేసిన హనుమంతుణ్ణి, కేతువుగా – అంటే జెండా మీది బొమ్మగా పెట్టుకొన్న అర్జునుడు" అని సాగదీసి, ద్రావిడ ప్రాణాయామంగా (దాని సంగతి మరోమారు చూద్దాం) అర్థం చేసుకోవలసివుంటుంది

అలా ఒక పట్టాన సాఫీగా అర్థంగాని భాగాలను వ్యాసుడు రాశాడని, వాటిని 'వ్యాసఘట్టా'లని పిలుస్తారు. తాత్పర్యంలో దూరాన్వయాలూ, డొంక తిరుగుడు మాటలూ, నానార్థాలు వచ్చే పదబంధాలూ వ్యాసఘట్టాలనే ముద్ర వేసుకున్నాయి అర్థంకాని కవిత్వం, రచన లాంటి వాటిని 'అయ్యా! అయన రచన వ్యాసఘట్టమనుకోండి!' అని వివరిస్తారు – ఒక్కమాటలో – 'భారతాన్ని తెలుగుచేసిన తిక్కన కూడా అచ్చ తెలుగుమాటలతో అక్కడక్కడ ఇలాంటి వ్యాసఘట్టాలు రాశాడు. అయితేనేం, వాటిని తిక్కన ఘట్టాలని ఎవరూ చెప్పరు మచ్చుకు "నలుగాలివాన గోవును" అనే పద్యమొకటుంది చదవగానే నలుడికీ గాలి వానకూ గోవుకూ ఉన్న సంబంధం తెలియదు "నలు – కాలి – వాన, అంటే నాలుగు కాళ్లున్న వాటిలో" అని అర్థం. అలాంటివాటిలో గోవు (ఆవు) పవిత్రమని తరువాత తేలుస్తాడనుకోండి సులభంగా అర్థంగాని, సంకేతమయమైన రచన తెలుగులో ఉన్నా దాన్నీ వ్యాసఘట్టమనే అంటారు

వ్యాసప్రోక్తం: ఇది పండితుల్లో ఎక్కువగా వాడుకలో ఉన్న మాట 'ప్ర–ఉక్తం' (ప్రోక్తం) అంటే గొప్పగా చెప్పినమాట అని అర్థం పద్దెనిమిది పురాణాలూ, అన్నే ఉపపురాణాలు సంస్కృతంలో ఉన్నాయి ఆ లెక్కలో రాని పురాణాలు దరిమిలా ఎన్నో పుట్టాయి – నానా భాషల్లో ఒకే కథను భిన్నపురాణాలు భిన్నవిధాలుగా వివరించిన సందర్భాలు ఎన్నో పండితుల మధ్య వాదోపవాదాలు జరిగేటప్పుడు ప్రామాణ్యం కోసం (ఇప్పుడు అథారిటీని కోట్ చేస్తారంటామే అదన్నమాట) వ్యాసమహర్షి ఇలా చెప్పాడనటం పరిపాటి న్యాయస్థానాల్లో సుప్రీంకోర్టు నిర్ణయాలకున్నంత గౌరవం, ప్రామాణ్యం వ్యాసుడి ధర్మప్రవచనాల కుండేదన్నమాట ఇది వ్యాసప్రోక్తం అంటే ఇది ప్రమాణ మన్నట్లు, కాచివడపోసిన నిర్ణయమని చెప్పినట్లు

ఈ ప్రస్తావన వచ్చినప్పుడు ఇటీవల తెలుగులో వాడుకలోకి వచ్చిన ఒక మాట సంగతి తలుచుకోవాలి భారతంలో ఇతర పురాణాల్లో మధ్యమధ్య ఓ చిన్న వచనం – నిజానికి ఒక చిన్న క్రియాపదం – శ్లోకాల మధ్య కనిపిస్తుంది. వేల పర్యాయాలు. అది 'ఉవాచ' అనేది ఖచ్చితంగా ఆ మాటకు అర్థం చెప్పాలంటే "చాలాకాలం కిందట (అత్యంత భూతకాలంలో) ఒక వ్యక్తి ఇలా చెప్పాడు/చెప్పింది" అని వివరించాలి. మహర్షులూ దేవతలూ ఎప్పుడు పుట్టారో ఎంత పాతకాలంలో ఆ మాట చెప్పారో స్పష్టంగా చెప్పలేనప్పుడు ఈ క్రియాపదాన్ని వాడ్తారు సంస్కృతంలో ద్వివచనముంది – అంటే ఇద్దరు అలా చెప్పి ఉంటే 'ఊచతుః' అనాలి; చాలామంది (ముగ్గురి కన్నా ఎక్కువమంది అయితే బహువచనం వాడాలి) చెప్పి ఉంటే 'ఊచుః' అనాలి. ఈ వ్యాకరణ మర్యాదగాని, శాస్త్రజ్ఞానం, భాషాపరిచయంగాని లేని ఏ తెలుగు మహా రచయితో ఈ ఇరవయ్యో శతాబ్దంలో 'ఉవాచ' అంటే 'చెప్పిన మాట' అని అర్థం చేసుకొని, అలా ప్రయోగించి తన భాషాపాండిత్యం ద్వారా తెలుగులో ఒక

కొత్తమాటను సృష్టించాడు! అంత పుణ్యం కట్టుకొన్న ఆ తొలి తెలుగు రచయిత కీర్తిశేషుడైనాడో సజీవంగా మన మధ్యనే ఉన్నాడో చెప్పలేం – అయ నెవరో కరాఖండిగా చెప్పటం సాధ్యపడనందువల్ల అప్పటినుంచీ ఈ 'వ్యాసప్రోక్తం' వాడుకలోకి వచ్చింది తెలుగు రచనల్లో "ఇది ఫలానా ఎల్లయ్యగారి ఉవాచ" అని దబాయించి చెప్పేవాళ్లున్నారు – అయన 'చెప్పినమాట' అనే నామవాచకపదంగా

వ్యాసుడు ఏ గ్రంథంలో ఏ సందర్భంలో ఏమి చెప్పాడో అభిప్రాయభేదం లేకుండా, రాకుండా చెప్పటం అల్లాటప్పాపని కాదు పురాణ కథలకేగాక భారత శ్లోకాలక్కూడా వేలసంఖ్యలో పాఠాంతరాలున్నాయి ప్రక్షిప్తాలున్నాయి. అంటే అన్ని ప్రతుల్లోనూ లేనందువల్ల తరవాతి కాలంలో ఎవరో చేర్చిన, దూర్చిన విషయాలన్న మాట ఇది వ్యాసప్రోక్తమనీ కాబట్టి ఈ మాటకు తిరుగులేదనీ చెప్పడానికి ఎంతో చదువూ, గుండెబలమూ కావాలి చేతనైనవాడు తానే ఒక శ్లోకం రాసి, అది వ్యాసుడు రాసిందేనన్నా కాదని నిరూపించడానికి చచ్చీచెడి శాయంగల విన్నపాలవుతై దబాయింపుకు వ్యాసప్రోక్తమనేది పర్యాయపద మయిపోతున్నది అసలు మాటే తేలనప్పుడు దాన్ని 'ఉవాచ' అనటం ఎంత అసంబద్ధమో ఊహించండి. కానీ వ్యవహారబలం మరోమాటను పుట్టించింది

శకారుడు: సంస్కృత వాఙ్మయంలోని 'మృచ్ఛకటిక' నాటకంలో శకారుడు రాజశ్యాలకుడు అంటే రాజు గారి బావమరిది అతడు రాజ్యశ్యాలకు డనికూడా అంటారు అంటే రాజుగారికేగాక రాజ్యానికి కూడా అతడు బావమరిదిలాంటి వాడన్నమాట! అందులోనూ ఉంపుడుగత్తె కొడుకు కాబట్టి అతడు మరింత శక్తిమంతుడై ప్రజాపీడన చేస్తాడు సైనికులను, రాజోద్యోగులను, న్యాయస్థానాలను లక్ష్యపెట్టడు వసంతసేన అనే ధనిక వేశ్యను బలాత్కరించడానికి ప్రయత్నిస్తాడు ఆమె ప్రేమించిన చారుదత్తుడనే వ్యాపారస్థుడు చాలా పెద్దమనిషి దానధర్మాలవల్ల దరిద్రస్థితికి వచ్చినా రాజ్యంలో అయన సత్యసంధత, సత్ప్రవర్తనలంటే చాలా గౌరవం ఉండేది అంతటివాణ్ణి తానే గొంతు పిసికిపారవేసిన వసంతసేనను చంపినవాడని ఆరోపించి ఉరి తీయించమని న్యాయమూర్తులనే దబాయిస్తాడు ఆమె బతికి బయటపడటంతో కథ అడ్డు తిరుగుతుంది పరమ దుర్మార్గాలకు అతడు చిహ్నం కావటం ఒక ఎత్తయితే, అతడి సంభాషణల్లోని అసందర్భాలు మరో ఎత్తు తిరుపతి వేంకటకవుల ఆంధ్రీకరణ చదివితే శకారు డెంత దుర్మార్గుడో, మూర్ఖుడో, అవకతవకలు ఎలా మాట్లాడగలవాడో తెలుస్తుంది పురాణాల్లోని పాత్రల బంధుత్వాలను తప్పులతడికలుగా వాడి, నీచమయిన వస్తువులతో తననుతానే పోల్చుకోవటంలో అతని కతడేసాటి అటువంటి పాత్ర మొత్తం సాహిత్యంలో మరొకటి లేదు. అందుచేత మూర్ఖుడనీ, దుర్మార్గుడనీ, అవివేకి అనీ, అజ్ఞాని అనీ నిందించదలచినప్పుడు సదరు వ్యక్తిని ఒకే ఒక మాటలో 'శకారుడ'ని చెప్పటం ఆచారమయింది ఆనాటి రాజకీయాల్లో కూడా శకారు డున్నాడంటే 'రాజకీయాలే అంత' అని సరిపెట్టుకోవాల్సిందే.

శనివారపు జడి: శని గ్రహం పేరుతో ముడిపడ్డ వారం కాబట్టి చాలామందికి శనివారంనాడు ఏ మంచిపని మొదలుపెట్టాలన్నా అనుమాన భయాలు మెండు దానికితోడు ఆ రోజున మబ్బు వేసిందంటే మరింత చిరాకు మనవాళ్ళు 'మేఘాచ్ఛన్నం తు దుర్దినమ్' అని మబ్బు పట్టినరోజు చెడురో జనుకునేవాళ్ళు చాలా పనులు వానకాలం

సరిగా నెరవేరవు. రేగటి నేలల్లోనయితే అడుగు తీసి అడుగుపెట్టడం కూడా ఇబ్బందిగా ఉంటుంది అలాంటి సమయంలో జడివాన – అంటే కుండపోత వర్షం-కురిస్తే కలిగే ఇబ్బందులు చెప్పనక్కరలేదు ఇది చాలదన్నట్లు శనివారం మొదలయిన వాన మళ్ళీ శనివారం వచ్చేదాకా వారం రోజులు ముసురుగా బాధిస్తుందన్న నమ్మక మొకటుంది. ఎడతెరపిలేకుండా, నసపీకుడుగా కురిసే వర్షం శనివారపు జడి ఊపిరాడకుండా సణిగినా, గొణిగినా, ఉపన్యాసం దంచటం మొదలుపెట్టినా, అర్చుకుంటూ తగాదా పెంచుతున్నా 'మహాప్రభో! ఇది శనివారం జడి' అని మొత్తుకుంటారు ప్రకృతి లక్షణాన్ని మానవ ప్రకృతికి అన్వయించే జాతీయాల్లో ఇదొకటి

**శశవిషాణం:** శశం అంటే కుందేలు విషాణం అంటే కొమ్ము దీనికి సరైన తెలుగు సమాసం ' కుందేటికొమ్ము'. కుందేలుకు పెద్ద చెవులేగాని కొమ్ములు లేవు. లేనిదాన్ని ఉందని భావించటం అసందర్భం ఈ మాటను 'సాధించటం' అనే విషయాన్ని ప్రస్తావించేటప్పుడు వాడుతారు "తివిరి కుందేటికొమ్ము సాధించవచ్చు"నని భర్తృహరి సుభాషితాల తెలుగు అనువాదం మూర్ఖుణ్ణి (తెలిసీ తెలియనివాణ్ణి) మెప్పించే కన్నా కుందేలుకు కొమ్ములు మొలిపించటం తేలిక అనే భావంతో ఆ పద్యం చెప్పారు "గగనకుసుమం, ఆకాశపుష్పం" అనే మాటలను కూడా ఆ అర్థంలోనే వాడుతుంటారు గగనం అంటే ఆకాశం. దానికి 'శూన్య'మనే పర్యాయపదం కూడా ఉంది ఆకాశంలో పూలుండవు. 'లేనివి' అనే అర్థంలో ఈ మాటలకు ప్రయోగం

**శషభిషలు:** కోపతాపాలూ, బెదిరింపులూ, హెచ్చరికలూ అనే అర్థాల్లో వాడుకలోకి వచ్చిన ఈ మాట అచ్చ తెలుగుపదం కానేకాదు – శకార షకార భకారాలు కారణంగా అదే కారణాలవల్ల సంస్కృత పదాలు కావచ్చుగాని ఆ భాషానిఘంటువుల్లో కూడా ఈ జాతీయం కనిపించదు కాని వాడుకలో నిలిచింది ఈ మాటను మొదట ఎవడో వ్యాకరణ పండితుడు పుట్టించి ఉంటాడు సంస్కృతంలోని 'శష్' అనే ధాతువుకు 'బాధించు, నొప్పి పుట్టించు, చంపు' అనే అర్థాలున్నాయని ధాతుపాఠం చెప్తోంది 'శషతి' వంటి క్రియారూపాల కిది మూలం అలాగే 'భిష్' అనేది 'భీ'అనే ధాతువు నుంచి ఏర్పడ్డ రూపం దానికి 'భయపెట్టు' వగైరా అర్థాలున్నాయి 'బిభిష, భీష్యన్తి' వగైరా రూపాల్లో ఇది వినిపిస్తుంది మొత్తం మీద ఇది ధాతుపాఠాల్లోని పదశకలాలతో తాను నోటితో స్పష్టంగా చెప్పకుండా సూచనగా 'తంతాను, చంపుతాను' అని బెదిరించటంతో సమానమయిన పదప్రయోగ మన్నమాట. శ్రీనాధుడు 'ణిసిధాత్వర్థ మనుగ్రహింపగదవే నీరేజపత్రేక్షణా!' అని రాశాడు ణిసి అనేది ణిజ్ అనే ధాతువు రూపం ఆ ధాతువుకు అర్థం 'ముద్దు' అని ణిసిధాత్వర్థం అనుగ్రహించమంటే ముద్దిమ్మని అడిగినట్లు ఇలా డొంకతిరుగుడుగా వ్యాకరణ మర్యాదలతో ఏర్పడ్డ జాతీయమిది శషభిషలంటే హెచ్చరికలు, బెదిరింపులు అని అర్థం. 'నీ శషభిషలు చాలించు' లాంటి వాక్యాలు వినిపిస్తాయి అంటే, 'నీ బెదిరింపు లికచాలు ఊరుకో' అన్నట్లు

**శాఖాచంక్రమణం:** శాఖ అంటే (చెట్టు) కొమ్మ చంక్రమణం అంటే దూకటం ఒక కొమ్మమీదినుంచి మరో కొమ్మమీదికి దూకటం సాధారణంగా కోతుల పని ఒక విషయం మీద ఉపన్యాసం మొదలుపెట్టి, మధ్యలో అసలు విషయం మరిచిపోయి, సభారంజనం కోసం పిట్టకధలు చెప్పి, ఎందుకు చెప్తున్నాడో మరిచిపోయి, మొత్తం

వ్యవహారాన్ని కలగాపులగం చేయటాన్ని కూడా శాఖాచంక్రమణ మంటారు కొందరు తమకు అనేకవిధాల పాండిత్యముందని బడాయికోసం సందర్భమున్నా లేకపోయినా ఇతరాంశాలు ఎత్తుకుంటారు అయితే వాటినెందుకు ప్రస్తావించారో, అసలు విషయానికీ వాటికీ సంబంధంమేమిటో మరిచిపోయి ఏదోవిధంగా ముగిస్తారు మరికొందరు రాజకీయవేత్తలూ దౌత్యవ్యవహర్తలూ మూల విషయం/సమస్యల నుంచి శ్రోతల/పాఠకుల దృష్టిమరల్చటానికి కావాలని పక్కదారి పట్టిస్తూ ఇతరాంశాలు ప్రస్తావిస్తారు ఫలితంలో ఇదంతా శాఖాచంక్రమణ మవుతుంది సంబంధంలేని విషయాలను ప్రస్తావించినందున మూలాంశం మరుగుపడితే అది శాఖాచంక్రమణం కిందే లెక్క

శుద్ధబుద్ధావతారం: గౌతమ బుద్ధుడు మహా తపస్వి అయన వేదం విధించిన యజ్ఞయాగాదులనూ, జంతుబలినీ వ్యతిరేకించాడు ఇప్పుడు హిందూ మతమని పిలుస్తున్న వైదిక సనాతన మతాన్ని ధిక్కరించి, బౌద్ధమతం స్థాపించాడు (ఇంగ్లీషువాళ్ళు మన గడ్డమీద అడుగుపెట్టకముందు 'హిందూ' మతమనే పేరు లేదు ఒకానొక యవనరాజు తాను ఈ దేశానికి వచ్చి కొంత రాజ్యం సంపాదించినమీదట, 'భాగవతమతం' స్వీకరించానని శిలాశాసనం వేయించాడు) తమ సిద్ధాంతాన్ని వ్యతిరేకించిన బుద్ధుణ్ణి విష్ణుమూర్తి దశావతారాల్లో ఒకడుగా గుర్తించి, ఆ మతాన్ని దెబ్బతీసిన ఘనత 'హిందువు'లదే (బౌద్ధులు కూడా గౌతమబుద్ధుడికి అనేకావతారాలను కల్పించి బదులుకు బదులు తీర్చినా, విగ్రహారాధన మొదలుపెట్టి ఇతరదేశాల్లో స్థిరపడిపోవలసి వచ్చింది, మూలస్థానంలో అల్పసంఖ్యాకులై అది వేరే విషయం)

బుద్ధుడు తనకు జ్ఞానోదయం కలిగేదాకా కదలనని బోధి వృక్షం కింది కూర్చొని తపస్సు చేశాడు ఒక మాటా పలుకూ లేదు అలా కదలని మెదలని నోరువిప్పని సౌమ్యుణ్ణి శుద్ధబుద్ధావతార మని అధిక్షేపించటం మతవైమనస్యం కారణంగానే వచ్చింది అయన సంపాదించిన జ్ఞానంకన్నా ఆయన ప్రవర్తనే ఆకర్షణకరమై ఈ మాట పుట్టింది

శ్మశానవైరాగ్యం: స్త్రీ పురుష భేదం లేకుండా సర్వులకూ రాదగ్గ, వచ్చే తాత్కాలిక వైరాగ్యమిది చావుకన్నా సర్వసమానంగా ప్రమాదకరమైన దేదీ లేదు. గొప్ప తక్కువలుగాని చిన్న పెద్ద లాంటి భేదాలుగాని లేని సార్వకాలిక సార్వజనిక విపత్తిది వల్లకాడులో శవ దహనమో ఖననమో చూసినప్పుడు-ఏ కొద్దిమందికో తప్ప - విచారం కలుగుతుంది జీవితంమీద విరక్తి పుట్టుంది అత్యంత సన్నిహిత బంధువులో మిత్రులో తప్ప తక్కిన వారందరూ శ్మశానం వదిలి బయటికి రాగానే ఈ విరక్తి నుంచి బయటపడ్తారు ఇది తాత్కాలికం

శ్రావణభాద్రపదాలు: శ్రావణం, భాద్రపదం అనేవి నెలల పేర్లు ఇవి వర్షాకాలంలో వచ్చే మాసాలు అందువల్ల నీళ్లుకారుతుంటాయి కొంతమంది తమకు లేదనో ఇతరుల కున్నదనో ఎప్పుడూ దుఃఖపడుతూ కన్నీళ్లు కారుస్తుంటారు - అందువల్ల సాధించేదేమీ లేకపోయినా. ఒకే వ్యక్తి ఇలా బాధపడుతుంటే అతగాడి కళ్లు శ్రావణ భాద్రపదాల్లా ఉంటా యంటారు అనేక విషయాల్లోలాగే ఇలా ఏడ్పుగొట్టుతనంలో కూడా స్నేహంగా ఉండే వాళ్లుంటారు వాళ్లని శ్రావణ భాద్రపదా లంటారు. వర్షానికీ కన్నీటిజల్లుకూ పోలిక అన్నమాట

**శ్రీరంగం రోకలి:** తమిళనాడులోని శ్రీరంగం వైష్ణవ పుణ్యక్షేత్రం. శివాలయాల్లో ప్రసాదంగా లభించేది విభూతి, మారేడుదళాలు మాత్రం. విష్ణుదేవాలయాల్లో పులిహోర, దధ్యోదనం వగైరా భోజనసామగ్రి ప్రసాదంగా దొరుకుతుంది. ఆలయం పెద్దదై, వచ్చిపోయే భక్తులసంఖ్య అపారంగా ఉన్నప్పుడు ప్రసాదం తయారు చెయ్యటమే అన్నిటికన్నా ముఖ్యమైన కైంకర్య మవుతుంది. అందువల్ల ఆ పనిలో నిమగ్నమయ్యే విష్ణుకింకరులు (భక్తసేవకులు) చాలామంది ఉంటారు. వేల లక్షల సంఖ్యలో వచ్చే భక్తులకోసం వీటిని తయారుచేయటంకోసం అహరహం ప్రయత్నాలు జరుగుతుంటాయి. భక్తులుకూడా తలా ఒక చెయ్యివేసి దంపకంలో తోడ్పడుతుంటారు. రోళ్ళూ రోకళ్ళూ వాడకతప్పదు. ఈ కైంకర్యం అవిచ్ఛిన్నంగా సాగడానికి ఓ సంప్రదాయం వెలిసింది. మరో భక్తుడు వచ్చి తీసుకొనేదాకా దంచుతున్న భక్తుడు రోకలిని వదిలిపెట్టిపోతే పాపం వస్తుందన్నారు. ఫలితంలో శ్రీరంగంలో (ఆలయంలో) రోకలి చేతికి వచ్చిందంటే ఆపే మార్గం లేదు. దంచుతుండాల్సిందే, మరొకరు సాయపడేదాకా. అంటే ఎడతెగని, అపరాని పరిశ్రమకు శ్రీరంగం రోకలి అనే అర్థం వచ్చిందన్నమాట. తగులుకొంటే వదిలిపెట్టని నసపీకుడుగాళ్లను, విసిగించి వేధించే వ్యక్తులను 'శ్రీరంగం రోకలి' అని వ్యవహరించటం అలవాటయింది.

**శ్రీరంగనీతులు:** తెలుగులో ఈ మాటకున్న వాడుక చాలా ఎక్కువ. 'చెప్పేది శ్రీరంగనీతు'లనే సామెతకూడా పుట్టింది. సాక్షాత్తూ రామానుజాచార్యులవారే నివసించిన శ్రీరంగంలో నీతి వాక్యాలకు లోటుండదు. కులభేదాలను వ్యతిరేకించిన వైష్ణవానికి నాయకులైన ఎందరో ఆళ్వారులకు స్థానమైనచోట నిత్యం నీతిప్రసంగాలు జరగటంలో ఆశ్చర్యం లేదు. అయితే దేవదాసీవిధానం వ్యాప్తిలోకి వచ్చిన తరవాత నీతి స్థానంలో శృంగారం ప్రథమత్వం సంపాదించింది. బౌద్ధం ఆరామాలలో సన్యాసినులను ప్రవేశపెట్టి అప్రతిష్ఠ పాలైపోయింది. బౌద్ధశిథిలాలున్న స్థలాలను తెలుగువాళ్లు 'లంజదిబ్బ' లని వ్యవహరించారు. వీరశైవులు 'బసివిరాళ్లు' అనే వ్యవస్థ నేర్పరచి వ్యభిచారాన్ని ప్రోత్సహించారన్న అపప్రథ తెచ్చుకొన్నారు. మొదటి సంకల్పం స్త్రీ పురుషులకు సమానత్వమివ్వటం. కానీ కాలక్రమాన వచ్చిన జాతీయం శ్రీరంగనీతులు. చెప్పేదొకటీ చేసేదొకటీ మానవస్వభావంలోని విలక్షణత్వం. ఫలితంలో తన స్వభావానికీ ప్రవర్తనకూ విరుద్ధంగా పైకిచెప్పే ధర్మపన్నాలనూ శ్రీరంగనీతు లనటం మొదలయింది.

**శ్రీవత్సగోత్రంవారి సింహం:** అగ్రవర్ణ వైష్ణవుల్లో గోత్రాలుంటాయి. అనేక గోత్రాల్లో శ్రీవత్స(స) గోత్రమొకటి. ఈ గోత్రంలో పుట్టిన వారికి కొన్ని అతీత శక్తులున్నాయని నమ్మకం. సాధారణంగా పంటచేలకు పట్టే చీడపీడలు వీరి పేరు చెప్తే పారిపోతాయన్న విశ్వాసముంది. ఇటీవలి కాలంలో ఈ రహస్యం బయటపడిందిగాని, పూర్వం ఆ గోత్రస్థులు కాగితాల మీదో కమ్మల మీదో "శ్రీవత్స గోత్రం వారి సింహం వచ్చింది, చీడ పురుగుల్లారా! పారిపొండి." అని రాసి రాగిచుట్టలో బిగించి 'రక్షరేకు'గా రైతుల కిస్తుండే వాళ్ళు. ప్రతిఫలం ఏదో రూపాన తీసుకుంటారనేది సాధారణ విషయం. నమ్మకం మీద ఆ రాగిరేకులు ధరించినా, పొలం దగ్గరి ఏ చెట్టుకో వేలాడదీసినా, పురుగు బాధ లేదనీ, ఉండదనీ భావించారు తరతరాలుగా. సింహం అంత గొప్ప జంతువు ఏనుగునో మరో మహా మృగాన్నో చంపటం, బెదిరించటం బాగుంది గాని

దిక్కుమాలిన చీడపురుగులను చంపటమేమిటని హేతువాదులు వాదించవచ్చు ఇక్కడ విశ్వాసం ప్రధానంగాని విషయం కాదు రక్షరేకులూ తాయెత్తులూ తీసుకున్న రైతుకు ఆ రాగి చుట్టలో ఏముందో తెలియకపోవటమే శ్రీరామరక్ష, ఇచ్చేవాడి గాంభీర్యం, పుచ్చుకొనేవాడి విశ్వాసం బాధానివారణ చేసే వన్నమాట! ఆ మాటకు వస్తే ఇటీవలి కాలంలో బారుకత్తులూ విచ్చుకత్తులూ ధరించిన వీరాధివీరులూ, రంకెలు పెట్టే ఆంబోతులూ ఒక్కో పురుగును చించి చెండాడుతున్నట్లు వాణిజ్య ప్రకటనలు చూస్తున్నాం-వింటున్నాం ఇవెంత హేతుపూర్వకాలో ఈ రాగిరేకు వ్యవహారం కూడా అంతే సింహం చీడపురుగులను పారదోల్తుంది!

శ్రీవారు, శ్రీమతి: శ్రీ అంటే ఐశ్వర్యం శ్రీమతి అంటే ఐశ్వర్యవంతురాలు డబ్బున్న స్త్రీ అని అర్థం. ఇల్లాలిని లక్ష్మీదేవితో పోల్చుకొని సంతృప్తి పడతారు కాబట్టి వివాహిత స్త్రీలను శ్రీమతి అనే మాటను/ బిరుదును పేరుకు ముందు చేర్చి వ్యవహరించే ఆచారం వచ్చింది పురుషులకు 'శ్రీ' మాత్రం చేరుస్తాంగాని 'శ్రీమంతు'డని అనం- బహుశా మొగవాడి సంపాదన అడగగూడని, నిలకడలేని విషయమని ఏమో! అవివాహిత స్త్రీని, కన్నెపిల్లను పొడి అక్షరాల్లో "చి.ల.సౌ" (చిరంజీవి లక్ష్మీ సౌభాగ్యవతి) అని వ్యవహరించటం కద్దు స్త్రీకి వివాహమే జీవిత లక్ష్యమయిన సమాజంలో భర్త అనేవాడు ఒక ఘుండటమే సౌభాగ్యమనీ, ఐశ్వర్యమనీ భావించి ఇలా శ్రీమతి అని వ్యవహరించటం అలవాటయింది నేటికి 'శ్రీమతి' శబ్దానికి భార్య అనే అర్థం వచ్చింది 'ఈమె మా శ్రీమతి' అని చెప్పటం, పరిచయం చేయటం నేటి మర్యాద చివరికి ప్రభుత్వంవారూ వివాహిత స్త్రీల విషయంలో పేరుకు ముందు శ్రీమతి చేర్చాలని, అవివాహితలకు 'కుమారి' ని చేర్చాలని శాసించారు

భర్తను గురించి ప్రస్తావించేటప్పుడు 'వీరు మా శ్రీవారు' అనే వ్యవహారం తెలుగుదేశంలో మాత్రమే వాడుకలోకి వచ్చింది భర్తపేరు చెప్పకూడదన్న మూఢ విశ్వాసం పోయినా, నామం/పేరు చెప్పకుండా సర్వనామం వాడటం పరిపాటయింది అయితే నాగపూర్ చుట్టుపక్కలగల విదర్భ ప్రాంతంలో శ్రీమతి అనే మాటను ప్రయోగించటం ప్రమాదకరం అక్కడ విధవాస్త్రీలను మాత్రమే శ్రీమతి అంటారు మరెన్ని ప్రాంతాల్లో ఇలా పెడర్థం వస్తుందో తెలియదు తమిళులు మాత్రం 'శ్రీ' అనేది సంస్కృత శబ్దం కాబట్టి తమ ద్రావిడ సంస్కృతికి అది విరుద్ధమని, "తిరు, తిరుమతి" అనే బిరుదులతో స్త్రీ పురుషులను వ్యవహరించటం మొదలుపెట్టారు దరిమిలా 'మతి' అనేది సంస్కృతప్రత్యయమని గుర్తించి, ఇప్పుడు 'సెల్వన్, సెల్వి' అని పురుషులనూ స్త్రీలనూ వ్యవహరిస్తున్నారు అసలీ విధంగా వివాహిత, అవివాహిత అనే భేదం ఎందుకు లోకానికి తెలియాలని ఆధునిక స్త్రీ సమాజాలు వాదిస్తున్నాయి. పురుషుల విషయంలో లేని సూచన తమ విషయంలో పనికిరాదని ఇంగ్లీషులో మార్పు సాధించారుగాని, తెలుగులో భేద సూచకంగాని బిరుదు పుట్టినట్లు లేదు

షష్ఠాష్టకం: షష్ఠం అంటే ఆరు అష్టం అంటే ఎనిమిది. ఇవి విడివిడిగా మాటలకున్న అర్థాలు. ఈ సమాసంలో మారి 'తగాదా, శత్రుత్వం' అనే అర్థమిస్తుంటాయి ఇది జ్యోతిశ్శాస్త్రం నుంచి వచ్చిన మాట జాతకచక్రం, రాశిచక్రం వగైరాల్లో గడు లుంటాయి ఆరోగడిలో ఉన్న గ్రహాలకూ ఎనిమిదో గడిలోవున్న వాటికీ శత్రుత్వమంటారు అంటే - ఆయా గ్రహాలు పరస్పర విరుద్ధఫలితా లిస్తాయన్నమాట

శాస్త్రం తెలియనివాళ్ళు కూడా ఈ మాటను వాడుతుంటారు 'మా యిద్దరికీ షష్టాష్టకం' అంటే "మాకు పడదు" అని అర్థం (రాతలో షష్ఠశబ్దాన్ని షష్టమని రాస్తుంటారు తప్పుగా రకారం ఒత్తుగా ఉంటే 'అరు' అని అర్థం, టకారం ఒత్తయితే 'అరవై' అని అర్థం ఈ భేదం గుర్తించక అరవైఏళ్ళు నిండిన తరవాత చేసే 'షష్టిపూర్తి'ని 'షష్ఠిపూర్తి' అని రాస్తుంటారు' అరేళ్ళు నిండినట్లు) శాస్త్రంలో నుంచి వాడుకలోకివచ్చి స్థిరపడ్డ జాతీయమిది

**సత్యహరిశ్చంద్రుడు:** నిత్య వ్యవహారంలో "అబ్బో! ఆయనా? సత్యహరిశ్చంద్రుడేనండి!" అని వెటకారంగా అబద్దాలకోరులను గురించి మాట్లాడటం కద్దు హరిశ్చంద్రుడి సత్యవాదిత్వాన్ని గురించి ప్రబంధాలు, కావ్యాలు, నాటకాలు, కథలు తెలుగులో ఎన్నో వచ్చాయి బహుశా వస్తూనే ఉంటాయి పోతన భాగవతంలో నదరు మహనీయుడి మరోలక్షణం లిఖితరూపంలో ఉందిగాని ఆ భాగాలను చదవరు చాలామంది శ్రీమదాంధ్ర మహాభాగవతం నవమస్కంధం సప్తమాధ్యాయంలో ఉన్న కథాభాగాన్ని చదవండి మరికొన్ని విశేషాలు తెలుస్తాయి సంగ్రహంగా అదేమంటే-

హరిశ్చంద్రుడికి పుత్రులు లేకపోతే నారదుడి ఉపదేశం పొంది వరుణోపాసన చేశాడు దేవుడు ప్రత్యక్షమైనాడు హరిశ్చంద్రుడే చొరవతీసుకొని వరగుణాలున్న కొడుకు పుడితే "కొడుకుఁబట్టి, పశువుఁజేసి నీవు పరిణమింపఁగ వేల్తు"నని మాట యిచ్చాడు వరంపొంది కొడుకును కని, అతడికి 'రోహితు'డని పేరు పెట్టాడు ఇంకా పురిటిగదిలోనే ఉన్న పిల్లవాణ్ణి బలి యిమ్మని వరుణు డడిగాడు "పురుడు వెళ్ళినఁగాని ఒసఁగ" నన్నాడు రాజు! పిల్లవాడికి పళ్ళురాకముందు వచ్చి బలికోరితే"పండ్లులేకున్న నభావ్యుఁ" డన్నాడు! పళ్ళువచ్చిన తరువాత అడిగితే, పాలపళ్ళు అసలు పళ్ళుకావుగదా అని పేచీపెట్టాడు! పడిపళ్ళు వచ్చిన తరువాత యుద్ధవిద్యలు రానివాణ్ణి బలి ఇవ్వటం భావ్యంకా దన్నాడు పోతనమాటల్లో "తొడరి యిట్లు కొడుకుతోడి మోహంబునఁ, బ్రొద్దుఁ గడుపుచుండె భూవరుండు" - ఇలా వాయిదాలు వేశాడన్న మాట సత్యసంధుడయిన హరిశ్చంద్రుడు వరుణుడికి కోపంవచ్చి, రాజుకు 'మహోదర వ్యాధి' పీడ కల్పించాడు శిక్షగా

తండ్రి ఎప్పుడు బలి ఇస్తాడో తెలీని రోహితుడు ఆయుధాలు ధరించి అడవికి పారిపోయాడు కానీ తండ్రి జబ్బుపడ్డాడని విని నగరానికి వస్తుంటే ఇంద్రుడు ముసలితపసి వేషంలో వచ్చి 'మేలుగలుగు నింటిమేర వలదు' అని నూరిపోశాడు దాంతో కుర్రవాడు మళ్లీ అడవికే పోయాడు మళ్ళీ తండ్రి మీద మనసై రోహితుడు ఇంటిదారి పట్టినప్పుడల్లా ఇంద్రు డతణ్ణే వారిస్తూనే వచ్చాడు ఇలా అయిదేళ్ళు గడిచాయి ఆరోయేట కుర్రవాడు మళ్లీ ఇంటిమొహం పట్టిపోతున్నప్పుడు అజీగర్తు డనేవాడి మధ్యముపుత్రుడైన శునశ్శేపుణ్ణి పట్టుకవచ్చి 'యాగపశువు'గ ఆ హరిశ్చంద్రుడి కిచ్చాడు అప్పుడు పురుషమేధం చేసిన రాజు వరుణాది నిఖిలదేవతలకూ తృప్తికలిగించాడట కౌశికుడు, భృగువు, జమదగ్ని, వశిష్ఠుడులాంటి హేమాహేమీల్లాంటి మహాత్ములు ఆ యజ్ఞం చేయించారు ఇంద్రుడు ఉబ్బితబ్బిబ్బయి హరిశ్చంద్రుడికి కనకరథ మిచ్చాడు! ఎందుకట? తన కొడుక్కు బదులుగా మరో అభాగ్యుడి కొడుకును బలి యిచ్చినందుకు!

ఇదంతా సత్యసంధతకే నిదర్శన మనయినా ఒప్పుకోవాలి లేదా పోతన అబద్దాలు రాశా డనయినా అనాలి ఈ రెండూ ఇష్టం లేనప్పుడు హరిశ్చంద్రుడు కూడా అవసరాన్నిబట్టి (తన కొడుకును రక్షించుకోడానికి) వాయిదాలు వేశాడేగాని,

ఎవర్నయితేనేం బలి యిచ్చి మాట నిలుపుకొన్నాడు గదా అని అర్ధసత్యం పలకాలి! "వారిజాక్షులందు వైవాహికములందు, ప్రాణవిత్తమానభంగమందు, చకితగోకులాగ్రజన్మ రక్షణమందు, బొంకవచ్చు నఘము పొంద"దన్నారు గదా అని సమర్థించటం కూడా వీలుపడదు ఆలిస్టులో కొడుకుచా వనేది లేదు అగ్రజన్మరక్షణ లేకపోగా భక్షణమాత్ర ముంది ఈ విషయం లీలగానైనా జన మనస్సుల్లో ఉందేమో – అబద్ధాలు చెప్పేవాణ్ణి సత్యహరిశ్చంద్రుడని ఆక్షేపిస్తుంటారు

సంతానగోపాలుడు: గోపాలుడంటే శ్రీకృష్ణుడు పదహారువేల నూట ఎనిమిది మంది భార్యలున్న మహాత్ముడు కాబట్టి ఆయనకు సంతానం కూడా దండిగా ఉండవచ్చు పిల్లలు లేనివాళ్ళు సంతాన గోపాలస్వామి పూజలు చేయటంకూడా కద్దు ఎందుచేతనోగానీ ఈ మాటనే పేరుగా పెట్టడం, ఈ దేవుణ్ణే పూజించటం తెలుగుదేశంలో కన్నా తమిళనాడులో ఎక్కువ ఈ పేరున్న వ్యక్తిని కూడా గోపా లని తెలుగువారు పిలుస్తారు తమిళ సోదరులు సంతానమనే పిలుస్తుంటారు చాలా మంది పిల్లలున్నా దరిద్రంలేని అదృష్టవంతుణ్ణి ఈ పేరుతో పిలవడం ఆచారం

సన్యాసి పళ్ళు: గృహస్థుల్లాగా తాంబూలం వేసుకోని సన్యాసులు కూడా ముఖప్రక్షాళనం చేసుకోక తప్పదు వాళ్ళ పళ్ళు నిగనిగలాడుతూ తెల్లగా, స్వచ్ఛంగా ఉంటాయి, తాంబూలపు మరకల్లేకుండా అది మనసులో పెట్టుకొని ఓ కవిగారు ఒకానొక రాజు గారి కీర్తి (కీర్తి తెల్లగా ఉంటుందనే కవిసమయాన్ని పురస్కరించుకొని) కొంగలా, సన్యాసిపళ్ళలా తెల్లగా ఉన్నదని కీర్తించాడంటారు. స్వచ్ఛమనే అర్థంలోనే గాక పనికి మాలినవన్న దురర్థంలో కూడా ఈ మాట వాడుతుంటారు అక్కరకురాని వస్తువులు కూడా సన్యాసిపళ్ళే!

సప్తమీ విభక్తి: సప్తమి అంటే ఏడోది కొందరయితే ఏడుపనే అమంగళార్థం వస్తుందని 'అరున్నొక్కటి' అని మాత్రమే చెప్తారు! సంస్కృతభాషలో ఏడు విభక్తులున్నాయి. ఆ ప్రణాళిక తెలుగుభాషకు సరిపడ్డా సరిపడకపోయినా సంప్రదాయ వ్యాకరణాలు తెలుగు విభక్తులను ఆ ప్రకారంగానే వర్ణించాయి 'అందు, న' సప్తమీ విభక్తి – అని చదివిస్తారు గదా – డుమువులు ప్రథమావిభక్తి – అని మొదలేసి ఈ వ్యాకరణ సంప్రదాయంనుంచి ఒక జాతీయం పుట్టింది "పాపం! ఆయన సప్తమీ విభక్తిలో ఉన్నా"డని సానుభూతి వాక్యం పలికితే "ఆయన అందునా ఇందునా చెడ్డా"డని అర్థం! ఇంటా బయటా విఫలమైన వ్యక్తిని, చేపట్టిన పనులన్నీ చెడిపోయి, కష్టాల్లో పడ్డ వ్యక్తిని సప్తమీ విభక్తిలో ఉన్నాడని చెప్తారు శాస్త్రం నుంచి వాడుకలోకి వచ్చిన జాతీయమిది

సంపతికుంటు: సంపతి అనేది సంపత్తి, సంపద అనే మాటకు రూపాంతరం 'కుంటు'కు బదులు 'మరుపు' అనే మాటను కొందరు వాడ్తారు మరుపు మరిచిపోవటం కుంటు అనేది కుంటిగా, పెడగా, అసాధారణంగా ప్రవర్తించటం "నడమంత్రపు సిరి, నరాలమీది కురుపు" అనే సామెత ఉంది అనుకోకుండా, ఉట్టవుడియంగా, పరిశ్రమించకుండా ఏ వారసత్వంగానో వచ్చిపడిన 'ముదనష్టపు' (మృతనష్టం) ఆస్తివల్ల తల తిరిగిపోయిన వ్యక్తులు ఇతరులను గుర్తించకపోవటం, విర్రవీగటం, పుట్టినప్పటినుంచీ తామెరిగిన, తమ్మెరిగిన వారిని గుర్తుపట్టలేకపోవటం లోకంలో ఉన్న విషయం ఎవరయినా నిర్లక్ష్యంగా వ్యవహరించినా, కొత్తగా వచ్చిన డబ్బువల్లనో, పదవివల్లనో ఇతరులను ఈసడించి

మాట్లాడినా సదరు వ్యక్తికి సంపతి కుంటు వచ్చిందంటారు తెలిసికూడా గుర్తుపట్టనట్లు వ్యవహరిస్తే సంపతి మరుపు వచ్చిందంటారు

**సంపాతి జటాయువులు:** రామాయణంలో పాత్రలయిన సంపాతి జటాయువు లన్నదమ్ములు–గద్దలు. జటాయువు సాక్షాత్తూ రావణాసురుడితో యుద్ధం చేసి, సీతను కాపాడటానికి ప్రయత్నించి ప్రాణం పోగొట్టుకొన్న గద్ద. సంపాతి సీతాపహర్త ఎటు వెళ్లాడో దారి చూపి పుణ్యం కట్టుకున్న ముసలిగద్ద ఈ రెండు పేర్లనూ కలిపి చాలా పాతకాలం నాటి వాళ్లని చెప్పడానికి "అయన సంపాతి జటాయువుల నాటి వాడని" అక్షేపిస్తుంటారు ఇక్ష్వాకుల బారసాలనాటి విషయమని, మాంధాత కాలానిదనీ అన్నట్లే ఈ గద్దల నాటిదని కూడా చెప్తుంటారు మరికొందరు రామాయణకాలానికే ముసలితనంలో ఉన్న భల్లూకరాజు 'జాంబవంతుడి నాటి విషయమని' మరికొంత ఘనంగా చెప్తారు ఎన్నడో జరిగిన దేవాసురుల యుద్ధంలో దేవతల తరఫున పోరాడిన జాంబవంతుడు, సుగ్రీవుడి మంత్రిగా, రామదండులో ప్రముఖవీరుడుగా ఉండి, రామావతారం తరవాతి కృష్ణావతార సమయంలో అయనతో పోరాడి ఓడి, కూతురు జాంబవతినిచ్చి పెళ్లి చేశాడని పురాణాలు ఘోషిస్తున్నాయి ఇంత సుదీర్ఘకాలం ఆరోగ్యంగా బలంగా జీవించినవాడు కాబట్టి 'జాంబవంతుడి ఆయుష్షు' అనే మాటకూడా పుట్టింది

**సర్వం జగన్నాథం:** సర్వం అంటే అన్నీ, అంతా జగన్నాథం అంటే జగత్తుకు (ప్రపంచానికి) నాథం (ప్రభుత్వం, అధికారం చెలాయించగలది) జగమంతా భగవంతుడితో నిండి ఉందనిగాని, అన్నీ భగవత్ స్వరూపాలేననిగాని చెప్పవచ్చు కానీ ఈ మాటను విరుద్ధార్థంలో విపరీత పద్ధతిలో ప్రయోగిస్తుంటారు కొందరు దీన్ని పూరీలోని జగన్నాథస్వామి ఆలయమర్యాదలకు అన్వయించి ప్రయోగిస్తుంటారు ఆ దేవాలయంలో ఇచ్చే ప్రసాదానికి కులభేదం లేదు అంతా కలగాపులగం, మడీ మైలా లేదు, పరిశుభ్రతా అశుభ్రతా అన్వయించవు అనే అర్థాల్లో సర్వం జగన్నాథమని నిట్టూరుస్తుంటారు ఇది విచారంతో విషణ్ణంగా వాడే మాట ఎంగిలి మంగల మన్నట్లు, ఎవరికీ దేనికీ ప్రత్యేకత లేదన్నట్లు ఈ మాటలద్వారా స్ఫురిస్తుంది

**సర్వభక్షకుడు:** సర్వం అంటే అన్నీ – భక్షించే/తినే వాడు సర్వభక్షకుడు అగ్నిదేవుడి కీమాట పర్యాయపదం నిఘంటువుల్లో అదంతా యజ్ఞయాగాదులు చేయటం జీవనవిధానమైనప్పటి మాట అధునిక ప్రభుత్వ వ్యవస్థ వచ్చిన తరవాత రకరకాల ఉద్యోగాలు వచ్చిపడ్డాయి లంచాల జోరు పెరిగింది కొందరు సజ్జనులు అందులో కొన్ని ప్రత్యేకతలు పాటించేవాళ్లు అంటే వస్తురూపంలోనే లంచం పట్టేవాళ్ళు కొందరు ద్రవ్యరూపంలోనే తీసుకొనేవాళ్ళు మరికొందరు మదిరామదవతుల్లో ఏ ఒక్కటో ఆశించేవాళ్ళు ఇంకా కొందరు ఇలాంటి విభేదాలు గాని, ప్రత్యేకాభిమానాలు గాని ఏవీ లేకుండా ఏమిచ్చినా తీసుకొనే మహాత్ములుంటారు వాళ్ళని సర్వభక్షకు లని వ్యవహరించటం ఈనాటి మర్యాద తినటమే ప్రధానంగాని ఏం తింటున్నామనేది ప్రశ్న కాదన్నమాట

**సర్వమంగళం:** సంపూర్ణమనే అర్థంతో ఈ మాటకు వాడుక పార్వతీదేవికి సర్వమంగళ అనే పేరుంది అన్ని శుభాలూ (మంగళాలు) కలిగిందనీ, కలిగించేదనీ రెండర్థాల్లోనూ ఆమె కాపేరు వచ్చింది ఆమె సతిగా దక్షుడింట్లో పుట్టి, శివుణ్ణి వివాహమాడి, యజ్ఞానికి తన భర్తను పిలవకపోగా నిందించినందుకు మండిపడి, యోగాగ్నిలో దగ్ధమయిపోయిం

దనేది పురాణకథనం చివరికి అయిందేమంటే – తగలబడటం ఈ విషయం జనులను విచలితుల్ని చేసింది అందువల్ల సర్వమంగళ మయిందంటే సర్వనాశన మయిందన్న అర్థం పుట్టించారు నిజానికి ఈ మాటలకున్న సహజార్థం ప్రకారం అంతా మేలు జరిగిందని చెప్పాలి కానీ అందుకు కేవలం విరుద్ధంగా సర్వధ్వంస మనే అర్థం వాడుకలోకి వచ్చింది

**సేమిరా:** సంస్కృతంలోని పంచతంత్రంలో ఈ మాట వినిపిస్తుంది తెలుగు కవులు దూబగుంట నారాయణకవి, బైచరాజు వేంకటనాథుడు అనువదించిన పంచతంత్రంలో ఒక కథ ఉంది ఒక రాజకుమారుడు అడవికి వెళ్ళి, పెద్దపులి భయానికి చెట్టెక్కాడని, దానిమీద ఉన్న ఎలుగుబంటి భయపడవద్దని అతడికి ఆశ్రయమిచ్చి కాపాడిందనీ కథ చెట్టెక్కలేని పులి, మొదలు దగ్గర చేరి నిద్రలో ఉన్న ఎలుగును కిందికి నెట్టి తన ఆకలి తీర్చి ప్రాణం కాపాడుకొమ్మంటే ఆ రాజకుమారుడు ఎలుగుబంటిని కిందకి తోశాడు అయితే అది జాగ్రత్తపడి కొమ్మలు పట్టుకొని ప్రాణం కాపాడుకొని, మిత్రద్రోహిని పూర్వవృత్తాంతం మరిచిపొమ్మని శపించింది కొంపకు చేరినా అతగాడు 'ససేమిరా' అని తప్ప మరేమీ పలకలేదు

ఈ దుస్థితినుంచి కుర్రవాణ్ణి కాపాడుకోటానికి ఎవరెన్ని విధాల ప్రయత్నించినా ఫలితం కలగలేదు చివరికి రాజు మరణదండన విధించగా తప్పించుకొని రహస్యజీవితం గడుపుతున్న మంత్రి అడవిలో జరిగిన గత దుర్మార్గాన్ని బయటపెడ్తుంటే ఒక్కొక్కమాటనే వదిలిపెట్టి 'సేమిరా, మిరా, రా' అని ఆఖరున మామూలు స్థితికి వచ్చాడనేది కథ మిత్రద్రోహి మాటలన్నీ మరిచిపోగా మిగిలి పలికిన పలుకులివి చిట్టచివరి వైద్యం ఫలించేదాకా ఎవరేమి చెప్పినా, ఏమి చేసినా మళ్ళీమళ్ళీ జపించిన పదం 'ససేమిరా' అనేది అది శాప ఫలితంగాకాక మొండితనంవల్ల, అజ్ఞానంవల్ల పలికిన మాట అన్నభావం పుట్టి ముదిరి 'ససేమిరా' అంటే 'ఎవరేం చెప్పినా సరే' అనే మొండి బండ అర్థం వాడుకలోకి వచ్చింది 'ససేమిరా నేనీపని చెయ్యనన్నాడు ఏం చెప్పినా ససేమిరా వినడు' లాంటి ప్రయోగాలు జన వ్యవహారంలో నిలిచిపోయాయి

**సారస్యపుతాడు:** పేరిగాణ్ణి తలచుకొన్ననేరానికి వ్యక్తినామంతో సంబంధంలేని 'సారస్యపుతాడు'ను ప్రస్తావించవలసివచ్చింది సంగీత నాట్యప్రదర్శనలు చూసి వెర్రి ఆనందంపొందిన పేరిగాడు కుప్పిగంతులు పెట్టుండేవాడు రాజుగా దర్బారులో అలాంటి వెకిలి వేషాలు వేస్తే లోకం అసలురాజు లేడని అనుమానిస్తుంది కాబట్టి ఏదోవిధంగా ఇతగాడు ఎగరకుండా ఏర్పాటు చేశారు మంత్రులు అదేమంటే – అతడిజుట్టు కోతాడుకట్టి సింహాసనం వెనకనిలిచె అంగరక్షకుణ్ణే లాగమన్నారు–నకిలీరాజు వెర్రివేషాలు వేయబోతుంటే! దానికి కవి పెట్టిన పేరు 'సారస్యపుతాడు' సరసంగా హుందాగా ప్రవర్తించాలని గుర్తు చేయడానికి ఏర్పాటయిన తాడు కాబట్టే దానికాపేరు పెట్టారు పదిమందిలో నగుబాటుగా ఎవరైనా ప్రవర్తిస్తుంటే వాళ్లను అదుపులో పెట్టమని సూచించడానికి అక్కడున్న పెద్దల్ని 'బాబూ! కాస్త సారస్యపుతాడు లాగ'మని కోర్తారన్నమాట పశువులకు ముక్కుతాడులాంటి దన్నమాట ఇది

**సింగడుబూరడు:** ఈ మాటను ఒకె వ్యక్తి విషయికరంగా చెప్పి, 'పొగరెక్కినవాడు, విజృంభిస్తున్నవాడు' అనే అర్థాల్లో వాడుతుంటారు కొందరేమో ఇది జంట గట్టి ఉమ్మాయజగ్గాయల్లాగా ప్రవర్తించేవాళ్లకు అన్వయిస్తుంటారు సింగడు 'శృంగ' శబ్ద

వికృతి 'కొమ్ము' అనే వాద్యానికి మానవత్వం, పురుషత్వం కల్పించిన రూపమిది 'బూర'కు కూడా అలాంటి లక్షణాలే ఆపాదించారు. యుద్ధం మొదలేసే ముందు పూర్వం కొమ్ము లూదేవాళ్లు బూరలు వాయించేవాళ్లు అంటే కయ్యానికి కాలు దువ్వేవా ళ్లన్నమాట ఈ పాత అలవాటును స్మరించి ఎవరైనా విజృంభించి మాట్లాడినా, కొట్లాటకు దిగినా "ఈనాడీయన సింగడూ–బూరడూ అయినా"డని చెప్పటం అలవాటయింది కొంతమంది సింగడు అనే మాట సింహశబ్దభవమనీ సింగడు/సింహం బూర డయినాడంటే గర్జిస్తున్నాడనీ గ్రహించాలంటారు. వివరణ ఏదైనా ఫలితమొక్కటే

సింగన్న ప్రయాణం: అనగనగా సింగన్న అనే కుర్రవాడు. అతడు భయస్థుడు, వినయవంతుడు కానీ ఆలోచన తక్కువ మనిషి. ఒకరాత్రి తల్లీతండ్రీ మాట్లాడుకుంటూండగా మరునాడు రెండు ముఖ్యమైన పనులున్నాయనీ, ఒకటి తానే చేయకతప్పదనీ, రెండోదానికి కొడుకును పురమాయిస్తాననీ తండ్రి చెప్పటం విన్నాడు తెల్లవారుజామునే లేచి అద్దంకిపోయి పని పూర్తిచేసుకొని సాయంకాలానికి తిరిగిరావలసిన వుంటుందని అర్థమయిందా కుర్రవాడికి. ఎటూ తప్పని పని తెల్లవారేసరికి ప్రయాణం కాబట్టి వెంటనే నిద్రపట్టించి వేగుచుక్కతోబాటు లేచాడు సింగన్న. అంతవరకూ అతడు చేసిన పని బాగానే ఉంది లేచీలేస్తుండగానే అద్దంకి బయలుదేరాడు – ఎందుకో తండ్రినడిగి తెలుసుకోకుండానే! మళ్లీ తిరిగి వచ్చాడు సాయంకాలానికి "ఏరా సింగన్నా! పొద్దున్నే ఎక్కడికి పోయావు? నిన్ను ఫలానా పనిమీద అద్దంకి పంపుదామనుకొన్నానే!" అని తండ్రి అడిగితే, "అద్దంకి పోవాలన్న మాట విని ఎటూ తప్పదుగదా అని పొద్దున్నేపోయి ఇప్పుడు వచ్చా"నన్నాడు పుత్రరత్నం!

అందుకే ఒక సామెత పుట్టింది "సింగన్న అద్దంకి పోనూపోయాడు – రానూ వచ్చాడు" అని! ఎందుకు పోయాడో, ఎందుకు వచ్చాడో అతడికి తెలియదు ఒకర్నడిగి తెలుసుకోనూ లేదు పోకతప్పదుగదా అని పోయాడు రాక తప్పదు కాబట్టి వచ్చాడు చెప్పేమాట పూర్తిగా వినకుండా, చేయవలసిన పని తెలుసుకోకుండా చేతులూపుకుంటూ పోయి కాళ్ళూపుకుంటూ వచ్చాడు. ప్రయాణం నిష్ఫలం. ప్రయాస అనవసరం చేసింది లేదు. చేయడానికి పని లేదు ఇలా నిష్ప్రయోజనకరమైన అయాసాన్ని 'సింగన్న అద్దంకి ప్రయాణం'తో పోలుస్తారు సింగన్న బదులు మరో కుంకన్న పేరు పెట్టినా, అద్దంకి స్థానంలో మరో వెల్లంకిని పెట్టినా ఇబ్బంది లేదు పేర్ల మార్పుతో ఇదే విషయాన్ని భిన్నప్రాంతాల్లో వ్యవహరిస్తుంటారు

సింగరాజు *లింగరాజు:* తెలుగు సాహిత్యంలో మొదటి లోభి లుబ్ధావధానులయితే, ఈనాటివరకూ తిరుగులేని లోభి సింగరాజు లింగరాజు కాళ్ళకూరి నారాయణరావుగారి "వరవిక్రయం" అనే నాటకంలో ఈ మహాత్ముడు అవతరించాడు దాదాపు ఓ అర్ధశతాబ్దం స్టేజి నాటకాల పుణ్యమా అని బ్రహ్మాండమైన పేరు సంపాదించాడు. లుబ్ధావధానులు డబ్బిచ్చి (దాన్ని 'ఓలి' అంటారు) పిల్లను కొని పెళ్ళాడదామనుకున్నాడు లింగరాజుగారు కొడుక్కు విడాకు లిప్పించి కట్నం కోసం మరో పెళ్ళి చేద్దామనుకున్నాడు ఒకరిది కన్యాశుల్కమయితే, రెండోవారిది వరకట్నం

లుబ్ధావధానులు జీవితాన్ని ఎంత దుర్భరంగా గడిపేడోనని మనం బాధపడనక్కర లేదు అతడి అవసరాలు తక్కువ కోరికలూ తక్కువే లింగరాజు అలాకాదు

ఈయనకు చాలా పెద్ద కోరికలే ఉన్నాయి పొదుపు పద్ధతుల్లో పండతుడు పెరట్లో చెట్లుంటే వాటి ఎండు కొమ్మలతో, ఆకులతో వంట చేయించేవా డనేది చిల్లర విషయం కాకిగూడు ఊడబెరికించి దానితో ఒక పూట వంట చేయించాడు! ఈ మానవజాతి చరిత్రలో ఇంత గొప్ప పొదుపు కార్యక్రమం నిర్వర్తించిన మేధావి ఇతడొక్కడే ఇంతకన్నా పాచిపీనుగ లే డనిపించినపుడు సదరు వ్యక్తిని బుద్ధావధానులంటే చాలదు–సింగరాజు లింగరాజనే అనాలి, అంటారు పొదుపును నీచత్వంతో రంగరించి ఆ రసాయనానికి బోలెడు భేషజం, మరికాస్త లౌక్యం కలిపితేగాని లింగరాజును సృష్టించలేం ఇతర సాహిత్యాల సంగతి చెప్పలేంగాని తెలుగు సాహిత్యం ప్రసాదించిన పరమ నీచపాత్రల్లో ఈయనిది మకుటాయమానం అంతకుమించిన లోభి పుట్టలేదిప్పటికి ఓసారి వరవిక్రయం చదివితే అయన మూర్తి కళ్ళకు కట్టుంది

సింగినాదం–జీలకర్ర: మాట అలికిడి, పోట్లాట వంటివి వినపడ్డప్పుడు ఏం జరుగు తున్నదంటే 'ఏముందీ! సింగినాదం–జీలకర్ర' అంటారు – 'వడ్లగింజలో బియ్యపు గింజ' అన్నట్లు ఏమీ లేదనీ, పెద్ద చెప్పుకోదగ్గది లేదని, అది సహజమేనని రకరకాల అభిప్రాయాలనూ భావాలనూ వివరించడానికి ఈ మాట వాడుతుంటారు సింగినాదమనే మాట 'శృంగనాదం' అనే సంస్కృత పదబంధంనుంచి పుట్టింది శృంగం అంటే కొమ్ము శృంగనాదం అంటే కొమ్మూదిన ధ్వని

మనకు జీలకర్ర, మిరియం, ఏలకులు, లవంగాలవంటి పంటలు లేవు అవన్నీ సుగంధ ద్రవ్యాలకింద లెక్క వాటిని విదేశాలనుంచి దిగుమతి చేసుకొనేవాళ్ళు జీలకర్ర ఆఫ్ఘనిస్తానంనుంచి వచ్చిం దంటారు పాత కాలంలో బిడారు వర్తకులు బండ్లమీద, ఎడ్లమీద, గుర్రాలమీద, ఒంటెల మీద – కొన్ని సందర్భాల్లో గాడిదలమీద సరుకు లెత్తుకొని, దారి దొంగల భయానికి మందగట్టి ప్రయాణించేవాళ్ళు అలా చాలామంది వర్తకులు కలిసికట్టుగా బయలుదేరి, రక్షణార్థం సాయుధ సేవకులతో సహా అక్కడక్కడ మజిలీలు చేస్తుండేవాళ్లు అలా ఏ పెద్ద గ్రామం దగ్గరో, నగరం దగ్గరో ఊరిబయట గుడారాలు దించేవాళ్ళు వాటిని 'నకరం, నఖరం' అని పాత శాసనాల్లో ప్రస్తావించేవాళ్లు తా మలా గ్రామ సమీపానికి వచ్చేటప్పుడు కొమ్ములూది తమ రాకను ప్రకటించేవాళ్లు అంటే 'సింగినాదం' చేసేవాళ్లన్న మాట అది వారి రాకకు గుర్తు

సరుకులతో వర్తకులు వచ్చారంటే తమదగ్గర పండని, తమక్కావలసిన వస్తువులను కొనుక్కొని, తమ ఉత్పత్తులను (ధాన్యం, వస్త్రం వగైరాలను) అమ్మేవాళ్లు గ్రామస్థులు చాలావరకు అమ్మకాలూ కొనుగోళ్లూ వస్తువుల మార్పిడి రూపంలోనే జరిగేవి సింగినాదం వినిపించిందంటే జీలకర్రవంటి విశేష వస్తువులు, అమ్మకానికి వస్తున్నట్లు భావించేవాళ్లు ఇది కార్య కారణ సంబంధం లాంటిది. అనేక వస్తువులు – అందులోనూ సుగంధ ద్రవ్యాలున్నా – అందరూ కొనగలిగిన చౌక వస్తువు జీలకర్రే వాటిలో అందువల్ల సింగినాదానికీ జీలకర్రకూ మనవాళ్లు ముడివేశా రన్నమాట కాలక్రమాన ఈ రకం బిడారు వర్తకం చాలావరకు తగ్గిపోయింది ఇప్పటికీ కోయలూ వగైరాలు అడవి వస్తువులను, పూసలూ, దువ్వెనలవంటి చిన్నచిన్న వస్తువులనూ తెచ్చి అమ్ముతున్నారుగాని, వారి రాకను ప్రకటించే సింగినాదంవంటి అర్భాటా లిప్పుడు చాలా తక్కువ ఇంకా అక్కడక్కడ మైకులు పెట్టీ కేకలు పెట్టీ సబ్బులూ,

శృంగార సామగ్రీ, మూలికలూ అమ్మేవాళ్లు లేకపోలేదు సింగినాదం వాడుకలోంచి పోయింది. జీలకర్ర కిరాణా కొట్లలో దొరుకుతున్నది. అందువల్ల పాత అర్థం పోయి 'అర్భాటం, హడావుడి, అర్థంలేని తగాదా, కంఠశోష'వంటి ఇతరార్థ విశేషాలు వచ్చాయి ఈ పదబంధానికి. ఇలాంటి మాటలు గత సాంఘిక చరిత్రను కొంతకు కొంత వివరించేవని గుర్తించాలి.

**సిడిపోతు:** గ్రామ దేవతకు బలి ఇచ్చి అరిష్టాల నుంచి బయటపడటానికి అంబోతును పెంచినట్లే గొర్రెనో మేకనో పెంచుతారు అంబోతుకులాగానే ఈ గొర్రెపొటేలుకుగాని, మేకపోతుకుగాని ఊరితమ్ముడి పెంపకం ఉంటుందిగాని, అంబోతుకు జరిగే ఇతర మర్యాదలు దీనికి జరగవు. తెగతిని బలిసిపోయిన సిడిపోతును అలంకరించి ఊరేగించి గుడి దగ్గరకు తీసుకుపోయి చివరకు బలి ఇస్తారు. సిడిపోతు వైభవం తాత్కాలికం. బలిపశువుగా మాత్రమే దీని పోషణ జరుగుతుంది. విపరీతమయిన తిండితప్ప స్నానాది సత్కారాలు లేనందువల్ల బలిసి మదపు వాసనతో ఊరిమీద తిరిగే సిడిపోతుతో పొగరెక్కి మదించి తన్నులాటలకు దిగే దురహంకారులను పోలుస్తారు ఈ పోలికలో అసహ్యమేగాని అంబోతు విషయంలో లాగా భయభక్తులుండవు. కాయకష్టం చేయకుండా తెగతిని బలిసిన సోమరులను సిడిపోతులని వర్ణిస్తారు ఎవడో సమర్థుడొకడు వచ్చి బలి ఇచ్చేదాకా – అంటే పొగరణిచేదాకా–విచ్చలవిడిగా తిరిగే వ్యక్తి సిడిపోతు

**సుగ్రీవాజ్ఞ:** మన పురాణేతిహాసాల్లో కావ్యాల్లో షట్చక్రవర్తులు, షోడశమహారాజులు, ఎందరో రాక్షసులు రాజ్యా లేలినట్లు చదువుతాం. కాని అటు రామరాజ్యంలోనూ ఇటు రాక్షస ప్రభుత్వంలోనూ తిరుగులేని అజ్ఞలు వేసి అమలుజరిపినవా డొక్కడూ లేడు – సుగ్రీవుడుతప్ప తానంత బలవంతుడయినా, సమర్థుడయినా, శ్రీరాముడంతటివాడి సహాయసంపదలున్నా సుగ్రీవు డేలింది కోతిమూకను – మనుషులను కాదు. 'మనిషికో మాట – గొడ్డుకో దెబ్బ' అనే సామెత కూడా కిష్కింధా రాజ్యంలో పూర్తిగా వర్తించదు కారణం కోతులు మనుషులు కాకపోవటం – గొడ్లలో చేరకపోవటం అతి చంచలమైన బుద్ధిగల కోతులను – ఒకటీ రెండూ కావు, కోట్ల సంఖ్యలో ఉన్న కోతులను – అదుపులో పెట్టడం, సైనికులనుగా తీర్చిదిద్ది, క్రమశిక్షణలో ఉంచటం అసామాన్యమైన పని అన్నన్ని కోతులకు వాలి కాలంలోకన్నా సుగ్రీవుడి హయాంలోనే ప్రాణభయంతో ఒక కట్టుబాటులో ప్రవర్తించవలసి వచ్చింది. అందుకని వాటిని అదుపులో అజమాయిషీలో ఉంచిన సుగ్రీవుడి ఉత్తరువు తిరుగులేనిదనే పేరు తెచ్చుకొంది. సుగ్రీవాజ్ఞ అంటే చండప్రచండ శాసనం. తలవంచి తీరవలసిన ఆదేశం. తిరుగులేని అధికారం. అందుకే "ఆయన మాటంటే ఆ చుట్టుపక్కల సుగ్రీవాజ్ఞే"లాంటి ప్రయోగాలు పుట్టాయి

ఇంత పేరు తెచ్చుకొన్న సుగ్రీవాజ్ఞ ఒకే ఒక్కసారి అమలుకాలే దంటారు సీతాన్వేషణకు పోయిన కోతులన్నీ ఆమె కనిపించందే తిరిగి కిష్కింధకు పోవటానికి జంకాయి – సుగ్రీవు డేశిక్ష విధిస్తాడో తెలియక హనుమంతుడు సీతను చూసి, లంకా దహనం చేసి వచ్చేదాకా సముద్రతీరంలో కనిపెట్టుకొని కూర్చున్న కోతిమూక శుభవార్త వినగానే విజృంభించి సుగ్రీవుడి సొంతతోటనే ధ్వంసం చేసింది. అంత సుగ్రీవుడూ ఇంత ఆనందసమయంలో హింసలూ చిత్రవధలూ ఎందుకని ఆ ఒక్కసారికి

అందర్నీ క్షమించాడు! ఒక్కసారి, ఒకేఒక్కసారి మాత్రం విఫలమైన సుగ్రీవాజ్ఞ ఇతర సమయాల్లో నిర్దాక్షిణ్యంగా అమలు జరిగింది. అందుకే అది తిరుగులేనిది

**సుందోపసుందులు:** సుందుడు, ఉపసుందుడు అనే ఇద్దరన్నదమ్ములు నికుంభుడనే రాక్షసుని పుత్రులు. వింధ్యారణ్యంలో వాళ్ళు తపస్సు చేసి బ్రహ్మను మెప్పించారు వాళ్ళు సంపాదించిన వరాలవల్ల ఇతరు లెవ్వరూ వాళ్లను చంపలేరని తేలిపోయింది. ఎంతో అన్యోన్యంగా పెరుగుతున్న వాళ్ళ భ్రాతృస్నేహం లోకానికి పీడాకరమయింది. వాళ్ళు మునులను పెట్టే బాధలు నానాటికీ పెరిగిపోతే బ్రహ్మ వాళ్ళిద్దరికీ తగాదా పెట్టడానికి ఒక జగదేకసుందరిని సృష్టించాలనుకొని, ఆ పని స్వయంగా చేయటం ఇష్టం లేక బాధ్యతను విశ్వకర్మ నెత్తిన పెట్టాడు. ఒక్కో అప్సరస నుంచి తిలప్రమాణంలో (అంటే నువ్వుగింజంత) చక్కదనం సేకరించి సృష్టించిన ఆ సౌందర్యవతికి తిలోత్తమ అనే పేరు పెట్టారు. బ్రహ్మ ఆమెను పిలిచి, అన్నదమ్ముల మధ్య వైరం పుట్టించి ఒకర్నొకరు చంపుకొనేటట్లు చేయమన్నాడు. ఆమె వాళ్ల కంట పడగానే ఇద్దరూ మోహంలో పడ్డారు 'మీ ఇద్దరిలో ఎవరు బలవంతులయితే వారిని వరిస్తా'నన్నది తిలోత్తమ దాంతో వారిద్దరూ ఘోరయుద్ధం చేసి ఒకర్నొకరు చంపారు లోకానికే కాక తిలోత్తమక్కూడా పీడ వదిలింది!

అన్నదమ్ములుగాని, అతి సన్నిహితులుగాని పాత మైత్రిని మరిచి పోరాడుకొంటే వాళ్లని సుందోపసుందులని వ్యవహరిస్తారు ఇలాగే పోట్లాడుకొన్న పాత్రలు పురాణాల్లో అనేకం. ఉదాహరణకు గజకచ్ఛపాలు కానీ ఆత్మబంధువులు పోరాడుకొని ఇద్దరూ హతమైనది సుందోపసుందుల విషయంలోనే అవతలి వ్యక్తిని చంపటంతప్ప మరో లక్ష్యం లేని శత్రువులను – పాత మిత్రులను – సుందోపసుందు లంటారు

**సుబ్బారాయుడు:** ఈ వ్యక్తి అయితంపూడి ఉద్యోగంలాంటివాడు. అందనివాడు, పుట్టనివాడు 'ఆలూలేదు, చూలూలేదు, అబ్బాయిపేరు సుబ్బాయురాయు'డని ఓ సామెత పుట్టింది ఒక అమాయిక చక్రవర్తి ఎవరి వీధిఅరుగుమీదనో పడుకొన్నాడు తనకు ఉండ నిల్లూలేదు – పండ మంచమూ లేదు పిల్ల నిచ్చేవాడూ లేదు ఇచ్చినా పెళ్లాడే స్థితిలోనూ లేదు తాను. అరుబయట అరుగుమీద పడుకొని మగతగా పడివున్న వ్యక్తికి ఆలోచన వచ్చింది కాలం ఎప్పుడూ ఒకే రకంగా ఉండదు ఓడలు బళ్లవుతాయి బళ్ళు ఓడలవుతాయి. ఎప్పటికో ఒకప్పటికి తానొక ఇంటివాడవుతాడు కొంతకాలానికి తనకో కొడుకు పుడతాడు తీరా కొడుకు పుట్టి, వాడి బారసాల సమయానికి మంచి పేరు తట్టకపోతే బావుండదు ఆ సమయంలో బంధువులు నలుగురూ నాలుగుపేర్లు సూచించి బుర్ర చెడగొడ్తారు. ఆ ప్రమాదం తప్పించుకోవాలంటే ముందుగానే నచ్చిన పేరు సిద్ధం చేసుకోవాలి ఇలాగని ఆలోచించి చివరికి పుట్టబోయే కొడుక్కి సుబ్బారాయుడనే పేరు పెట్టాలని నిర్ణయించుకున్నాడు. ఆ పేరు భార్యకే నచ్చలేదు దెబ్బలాటయింది నీవా నాకు చెప్పేదానివని ఆమెను నెట్టిపారేశాడు అరుగు పక్క గోడను ఆ మగతలో భార్య అనుకొన్నాడు లాగి తన్నేసరికి ఆ ఊపున తానే కిందపడ్డాడు అది కల కావచ్చు. మగత కావచ్చు ఏదయితేనేం, అది చెదిరిపోయినా నిలిచిందేమంటే పుట్టబోయే కొడుక్కి పెట్టబోయే పేరు సదరు సుబ్బారాయుడు ఒక అభాగ్యుడి ఊహలో అయోనిజుడుగా పుట్టిన మహాత్ముడు అతడికి ఊరు లేదుగాని పేరుంది తల్లిలేదుగాని తండ్రి ఉన్నాడు అయితే అతడు మాత్రం లేడు! వాస్తవ

జగత్తులో ఆకుకు అందని, పోకకు పొందని ఊహల్లో పుట్టిన మహనీయుడన్నమాట. ఈ పేరును రెండు విధాల వాడుతుంటారు తల్లెవరో తండ్రెవరో తానెవరో తెలియని అభాగ్యుణ్ణి 'పోవోయ్ సుబ్బారాయుడూ!' అని ఈసడిస్తారు. కొన్ని నాటకాల్లోని అదృశ్యపాత్రల్లాగా ఉన్నాడనిపించినా కంటికి కనిపించని వాడన్నట్లు ఎవరో తెలియని వ్యక్తిని గురించి వివరాలడిగితే 'ఎవరో సుబ్బారాయుడులెండి!" అనటమూ కద్దు.

**సుబ్బారావు:** సాధారణంగా రచయితలు తమ తమ గ్రంథాల్లోని పాత్రలకు ఏవో తమకిష్టమైన పేర్లు పెట్టారు. ఒకే మూసలో వందల సంఖ్యలో ఉన్న రచయితలు ఇరవయ్యో శతాబ్దంలో తెలుగు సాహిత్యంలో సృష్టించిన అమాయక పాత్ర సుబ్బారావు ఈయనకు ఇంటిపేరు లేదు. ఏ రచనలో చూసినా వట్టి అమాయకుడుగా, 'అతి' మంచివాడుగా, అస్వతంత్రుడుగా కనిపిస్తాడు– కథల్లో, కథానికల్లో, నవలల్లో. అతణ్ణెవరూ లక్ష్యపెట్టరు అత డందరినీ లక్ష్యపెడ్తాడు పరమ భయస్థుడు కలికానికయినా అతడికొక దురభ్యాసం లేనందుకు కట్టుకున్న భార్య కూడా బాధపడుతుంది. ఎవర్నీ కాదనలేడు ఏదీ కాదనలేడు మెత్తని – సుతిమెత్తని మనస్సు. అంతో యింతో చదువుకున్నవాడేగాని అతడికి గుమాస్తా ఉద్యోగంకన్నా గొప్పది లభించదు.

తెలుగు రచయితలు చాలామంది ఒకరితో ఒకరు సంప్రదించకుండా, కూడబలుక్కో కుండా సృష్టించిన పాత్ర యిది. తెలుగుదొంగకు గళ్ళ లుంగీ, దండకడియంలో గుచ్చిన చాకు, కళ్ళకు గంతలూ ఉండక తప్పదని మన కార్టూనిస్టులు నిర్ణయించుకొన్నట్లే రచయితలు సుబ్బారావు విషయంలో ఏకాభిప్రాయానికి వచ్చా రనిపిస్తుంది ఎన్ని విపరీతానుభవాలు కలిగినా ఈ సుబ్బారావు మాటతీరుగాని, ప్రవర్తనగాని, ధోరణిగాని మారదన్నమాట! ఇప్పుడిప్పుడు ఎవర్నయినా ఈసడించదలిచినప్పుడు 'పోరా! సుబ్బారావ్' అని గదుముతున్నారు– ముఖ్యంగా ఆడపిల్లలు– మరీ ముఖ్యం పడుచుపిల్లలు!

**సొరకాయ కోత:** లేతలో సొరకాయంత సులభంగా కోతపడే సన్నిహిత ఫలం లేదని కాబోలు కొందరు 'లేత' అనే విశేషణం కూడా ముందుచేర్చి ఈ మాట వాడ్తారు. గప్పాలు కొట్టే అవన్నీ సొరకాయ కోత లంటారు. 'లేత' శబ్దం వాడనివాళ్ళు చెప్పే వివరం మరొకటుంది తెగ ముదిరిన సొరకాయనయినా పైముచిక తీసివేసి లోపలి గుజ్జును తోడెయ్యటం చాలా సులభం కాకపోతే కొద్దిపాటి నేర్పుండాలి. ఇప్పటిలా నీళ్ళనుగాని, ఇతర ద్రవాలనుగాని నిలవ వుంచడానికి ప్లాస్టిక్‌సీసాలు దొరకని, లేని రోజుల్లో, కుండలు పెళుసుగా, లోహపాత్రలు బరువుగా వుండే రోజుల్లో, బాటసారులు సొరకాయ డిప్పల్లో వాటిని మోసుకపోయేవాళ్లు ముదిరిన సొరకాయను డొల్లచేసి ఎండబెడ్తే అది ద్రవపదార్థాలను చెడిపోకుండా నిలవ వుంచేది. కోసిన ముచికనే మూతగా అమర్చి, కాయమెడకు ఉగ్గంకట్టి, ప్రయాణ సమయాల్లో వాడుకునేవాళ్ళు ఇప్పటికీ ఆఫ్రికా ఖండంలోని అనేక దేశాల్లో సొరకాయను ఈవిధంగా వాడుకుంటున్నారు. ముదిరిన సొరకాయనే ఇంత సులభంగా కోయగలిగినప్పుడు లేతకాయ సంగతి వేరే చెప్పనక్కరలేదు ఇలా సొరకాయను కొయ్యటం, మాటలను సులభంగా వాడటంతో పోల్చి డచ్చీలు కొట్టడాన్ని, లేని ఘనతను చాటుకోవడాన్ని సొరకాయ కోతగా భావించి వ్యవహరించటం అలవాటయింది. 'కోతలరాయుడు' అనే మాటను కూడా ఈ ఉద్దేశంతోనే సృష్టించుకున్నాం కన్యాశుల్కంలోని గిరీశంలాంటి వాళ్ళను

కోతలరాయుళ్ళుంటాం. అదే విధంగా గొప్పలు చెప్పుకోడాన్ని సొరకాయ కొయ్యటం అంటున్నాం. సొరనే 'సొ్ర, అనప' అని కూడా పిలుస్తారు

స్తనశల్యపరీక్ష: స్తనశల్య పరీక్ష అనే దొకటి ఉంది. శల్యం అంటే ఎముక ఎముకలే లేని స్తనాల్లో అవి ఉన్నాయోమోనని చేసే పరీక్ష అది. స్తనాల్లో నాలుకలోలాగా ఎముకల్లేకపోయినా వాటికింద ఉన్న ఎముకల గూడును పరీక్షించవచ్చు కాబట్టి, ఎంతో శ్రమపడి చేసే గంభీర పరీక్షను స్తనశల్యపరీక్ష అనవచ్చని కొందరంటారు. చాలా జాగ్రత్తగా ప్రతి విషయాన్ని శోధించి చూస్తుంటే స్తనశల్యపరీక్ష చేస్తున్నారంటారు.

స్థాలీపులాకం: స్థాలీ అంటే పాత్ర. పులాకం అనేది తెలుగులోని 'పులగం' అనే మాటకు పూర్వ సంస్కృత రూపం. వివాహ సమయాల్లో నూతన వధూవరుల చేత చేయించేది 'స్థాలీపాకం' పాకమంటే వంట కుండలో చేయించిన వంట స్థాలీపాకమయితే అందులో పండిన పదార్థం పులాకం అంటే పులగం అన్నమంతా సరిగా ఉడికిందా లేదా అని చూడటానికి ఒకటి రెండు మెతుకులు పట్టి చూస్తాం. అది చాలు మొత్తం అన్నం ఉడికిందో లేదో చెప్పటానికి. అంటే మచ్చుకు, మాదిరికి కొంతభాగాన్ని పట్టిచూసి మొత్తం పదార్థ లక్షణాలు అదేవిధంగా ఉన్నాయని నిర్ధరించుకోవటమన్నమాట స్థాలీ పులాకమంటే ఇదో న్యాయమంటారు "స్థాలీపులాకం"గా ఈ ప్రభుత్వం చేసిన పనులు మంచిపన్లో చెడ్డపన్లో కొన్ని ఉదాహరణలిస్తే, మొత్తం వ్యవస్థ గురించి చెప్పినట్లే లెక్క. పాకపులాక శబ్దాలమధ్య గజిబిజిపడి కొందరు "స్థాలీపాకంగా చెప్తున్నానయ్యా! ఈ పనులేం బాగా లేవని" అనటం కద్దు. వాళ్ల ఉద్దేశం మాత్రం స్థాలీపులాకమనే

స్థూలారుంధతి: చెప్పే పురోహితుడికీ వినే వరుడికీ (ముఖ్యంగా పగటి వివాహాల్లో) కనిపించకపోయినా ఉత్సాయింపుగా అరుంధతీనక్షత్రం ఆ ప్రాంతాల్లో ఉంటుందని తలయెత్తి అటువైపు చూసి, "అఁ ఉందిలె"మ్మనటం ఒక తంతు పురోహితుడు వేలెత్తి చూపిన ప్రాంతానికి కొంచెం అటుగానో ఇటుగానో అరుంధతి ఉన్నదనుకోవటం, చూశాననుకొని అలా చెప్పటం స్థూలారుంధతీన్యాయ మంటారు అంతేగాని, అరుంధతి స్థూలంగా (లావుగా, బొద్దుగా) ఉంటుందని అర్థం కాదు చూసీచూడకుండా, తెలిసీతెలీకుండా చెప్పినమాటను స్థూలారుంధతి అంటారు.

స్నానం: స్నానం మూడు రకాలుట – కాకస్నానం, గజస్నానం, మహిషస్నానమని కాకి ఏ నీటిమడుగులోనో ఒక రెక్కను తడిసీతడవనట్లు జాడించి విదిలించుకొని మళ్ళీ రెండో రెక్కను అదేవిధంగా జాడించి స్నానమయిం దనిపించుకుంటుంది మనలోకూడా కొందరు లెక్కకు రెండు చెంబుల నీళ్ళు కుమ్మరించుకొని స్నానం చేసినట్లే సంతోషించేవా ళ్లున్నారు ఒంటి మురికి వదలటం ప్రధానం కాదుగాని స్నానం చేశా డనిపించుకోవటమే ముఖ్యం ఈ రకం స్నానాన్ని 'కాక స్నాన' మంటారు

ఏనుగు ఈదటం చాలామంది చూసివుండరు. బ్రహ్మాండంగా ఈదుతుంది. అందుకే 'గజయీతగాడు' వంటి మాటలు పుట్టాయి. ఏ చెట్టు కొమ్మనో విరిచి చక్కగా ఒళ్ళు తోముకుంటుంది కూడా. తంజావూరు పాలించిన నాయకరా జొకాయన సైనికులను ఏనుగులమీదకెక్కించి మన్నారు జలసంధిని దాటి 'సేపాళ రాజ్యస్థాపనాచార్య' అనే బిరుదు సంపాదించాడు ఏనుగులంత దీర్ఘకాలం సముద్రంలో కూడా ఈదగలవని ప్రత్యక్షంగా నిరూపించాడు. కొందరు స్నానాలగదిలో ప్రవేశించగానే

సమయసందర్భాలు గూడా గమనించకుండా గంటలతరబడి తోమిన శరీరాన్ని తోమినట్లే కాలం దొర్లిస్తారు. అలాగే ఏనుగులు నీటిలో దిగితే ఎంతకాలమయినా గడుపుతాయి. కాని ఒడ్డుకు చేరినతరవాత చెట్ల ఆకులను, దుమ్మును ఒంటిమీద చల్లుకుంటాయి. అందాకా చేసిన శ్రమ, స్నానం అంతా వృథా అయిపోతుంది. గంటలకొద్దీ స్నానమాడి తరవాత మాసిన గుడ్డలతో చింపిరితలతో ఊరేగేవాళ్ళు లేకపోలేదు మానవజాతిలో. ఈ బాపతు జనం చేసిన స్నానం 'గజస్నానం' – అంటే నిష్ఫలం, వృథాయాసం అన్నమాట! ఎంత శుభ్రంగా స్నానం చేశారో అంత అపరిశుభ్రంగా తిరిగేవాళ్లను గజస్నానం చేసేవారంటారు. ఫలితంలేని శ్రమను గజస్నానమని వ్యవహరించటం కద్దు.

మూడో రకం స్నానం 'మహిషస్నానం'. అంటే దున్నపోతు వ్యవహారం. నీళ్లలో నానటమేగాని మరే ప్రయోజనం దానికి లేదు. నానుతున్నంతసేపూ అర్ధనిమీలిత నేత్రాలతో ఆనందపారవశ్యంలో ఉండి, ఒళ్లు తోముకోవాలన్న ఆలోచన కూడా తట్టదు. లోతు నీళ్లకన్నా బురదనీళ్ళే వాటికి తృప్తినిస్తాయి. ఆ బురదతోనే బయటికి వస్తాయి బలవంతంగా. ఏనుగులు కనీసం శరీరం శుభ్రపరుచుకుంటాయి నీళ్లల్లో ఉన్నప్పుడు. బైటకు వచ్చిన తరవాత కొమ్మల్తో ఇసుకతో ఒళ్లు 'తుడుచుకుంటా'యన్నమాట – మనకు లాగా తుండుగుడ్డల్లేవు కాబట్టి. తడియార్చుకొనే వాటి పద్ధతి అది. అందువల్ల పూర్వశ్రమ వ్యర్థమైపోతుందని తెలీకపోవచ్చు. దున్నపోతులు అలాంటి ప్రయత్నాలు కూడా చేయవు. ఆచారం కోసమని, మడి కోసమని ఒకటికి నాలుగుసార్లు స్నానం చేసి తడిగుడ్డలతో, నీరుకావి పంచెలతో, పాచిపట్టిన కాళ్లతో వేళ్లతో ఉండేవాళ్లని 'మహిష స్నానం' చేశారని ఎద్దేవా చేస్తుంటారు. ఈరకం మనుషులకు స్నానం చేయటమే ప్రధానంగాని పరిశుభ్రత కాదు. గజస్నానం నిష్ఫలమైతే మహిషస్నానం నిరుపయోగకరం. కాకిది స్నానమే కాదు, నటన మాత్రమే. అందులో దున్నకు లాగా ఆనందమూ లేదు; ఏనుక్కులాగా ప్రయత్న పరిశ్రమాలూ లేవు.

**స్వయంపాకం:** ఈ మాటకు అసలర్థం సొంత వంట అని. ఆచారపరులయిన అగ్రవర్ణాలవారు ఇతరుల ఇళ్ళల్లో ఇతరులచేతి వంట తినరు. స్వగృహంలో కూడా సొంతంగా వండుకొని తినే ఛాందసు లున్నారు. వాళ్లు విధిలేని పరిస్థితిలో పొరుగూరు వెళ్ళవలసివస్తే బియ్యం, పప్పు, ఉప్పు తీసుకొని సొంతంగానే వండుకుతింటారు. వైష్ణవులు ఇతరులు వండితే తినరు. ఇతరులకు సపంక్తి భోజనం పెట్టరు. శైవులు వైష్ణవుల విషయంలో అలాగే ప్రవర్తిస్తారు. అటువంటి సందర్భాల్లో వండుకుతినటమే గత్యంతరం. తిరుపతి వేంకటకవులు అవధానాలు చేస్తూ గద్వాల సంస్థానానికి వెళ్ళినప్పుడు ఆస్థాన విద్వాంసులు వైష్ణవులు కాబట్టి వీరికి అన్నం పెట్టలేదు. ఆ విషయం స్మరిస్తూ "వంట నేర్పించె గద్వాల విభుడు" అని పద్యం చెప్పుకున్నారు. తమకన్నా పెద్దకులంవారని తాము భావించినాసరే ఇంట్లో అన్నం పెట్టకపోవటమనేది ఈనాటికీ నిలిచిన ఆచారం. 'స్వయంపాక'మని చేటలో బియ్యం వగైరాలు ఇప్పిస్తారు. తెలంగాణాలో ఈ మాటకు పర్యాయపదంగా "సాహిత్యం" అనేది వాడుకలో ఉంది. "అయ్యవారు వచ్చిన్రు. సాహిత్యమిచ్చి పంపుండ్రి" అంటారు. బియ్యంతో సహితంగా అనేక పాకవస్తువులు ఇస్తారు కాబట్టి సాహిత్య మన్నారన్నమాట!

తనవంట తానే చేసుకొనటమనేది స్వయంపాక శబ్దానికి తొలి అర్థం. వాడుకలో దాన్ని మరికొంత సాగదీశారు. తన మనసులోని మాటను, భావాన్ని బయటకు

చెప్పకుండా కష్టనష్టాలు వస్తే తనలో తానే కుమిలిపోయే వ్యక్తిని 'ఆయనదంతా స్వయంపాకం; ఉత్త స్వయంపాకపు మనిషి' లాంటి మాటలు వాడి వర్ణిస్తారు ఆధునిక మనస్తత్వ శాస్త్రంలో అభిప్రాయాలూ ఆలోచనలూ దాచుకొని తన ప్రపంచంలోనే తానుండే వ్యక్తిని 'ఇంట్రోవర్ట్' అంటారు. ఆ అర్థంలోనే స్వయంపాకం అంటే దాపరికం, స్వాభిమానం, రహస్య ప్రవర్తన వగైరా లక్షణాలనే వాడుక వచ్చింది.

హంస గానం: హంసలనే పక్షులు భూలోకంలో ఉన్నాయని నమ్ముతాం. బాతు జాతి నీటి పక్షులు కొన్ని హంసలుగా చెలామణిలో ఉన్నాయిగాని మన పురాణేతిహాసాల్లో, ప్రబంధాల్లో రాజహంస లున్నాయి అవి బ్రహ్మదేవుడికి వాహనాలట ఆకాశ గంగానదిలో బంగారు తామరతూళ్ళు తింటూ విహరిస్తుంటాయని, ప్రచండమైన వేగంతో ఆకాశంలో ఎగురుతుంటాయని కవులు వర్ణించారు. హంసకాకీయోపాఖ్యానమనే పిట్టకథను శల్యుడు, మనసు విరవటానికి కర్ణుడికి చెప్తాడు భారతంలో. కథ ప్రకారం హంస కాకికన్నా ఎత్తుగా ఎక్కువ దూరం ఎగరగలదు. ఒక హంస 'రాయబారం' నడిపి నల దమయంతులకు వివాహానికి ముందే ప్రేమ పుట్టించింది. మరొకటి ప్రభావతీ ప్రద్యుమ్నుల మధ్య గ్రంథం నడిపి, బాణాసుర మరణానికి కారకమయింది. ఇన్నిన్ని పనులు చేసిన హంస ఎందుచేతనోగాని సాధారణంగా పాడదట పాడిందంటే అది చావు పాటే అరటి, వెదురు మొక్కలు పిలకేసిన తర్వాత చచ్చినట్లు, తుమ్మెదలూ తేళ్ళూ కని చచ్చినట్లు, హంస పాడగానే హంస లేచిపోతుంది! మన ఆత్మ అనే పదార్థం హంస రూపంలో పాడుకుంటూ పోయి పరమాత్మలో కలిసిపోతుందన్న విశ్వాసముంది. అందుకే ప్రాణం పోయిందనటానికి 'హంస లేచిం'దనే ప్రయోగం పుట్టింది. హంస చేసే చిట్టచివరి పని గానం కాబట్టి 'హంస గానం' అంటే మరణమనే అర్థం కల్పించారు. ఇతర సమయాల్లో హంస కూస్తుందిట అది అనేకవిధ మణిత భేదాల్లో ఒకటి రతి పారవశ్యంలో కొందరు స్త్రీల గొంతునుంచి వచ్చే ధ్వని మణితధ్వని. ఆధ్వని లక్షణాలతో హంస ధ్వని అనే రాగం కూడా ఉంది కానీ గానం మటుకు చిట్టచివర, కన్నుమూసే సమయంలోనే వికసిస్తుందన్నది విశ్వాసం. 'పెద్దాయన మొన్న హంసగానం చేశా'డంటే దీర్ఘనిద్రకు జారిపోయాడని అర్థం. కొందరు పని చెడిపోయిందనే భావంతో, చెరిచారన్న అభిప్రాయంతో 'హంసగాన మయిపోయిం'దంటారు.

హంసపాదు: ఈ మాటకు సరైన రూపం హంసపాదం హంసను చూడనివాళ్ళు బాతుని చూసి దాని పాదా లెలావుంటాయో గమనించవచ్చు అక్షరాలు రాసే తొందరలో కొన్నిటిని వదిలివేస్తుంటారు. అలా వదిలిపెట్టిన అక్షరాన్ని గాని, అక్షరాలను గాని పంక్తి కింద ఓ గుర్తు పెట్టి పంక్తి మీద రాయటమనే అలవాటుండేది. పంక్తి కింద పెట్టిన గుర్తును (హంసపాదంలా ఉండేదాన్ని) హంసపాదంటారు. ఈ ఆచారాన్ని పురస్కరించుకొని 'అడుగులోనే హంసపాదు' అనే సామెత పుట్టింది. అక్షరం వదలటం అంటే తప్పు రాయటం, తప్పు చేయటం మొదట్లోనే హంసపాదంటే మొదటి అక్షరాన్నే తప్పుగా రాయట మన్నమాట. తప్పు(ల)తో పని మొదలు పెట్టా రనడానికి ఈ సామెతను వాడుతుంటారు

పాతకాలంలో రాసిన అక్షరాల్లో తప్పుంటే వాటిని కొట్టివేయటంగాని, తుడిపి వేయటంగాని, కింద హంసపాదుపెట్టి పంక్తిపైన రాయటంగాని అక్షరరూపంలో ఉన్న

సరస్వతీదేవికి అపచారం చేసినట్లేనన్న విశ్వాసం ఉండేది. వజ్ఝల చినసీతారామస్వామి గారనే పెద్ద వ్యాకరణ పండితుడు తాను రాసే గ్రంథాల్లో చేతప్పులు వస్తే - హంసపాదులు వగైరా పెట్టకుండా వేరే కాగితం మీద రాసి, మొదట రాసిన పంక్తిమీద అతికించేవారు. అందువల్ల ఆయన సవరించి రాసినప్పుడల్లా పొరలుపొరలుగా అతికింపులుండి ఒక్కో కాగితం అట్టంత మందంగా తయారయ్యేది! అతికింపులో ముందు వెనకలయితే అక్షరాలు కొన్ని కనిపించేవికావు. అయినా సరే, ఆయన హంసపాదులు రాసేవాడుకాదు!

హరిదాసు, ఉల్లిపాయ: ఈ మాట తెలంగాణా వ్యవహారంలో ఎక్కువగా వినిపిస్తుంది. ఈ ఉల్లి నీరుల్లేగాని వెల్లుల్లి (వెల్లిపాయ) కాదు. ఆచారపరులు పూర్వం ఉల్లిపాయ వాడేవారు కాదు. ఆ మాటకు వస్తే వాసన వచ్చే ఏ పదార్థమూ పనికివచ్చేది కాదు వాళ్ళకి. ఉల్లి నిషిద్ధమంటూనే ఉల్లిపాయకాడలను దూలాలకు వేలాడదీసేవా ళ్ళుండేవాళ్ళు. వెల్లుల్లిని బాలింతలకు మోడీకారంలో వాడేవాళ్ళు ఆచారపరులు కూడా - ఉల్లి చేసిన మేలు తల్లికూడా చేయలేదని. శ్రీనాథు డంతటివాడు 'వెల్లుల్లిన్ తిలపిష్టమున్ మెసవితిన్ విశ్వస్త వడ్డింపగా'నని అంగలార్చాడు. ఆ పాపానికి ఆయన్నెవరూ వెలివేసినట్లు లేదు నీరుల్లి చాలాకాలంగా నిషిద్ధమై, ఇప్పుడు పనికి వస్తున్నది- శ్రాద్ధకర్మలప్పుడు తప్ప అది విశ్వామిత్ర సృష్టిలోనిదనే భావంతో నిషేధించా రొకప్పుడు. హరిదాసుగారు ఉల్లిపాయ తినటం తప్పన్నారు - వెల్లుల్లో నీరుల్లో చెప్పలేదు! వెల్లుల్లి వైద్యంలోకి పనికివచ్చేది అప్పుడు కూడా. కానీ తాము నీరుల్లి సేవించేవారు వైష్ణవం ప్రబలంగా ఉన్న ద్రవిడ దేశంలో/తమిళ రాష్ట్రంలో సాంబారులోకి ఉల్లిగడ్డలు లేనిదే మెతుకు దిగదు. వైష్ణవోత్తములైన హరిదాసుగారు తాము సేవిస్తున్నా సామాన్య భక్తులకది నిషిద్ధమని చెప్పారన్న మాట - శ్రీరంగనీతుల్లో భాగంగా! ఇదికూడా ఒజ్జల పుచ్చకాయవంటిదే.

హేమాహేమీలు: హేమ, హేముడు అనే కవలలను కలిసి ఈ పేరుతో ద్వంద్వ సమాసంగా వ్యవహరిస్తున్నారు ఈ మాటకు 'హేమాహేమీలు, హేమాహేములు' అనే రూపాంతరాలను కోశాలు గ్రహించాయి 'అతనుడు, అధికుడు, అధికృత్యుడు, ఉదాత్తుడు, ఉదారుడు, కైవల్యుడు, ఘనుడు' అనే ఏడురకాల వ్యక్తులు హేమాహేమీలని ఆంధ్రవాచస్పత్యం చెప్తున్నది ఆ మాటలకే అచ్చతెలుగు రూపాలుగా 'అక్కజుడు, గఱుప, గొప్పవాడు, పెద్ద, ప్రేపుడు, మిండడు, మిక్కిలివాడు, వెగ్గలీడు' అనే పదాలను ఆ నిఘంటువు చెప్తుంది. ఏ విధంగానయినా సమర్థులైన, ఏ విద్యలోనయినా ప్రసిద్ధులయిన వ్యక్తులను హేమాహేమీలంటారని తాత్పర్యం. ఇటీవలి కాలంలో హె.మా. అంటే హెడ్మాష్టరని, హె.మి అంటే హెడ్ మిస్ట్రెస్ అనీ ఒక ఉపాధ్యాయ శిరోమణి వ్యాఖ్యానించాడు ఈమాటలను! అసలింతకీ ఆ హేమ ఎవరో, హేముడెవరో నిదర్శనపూర్వకంగా తెలియటం లేదు. మోసగాళ్ళనే అర్థం కూడా వచ్చిందీ మాటకు - ఎందుకోమరి!

* * * * *

ఈ తెలుగు జాతీయాలనే వ్యాసపరంపరకు ఇది భరత వాక్యం చెప్పవలసిన, చెప్పగల జాతీయలన్నీ ముగిశాయనే అర్థం లేదిక్కడ ప్రస్తుతానికి ఇక్కడికి ముగిస్తున్నామని మాత్రమే భావం తెలుగులో జాతీయాలుగా ప్రయోగంలో ఉన్న పదాల్లో పదబంధాల్లో చాలా భాగం ఏదో ఒక కులాన్నో వంశాన్నో ఊరినో, వృత్తినో ఎద్దేవాచేస్తూ ఎవరో

ఏనాడో సృష్టించగా తరతరాలుగా ఇతరులు ఆమోదంతోనో, ఆక్షేపణకోసమో, తాత్కాలిక ప్రయోజనం కోసమో వాడుకలో పెట్టినవే ఒక వ్యక్తి ఒక వృత్తి, ఒక కులం, ఒక మతం, ఒక ప్రాంతం కనబరిచే బలహీనతలనూ ప్రత్యేకతలనూ ఇవి బహిరంగపరుస్తాయి వీటిని నిందార్థంలో వాడరు చెప్పే విషయం శ్రోత మనసులో హత్తుకుపోయేట్లుండాలంటే వీటి ప్రయోగం అవసరం వీటిని సరైన అర్థంలో సకారణంగా ఉపయోగించాలంటే 'లోకజ్ఞానం' అవసరం. వీటిలోని ఆక్షేపణలను సద్విమర్శలుగా, చమత్కార ప్రసంగాలుగా గ్రహించగల గటం ప్రయోక్తల, శ్రోతల హృదయ వైశాల్యానికీ లోకజ్ఞతకూ, సరసభావాలకూ నిదర్శనం. అయితే తమకు నచ్చని వారికి అన్వయించేటప్పుడు ప్రదర్శించే భాషాభిమానం తమ విషయానికి వచ్చేసరికి లోపించటం ఆయా వ్యక్తుల సంకుచిత మనస్తత్వానికి ఉపలక్షణం అందువల్ల జాతీయాల వాడుక మరుగునపడుతున్నది. వాటిని తెలుసుకోవటం చిత్తసంస్కారానికికాక ప్రయోజన సాధనకు తోడ్పడినప్పుడు మూలభావానికే విరుద్ధమైన ప్రవర్తనలు కనిపిస్తాయి. భాషాసంస్కృతుల మీద అభిమానం తెలుగుజాతిలో తక్కువ నన్నయ నాటినుంచి చిన్నయనాటిదాకా సంస్కృతాభిమానం, దరిమిలా ఆంగ్లభాషావ్యామోహం, మధ్యయుగాల్లో ఉర్దూప్రభావం తెలుగును నిస్తేజం చేశాయి ఇప్పటికీ అన్యభాషా వ్యామోహం మనల్ని వదల్లేదు వదులుతుందన్న నమ్మకమూ లేదు

నిజానికి ఈ జాతీయాలను ఇంతకు పదిరెట్ల గ్రంథంగా రాయవచ్చు. కానీ సమాజ పరిస్థితులవల్ల, మారిన విలువలవల్ల అది సాధ్యం కాదనిపించింది 'దుప్పి భోజనం' వంటి జాతీయాలను అశ్లీలతా భయం వల్ల పరిహరించవలసి ఉంది ఆయా కులాల, వృత్తుల, ప్రాంతాల, మతాల పేరిట పుట్టిన జాతీయాలను ఇతరులు హర్షించినా వాటికి చెందిన వాళ్ళు సహించగల 'ఔదార్యం' ప్రదర్శించే స్థితిలో లేరు నేటి సమాజం పొగడ్తలకు అలవాటుపడ్డది వ్యక్తిపూజలను, ప్రయోజన సాధనాలను లక్షిస్తుంది. కానీ ఎంత సున్నితమైన విమర్శనయినా సహించలేని సౌకుమార్యం పెరిగిపోతున్నది చివరికి పురాణేతిహాస పాత్రల స్వరూపస్వభావాలకు సంబంధించిన జాతీయాలను విదేశీయాలుగా పరిగణించే వర్గం ఒకటి బయలుదేరింది. తెలుగు సాహిత్యంలోని పాత్రల్లో ప్రాచీనాలన్నీ సంస్కృత సాహిత్యాధారాలు. ఆధునిక సాహిత్యంలోని 'గిరీశం' వంటివారు కొద్దిమంది తప్ప తక్కిన పాత్రలు ఇంకా ఎదగవలసి ఉంది. అంతకుమించి స్వజాతి సంస్కృతి మీద, భాషమీద, సాహిత్యం మీద మన అభిమాన గౌరవాలు పెరగవలసి ఉంది.

ఇంతవరకు ఆయా జాతీయాలకిచ్చిన వివరణలు, చేసినవ్యాఖ్యానాలు సర్వసమగ్ర మనుకోవటం లేదు ప్రతి విషయంలోనూ అభిప్రాయభేదానికి తావుంది. ఇటువంటి విషయాల్లో ఏ ఒక్కరూ సర్వజ్ఞులు కాలేరు–కారు అనేకుల భిన్నానుభవాల సమాహారంగా మాత్రమే పూర్తి వివరణ సాధ్యం ఆ పని మరెవరయినా చేయగలరన్న విశ్వాసంతో ఈ ప్రయత్నాన్ని ఇంతటితో విరమిస్తున్నాను. సెలవు.

No. 49358

# డా॥ బూదరాజు రాధాకృష్ణ ఇతర రచనలు

| | | రూ. |
|---|---|---|
| ★ వ్యావహారిక భాషా వికాసం | ... | 32-00 |
| ★ సాహితీ వ్యాసాలు | ... | 30-00 |
| ★ భాషా శాస్త్ర వ్యాసాలు | ... | 50-00 |
| ★ పురాతన నామకోశం | ... | 100-00 |
| ★ జర్నలిజం - పరిచయం | ... | 50-00 |
| ★ నేటి తెలుగు - నివేదిక<br>మూలం: గిడుగు వేంకట రామమూర్తి,<br>అనువాదం: డా॥ బూదరాజు రాధాకృష్ణ | ... | 15-00 |
| ★ మాటల మూటలు | ... | 60-00 |
| ★ మాటల వాడుక: వాడుక మాటలు | ... | 90-00 |
| ★ ఈనాడు వ్యవహారకోశం<br>(ఈనాడు ప్రచురణ) | ... | 50-00 |
| ★ మాండలిక వృత్తిపదకోశం (కళలు)<br>(తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ) | ... | 110-00 |
| ★ తెలుగు శాసనాలు (క్రీ.శ. 12వ శతాబ్ది)<br>(తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ) | ... | 120-00 |
| ★ సాగర శాస్త్రం - అనువాదం<br>(నేషనల్ బుక్ ట్రస్ట్ ఇండియా ప్రచురణ) | ... | 50-00 |
| ★ **Mahakavi Sri Sri (English)**<br>(Central Sahitya Academy Publication) | ... | 15-00 |
| ★ **Paravasthu Chinnayasuri**<br>(Central Sahitya Academy Publication) | ... | 15-00 |
| ★ **Occasional Papers (In Language & Literature)**<br>(Prachee Publication) | ... | 200-00 |

ప్రతులకు: అన్ని విశాలాంధ్ర బుక్ హౌస్‌లు